# శ్రీవాసవీ పురాణము

## పద్యకావ్యము

డా.చింతలపూడి వేంకటేశ్వర్లు గుప్త

## విషయ సంగ్రహము

శ్రీ స్కాందపురాణాంతర్గత ఊరుజోపాఖ్యానంగా పేర్కొనబడుతున్న వైశ్య వంశ గాథకు పురాణశైలిలో కావ్యీకరణమీ వాసవీపురాణం. ముందు వచ్చిన కావ్యాలేవీ ఇంత విస్తృతాలు కావు. శ్రీ ఆర్యవైశ్య యువజన సంఘంవారు 'శ్రీవాసవకన్యకా పురాణము' అను పేర 1951లో ప్రకటించిన సంస్కృతమూలం+తెలుగు వచనానువాదం ఆధారంగా ఈ స్వేచ్ఛానువాదం పద్యకావ్యంగా రూపుదిద్దుకొంది. వైశ్యుల కథలో సామాన్యంగా తలెత్తే అనుమానాలు దాదాపుగా పరిహరించబడ్డాయి. పురాణాలలో అక్కడక్కడా కనిపించే పునరుక్తి దోషాలు సాధ్యమైనంతవరకు తగ్గించబడ్డాయి. అవసరమైన చోట్ల హిందూధర్మ రక్షణకై ఉపయోగపడతాయనుకున్న కొన్ని ప్రసిద్ధ అవాంతర కథలు స్వీకరించబడ్డాయి. మూలంలోని కథ 60 అధ్యాయాలే కాగా ఇందులో 102 అధ్యాయాలుగా విస్తరించ బడింది. వైశ్యజాతి హిమాలయాలలోని పతకాయి పర్వతశ్రేణినుండి గోగర్భమార్గం ద్వారా భారతదేశంలో ప్రవేశించిందనే రావుబహదూర్ శ్రీ తుంపూడి భగవంతంగుప్త గారి అభిప్రాయాన్ని స్వీకరించాను. వాసవీమాత సాక్షాత్ విశ్వమాత మహేశ్వరీ అవతారం గాను, నారాయణీ స్వరూపంగానూ భావించాను. నాయీ అభిప్రాయాలను వైశ్యసోదరు లందరూ మన్నిస్తారని ఆశిస్తున్నాను. విస్తృతపరిధిలో ప్రస్తుత సమాజంలో వైశ్యులు కానివారు లేరుకదా! అహింస, క్రమశిక్షణ, నీతులను బోధించడమే ఈ కావ్యంయొక్క పరమార్థం. స్వస్తి !

# ఏ అధ్యాయంలో ఏముంది

1. మణిగుప్తాదులు సాలంకాయనుజేరి వైశ్యుల అగ్నిప్రవేశమునకు కారణమడుగుట.
2. అత్ర్యగస్త్యాదుల కోరికపై సూతమహర్షి వైశ్యవృత్తాంతమును వివరించుట.
3. ధర్మనందనుడు జన్మించుట, చదువుకొనుట.
4. అరణ్యమున ధర్మనందనుడు బ్రాహ్మణబాలకునికై కిరాతునికి తన్నుతాను సమర్పించుకొనుట, రాజునుజూచి భయపడిన కిరాతుడతనిని గుహలోదాచి తాను చెట్టెక్కుట.
5. మగధరాజు కిరాతుని చంపి వెనుదిరుగుట, చ్యవనుడు శిష్యునిగానక విలపించుట.
6. వాసుకి వెంట ధర్మనందనుడు ఆదిశేషుని దర్శించుట, రెండువరములు కోరుకొమ్మనగా సృష్టినిర్మాణ క్రమము, కలియందు వైశ్యవృత్తాంతము కోరుకొనుట.
7. ఆదిశేషుడు సృష్టినిర్మాణ క్రమమును వివరించుట.
8. వైశ్యులు కులాధిపత్య దోషమున బ్రాహ్మణశాపమును పొందుట, జగన్మాత కులమున పుట్టి శాపమును తొలగించునని బ్రహ్మ అనునయించుట.
9. వైశ్యులు అపరార్కునికి శాపవృత్తాంతమును చెప్పి కలియందు మర్త్యలోకమున శాశ్వతముగ నుండలేమనుట.
10. అపరార్క, నారదుల సందేశములగొని వైశ్యులు భూలోకమున సంతానముగని శివునికై తపస్సును చేయుట, ఇష్ట పదార్థములను వర్జించుట.
11. వైశ్యులకు శివుడు ప్రత్యక్షమై వరములిచ్చి కైలాసమునకు చేర్చుట.
12. అక్కడ యవ్వనవతియైన కీర్తికన్యక వనవిహారము చేయుట, గంధర్వరాజు చిత్రకంఠుడు ఆమెను చూచి ప్రేమించుట, అందుకిష్టపడని వైశ్యులు తలపగిలిచత్తువని శపించుట.
13. మేనరికముపై వైశ్యుల వాదోపవాదములు, కణ్వమహర్షి ఆగమము.
14. కణ్వమహర్షి వైశ్యుల సందేహముల దీర్చి చనుట.
15. కీర్తికన్యా సుదంతుల వివాహము, చిత్రకంఠుడు నందీశ్వరునిచేత భస్మమగుట.
16. దక్షుడు శివుని పిలువకుండ యజ్ఞము చేయుట, సతీదేవి శివునికాదని పుట్టింటికేగుట.
17. బ్రహ్మ విష్ణువులు జన్మించుట, ఈశ్వరుని ప్రాకృతరూపమున చూడగోరుట, ముందు బ్రహ్మ సృష్టిగావించుట, బ్రహ్మలోని అహంకారమునుండి దక్షుడుద్భవించుట.
18. సృష్టి లయతప్పుట, ఈశ్వరుడు ప్రాకృతరూపమును పొందుట, బ్రహ్మవిష్ణువులు అంబదర్శనమడుగుట, అందుకు దక్షుని ప్రోత్సహించమనుట.
19. దక్షుడు భార్యనుకూడి తపస్సుచేయుట, పరాశక్తి దక్షుని కూతురుగా జన్మించుట.
20. శివుని కాదన్న దక్షుని బ్రహ్మాదులంగీకరింపజేయుట, సతీ శివుల కల్యాణము.
21. చంద్రుడు రోహిణీప్రియుడగుట, దక్షుడు శపించుట, శివుడు సమస్యను పరిష్కరించుట, దక్షుడు కోపించి బ్రహ్మ చేసిన యాగమందు శివునికి యజ్ఞభాగార్హత లేకుండ చేయుట.
22. శివుడులేకుండ దక్షుడు యజ్ఞమునిర్వహించుట, పతినింద భరించలేక సతీదేవి భస్మమగుట, వీరభద్రుడు యజ్ఞమును ధ్వంసముచేయుట, దక్షునకు మేకతల అతుకుట.
23. భార్యభస్మము చేబూని శివుడు పిచ్చివాడగుట, విష్ణువు భస్మమును వెదజల్లగా పద్దెనిమిది శక్తిపీఠములు వెలయుట, తారకుని చంపుటకై జగన్మాత హిమవంతునింట పుట్టుట.
24. బ్రహ్మ దేవతలకు శివపార్వతులను కలుపుమనుట, వారు మన్మధుని నియమించుట.
25. మన్మధుడు శివుని తపమును చెడగొట్టబూనుట, శివుడు వానిని భస్మముచేయుట.
26. విలపించు రతీదేవికి భర్తనుసాంగుని చేయుట, బ్రహ్మాదులు శివుని పెండ్లికొప్పించుట.
27. సాలంకాయనుడు వైశ్యులకు పురుషసూక్తమును బోధించుట.
28. నారదుని ప్రేరణతో శివుడు హిమాచలమున గౌరిని చూచుట.
29. వృద్ధరూపమున శివుడు పార్వతిని పరీక్షించుట, పార్వతి తనతండ్రిని అడుగుమనుట.
30. పెండ్లిపెద్దగా విష్ణువు సప్తర్షులను రాయబారమంపుట, హిమవంతుడంగీకరించుట.
31. శివుని పెండ్లికి అందరిని పిలుచుట, హిమవంతుని ఎదురుకోళ్ళు.
32. శివ పార్వతుల కల్యాణము.
33. అందరు కానుకలిచ్చుట, భూలోకమునుండి కానుకలు రాకపోవుట, వైశ్యులను పంపుట.
34. వైశ్యముని బాలకునివలన కానుకలు బడయుట, భార్గవుని శాపము.
35. ఈశ్వరుని కాలప్రమాణము, సమాధికి దూర్వాసుని శాపము.
36. కుమారస్వామిచే తారకాసుర సంహారము.
37. నారదుడు శివునికి భూలోకస్థితి వివరించుట, వైశ్యులబంపి గోబిలము నుద్ధరించుట.
38. వైశ్యులనునందిని భూలోకమునకుపంపుట, ఆదిశక్తి వైశ్యుల కూతురగునని మాటిచ్చుట.
39. బ్రహ్మ విష్ణు మహేశ్వరులును భూమికి వత్తుమనుట, వైశ్యులు గోగర్భమున చేరుట.
40. గోకర్ణమార్గమున వైశ్యులు భూమికిచేరుట, బ్రహ్మ భాస్కరాచార్యుడగుట, తల్లి నందిని వారి సంసారములు నిలబెట్టుట, వైశ్యులు పద్దెనిమిది పట్టణముల చేరుట.
41. వైశ్యులు ధర్మనందనుని వృత్తాంత మడుగుట, ఆదిశేషుడు వైశ్యవృత్తాంతము వినిపించి ఇంటికి చేర్చెనని చెప్పుట.
42. సాలంకాయనుడు భూమికిదిగిన సిద్ధవైశ్యుల పేర్లు కొన్ని చెప్పుట.

43. వైశ్య వంశక్రమము, తులాధారుడు జాజిలియందలి గర్వమును తొలగించుట.
44. పద్మాక్షుడు పుట్టుట, శూద్రకన్యకు శ్రవణుడు పుట్టుట, దశరథునివలన మరణము.
45. గోముఖుడు యముని ప్రార్థించి దీర్ఘాయువగుట, విసుపుచెందిన గోముఖునకు మాండవ్యుడు కాకి రూపమిచ్చి రక్షించుట.
46. కల్హారుని తపస్సు, సమాధి ఉద్వాహునిగని మహామాయకై తపస్సు చేయుట.
47. మహామాయ మధుకైటభులను చంపుట.
48. మహామాయ మహిషాసురుని మర్దించుట.
49. మహామాయ శుంభ నిశుంభులను అంతము చేయుట.
50. సమాధి కుసుమగుప్తునిగా పుట్టుట.
51. కుసుముని బాల్యము, చదువు, వివాహము, కల్హారుని వానప్రస్తము.
52. కుసుముడు తండ్రిని చూడగా మనుమని అడుగుట, పుత్రకామేష్టిచేసి బిడ్డలను కనుట.
53. వాసవీ విరూపాక్షులు బాల్యమున ప్రవేశించుట, విద్యాభ్యాసము.
54. విష్ణువర్ధనుని దిగ్విజయయాత్ర, పెనుగొండపురమున ఆహ్వానము.
55. రాజు పెనుగొండలో వాసవిని చూచి మోహించుట.
56. రాజు విరహవేదన, విజయసింహుని రాయబారము.
57. వైశ్యులందరితో మంత్రివర్గ సంవాదము, మంత్రుల బెదిరింపు, విందుకాహ్వానము.
58. బాలనాగరులు రాజుకు కతికిన అతకదని చెప్పుట, రాజు తిరుగుప్రయాణము.
59. పద్దెనిమిది పట్టణముల వైశ్యులకు కబురు పంపుట.
60. వైశ్యులందరు వివిధ వాహనములపై పెనుగొండకు వచ్చుట.
61. చర్చలందు రెండు వాదములు, రెండు వర్గములు.
62. కుసుమగుప్తుడు కన్యనీయవలదనువారిని సేకరించుట, అగ్నిప్రవేశమునకు పరీక్షించుట.
63. రెండు వర్గములు విడిపోవుట.
64. ఆత్మహత్య పాపమను వైశ్యులకు ఆచార్యుడు వశిష్ఠ జగన్నాథ వృత్తాంతము చెప్పుట.
65. భద్రశ్రేష్ఠికి విష్ణుసందేశ వృత్తాంతము, సంతానములేని ధర్మశ్రేష్ఠిని అంగీకరించుట.
66. అగ్నిప్రవేశ విషయమును కుసుమశ్రేష్ఠి వాసవికి తెలుపుట.
67. తలిదండ్రులకు వాసవి విశ్వరూపమును చూపించుట, జ్ఞాన బోధ.
68. ఆరువందల పన్నెండు గోత్రములవారు నాలుగుదిక్కులకు పారిపోవుట.
69. ఆలయమున వైశ్యసమావేశమున వాసవి విశ్వరూపదర్శనము.
70. బాలనగరులకు వాసవీమాత సందేశము.
71. వృద్ధవైశ్యులు బాలనగరులకు మేనరిక వివాహపద్ధతులు బోధించుట.
72. ఋషిగోత్రములు - సిద్ధపురుష గోత్రములు.
73. భాస్కరాచార్యుడు వేదవతికథను చెప్పుట.
74. సాలంకాయనుడు విష్ణువర్ధనుని విరహమును వర్ణించుట.
75. వైశ్యభటుడు తనతండ్రి మల్హణుని కథచెప్పి అగ్నిప్రవేశమునకు అనుమతి కోరుట.
76. ఆచార్యుడు అగ్నిగుండముల నిర్మాణమును మల్హణునికి వివరించుట.
77. రాజుపంపిన బ్రాహ్మణునకు వివాహవిధులచెప్పుట, విలాసవంతమైన విడిదినిచ్చుట.
78. వాసవి చెలులనూరడించుట, బాలనగరులకు కర్తవ్యబోధ, ఆచార్యునకు దానశాసనము.
79. విష్ణువర్ధనుని వంశచరిత్ర.
80. వైశ్యులు వాసవితో అగ్నిగుండముల వద్దకు బయలుదేరుట.
81. మృగశిరా నక్షత్రం పుట్టిన కథద్వారా జంతువులును ఆత్మత్యాగము చేయుట.
82. వాసవ్యాదులు గుండములబడబోవ అగ్ని అణగిపోవుట, కారణములు చెప్పుట.
83. బ్రహ్మ భృగువులయెడల అగ్నిచేసిన అకార్యములు.
84. వాసవి అగ్నిదేవుని జ్వలించునట్లు పురికొల్పుట.
85. పురజనులకు వాసవి విశ్వరూపమును చూపుట, దండకము.
86. వాసవి తొల్లి యక్షిణీరూపమున దేవతలను పరీక్షించిన విధము చెప్పుట.
87. వాసవీమాతతో వైశ్యదంపతుల అగ్ని ప్రవేశము.
88. రాజు విరహంతో వికలమనస్కుడై పిచ్చిపనులు చేయుట.
89. రాజు పరివారముతో పెనుగొండకు బయలుదేరుట, ధౌమ్యుడు అడ్డుపడుట.
90. రాజు పురోహితుడు, మంత్రి, చారుల విన్నపములు వినకుండ ముందుకేగుట.
91. వాసవి మరణవార్తవిని రాజుతల వ్రక్కలగుట.
92. రాకుమారుడు పితృవియోగమున విలపించుట, దేహమును సంస్కరించుట.
93. రాకుమార, వైశ్యకుమారులు పరస్పరము ఓదార్చుకొనుట.
94. వైశ్యబాలకులను గయకు పంపి రాకుమారుడు దీక్ష వహించుట.
95. ఆచార్యుడు వైశ్యబాలకులకు గయాపిండ మాహాత్మ్యమును తెలుపుట.
96. వైశ్యబాలకులు ప్రయాగలో స్నాన దానాదులు చేయుట, కాశీలో వ్రతము చేయుట.
97. గయలో పిండప్రదానము చేయుట, వాసవి ప్రత్యక్షమై కలశద్వయమిచ్చుట.
98. నైమిశమున పుండరీకునివలన గదాధరుని కథ వినుట.
99. వాసవీమాతకు అర్ధరాజ్య సమర్పణము, తిరిగి రాజపురోహితునకు దానమిప్పించుట.
100. వైశ్యబాలకులకు భాస్కరాచార్యులు దశలింగవిధులు తెలుపుట.
101. పెద్దరికమునకు విరూపాక్షుని విముఖత, ఆచార్యుని కోరికతో పెద్దశెట్టియగుట.
102. పొత్తుగుడుపులు, సేవకులకు సత్కారములు, ఫలశ్రుతి.

# శ్రీకారము

ఉ. శ్రీకర ! కార్య సిద్ధి కర ! సిద్ధి వినాయక ! విఘ్న రాజ ! దీ
క్షాకర ! దక్షుఁడీవకద కామితయత్నముఁదీర్చ ! తొల్త నీ
వాకిటఁజేరి మ్రొక్కులిడువారికి నోటమిలేదు కాదె ! జ
న్మాకర పాపనాశకర ! నాకృతి సత్కృతిఁజేయ వేడెదన్.

చం. శ్రీజనకాత్మజాంబక కుశేశయ కౌసుమ శీకరోద్ధృతిన్
తేజము చల్లనై తపన దిశ్యకరాన్వయజాత రాజు రే
రాజయి రామచంద్రుఁడయి, రాగనిరంజన పూర్ణచంద్రికన్
భూజనులన్ భరించుపతి భూతిని నన్ను భరించి కాచెడున్ !

తే.గీ. శాంతమున కాటపట్టులు కాంతియుతులు
సాహితీయోగపీఠస్థ లాహితాగ్ను
లెల్లసిద్ధులు శివరూపు లుల్లసితులు
సద్గురుజనుల మనమున సంస్మరింతు.

కం. శారద, శారద సురనద
నీరజ, నీరజభవ వదనేందుసుధ, సుధా
సారద, సర్వద, సతతము
నా రసన వసించుగాత నల్గురిలోనన్.

శా. శ్రీకారంబిది తల్లి ! నీదు ఘనసౌశీల్యంబు కావ్యంబుగా
లోకమ్ముల్ కొనియాడ వ్రాయుటకు నాలోసుంతకూర్చుండుమో
లోకాధీశ్వరి ! వాసవీజనని ! నిన్ లోగొన్న నాకింక నే
చీకుంజింతయులేదు, హాయిమెయి నేజీవింతు కావ్యంబునన్ !



# శ్రీవాసవీ పురాణము

## మొదటి అధ్యాయము

**కం. శ్రీ వాసవి ! శ్రీ కన్యక !**
**శ్రీ వైశ్య కులాగ్ర నేత్ర ! శ్రీ గాయత్రీ !**
**శ్రీ వహ్ని మండల పుటీ !**
**సావిత్రీ ! జ్ఞాన శక్తి ! సామ్రాజ్యవతీ !**

ఉ. శ్రీ వసువాస మీ వసుధ శ్రీలు రచించెడు దివ్యవారి, స
ద్భావ తరంగ రంగ నట భారతిపాద పవిత్రకారి, తృ
ష్ణావన కంజ ప్రేర్త్వరి, సనాతన సంస్కృతి మేలుదారి, గో
దావరి, చల్లగా మనుపఁ దాపసి నాడొక టొప్పు నద్దరిన్ ! 1

సీ. లోలోత్పల మరంద లోల పుష్పంధయ
మ్మవనత ఫలిత ద్రుమాలయమ్ము
వికచ కమల షండ విహరణోత్సుక హంస
మమల మల్లీలతోద్యాన వనము
లహరీ విహారి జల విహంగ కూజిత
ప్రతినద ద్దశదిశాప్రాంగణమ్ము
బహుళ గాన విదగ్ధ పరభృతారామంబు
శుకముఖ్య సద్ద్విజశోభితమ్ము
తే.గీ. యాజ్ఞి కాహూత నిర్జరహర్షకమ్ము
సాంధ్య హోమాజ్య ధూమప్రసారకమ్ము
రాజ ఋషిపుంగవాది విరాజితమ్ము –
అద్ది వేదధ్వని ఫలించు నాశ్రమమ్ము. 2

వ. అందు వేద వేదాంగ విదుండును జితేంద్రియుండును తపో నిష్ఠుండును ప్రాచీనుండును బ్రహ్మ సమానుండును మహాత్ముండును నగు సాలంకాయన ఋషి సత్తముం డనంత శిష్య కోటి పరివృతుండై నిత్యంబుఁ బితృ దేవతలకుం బ్రీతిం జేయుచు వసించు చుండె. 3

ఉ. అంతట నొక్కనాడు నిగమాఢ్యులు నిత్య తపోనిమగ్ను ల
త్యంత శుభాను వర్తనులు ధౌతమనస్కులు వల్కలాజినుల్
సంతత పుణ్య తైర్థికులు సౌమ్యులు చక్రధరాత్మజుల్ మహా
దాంతులు వచ్చి రచ్చటకుఁ దారలు జందురుఁ జుట్టినట్లుగాన్ ! 4

వ. అటులఁ దన్నుఁ జూడ వచ్చిన మణిగుప్తాది వైశ్య ఋషి పుంగవులకు నమ్మహర్షి యథోచిత రీతి నతిథి సత్కారంబుల గావించి మృదు మధుర వచనంబులఁ గుశలంబు లడుగ. 5

కం. సాలంకాయన మునిచేఁ
జాలన్ సత్కారమంది సద్వైశ్యఋషుల్
లీలాబాలేందుధరున్
బోలిన మునిచంద్రు నంతఁ బొగడిరి భక్తిన్. 6

ఆ.వె. భగవదంశ మీవు వర మునిశార్దూల !
నిన్నుఁ జూచి నంత నిఖిల పాప
మంతరించుఁ గాదె ! యాదిత్యు పొడ సోక
నంధకార మెల్ల నడఁగు పగిది. 7

కం. మేము కృతార్థుల మైతిమి
నీ ముఖపద్మమును జూచి, నీ పదసేవల్
నోములు పండినఁ గాక మ
రే మనుజునకు లభియించు నిలపైఁ జూడన్. 8

కం. నీ దర్శనంబు దొరికిన
మేదిని లోటేమి కలుగు? మేధావిభవా !
పేదకు చింతామణి కద
నీ దివ్యవిలోకనంబు నిగమవిపంచీ ! 9



వ. మేము తీర్థసేవాతత్పరులమై బ్రహ్మకుండంబు వీడి పుణ్యగంధమనోహరంబులును నభ్రంకషద్రుమాకీర్ణంబులును సిద్ధగంధర్వాది సేవితంబులునగు పతకాయి హిమాలయ హేమకూట పారియాత్ర బృహదాచల సురాచల వింధ్య సహ్య క్రౌంచ వేంకటాచల గంధమాదనాదులగు శైలంబులం బర్యటించియును, పుణ్య సలిలంబుల జగత్త్రయంబుఁ బవిత్రంబుఁజేయు ధార్లా బ్రహ్మపుత్ర భాగీరథీ యమునా సరస్వతీ చర్మణ్వతీ చంద్రభాగా శరావతీ గోమతీ రేవా సింధు కావేరీ పినాకినీ కృష్ణాది జీవనదుల జలకంబులాడియును, సింధు మహాసింధువును సేవించియునుఁ దనివితీరని యెడందల నఘంబుఁ బాపుకొన నీ గోదావరీ పవిత్ర జలంబుల సేవింప నిటకు వచ్చితి మిట సకలభవదోష నివారణంబులగు నీ పదకంజంబులఁగనుంగొంటిమి. సకలతీర్థనిషేవణ ఫలంబు నిను వీక్షించి నంత మాత్రంబునఁ బొంది కృతార్థుల మైతిమి. 10

మ. మహనీయంబగు నొక్క గాథ వినఁగా మా మానసం బెంతయున్
తహ పాటొందుచునుండె నింతదను కా తాపంబు దీరంగ నో
మహనీయా ! కలి, వైశ్యవంశ మెటు సమ్మానంబు సాధించునో
మహి వహ్నిం బడ నేమి కారణమొకో మాకింత విన్పింపవే ! 11

కం. అన విని ప్రసన్నమతియై
విన వేడిన వైశ్యఋషుల వీనుల విందై
అనయము పుణ్యప్రదముగ
మునిముఖ్యుఁడు కథను జెప్ప మొదలిడె నిటులన్. 12

తే.గీ. వైశ్యఋషులార ! కలి యందు వైశ్యకులము
వాసవీకన్యచే నెట్లు వర్ధమాన
మగునొ వినిపింతు నది విన్న మానవాళి
సకల సౌఖ్యంబు లొనగూడి సంతసిల్లు. 13

సీ. ఏ దేవి కృతయుగం బాదిలో దైతేయ
శుంభ నిశుంభుల దంభ మణచె
నే దేవి జమదగ్నియిల్లాలుగా త్రేత
భార్గవుఁగని త్రుంచె బాహుజులను

ఏ దేవి గోవిందు సోదరీమణి యౌచు
ద్వాపరదానవ దర్ప మడcచె
నా దేవి యికమీద నార్యవైశ్యుల యింట
కన్యయై వెలయును కలి యుగమున
తే.గీ. విష్ణువర్థనుcడను రాజు విఱ్ఱవీగి
తనదు కులగౌరవము మీద దాడిc జేయ
ధర్మమును గావ నాతని తనువు నడిచి,
బాంధవులcగూడి కైవల్యపదముc జేరు. 14

కం. ఇల నీ కథ సూతర్షులు
తొలి చెప్పెను శౌనకాది దులి ముఖ్యులకున్
పలికెద నా పావనకథ
మలిగా మీరెల్ల వినుcడు మానిత భక్తిన్ . 15

కం. ఎవ్వం డీ కథc జదువునొ
యెవ్వం డీ కథను జెప్పు నెవ్వcడు వినునో
అవ్వానికె చింతామణి
అవ్వానికె కల్పతరువు నమరుల గోవున్ ! 16

***ఇది శ్రీ వాసవీపురాణ మందు సాలంకాయనమునిచే వాసవీపురాణకథా ప్రారంభమను ప్రథమాధ్యాయము సంపూర్ణము.***

(కంజ ప్రేర్వరి= అమృత ఝరి, దులి= ఋషి)



# రెండవ అధ్యాయము

**కం. అతుల సుగుణాకరీ ! పా**
**లిత సకలభువన వసంత లీలేందు ముఖీ !**
**వితరణ చింతామణి ! గృహ**
**వితర్థి శోభాకరీ ! కవిత్వోల్లేఖీ !**

తే.గీ. అనగ వైశ్యానుకంప్యులు హర్షమంది
సూతుcడన నెట్టివాcడు, భూస్పృశుల గాథ
శౌనకాదుల కుగ్గడించంగ నేల
కలిగె, ననcగ సాలంకాయనులు వచించె. 17

కం. అత్యంతపుణ్యనిలయము
నిత్యము వేదాంతచర్చ నెలకొను చోటున్
సత్యము నైమిశ నామక
మిత్యము మునులకు నొక వన మిలc గల దందున్. 18

తే.గీ. అన్ని ఋతువులc బుష్పించు నట్టి జువ్వి
పొన్న సంపెగ కానుగ బొట్టు గిప్ప
రావి వెలగ అశోకముల్ మావితతులు
చక్కగానొప్పు నొక గొప్ప చట్టునుండి. 19

చం. చెలగు మృదంగనాదములు చిత్తము నుయ్యేలలూప గోమతీ
జలవహ జాలువారు కడు చల్లగ మెల్లగ, దాని గట్టుపై
కల దొక యాశ్రమంబు మునికాంతలసేవల నిండుపున్నమై ,
పులులకు మేకపోతులకుc బొందుc గుదిర్చెడు శాంతిధామమై. 20

వ. అందు వేదవిహిత బ్రహ్మతత్త్వ సంపన్నులును బ్రహ్మాండనిర్దేశకులు నగు నత్ర్యగస్త్యాపస్తంబ వసిష్ఠ వ్యాస పరాశర మందపాల మైత్రేయ మాండవ్య కాశ్యప కణాద కపిల కుద్దాల కుత్స వత్సక గార్గ్య గాలవ గౌతమ శతానంద శౌనక చ్యవన సుతీక్షణ శుక శక్తి జమదగ్ని జాబాలి భృగు బభ్రు శరభంగ శ్వేతకేతు విశ్వామిత్రాది మునిపుంగవులెల్ల రొండు క్రతురాజం బొనరించుచుండి రంత. 21

సీ. నారచీరలు కట్టి నాగచర్మము కప్పి
చదునుగా నెరసినజటలు చుట్టి
మేలైనభస్మంబు మేనెల్ల ధరియించి
పులిచర్మ మొకరీతి మొలకుఁ జుట్టి
వేదపురాణముల్ వేదాంతశాస్త్రంబు
లితిహాసజాలంబు మదినిఁ బట్టి
యిందుమౌళిని మించి యింద్రియంబులఁ గట్టి
దివ్యమౌ నొక యాగదీక్షఁ బట్టి
తే.గీ. అటకుఁ జనుదెంచె హరుఁ బోలు నట్టి ఘనుఁడు
పుడమి కథకులకున్ గురుపుంగవుండు
భాను మరపించు తేజోవిరాజితుండు
సూతుఁడను పేరుగల యొక్క పూతమౌని. 22

తే.గీ. అంత మునులెల్ల రెదురేగి సంతసమున
దెచ్చి కుశమండితాసనస్థితునిఁ జేసి
అర్ఘ్యపాద్యాదివిధులచే నతిథిఁ దనిపి
కుశల మడిగిరి తామునుఁ గూరుచుండి. 23

వ. అనంతరంబు పుణ్యకథా శ్రవణాభిలాషులగు శౌనకాదిమహర్షు లా మునిసత్తము నిట్లు వేడుకొనిరి. సకల పుణ్యప్రదమును, పరమ పవిత్రమును,



మహామహిమాన్వితమునై స్కాందపురాణాంతర్గతమగు నూరుజోపాఖ్యానమను పేరుగల వైశ్యమహాపురాణమును నందలి శ్రీవాసవీమాత పవిత్రగాథను వినువారికి పుష్కరజలములఁ గ్రుంకులిడినపవిత్రత చేకూరుననియును, బంగారుకొమ్ములుగల నూరుగోవులను వేదవిదుఁడైన బ్రాహ్మణునకు దానమిచ్చిన ఫలితము ప్రాప్తించు ననియును, గతయుగముల రాజసూయాదులఁజేయుటవలన పొందగలుగు పుణ్య ఫలమీ కలియుగమున నీవైశ్యపురాణకథాంశము కలిగిన గ్రంథమును దానము చేయుటవలన మాత్రమే సిద్ధించునని విందుము. 24

ఉ. వ్యాసుని కూర్మిశిష్యుఁడ వనంతుని మించు వచోవిలాసతన్
భాసురపుణ్యగాథలగు భాగవతాది మహాపురాణముల్
వేసవిఁ జల్లగాలులటు వేడుక మీరఁగఁ జెప్పినాడ వో
భూసుర! అట్టి వైశ్యకథఁ బూర్ణముగా వివరించి చెప్పవే ! 25

చం. అనవిని సూతుఁడంత మునులందరి కోరికఁదీర్ప నెంచి తా
వినమితమౌళియై తొలుత వేడెఁ జిదాత్మఁ బరాశరాత్మజున్
మినుకుఁజెలిన్ వినాయకుని మేరుశరాసను వెన్ను వాక్పతిన్
మనమున నిల్పి పల్కె నతిమాన్యము వైశ్యపురాణరత్నమున్. 26

***ఇది శ్రీ వాసవీపురాణ మందు నైమిశారణ్యమున వైశ్యమునులు సూతుని గని వైశ్యపురాణమును వినగోరుటయను ద్వితీయాధ్యాయము సంపూర్ణము.***

(వైశ్యానుకంప్యులు= వైశ్యమునులు, ఇత్యము= ప్రాప్యము, మినుకుచెలి= సరస్వతి, వెన్ను= విష్ణువు)

# మూడవ అధ్యాయము

**కం. శ్రీమదఖిలాండ కోటి సు**
**దామా కందుక విలోల దక్షిణ హస్తా !**
**శ్రీమదఖిలాండ కోటి సు**
**దామా కందుక విచాల దారిద్ర్య హరా !**

కం. అనగనగా నొక నాడా
పెనుబాములతేఁడు వేయిపిలకల విదురుం
డనఘుండు ధర్మ సుతునకు
వినిపించిన గాథ యిద్ది వినుఁడీ ! ప్రీతిన్. 27

తే.గీ. అదియు నారదుఁ డేకాంతమందు నాదు
చెవినివేసినకథ యిది చెప్పకుండ
దాచియుంచితి మీ కయి వేచియుంటి
ననుడు తాపసు లాశ్చర్యమున మునింగి. 28

ఉ. ఎక్కడ ధర్మనందనుఁడు, ఎక్కడ శేషుఁడు ! వారి మధ్య మా
యొక్క భవిష్యపుణ్యచరితోక్తికి హేతు వదెట్లు గల్గెనో
మక్కువమీర మాకు ననుమానము దీర సదాపవిత్రమౌ
నక్కథ సర్వముం దెలుపవయ్య ! జగన్నుతమౌనిశేఖరా ! 29

వ. అనుచుఁ బ్రార్థించిన సూతుండును నత్యంతసమ్ముదంబున నా పురా
వృత్తాంతంబుఁ బ్రవచింపఁ దొడంగె. 30

కం. ఆర్యావర్తము నందున
ధైర్యమునకు నెలవు సకలధర్మాలయమున్
కార్యస్థిరనరనారీ
తిర్యగ్వాసము పురము ప్రతిష్ఠాన మనన్. 31



ఉ. మామిడిపండ్లతోటలును మల్లెలు పొన్నలు పూలతావులున్
భూమికి సేదదీర్చు రసపూరము నర్మదవాకయున్ సదా
క్షేమత నొప్పు సంఘమును గెంపులుఁ బచ్చలు రత్న రాసులున్
ప్రేముడి దానధర్మములు పెంపు వహించును నప్పురంబునన్. 32

కం. అందు గల యిందిరాప్రియ
నందనుల నడుమ నలరుచు నాణెంబున నా
నందముగ గడపుచుండెను
కందెరుగని ధర్ముఁడచట గర్వరహితుఁడై. 33

కం. ధర్మముఁ దప్పదు సత్కుల
కర్మములను మాన డెందు గణుతింపగ నే
మర్మమును లేని యాతఁడు
నిర్మలసుజ్ఞాని కాని నేరఁడు సుఖమున్. 34

తే.గీ. ధరకు మించిన యోర్పరి ధర్మపత్ని
కడుపు పండని కతమునఁ గనులు దుడువఁ
జూచి యెదఁ జేర్చి యోదార్పఁ జూచుఁ గాని
గొంతు పెగులదు దుఃఖంబు గుండె దిగదు. 35

ఉ. దానము ధర్మమంచుఁ బలుదారుల సత్కృతు లాచరింతు రా
మానిత వైశ్యదంపతులు మాన్యుల మ్రొక్కుదు రెల్లవేళ సం
తానము గోరి దేవతల తావుల నర్మిలిఁ గొల్చివత్తు రే
మౌనులు దారసిల్లినను మానసముంతురు వారి ముందరన్. 36

వ. అట్లుండ నొక పరి. 37

కం. భూమింజయుఁడను విప్ర
స్వామిం గనె ధర్ముఁ డొక్క సాయాహ్నము నం
దా మంద్ర యమున యొడ్డున
నేమంబునఁ బూజఁజేసి నెమ్మదిఁ దెలిపెన్. 38

తే.గీ. బ్రహ్మవిదులందు శ్రేష్ఠుఁడవైన భూసు
రాగ్రణీ ! నాకు సంతతివ్రతము నొకటి
వైష్ణవంబైనదానిని వరముగా మ
దీయదుఃఖంబుఁ బాపగఁ దెలుప గదవె. 39

కం. అన విని భూమింజయుఁడును
వినుమని వివరించె నొక్క విష్ణువ్రతమున్
మనమునఁ గోరిన దానినిఁ
గొనుమని యందించు దానిఁ గొంగుకడానిన్. 40

వ. కార్తిక శుద్ధ త్రయోదశి నాడు సతీసమేతంబుగ లక్ష్మీపతిపూజఁ బ్రారంభించి నిత్యాగ్నిహోత్రంబు నొనరింపుచు హవిశ్శేషంబు భక్షింపుచుండు మనియును, సత్సంతానంబునొందు మనియునుఁ బలికి యాతం దంతర్ధానంబయ్యె నంతట ధర్మశ్రేష్ఠియు నట్ల యొనరింపుచు నొక్క వత్సరం బత్యంతశ్రద్ధా భక్తులఁ గొలువ నప్పురుషోత్తముండును జతుర్భుజంబుల తోడఁ దులసీమాలాలంకృతుఁడై ప్రత్యక్ష మయ్యె. 41

శ్లో. నమః పద్మపలాశాక్ష ! దేవదేవ నమోస్తుతే ! ।
లక్ష్మీపతే ! నమస్తేஉస్తు గోవింద ! పురుషోత్తమ ! ॥ 42

తే.గీ. అనుచు నోరారఁ బరమేశు నభినుతించి
నీవ నను గావవలె నంచుఁ దీవరించి
వరదుపదములపై బడి వదలఁడాయె
వరముఁ బడయగనెంచిన వైశ్యవరుఁడు. 43

కం. మెచ్చిన లచ్చిమి పెనిమిటి
యిచ్చెను వెనువెంట వరము నీప్సిత సుతునిన్
మచ్చు సుమా నీతికి నని
బచ్చుకు వివరించి చనియె వచ్చిన త్రోవన్. 44

కం. నెరవేరిన కోరికతో
పరమానందంబు తోడ భార్యాయుతుఁడై
చరచర యింటికి నడచెను
వరచరితుఁడు ధర్ముఁడతుల వరలాభమునన్. 45

ఉ. అంతట శ్రేష్ఠిదంపతులు నచ్యుతు మిక్కిలి భక్తి శ్రద్ధలన్
స్వాంతము నిండుగా నొక వసంతమునింద భజించి రంత వే
దాంతసమగ్రదీధితుల ధర్మువు ధారుణి మెట్టి నట్టు ల
త్యంతకళావిలాసమున నన్వయవర్ధనమయ్యె వారికిన్. 46

కం. తలిదండ్రు లంత ముదమునఁ
బిలిచిరి బ్రాహ్మణులఁ జంటి పిల్లనికిం గా
గల సంస్కారంబుల వెసఁ
గలిగింపగ నంత వారుఁ గడఁగిరి తీర్పన్. 47

తే.గీ. శాస్త్రబద్ధంబులై సాగె జాతకర్మ
లంతఁ బదునొకండవ వత్సరాంత మందు
పేరు నిడఁబోవ నింగి తాఁ బిలిచి పలికె
ధర్మనందనుఁడను పేరు తగినదనుచు. 48

వ. పురోహితులు నట్ల గావించి రంత. 49

సీ. తలిదండ్రులు ప్రమోదతతవాటి విహరింప
దరలె వత్సరమొండు ధర్ముఁ డంత
చైతన్యమూర్తియౌ చక్కనిబాలకు
నుపవీతు గావించి యొజ్జఁ జేర్చ
బాలకుండును దండ్రి పంపున శ్రద్ధగా
పండ్రెండు వర్షముల్ భక్తి మీర
గురువు చ్యవనుసేవ గుఱితోడఁ గావించి
గురువిద్యలెల్లను గుఱుతుఁ గనియె

తే.గీ. తృప్తి నొందిన భృగువంశఋషియు నంత
వేదవేదాంగ విదుఁడైన విజ్ఞశిష్యు
నింటి వాడవు కమ్మోయి యిష్టకామ్య
సిద్ధినొందుమీయనుచు నాశీర్వదించె. 50

మధ్యాక్కర. అయినను ధర్మనందనుఁడు నటులే యనుచుఁ బోవలేదు
ప్రియమారగ మఱియొక పది రెండేడు లందె నిలువగ
దయసేయుమా యని వేడి తరువాత గురువాక్యమున హృ
దయముంతు నని మ్రొక్కె గురునిదయ నెఱిఁగినవాఁడు గనుక 51

వ. శిష్యుని హృదయమెఱింగిన చ్యవనుండందులకంగీకరింప నతండును 52

సీ. ఇరు సంధ్యలందును గురుహోమవేళల
సరగునఁ దోడ్పడు జాగులేక
వన మెల్ల గాలించి ఫలమూలములు దెచ్చి
బలినివేదనముల వఱలఁజేయు
సమిధల సమకూర్చు సాధించు దర్భల
సత్రంబులకు నెల్ల సంతరించు
పుష్పంబులను దెచ్చి పొదవి మాలలు గట్టి
కూర్చుఁ నర్చావేది కొలుచువేళ

తే.గీ. తలను నాలుకయట్టులఁ దలపు లెఱిగి
భక్తి సేవించు సతతంబుఁ బరమగురుని
నాతఁ డొసగినది తినుచు నన్యచింత
మాని బహుకాల మట నుండె మాన్యబుద్ధి. 53

ఆ.వె. మహితకీర్తికరము మహనీయచరితమ్ము
పుత్రవృద్ధికరము పుణ్యపథము
ధనము బలముఁ గూర్చు ధర్మనందనుగాథ
వినినఁ జాలుఁ దొలగు విఘ్నచయము. 54

***ఇది శ్రీ వాసవీపురాణమందు ధర్మనందనుని జన్మ, విద్యాభ్యాస వృత్తాంతంబులను తృతీయాధ్యాయము సంపూర్ణము.***



# నాల్గవ అధ్యాయము

**కం. శ్రీమ దఖండ దయా వర**
**దామర పూర భవ హిమవ దచలేంద్రో త్సం**
**గామృత సింధు తరంగ వి**
**రామ శ్రీచక్ర నిలయ ! రమణీయ సుధీ !**

మ. ఒక నాడా సుకుమారుఁ డొంటిగ ప్రసూనోల్లానముల్ రోయుచున్
వికచోగ్రాటవిలో చరించు తఱి నుద్వే లార్తనాదం బొకం
డొకచోఁ గర్ణపుటంబునం బడ నెవండో పాప మల్లాడు న
ట్టె కటా ! యంచటఁజేరి చూచె నొక కౌటీర్యున్ కిరాతార్దితున్. 55

చం. ప్రబలనిషాదు పాశములఁ జిక్కిన బాలకు మోముఁ జూడ నం
దబల చతుర్ముఖాంశ మనిలాహతపత్రవిధంబుఁ దోచె నా
శబర దురాత్ము సాహసము సంస్కృతధర్మనిరోధమై మదిన్
విబుధవిధేయవృత్తి ప్రభవింపఁ గిరాతునిఁ జూచి యిట్లనెన్. 56

శా. పాపాత్మా ! కడ జాతి బుద్ధివి కదా పాపంబు యోచింతువే
యే పాఱుం గని వేదశాస్త్రముల మౌనీంద్రుల్ ప్రశంసింతురో !
భూపాలాళి శిరంబు వంచునొ ! దయాంభోరాశి యుప్పొంగునో !
ఆ పాఱుం జెఱవెట్టఁ బాడియె దురాత్మా? పాదముల్ బట్టుమా ! 57

వ. అవ్వింధ్యాచల గుహాకర్ణపుటంబుల నప్పలుకులు ప్రతిధ్వనింప దృశాన, నిశాదు లిరువురు నొక్కమారుగా నులికిపడి. 58

సీ. చిరుచేలమునుఁ జుట్టి చిరుకోల ధరియించి
చిరుకోప మురువుగా నురుమువాడు
కృష్ణాజినముఁ గప్పి కృష్ణనామము వెట్టి
జిష్ణువై కనుల భాసించువాడు
సత్త్వంబుగలవాడు సత్త్వమార్గమువాడు
సత్యంబుఁ దెలిసిన చంటివాడు
ధర్మనందను వోలె ధర్మోపదేశంబుఁ
జేయగా వచ్చిన చిఱుతవాడు

తే.గీ. కట్టెదుట నుంటఁ గాంచి నిర్భ్రాంత పడిరి
విజయవిహ్వలితాబద్ధ విగ్రహముల
పాఱుఁ డొక తోడు దొరకె నం చూఱడిలగ
నడుమ వీడెవ్వ దని క్రుంగు నడవిమనిషి. 59

కం. తన పని కాటంకము గని
కినిసిన నా వ్యాధుఁ డంత కేకలు వేసెన్
"సిన కూనా పానము మీ
దన బయ మెయ్య దొసి పొడిసెదన్" బొమ్మంచున్. 60

వ. సుడులు దిరుగు కిరాతుఁ గనుబొమముడు లా వైశ్యబాలకు హృదయ తంతువుల ధర్మంపుముడి నింకను బిగియింప. 61

తే.గీ. అటులె కానిమ్ము ననుఁ జంపు మా ద్విజన్ము
వదలివేయుము వేగంబ వ్యాధముఖ్య !
గోకులాగ్రజన్ములఁ గావఁగోరి కోరి
బొంది నర్పించువాడె పో పొందు ముక్తి. 62

వ. అనుచు నాతఁ డా కిరాతుఁ జెంత కరుగ నతండును బాలకుఁ జిలుక పలుకులకు తలపునఁ జలంబు తొలంగి కృపాజలంబు వొడమ. 63



కం. "యిందెమ్మకు పెతి యేటా
యిందుకు మనిసిని బలేసి యిచ్చుట మాలో
యిందల మామూలొరె నీ
కెందుకు పోపోర పోఅ ! యెక్కడి కైనా" 64

ఆ.వె. అనుచు జాలి గదుర నడవి నాయకుఁ డాడ
ధర్మనందనుండుఁ దలకఁడాయె
వాని బదులు నన్ను వనదేవి కిమ్మంచు
మొండిపట్టుతోడ మ్రోల వ్రాలె. 65

వ. మాట వినక మరణపాశంబు మెడను వైచికొని మహీసురు మృత్యుముక్తుం జేసిన ధర్మనందనుపై క్రుద్ధుండైన కిరాతుండు దన్ను లక్ష్యపెట్టని నేరమునకు మిగుల శిక్షింపనెంచి తక్షణంబ చారలదుప్పి నొందు రెండు కుందేళ్ళ నైదు తోడేళ్ళఁ జంపి బాలకు శిరంబున నుంచి మెడత్రాడుఁబట్టి రాలగుట్టల ముండ్లమట్టులఁ బులులతెట్టల నలవిగాని దట్టమైన యటవీమార్గంబున వేగంబ నిర్గమించునెడ నా వైశ్యబాలకుండు. 66

సీ. నడియెండ నొడ లెండ నడ యెండి వడి కుంద
మెడఁ బిండు నురిదండ మిన్ను దండు
మిడినేల నడ తూలి మెడ వ్రేలు తోడేలు
పడ నేలఁ జొఱి కేలు బాద వ్రేలు
తుదముట్టు నెదగుట్టు సొదవెట్టి పడఁగొట్టఁ
జెడఁదిట్టు కడగొట్టు మదమ ముట్టు
కసినోడ్చి దయనూడ్చి వెసనీడ్చ బిగినేడ్చుఁ
గేల్మోడ్చుఁ గనుమోడ్చుఁ గీళ్ళు విడచు

తే.గీ. బాల్యచాపల్యమున నింత బాధపడుచుఁ
దిరిగి విధినెంచి విధి యంచుఁ దెప్పతిలును
గురుపథంబున మన ముంచి కుళ్ళబొడుచు
వేటగానికి శుభ మంచు వేడుకొనును. 67

తే.గీ. అట్టి తతి నమ్మహారణ్యమందు మగధ
ప్రభువు మృగయార్థ మరుదెంచె బలముతోడ
భటుల డప్పులచప్పుళ్ళబారి నుండి
లొద్దలను గూలు మెకములు దద్దరిల్లె. 68

ఆ.వె. కలకలంబునందు కలగుండువడిన కి
రాతుఁ డెందుఁ బోవరాక బాలు
నొండు బిలమునందు నుంచి ఱాతినిఁ గప్పి
చెట్టునెక్కి దాగె గుట్టుగాను. 69

తే.గీ. గొప్పదియు గొప్పకప్పున్న దొప్పయినది
గుట్టయినదియుఁ దొలిగుట్టుఁ గట్టఁబెట్టు
నట్టి తొల్లిటికథ యిద్ది గట్టిబుద్ధి
తోడ విన్నట్టివారికి తొలగు భయము. 70

***ఇది శ్రీ వాసవీ పురాణ మందు ధర్మనందనుఁడు కిరాతు చెఱ వడిన వృత్తాంతం బను నాల్గవ అధ్యాయము సంపూర్ణము.***

(ప్రసూనోల్లానముల్= పువ్వులు, దర్భలు, రోయు= వెదకు, కౌటీర్యుడు= తోడులేనివాడు, దృశానుడు= బ్రాహ్మణుడు, పోఱడు= బాలుడు, ముండ్ల మట్టులు= బాధించుముళ్ళు, తెట్టలు= సమూహములు, చొఱికాడు= కిరాతుడు)



# ఐదవ అధ్యాయము

**కం. శ్రీకరి ! కరుణాకరి ! సుగు**
**ణాకరి ! కర కాంతి కారి ! అవగుణ ధరుణీ !**
**భీకరరిపుషడ్భిదురా !**
**వ్యాకృత పరతత్త్వ కంధి ! వాఙ్మీ ! జననీ !**

వ. సత్కథాశ్రవణాభిలాషు లగు వైశ్యమునీంద్రులు మగధప్రభు వృత్తాంతంబు విన ముచ్చటవడ నమ్మునిపుంగవుడు జిరునగవున నిట్లనియె. 71

తే.గీ. భద్రుఁడను రాజు శ్రీరామభద్రు వోలె
మగధఁ బాలించి పేర్గన్న మానధనుఁడు
ఆతఁ డొకనాడు వేటకై యరుగుదెంచె
వింధ్యపర్వతప్రాంతాటవీ పథాల. 72

శా. శుండాంతాస్త మదేభకుంభ చర గర్జోత్పన్న భేరీధ్వనుల్
మండూకాస్త ముఖప్రవాహ విష సంపన్నాహి కైవారముల్
ఖండోలీ ఝషవాల మోక్ష మకరాక్రాంతాబ్జ గంధాంబువుల్
ఝుండాలెత్తి సపర్యఁజేసినవి రాజాకానఁ గాలూనగన్ . 73

కం. పెక్కు మృగంబులఁ గూలిచి
స్రుక్కిన యా నృపతి యొందు చూతచ్ఛాయన్
ప్రక్కనుఁ బఱచిన వెనుకా
ప్రక్కకు ననుచరులు వచ్చి పల్కిరి వేడ్కన్. 74

సీ. క్రొవ్వెక్కి కాల్దువ్వు క్రుద్ధమహిషముల
క్రూర నారాచాలఁ గూల్చినాము
అడవిపంటల మెక్కు నడవిపందుల నెల్ల
త్రుటిలోన నంతమొందించినాము

భయదఘోరాకార భల్లూకతతి నెల్ల
భల్లమ్ములకు బలిపఱచినాము
తరుశాఖలన్ వ్రేలి తెరువరులను మ్రింగు
కొండచిల్వలఁ దెగఁగొట్టినాము

తే.గీ. క్రోల్పులులగములం గూలఁగొట్టినాము
చండసింహంబులం జాల చెండినాము
బలిమి మత్తేభయూధముల్ పట్టినాము
పిల్చి ప్రభు విచ్చు మెచ్చుకై నిల్చినాము. 75

వ. అటుల వినయవినమిత గాత్రులైన పరిజనులఁ జూచి భద్రుండును సంతృప్త మానసుండై ధనకనకరత్నాభరణాది వివిధ భూరిపారితోషికంబుల యథావిధి సత్కరించి స్తిమితుండై భోజన భాజనాదులం గావించి సుఖసల్లాపంబులఁ గావించు మంత్రి మండలంబున నొకింత విశ్రమించు తలంపున మేను వాల్చి పైకిఁ జూచుడు.

తే.గీ. ఆకు లలమిన యెత్తైనమ్రాకు మీద
నక్కిచూచెడు బోయ వాడొక్కరుండు
బిక్క జచ్చిన చూపుల నక్క వోలె
కనులఁబడె నంత యెరుపెక్కెఁ గన్నుదోయి. 77

చం. కనలిన కన్నుదోయి ప్రతిగా నిటు సేనల కానవెట్టె నీ
జనపదమందు నిట్టి నరజంతువు పాంథజనారి పాపి భో
జనయుతుఁడౌట భద్రుఁడు ప్రజాహిత పాలకుఁ డెట్టులోర్చు మీ
ధనువుల శూలఖడ్గముల దానముఁ జేయుడు వీని మిత్తికిన్. 78

వ. అంతట నా భటనివహంబు నొక్కుమ్మడి నానావిధశస్త్ర ప్రయోగంబులు గావించి. 79

ఉ. భోరున పైకిఁబారు శరపుంజము బోయను గ్రుచ్చు చుండ, నా
భీరువు నుక్కుమీరి యతిభీకర మారణ శూల ప్రాసముల్
జోరుగ నాటె, సేనలును జుట్టెను వానిని నాయుధమ్ములన్,
తీరుగ వ్యాధుఁ డాకసము తెన్నుగఁ జేకొని పైకిఁ బాఱినన్ 80



తే.గీ. క్రుద్ధ భూజాని యవ్వాని గ్రొవ్వుఁ బాప
నర్ధచంద్రాస్త్ర మొందు కర్ణాంత మూని
విడువ నద్దానిచే బోయ విడచెఁ దనువు
సంతసమ్మున నా రాజు చనియెఁ దిరిగి. 81

తే.గీ. అచట మధ్యాహ్న మగుడు నా చ్యవనమునియు
శిష్యుఁ గానక మిగిలిన శిష్య తతినిఁ
గూడి వనమెల్ల నెలుగెత్తి గోల వెట్టె
వెదకి వేసారి దురపిల్లె వెక్కి వెక్కి. 82

ఉ. ఆత్మసమానుఁడైన నియతాత్ముఁడు ఛాత్రుఁడు గానరామిఁ దా
నాత్మఁ గలంగి చింతిలు మహాముని యెట్టులొ యిల్లుఁ జేర్చె భూ
తాత్మను, నొంటిపాదమునఁ దాపసదీక్ష వహించె రేబవల్
పత్మ దిశోన్ముఖుండగుచుఁ బథ్యము లొల్లక శిష్య రాకకై. 83

తే.గీ. తనయు విషయంబుఁ దెలిసిన తల్లిదండ్రు
లొక్క పెట్టునఁ గూలిరి దిక్కుఁ దప్పి
యెట్టకేలకు గురుఁ జేరి యెడద హరినిఁ
బూని ప్రాయోపవేశంబుఁ బూని రచట. 84

కం. అని చెప్పెడు సాలంకా
యను గాథకు వైశ్యుల హృదయమ్ములు బరువె
క్కెను బాలకు విషయమ్మును
విన వేడుకమీఱ వారి వీనులు రిక్కెన్. 85

***ఇది శ్రీవాసవీపురాణమందు కిరాతుని మగధరాజు వధియించిన వృత్తాంతంబను ఐదవ అధ్యాయము సంపూర్ణము.***

(శుండాంతాస్త= తొండము చివరతో త్రోయబడిన, కుంభచర= సింహము, ఖండోలీ= సరోవరము, భూతాత్మ= బాహ్యశరీరం, పత్మము= ఆకాశము)

# ఆరవ అధ్యాయము

**కం. అయిగిరి నందిని ! నందిత**
**దయిత వినోదిని ! త్రిభువన తాపస వినుతా !**
**నయన వశంకరి ! తోషిణి !**
**భయదాసుర శోషయిత్రి ! భాగ్య విధాత్రీ !**

వ. శ్రోతల యుత్సుకతఁ దీర్ప నమ్మునివరుం డనంతరకథం బ్రవేశించె. 86

సీ. శంభు కంఠపుచుట్టు, జలధి కవ్వపుచుట్టు,
విఘ్నేశు నడికట్టు, వేల్పు టుద్ది,
వాయుభుక్కుల ఱేడు వాసుకి యొక్కనా
డాదిశేషుని జూడ నరుగఁ దలచి
శివుని యానతినొంది శివశైలమును డిగ్గి
భూమార్గమునఁ దన పురముఁ బట్టి
పాతాళబిల మందు పాషాణమునఁ గప్పు
బడి తాను నిలబెట్టఁ బడుట రోసి
తే.గీ. చంద్ర నిప్పులు గ్రక్కుచుఁ జట్టుఁ జూడ
నదియు మందు వ్రేల్చినయట్టు కుదిలబడియె
కాని పిసరంతఁ గమలని కందుఁ జూచి
యక్కజంబున వాసుకి యుక్కు సడలె. 87

తే.గీ. మేఖలాజినధరుఁడైన మేరుధీర
చిత్తు నబ్బాలు ధ్యానంబుఁ జిత్తగించి
చిలువఱేడంతఁ బ్రియమునఁ బలుకరింపఁ
గనులు తెఱచిన బాలుండు గనియెఁ జిలువ. 88

శ్లో. నమస్తే నాగరాజాయ కాద్రవేయాయతే నమః ।
నమశ్శంకరభూషాయై నమో భక్త ప్రియాయతే ॥ 89

తే.గీ. అనుచు స్తుతియింపఁ దనిసిన యహివరేణ్యుఁ
డస్తు దీర్ఘాయు వారోగ్యమస్త టంచు
నెవ్వఁడవు నీవు చెప్పుమీ యేమి కోరె
దిద్ది నాగలోకపుదారి, యెరుగు మనఁగ. 90

సీ. నేను ధర్మశ్రేష్ఠి సూనుండ ఋషివర
చ్యవనశిష్యుఁడ నిందు సమిధ లేర
వచ్చి చూచితి వ్యాధబాధితుం డగు నొక్క
భూసురు నసువుల నాస విడచి
యున్నవానిని విడు మన్నఁ, గాదన్న కి
రాతున కీ శరీరమ్ము నమ్మ
కొన్నవాడను, వాడు నన్నిచ్చుటకుఁ దెచ్చి
దాచి పో నతనికై వేచియుంటి
తే.గీ. ననగ నబ్బాలకుని దీక్ష నభినుతించి
చనియె వాసుకి యంత రసాతలంబు
నం దనంతునితో ధర్మనంద నార్ద్ర
గాధ వినిపించె నాగలోకము వినంగ. 91

సీ. ధర్మనందనుగాథ తబ్బిబ్బు సేయంగ
తక్షణం బవ్వాని దర్శనంబుఁ
జేయఁగోరిన యట్టి చిలువరాయఁడు వాసు
కిం బంపె దన యింటికిం బిరానఁ
దోడ్తేర నతఁడును దొల్లింటి చోటికిన్
జని వానిఁ దనతోడ సాగు మనగఁ
దనదికానితనువుఁ దరలింపఁ దనవల్ల
కాదంచు నాతండు గదలడాయె

ఆ.వె. కపటి స్వార్థపరుఁడు గలుషాత్ముఁ డగుఁగాక !
ఆడి తప్పు టద్ది పాడి గాద
టంచు నియ్యకొనని యర్భకునీతికి
ముగ్ధుఁడగుచు నిట్లు ముచ్చటించె. 92

ఆ.వె. తెలిసికొంటి నిజము దివ్యదృష్టినిఁ జేసి
పుడమితేడు వచ్చి బోయఁ దునిమె
కాన తప్పు లేదు కదలుమా ఫణిరాజు
నిన్నుఁ జూచు వేడ్క నిలిచినాడు. 93

వ. అదివిని ధర్మనందనుఁడు నాగేశుమీది విశ్వాసమునంజేసి యతని పిఱుంద రసాతలంబుఁ జని నాగాధిపసముద్ధృత నవరత్నఖచిత నాగకన్యాపరివేష్టిత సువిశాల దివ్యమందిరంబున నున్నతాసనాసీనుండును నైరావత తక్షక కర్కోటక ధనంజయ శంఖచూడ మహానాగాధినాయక సంసేవ్యమానుండును సహస్ర మణిమండిత ఫణ వినిర్ధూత సమస్తతిమిరుండును ముహుర్ముహు ర్ద్విసహస్ర జిహ్వా లేలిహానుండును సురాధ్యక్షుండును నగు నాదిశేషుం గని పులకితాంతరంగుఁడై పాదాభివందన మాచరించి. 94

శ్లో. నమస్తే దేవదేవాయ పురుహూతస్తుతాయచ ।
ఆదిదేవాయ శాంతాయ భోగినాం పతయే నమః ॥ 95

శ్లో. నమ స్సహస్రశీర్షాయ ఆదిశేషాయ భూభృతే ।
చతుర్వ్యూహస్య తల్పాయ వేదవేద్యాయ తే నమః ॥ 96

తే.గీ. పుడమి మైత్రేయకుల గోత్రజుఁడను నేను
ధర్మనందన నాముండ ధర్మ సుతుఁడ
సకలలోకాళిరక్షక ! సత్స్వరూప !
నన్నుఁ బాలింపుమో దేవ ! నాగదేవ ! 97

ఆ.వె. ముద్దుఁగొల్పు బాలు ముద్దుమాటల కాది
శేషుఁ డెంతొ సంతసించి వాని
రంజితాత్ముఁడై చిరంజీవ యంచు దీ
వించి వరము నొండు వేడు మనఁగ. 98



ఆ.వె. దేవదేవ నీదు దెస నాదు చలబుద్ధి
పాయకుండ నిమ్ము భక్తసులభ
జన్మ జన్మలకును జగమేలు నీ యందు
భక్తి కుదురనిమ్ము భక్తపాల ! 99

వ. అనెడు నాతని నిస్పృహేంద్రియంబులగు నిస్వార్థకామనల కానందమంది వియోగంబున దుఃఖించు నాచార్య పితరుల కానందంబుఁగూర్ప నిలుఁజేరి సుహృదాదరణీయంబగు గార్హస్థ్యం బత్యంతభక్తి నాచరింపుమని దీవించి వేరొండు వరంబు వేడుకొనుమనిన నతండును వినయ వినమితాంగుడై తన చిర వాంఛితంబు నిట్లు వెల్లడించె. 100

సీ. ఉరగాధినాథ ! నే వర మేదియును వేడ
వృత్తాంతములఁ గొన్ని వివర మిందు
భావిగతము లెల్లఁ బలుకంగ నేర్తువు
కనుక నడుగుచుంటిఁ జనవు కొలది
నాలుగు యుగముల నడచు చంద్రార్కాది
కాలప్రమాణంబు కలుగు విధము
నాలుగు జాతులు నడువందగు విధమ్ము
కలియుగంబున వారి కర్మహాని
ఆ.వె. రాజు నందు తోడ రాజవంశాంతంబు
విష్ణువర్ధన విభు వెట్టిచేత
వైశ్యవంశ మందు వైశ్వానరుని దాడి
వీని విధముఁ దెలియ వేడుచుంటి. 101

వ. బాలకు విషయసంగ్రహణాసక్తత కెంతయు నయ్యాదిశేషుండు సంతసించి వల్లెయని తద్వృత్తాంతంబు వివరింపఁ దొడంగె. పరమపావనంబును నూర్జస్కరంబును శ్రోతవ్యంబును నగు నీ గాథ నిత్యంబుఁ బఠించు వారలు దీర్ఘాయువులు నధిక సంపన్నులుఁ బుత్రవంతులు యశోవంతులు నగుట సత్యంబు. 102

***ఇది శ్రీవాసవీపురాణమందు ధర్మనందనునియెడ నాదిశేషుండు ప్రసన్నుఁ డగుటయను ఆరవ అధ్యాయము సంపూర్ణము.***

# ఏడవ అధ్యాయము

**కం. విలయప్రచండమారుత,**
**మలయసమీరద్వితయ సమన్విత హృదయా !**
**విలసన్మరాళ ధిషణా !**
**సులభా భక్త జన ! నిహిత శుభగుణ సదనా !**

వ. పదునేడులక్షల యిరువదియెనిమిదివేల సంవత్సరంబులు కృతయుగ ప్రమాణంబు, త్రేతాయుగంబు పండ్రెండులక్షల తొంబదియారువేల యబ్దంబులు, ద్వాపరం బెనిమిదిలక్షల యరువదినాలుగువేల వర్షంబులు, నాలుగులక్షల ముప్పది రెండువేల యేండ్లు కలియుగంబు నీ నాల్గుయుగంబులుఁ జేరి యొక మహా యుగంబగు నిట్టి మహాయుగంబులు డెబ్బదియొండు గడచిన నొక మన్వంతరంబు లేక నింద్ర కల్పంబగు నిట్టివి పదునాల్గు గతించిన బ్రహ్మ కొక దినంబగు, శతాయువులగు ధాతలు నూర్గురు గతించిన దీర్ఘాయువనియెడి ముని కొక్క దినంబగు, నిట్టి దీర్ఘాయువు లిరువదియేడుకోట్లు గతించిన రోమశాఖ్యు రోమం బొండు గళితంబగు, నిట్టి రోమశాఖ్యులు ముప్పదికోట్లు మరణించిన నష్టావక్రు శల్యం బొండు జీర్ణంబగు, నిట్టి యష్టావక్రులు నలుబదికోట్లు గతించిన పాదద్రుజ్మని కొక్క క్షణంబు గడచు నిట్టి పాదద్రుజ్మను లిరువదియర్బుదములకోట్లు గతించిన మహేశ్వరున కొక్క నిమేషమాత్రంబగు నియ్యది మహర్షి వాక్యంబు, మరియు మహేశ్వరుండన – 103

చ. బయటకు రాడు లోనఁ జెఱఁ బట్టెద మన్నను కానరాడు లో
బయలునుఁ దానయౌచుఁ దను జెందనిదేదియు లేకయుండుఁ దా
నియమము లేక లోకముల నిష్ట గతి న్నియమించు చుండు వా
జ్మయమునకందఁ దంతర సమాగతుఁ డప్రభవుం డనంతుఁడున్. 104



ఉ. సృష్టియు సృష్టికర్తయును సృష్టిపతుల్ నశియింత్రు గాక తా
నష్టము లేక వెల్గు; నది నైజమగున్ పరమాత్మ, కింక వి
స్పష్టత సాగరమ్ము లొక పాటున విశ్వము ముంచి వైచినన్
భ్రష్టత నొందఁ డెల్లఁ దన భాగముగాఁ గొని వెల్గు నిత్యమై. 105

ఉ. స్థావరజంగమాదులును సారససంభవు డెల్ల దేవగో
త్రావళు లంతరించినను రమ్యత రాజిలు చుండు భూనభో
రావము లేకమై జగము రాత్రిబడంగ, స్వరూపహీనమై
పోవగ తానె యొంటరిగఁ బొల్చెడి నెల్లెడలన్ యథాస్థితిన్. 106

తే.గీ. అట్టి పరమేశ్వరుం డొక్క హంస యట్లు
వేదముల నెల్ల వివరించె నాది యందు
ప్రభవ మొందించె నటుపైన ప్రకృతి సతిని
నామె తత్త్వంబు నంద్రు మహత్తటంచు. 107

తే.గీ. మహదహంకార మద్దాని మహితగుణము
సత్త్వ రాజస తామస తత్త్వములును
జ్ఞాన కర్మేంద్రియములును బ్రాణ పంచ
కంబు భూతంబు లైదు గుణంబు లందు. 108

తే.గీ. రాజసముఁ గూడి పరమేష్ఠి బ్రహ్మ యయ్యె
సత్త్వమునుఁ గూడి విష్ణువై సంచరించె
తామసముఁ గూడి శంభుఁడై తాండవించె
మూడు మూర్తుల తన రూపు ముక్తి కిరవు. 109

వ. ఆ జగన్నియంత నిజాధికారంబులగు నిగమాధికారజగన్నిర్మాణ కౌశలంబులు బ్రహ్మ రూపంబునకును, చక్రాయుధజగద్రక్షాదక్షతలు మహావిష్ణు రూపంబునకును, త్రిశూలవిశ్వసంహారనైపుణ్యంబులు శివరూపంబునకును సంక్రమింపఁజేసె. 110

సీ. నలువ యంతట సృష్టిఁ గలుగఁ జేయగ నెంచి
ముక్కంటి ధ్యానించె ముందుగాను
అంత మనసు నుండి యపరార్కుఁ డుదయించె
ప్రాణ మందున దక్షపతి జనించె

ప్రభవించె నతని యపానమునఁ గ్రతువు
పుట్టె వ్యానమునందు పులహుఁ డంత
తగ నుదానము నందు తాత పులస్త్యుండు
సరి సమానము నందు సద్వశిష్ఠు
ఆ.వె. డుదయ మందె నెల్ల రుత్సాహవంతులై
సంతుఁ బెంచి రంత వంతు మీఱి
బ్రహ్మయునుఁ బిఱుంద ప్రత్యంగ మందున
విశ్వ సృష్టిఁ జేయ వేడ్క మీఱ. 111

వ. శిరంబున గగనంబునుఁ గరంబుల వాయువును నేత్రంబుల సూర్య చంద్రులును లలాటంబున నింద్రాగ్నులును నాభి యందంతరిక్షంబును రోమ కూపంబుల లోకంబులును ముఖంబున దేవతలును భుజంబుల వసు రుద్రాదిత్య రాక్షసులును నూరువుల యక్ష గుహ్యకులునుఁ బాదంబుల గంధర్వ కిన్నర కింపురు షాదులును శేషాంగంబుల నక్షత్ర గ్రహ తారకాదులును సాగర పర్వత మాతృకా సప్తకంబులును నదీ ద్రుమ లతాదులును మృగ పశు పక్షి గణంబులును నవయవ క్రియాసంకేతానుసారము క్రమంబున నుద్భవించి రందు దేవతలు బ్రాహ్మణులనుపేర బాహుజులు క్షత్రియులనుపేర నూరుజులు వైశ్యులనుపేర నంఘ్రిజులు శూద్రులను పేర భూమిని స్థిరపడిరి. 112

ఆ.వె. స్రష్ట యంతఁ దనదు సృష్టి నెల్లరకును
యోగ్యజీవనంబు యోగ్యభుక్తి
యోగ్యవాసములను యోగ్యమర్యాదాశ్ర
మాది నియతిఁ జేసి యాదుకొనియె. 113

వ. ఆయుష్కరంబు నమిత్రకర్శనంబు విభూతివర్ధనంబునునగు నీ చరాచరోత్పత్తి క్రమవృత్తాంతంబు వినువార లిహపరంబులఁ బూజింపబడుదు రిదిసత్యంబు. 114

***ఇది శ్రీ వాసవీపురాణ మందు యీశ్వరభవంబగు సృష్టిరహస్యంబను ఏడవ అధ్యాయము సంపూర్ణము.***



# ఎనిమిదవ అధ్యాయము

**కం. దరహాసామృత స్రోత**
**శ్చర సుమనో హృదయ భావ సాంద్ర రసావి**
**ష్కరణ నిరంతర మగ్నా !**
**పరిపూర్ణ దయాంతరంగ పావన గంగా !**

ఆ.వె. అటుల ధర్మనందనాఖ్యున కహిరాజు
చెప్పి యున్న యట్టి సృష్టివిధము
నిచట వైశ్యమునుల కిటుల సాలంకాయ
నర్షి విపులపరచె హర్షమెసగ. 115

తే.గీ. అంత నలువాయి నాల్గు కులాంతరముల
నెఱిఁగియుండుట గుణ కర్మ లెంచి చూచి
వారివారికి తగినట్టి వంతులొసఁగి
శిక్షకుల నియమించి యాశీర్వదించె. 116

ఆ.వె. వేదపాలనంబు విప్రజాతికి నిచ్చె
క్షేత్రపాలనంబు క్షత్రియులకు
వసుధపోషణంబు వైశ్యసంతతి కిచ్చె
ననుమతించె శూద్రు లనుసరింప. 117

కం. సుర భూసుర ఋషి సంగతి
సరిఁ జూడగ నంగిరసుని, ధరణీశులకున్
గురుని వశిష్ఠుని, వైశ్యుల
గురువుగ నపరార్కుఁగూర్చె కూర్మిన్ విధియున్. 118

వ. విధాత పనుపునఁ గర్మభూమి కేతెంచిన వర్ణచతుష్టయంబుఁ దమ తమ యాచార్యనిర్దిష్టితంబులగు కర్మల భక్తిశ్రద్ధల నాచరించి యశస్వంతులై బ్రహ్మకిష్టం బగు బీజవృద్ధిని బాటింపుచు నిరంతరం బానందంబునఁ జరించి రం దపరార్కు మార్గంబున వైశ్యగణం బున్నతిని సాధించిన క్రమం బెఱుంగుడు. 119

సీ. పదియు రెండేడుల ప్రాయంబుఁ బ్రాప్తింప
శుభశరత్కాలంపు సుదినమందు
గృహ్యోక్తి నుపనాయగేయసంస్కారులై
సాంగత్రయీవిద్యఁ జదివినారు
సారంగచర్మంబుఁ జారు మౌంజీదండ
యజ్ఞోపవీతముల్ యావదుక్త
ధారణం బొనరించి తరుణార్కతేజులై
బ్రహ్మచర్యంబునఁ బ్రబలినారు
తే.గీ. విద్య లరువదినాలుగు విబుధగుణము
లెలమి నేర్చిరి యపరార్కు కలిమిఁజేసి
కూర్మి నతఁడును వారల గోత్ర ప్రవర
భేదములఁ దలంచి వివాహవిధులఁ గూర్చె. 120

ఉ. పొందిన గార్హపత్యమునఁ బొందుగ శోభిలు శిష్యకోటికిన్
విందుగ సర్వవస్తు క్రయవిక్రయ జ్ఞానముఁ దద్గుణంబులున్
ఛందము నార్యధర్మములు సత్య వ్రతంబును సద్ద్విజత్వమున్
కందువ యజ్ఞకర్మ లధికారములన్ దయచేసి యిట్లనెన్. 121

సీ. పితృదేవఋషులకుఁ బ్రీతిసేయుడు భక్తి
ఋణవిముక్తులు కండు ఋతముకొఱకు
పంటలు పండించి పశువులఁ గాయుడు
ప్రజ పాడిపంటలఁ బ్రబలుకొఱకు



వాణిజ్యమందున వడ్డీలయందున
మితలాభమునుఁ గొండు బ్రతుకుకొఱకు
రత్నాలఁ గొని యమ్ము యత్నాల లాభాల
ఖర్చు చేయుడు ధర్మకార్యములకు
తే.గీ. బ్రహ్మచర్యంబుఁ బాటించి వ్రతముఁ బూని
యమల గార్హస్థ్యధర్మంబు లాచరించి
యజ్ఞయాగంబు లొనరించి యశమునొంది
శాస్త్రమార్గంబుఁ దప్పకఁ జనుడు మీరు. 122

వ. అట్లు మృదూక్తుల కులధర్మంబు లుపదేశించి యపరార్కుండు నిజావాసంబు జేర వైశ్యకులంబును గురూపదేశంబును భక్తిఁ బాటించుచు బ్రాహ్మణ క్షత్రియుల ననుసరించుచుఁ దమ గోత్రంబుల వృద్ధి గావించిరి. 123

సీ. అలనాడు మానవు లన్నిలోకంబుల
నంచలవలె విహరించినారు
అలనాడు మానవు లబ్దంబు లిరులక్ష
లించుకఁజేసి జీవించినారు
అలనాడు మానవు లనృతం బెఱుఁగ రను
ఖ్యాతిఁ గాంచి పొగడ్త లందినారు
అలనాడు మానవు లమరసమానులై
ముల్లోకములఁ గీర్తి ముంచినారు
తే.గీ. ధాత కోరిక మన్నించి ధరణియందు
మూడు కులముల వారును ముచ్చటలర
గోత్రములఁ బెంచి గణములఁ గూర్చినారు
అంచితంబగు సంతృప్తి మించినారు. 124

తే.గీ. అంత నొకనాడు నలువ తా నంతరంగ
మందుఁ దలచిన యంత నా ముందుఁ జనిరి
ఋషులు నా వెన్క మనుజపూరుషులు భక్తి
కరయుగమ్ములు జోడించి శిరమువంచి. 125

తే.గీ. తాను చెప్పిన విధమునఁ దమ తమ కుల
ములనుఁ దామరతంపరై వెలయఁ జేసి
ముందు నిలచిన మనుజుల నందఱఁ గని
గోత్రగణసంఖ్య వివరింపఁ గోరె నలువ. 126

తే.గీ. నూటతొమ్మిది గోత్రమ్ము లోటలేక
పదునెనిమిదిగణంబులఁ బరగు చుంటి
మనుచు బ్రాహ్మణపక్షాన మనవిఁజేసె
ఋషి వరుండగు దుర్వాసుఁ డెలమి మొదట. 127

తే.గీ. క్షత్రియుల నుండి ఋషి ధనంజయుఁడు లేచి
గోత్రములు నేడు గణమొందు మాత్ర మనుచు
పలికె నంతట వైశ్యుల పక్షమున స
మాధిఋషి పల్కె బ్రహ్మసమ్మతిని నిటుల. 128

తే.గీ. ధాత ! నీ యాజ్ఞ మాదు గోత్రములు పెరిగి
యేడు వందల పదునాలు గేర్పడినవి
నీదు శిక్షణమున గాదె నిలచితి మెటు
లయిన నధికులమై మేము జయము నంద ! 129

వ. ఈ విధంబున నెల్లవర్ణంబుల వారును తమ తమ గోత్రంబుల వృద్ధి క్రమంబు వినిపింప బ్రహ్మదేవుండును నానందించి తగు వరంబుల వేడుఁ డనినఁ దపంబునందును బ్రహ్మచర్యంబునందును వేదవిహితకర్మంబులయందునుఁ దమ కనురక్తి తప్పకుండునట్లు భూసురులును, ధర్మరక్షణమునందును దుష్టశిక్షణము నందునుఁ దమకు శక్తినిఁ జేకూర్చునట్లు క్షత్రియులునుఁ బ్రార్థించి రంత గోత్రాధిక్య గర్వంబున మూడవ వర్ణము ముందునిలువ నలువయు. 130

ఉ. వైశ్యులు వాసిమీఱఁ బరివారముఁ బెంచిన తీరుఁ జూచి సా
దృశ్యము లేమిఁ జేసి శరదిందువదాన్యత వేడుఁడంచు సం
వేశ్యత నుండ వారుఁ గడు వేడుక నగ్రకులాధిపత్య మా
వశ్యక మంచు వేడిరట, బ్రహ్మ ముదంబున నట్లె పొమ్మనెన్. 131

కం. గోత్రాధిక్యముఁ గలిగిన
మాత్రంబున నొంది నట్టి మద వేగముచే
పాత్రము మఱచిరి విశుల న
పాత్రులు కొందఱు పెలుచన పాలసులగుచున్ ! 132

సీ. వర్ణాధికుల మన్న వరగర్వమునఁ గన్ను
కానక వారు లోకమ్ము మఱచి
యందాక నా స్థాయి నలరిన బ్రాహ్మణ
వరులను జూచి యొండొరులుఁ జేరి
వింతచేష్టలఁ తోడ వికటాట్టహాసాల
గేరి చంకలు గ్రుద్ది గేలిఁజేయ;
తోబుట్టువుల తంతుతో విస్తు పోయిరి
వైశ్యులందున శిష్టవైశ్యగణము,

తే.గీ. గోరుచుట్టును రోకటఁ గొట్టి నట్టు
లసలె యున్నతిఁ గోల్పోయి మసలుచున్న
బ్రాహ్మణుల కోపమును జూచి బ్రహ్మ పలికె
తనయులకు నచ్చజెప్పెడు తండ్రివోలె. 133

చం. కులముల గౌరవంబు సమకూరిన యంతన నెల్ల బాధ్యతల్
పొలయును గాని, మీ కిటుల పోతరమబ్బెనె వైశ్యులార ! వి
ప్రులు, కడు సౌమ్యవర్తనులు, భూమి జనించెడు దేవతల్ కదా !
నిలకడనొంది నెచ్చెలిమి నింపుడు మీ హృదయమ్ములందునన్. 134

సీ. చేసిన తప్పుకు శిక్షయున్ తప్పదు
భువికేగి బాధలు పొందవలయు
శాంతమ్ము సత్యమ్ము సమతయున్ మమతయున్
ధర్మమార్గమ్ములన్ దాటవలదు
'నిత్య' 'కన్య' యటంచు నిత్యకీర్తనఁ బొందు
విశ్వేశ్వరీదేవి విష్ణుమాయ
మీ వంశమున యందు మిమ్ముఁ బ్రోవగఁబుట్టు
వంశోన్నతిని గావ వహ్ని ముట్టు
తే.గీ. ఆమె వెనువెంట నెవ్వార లగ్నిదూకి
పాపములఁ బాపుకొని విప్ర భవ్యకరుణ
నందెదరొ యట్టి వారలు పొందగలరు
తమ సగోత్రుల తోడ నుత్తమపదంబు. 135

వ. మరియు నగ్నింబ్రవేశించువార లెల్ల లోకంబులఁ గీర్తింపబడుదు రట్లు కాని వార లాత్మకులంబు నుండి వెలివడుదురంచు న న్నలువ వీడ్కొలుప వినమి తాంగులై కొందఱును నిరాదరంబునఁగొందఱును నిజలోకంబుల కరిగిరి. 136

***ఇది శ్రీ వాసవీపురాణమందు వైశ్యులకు బ్రాహ్మణశాపంబను నెనిమిదవ అధ్యాయము సంపూర్ణము.***

(వసుధపోషణము= పాడిపంటలతో భూజనుల పోషణము, గృహ్యాము= కర్మబోధక గ్రంథము, ఉపనాయము= ఉపనయనము, కందువ= క్రమముగా, సంవేశ్యత= వేగిరపాటు)



# తొమ్మిదవ అధ్యాయము

**కం. అయి తుర్యతుర్య శివ స**
**న్మయ హృద్వాసిని ! హిమనగ మాతంగ నిజా**
**లయ ! జనగణ హిత వరదా !**
**వియదంభోరాశి శుభ్ర వేణీ భరణా !**

తే.గీ. అంత సంతాపమున వైశ్యసంతతు లొగి
తిరిగి నిజలోక మరుదెంచి దివ్యకాంతి
నలరు నపరార్క ఋషి ముందు తలలువాల్చి
విన్నవించిరి తామున్న విధము నిట్లు. 137

ఉ. వందన మో గురూత్తమ ! భవాదృశ సన్ముని యొజ్జ యయ్యు మా
చందము లిట్టు లయ్యెఁ ! గులసాధన నగ్రత తొల్లి వీడియం
బందియు విప్రకోపమున నంచితగోత్రము లుత్తలమ్ములై
కుందుచునుంటి మయ్య ప్రతికూలములయ్యెను దైవయోగముల్. 138

ఆ.వె. మర్త్యలోక మన్న మరణంబునకు దారి
దుఃఖభాజనంబు దుస్సహంబు
దురితజనులు సల్పు దుష్కర్మముల నెన్న
వశమె వేయినోళ్ళ ఫణికినైన ! 139

సీ. పరధనమ్ములఁ గోరి పరకాంతలనుఁ గోరి
దొంగలై పరులను దోచువారు
మద్యపానము నందు మాంసభక్షణమందు
మత్తులై రే బవల్ మసలువారు

పోషించు ప్రభువును భూషించుచునె వెన్క
ద్రోహ మూనుచు వాని దోచువారు
ఆలిమాటలు విని అమ్మనాన్నల కింత
కూడు పెట్టక వెళ్ళగొట్టువారు

తే.గీ. ఆస్తికై కుక్కలై పోరు నన్న దమ్ము
లాస్తికై కోడలినిఁ గాల్చు నత్త లింక
కుత్సితంబుల బ్రతికెడి క్రూర జన్మ
లున్న నరకంబు నర లోక మెన్న కలిని. 140

తే.గీ. బ్రాహ్మణుల క్షాత్రధర్మంబు ప్రబలు నచట
క్షత్రియుల వైశ్యవృత్తంబు పాత్రమగును
వైశ్యులకు శూద్రతత్వంబవశ్య మగును
శూద్రు లందున ఛండాల ముద్ర పడును. 141

సీ. కామకీలాలమై గంభీరమైనట్టి
క్రోధకల్లోలమై రోజునట్టి
దుర్లోభలవణమై దుస్పర్శమైనట్టి
మోహశైవాలమై ముంచునట్టి
మదవిషోపేతమై మలినమ్ము నైనట్టి
మాత్సర్యనక్రమై మనెడునట్టి
అంగనావ్యసనాహియై ఘోరమైనట్టి
దంభ శైలాఢ్యమై తనరునట్టి

తే.గీ. నరకభీకరద్వీపమై పరగునట్టి
దిశల యొద్దుల నొరయుచుఁ దెర్లునట్టి
సంచితాపారసంసారసాగరమునఁ
జేరుచుండును దుర్మత్త జీవ వితతి. 142

ఉ. తొమ్మిది చిల్లులున్ సతముఁ దొల్చుకు పోయెడు బొంది నావపై
హుమ్మను నౌను కాదుల మహోద్ధృతఝుంఝుల భీకరాబ్ధి మ
ధ్యమ్మున దిక్కు తోచక విధర్మపథమ్ముల నంటరాని దే
శమ్ముల సంచరించు నర సంగతి మాకు విధింపఁ బోకుమా ! 143

ఆ.వె. తప్పు నొప్పుకొందు మొప్ప మీ దండనం
బిప్పు డేది దారి చెప్పుమయ్య
నొప్పి తగులకుండ నప్పు తీఱెడు మార్గ
మొప్ప గురువరేణ్య చెప్పుమయ్య. 144

వ. అంత నపరార్కుండును సంతుష్టాంతరంగుండై 145

ఉ. అర్యకులార బాధ వల దంచితకర్మల నిష్ఠ సల్పుడీ
యార్యజనోచితంబులగు యజ్ఞతపోజపవేదపాఠ నా
చార్యసురద్విజార్చనల స్వాదుజలాశయనిర్మితీద్య స
చ్చర్యల నైజవృత్తులను సద్గతినొందుఁ డటంచుఁ బల్కుచున్. 146

చం. జగతిని దేవజంతునరజాలముఁ గావగ నప్పు డప్పుడా
ఖగపతియాయి విష్ణు విలఁ గాలిడుఁ గాదె విభిన్న మూర్తులన్,
భగవతి భర్త ఈశుఁడనఁ బాపహరుండు నభీష్టదాత, త
ద్యుగమును గొల్చి మేల్గనుట యుక్తము మీకన వైశ్యసత్తముల్. 147

శా. స్వామీ యంచు మనోగతంబు నిటులన్ వాక్రుచ్చి రధ్యాత్ములై
మేమీ తాపసలోకపుణ్యవనమున్ మిన్నేటి సమ్మానమున్
ప్రామాణ్యంబగు జీవనం బమరసౌభాగ్యంబుఁ బోనాడుచున్
పోమా మర్త్యవికల్పితాసురఘనీభూతాగ్నిఁ బొర్లాడగన్. 148

శా. సంసారంబను చక్రనేమి నెపు దజ్ఞానాంధయానంబునన్
హింసాకల్మషపంకకూపజలసాహిత్యంబు మన్నించి వి
ధ్వంసాశ్లిష్టత ముగ్గి తేలు కలి సంతానంబు నెట్లోర్తు మీ
శంసాదక్షబలాంగకాయతనమౌ స్వర్గం బుపేక్షించుచున్ . 149

సీ. నిరతంబు సత్యంబు నిష్కామకర్మంబు
నిచ్చఁ బాటించు వారెచటనుందు
రశ్వమేధాదులౌ యజ్ఞయాగంబుల
నిష్ట మొందెడి రాజు లెచటనుందు
రాత్మావలోకనం బాత్మనిర్మల మొన
రింపఁ బరివ్రాజు లెచటనుందు
రిల బ్రాహ్మణులఁ గావ  మలినదేహము వీడ
నిచ్చగించెడు పుణ్యు లెచటనుందు
తే.గీ. రని విధర్మంబు నశియింపఁ దనువు నొడ్డి
రక్త లేపనమున పాపముక్తులైన
వీరు లే వెల్గుసదనంబుఁ జేరుకొందు
రటకు రావద్దు తొలగి పొమ్మనుట తగునె ? 150

ఆ.వె. విప్రశాప మెట్లు విదలించుకొనుటయో
నేర్వరాక కంట నీరువెట్టి
రార్య వైశ్యు లట్టు లపరార్కముని చెంత
దగ్ధతామసులు విదగ్ధులగుచు. 151

***ఇది శ్రీ వాసవీపురాణమందు వైశ్యుల పశ్చాత్తాపమను తొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము.***

(కామ కీలాలము= కోరికలనెడు నెత్తురు, మోహ శైవాలము= మోహమనెడి నీటి పాచి, అర్యక= వైశ్య, మర్త్య వికల్పితాసుర ఘనీభూతాగ్ని= మానవకల్పితమై భయంకరమైన గడ్డ కట్టిన అగ్నియందు, హింసా కల్మష పంక కూప జలము= హింస అనే మలినంతో బురదలైన నూతి నీరు, సాహిత్యంబు= కలయిక, విధ్వంసాశ్లేషము= విధ్వంసపు కౌగిలి, శంసా దక్ష బలాంగ కాయతనము= స్వేచ్ఛకు, నైపుణ్యానికి, వసంతానికి నెలవైన.)



# పదవ అధ్యాయము

**కం. సంచితపాప వినాశిని !**
**సంచకరఫలప్రదాన సత్తా జననీ !**
**పంచోపచార మోదిని !**
**పంచ 'మ'కార విఘటిత విపన్న పునానీ !**

కం. త్రపఁ బొగిలెడు శిష్యులఁ గని
అపరార్కమునీంద్రుఁ డంత  నాదరమున దా
నుపనీతాత్ముల కభిమత
ముప భోగము కాగఁ జెప్పె నుత్తమ హితమున్. 152

ఆ.వె. సత్యశూరులైన సత్పుత్రులార మీ
రంద ఱెందు కంత కుందుచుందు
రిల నడుమ నిడుముల కిప్పుడే పోనేల
శివునిగూర్చి ముసు భజింపుడయ్య. 153

చంద్రకళావృత్తము.
చంద్ర శేఖరుఁ డాతఁడు భోళాశంకరుఁ డాతఁడు సృష్టికిన్
కేంద్ర బిందు వతండు సృజించుం గ్రీడ హరించు నతండు స
ర్వేంద్రుఁ డాతఁడు సర్వజగద్భావేంద్రియుఁ డాతఁడు సాధుహృ
త్సాంద్రసుందరుఁ డాతఁడు మీ దోషంబులఁ గాచెడు మ్రొక్కుడీ. 154

మ. ఇల నేనెంత పరాత్పరున్ శివుని గీర్తింపన్, సహస్రాధికా
మలతేజోమయశీర్షసంస్తుతులు భూమ్యాకాశముల్ నిండగన్
పలు బ్రహ్మాండసమూహముల్ వెలుగు సంపాదించు నెచ్చోట నా
విలసత్ప్రాకటకాంతిపుంజమును భావింపంగ లే రెవ్వరున్. 155

మ. ముని పద్మోద్భవ పద్మనాభులకు శంభుప్రాజ్యశీర్షాంఘ్రులన్
కని రాఁ బంతము లయ్యెఁ బోయితి రతిక్రాంతాశయానంబులన్
చనుటే గాని దిగంతముల్ గడచినన్ జంద్రాంకు లింగాకృతిన్
కొన లే మాత్రముఁ గాంచ రైతిరిక నా కూటస్థు నేమందు నేన్ ! 156

వ. మరియు నీ మాయాజగతి నాతని ప్రకాశం బెట్టిదనిన. 157

సీ. వామభాగమునందు వామాక్షిఁ గలవాఁడు
విశ్వాధిపతియైన బిచ్చగాఁడు
అంధకాసురుఁ జంపి యవనిఁ గాచినవాఁడు
భక్తిచే మనకు లోబడెడు వాఁడు
వేదవేదాంగముల్ వెదుక నందని వాఁడు
పసిఁడికొండను విల్లుఁ బట్టువాఁడు
రవిచక్రమైన ధరారథమున నిల్చి
ఆదిశేషుండైన యల్లె త్రాట

తే.గీ. నెసఁ బరబ్రహ్మమను బాణ మెక్కువెట్టి
త్రిపురముల గూల్చి నిలచిన త్రినయనుండు
వానిఁ గొల్చిన వారికి భవము లణగు
నవని వశమౌను గైలాస మవల నిజము. 158

వ. అనవిని హర్షాశ్రుప్లుతలోచనులైన వైశ్యపుంగవులుఁ బులకిత సర్వాంగంబుల
నా బ్రహ్మసంభవుల మ్రోలఁ బ్రణామంబు లాచరించి. 159

ఉ. నిస్తులనిర్విశేష ! పెను నిద్దుర మత్తున గూరు వారు మై
గస్తురిపూత నొందినటు, కర్మవశంబున మధ్యలోక మ
ప్రస్తుతమైన గాని కడు పావనశైవ మపూర్వతత్వముం
బ్రస్తుతి వింటి మింక, విధిఁ బాలనఁజేతు మనుగ్రహింపుమా ! 160

ఉ. తప్పక భూతనాథునకుఁ దత్క్షణమే వ్రత మాచరింతు మా
చొప్పు వచింపు మంచుఁ బరిశుద్ధమనంబుల నిల్చియుండ నా
ముప్పున నున్న శిష్యులకు ముక్తి ఘటింపఁ, గపర్ది మెచ్చుగా
నొప్పగు నర్చనావిధము నొజ్జ వచించె ముదంబు మీఱగన్. 161

తే.గీ. సత్యచిత్తోపశమనముల్, సర్వసంగ
ముల విరక్తి, తపము, దానము, మనమునను
శుద్ధి, బహిరింద్రియమ్ముల సిద్ధి, బుద్ధి,
ధైర్యశౌర్యక్షమాదుల దక్షులగుచు; 162

తే.గీ. మదిని సుఖదుఃఖమానావమాన సములు
సంగరహితులు నిందా ప్రశంససములు
శుభము నశుభమ్ము నొకరీతిఁ జూడఁ గలిగి
శివుని పూజించు వారలే శివులు భువిని. 163

సీ. అటువంటి గుణముల నలవర్చుకొని మీర
లపకారి కుపకారు లగుచుఁ బూని
పసిడిదో వెండిదో పారద మృత్తులన్
లింగ మొక్కటి చేసి ముంగిట గణ
పతి నుంచి ధ్యానించి భక్తితో మారేడు
దళముల నర్పించి గళము నిండ
నుమ్మెత్తపూలతో తుమ్మిపూవులతోడ
ధవళాక్షతలతోడ ధవళతిలల

తే.గీ. తోడ పూజించి కీర్తించి ధూపదీప
ములను సేవించి నైవేద్యములను పెట్టి
ఓం నమశ్శివాయ యనుచు నుచ్చరించు
చుండ నిరతంబు, నీశుండు సులభుఁ డగును. 164

ఉ. వర్ధిలు మధ్యలోకమున వంశము నిల్పుడు ముందు, పుణ్య సం
వర్ధనమార్షపితృగురువాంఛితసిద్ధి ఋణంబుఁ దీర్పుడీ,
ప్రార్థనఁజేయుఁ డావలఁ బరాత్పరు నీశు కృపాకటాక్ష సి
ద్ధ్యర్థము దీక్షఁబూని నిజవాసము నొందుడు దర్శనంబునన్. 165

తే.గీ. అనుచు నాశీర్వదించిన నచ్యుతాంశు
పదము లంటి వీడ్కొలుపంగఁ బయనమైన
గోమఠులు మేరుగిరి చెంతఁ గూడి రచట
నారదుని గాంచి మనసార గారవించి 166

ఉ. లోకములెల్ల నీకు నవలోకితముల్ గద మౌనిసత్తమా !
మాకిక శాపదత్తమగు మధ్యమలోకము వాసమౌను, మే
మేకరణిన్ సహింపగల మేవిధి నుందుము నిర్మలంబుగా,
మా కొక దారిఁజూపుమని మౌనము దాల్చిరి శోకమూర్తులై. 167

తే.గీ. వారి యారాటమును గాంచి వారిలోని
భయముతీఱగ దేవర్షి పలికె నిట్లు ,
కాదు మధ్యమలోకంబు కలుషమయము
భూరివరముల నిడు కర్మభూమి యనుచు. 168

ఆ.వె. 'చేసికొన్న మదికి చేసికొన్నంత' ను
సామె తెచట పుట్టి సత్య మగునొ,
సురుల నైన గాని శుద్ధి చేయగఁ జాలు
మర్త్య లోక మద్ది మాన్య మగుచు. 169

కం. పులు కడుగఁగఁ దగు లోకము
కలుషములనుఁ బాపుకొనగ కదలుఁ డటంచున్
పలికిన వాగ్మికి నతులిడి
ఇల జనపదములకు నడచి రెదలు కలంగన్ . 170



చం. అనుదిన మీశ్వరార్చనల నౌపయికమ్ముల గార్హపత్య సా
ధనముల నోజ సల్పి కులధర్మములందు నిమగ్నచిత్తులై
దినములు వత్సరంబులును దీక్ష వసించిరి పెద్దకాలమున్
మనుమల గాంచుదాక గురుమార్గముఁ దప్పక వైశ్యకూటముల్. 171

ఉ. వంశము నిల్చె నింకఁ నిజ వాంఛితమొప్పఁ దపంబుసల్పి పూ
ర్ణాంశు మహేశు దర్శన వరంబునఁ బూర్వ నివాస మొందగా
పాంశుశరీర కర్మపరిపాకము నయ్యె నటంచు వారు దే
హాంశము లందు నిల్పి తగు యాత్రల సాగిరి దీక్షఁ బూనగా. 172

కం. సాగిరి కాననముల నా
భోగవిరక్తులు చనిచని పుణ్యహిమాద్రిన్
యోగుల మానసముల శ్రీ
రాగము మానససరోవరంబునుఁ గనగాన్. 173

సీ. నేరేడు మారేడు నిమ్మ మామిడి మద్ది
వెలగ గానుగ రావి వేప జువ్వి
మఱ్ఱి పనస పొన్న మాదీఫ లాశోక
తాళామలకముల తరుల నీడ
మల్లె జాజి పొగడ మందార పారిజా
తముల పూపొదరిండ్ల గములయందు
దురదచే దురపిల్లు ద్విరద గండంబుల
గోకు సింగంబుల కూన లున్న
నెమలి ఱెక్కల క్రింద నిద్రించు పాములు
పిల్ల యెల్కలఁ బెంచు పిల్లు లున్న

తే.గీ. కశ్యపాదుల చేత ప్రకాశమాన
మాహుతుల నింద్రనిలయ ముత్సాహకరము
గానగాంధర్వ మయ మూర్ధ్వకాంతినిలయ
మాశ్రమము నొందు గమనించి రచట వారు. 174

కం. అచ్చట మునులకు మ్రొక్కిరి
యెచ్చట తమ తపము సల్ప నిరవగునో యం
చిచ్చ మెయి నడిగి తెలిసిరి
నచ్చిన చోటులకు వారు నడచిరి ప్రీతిన్. 175

సీ. గంగాదినదుల చెంగటఁ గొంద ఱాగిరి
కుల పర్వతములకు కొంద ఱేగి
రవలఁ గొందఱు నైమిశాదివనులఁ జనన్
సిద్ధ భూములఁ జేరె శేషమెల్ల
నందు నందుల వార లాత్మ నీశ్వరు నిల్పి
శివలింగములఁ బ్రతిష్ఠించి నిష్ఠఁ
బూజించి మేన విభూతి రుద్రాక్షలన్
ధరియించి మది శివధ్యానమందు

తే.గీ. సతముఁ బంచాక్షరీమంత్రజపము నందు
పార్వతీపతిఁ గూర్చి తపంబు సల్పి
రెండ వానలఁ జలిగాలి నెండి తడిసి
వణుకుచుండియు నిల్చిరి వత్సరములు. 176

కం. ఆకులతో నీరముతో
సోకెడు వాయువుల తోడ సూర్యరుచులతో
రే కాంతుని కాంతులతో
నాకొనియునుఁ గ్రమత సల్పి రతుల తపంబున్ . 177

శా. ఎంతో కాలము నట్లుఁజేసి రయిన న్నీశుండు రాలేదు, లో
నెంతో నిస్పృహనిండె, లోపమెదియో యేమో యెఱుంగన్ మనం
బెంతో తల్లడమందె; మానససరం బేతెంచి దేవర్షులం
దంతేవాసులు నైరి వెందిరిగి పాదాబ్జంబులం దార్తులై. 178



కం. వైశ్యుల విన్నదనంబు న
వశ్యము బోగొట్ట నెంచి భంజిత విధులున్
వశ్యదృగంతరవీక్షా
పశ్యతనిజ మెఱిగి యిట్లు పలికిరి దయతో. 179

ఉ. నచ్చిన భోజ్యమున్ విడిచి నాగవిభూషణు నాత్మఁ గొల్చుచో,
హెచ్చును వేయి రెట్లు ఫల మిచ్చును మీకు తపస్సు, లెస్సగా
మెచ్చును నీలకంధరుఁడు మీ మది మెచ్చు వరంబు నిచ్చు, ని
క్కచ్చిగ మీ సుగోత్రములుఁ గావలె మీవలె నీ విధంబుగన్ . 180

వ. ఏ వైశ్యునిచేత నే వస్తువు విడువబడునో యా వస్తువు నాతని వంశంబునందలి వారెల్లరు విడిచిపెట్టవలె నట్టి నియమంబుఁ జేసికొని తపంబుఁ సలుపుండన నమ్మహర్షి వచనంబులకు వైశ్యమునులును సంతుష్టులై తన్నియమంబుఁ బాటించి మానససరోవరతీరంబు నందే తమ తపోదీక్షలఁ బునః ప్రారంభించిరి. 181

ఆ.వె. బొటన వ్రేలి మీదఁ బ్రొద్దు క్రుంకులు నిల్చి
మదన వైరి నోం నమశ్శివాయ
యనుచుఁ దపముఁ జేయు నా వైశ్యగణమున
సత్ఫలంబు లయ్యె సకలములును. 182

***ఇది శ్రీవాసవీపురాణమందు వైశ్యమునులు శివానుగ్రహమునకై తపించుటయను పదవ అధ్యాయము సంపూర్ణము.***

(త్రప= సిగ్గు, ఉపనీత= సమీపమునకు తీసుకురాబడిన, శీర్ష సంస్కృతులు= ఉత్తమ కుటుంబాలు, విలసత్ప్రాకట కాంతి పుంజము= బయటకు ప్రకటమగు వెలుగు వలయము, అతిక్రాంతాశు యానంబులు= బాణవేగమునకు మించిన ప్రయాణములు, ఔపయికము= యుక్తము, వేథోపవాసంబు= విద్వాంసుల సేవ, భంజిత విధులు= బాధ్యతల జయించిన వారు)

# పదునొకండవ అధ్యాయము

కం. **సుర లలనా తతథేయిత**
**థిరణన తాళ నియమావధిత లాస్య రతా !**
**వర కకుభాంపతి థోంగత**
**హర తాళ కుతూహల హృదయ వినోద రతా !**

తే.గీ. యక్ష గంధర్వ సుర నాగ రాక్షసులకు
నాతపంబైన వైశ్య తపోఽంతి కాగ్ని
కీలలం జూచి కైలాస గిరి నివాసు
డుండు తెరగు సాలంకాయనుండు దెలిపె. 183

వ. వైశ్యుల తపంబునకుఁ బ్రసన్నుఁడైన భూతపతి. 184

సీ. దండధరుఁడు ముందు దారి చూపుచునుండ
నైరృతాగ్ను లురు గానములు సలుప
తాళవృంతముఁ బూని తరుణానిలుడు వీవఁ
గోరి దేవేంద్రుండు గొడుగుఁబట్ట
చంద్రకాంతులఁ బోలు చామరంబులుఁ బట్టి
వరుణ ధనదు లిరు దరుల నడువ
వెండికొండనుఁ బోలు దండిపుంగవమెక్కి
బాభ్రవీజాని విశ్వాధినేత

తే.గీ. అత్ర్యగస్త్యాది మునుల వేదామృతోక్తి
నాగమస్తోత్ర మంత్ర సంప్రార్ధనములఁ
జంద్రశేఖరుఁడై శరచ్చంద్రధవళ
కాంతిపూర్ణుఁడై యేతెంచెఁ గరుణ తోడ. 185



కం. భువనమనోహరమగు నా
భవు సాక్షాత్కారముఁ గని వైశ్య మునీంద్రుల్
నవహర్షవిపులనేత్రము
లవభృథములు గాగ బొగిడి రభవున్ విభవున్. 186

స్తోత్రము.

దేవ దేవ ! నమస్తుభ్యమ్ దేవేశ ! కరుణా నిధే ! ।
విశ్వేశ్వర ! నమస్తుభ్యమ్ విరూపాక్ష ! నమోఽస్తుతే ॥
ప్రసిష్ఠాయ వశిష్ఠాయ స్వాధిష్ఠాత్రే నమో నమః ।
గరిష్ఠాయ లఘిష్ఠాయ మహీయసే నమో నమః ॥
మృత్యుంజయాయ రుద్రాయ కాలకంఠాయతే నమః ।
మహేశ్వరాయ శర్వాయ భవాయచ నమో నమః ॥
పినాకపాణయే తుభ్యం నమ స్త్రిపురఘాతినే ।
దక్షయజ్ఞ వినాశాయ త్రీక్షణాయ నమో నమః ॥
పూషదంతభిదే ఘోర హాలాహలవిషాదినే ।
ఖండచంద్రకిరీటాయ వామదేవాయతే నమః॥
భుజంగమవిభూషాయ శుద్ధస్ఫటికమూర్తయే।
అంతర్బహిశ్చ జగతః తిష్ఠతే వ్యాపినే నమః ॥
నమశ్శివాయ శాంతాయ నిర్గుణాయ గుణాత్మనే ।
నిత్యాయ నిర్వికల్పాయ విరాగిణే మహాత్మనే ॥
దగ్ధప్రసూనబాణాయ ధరణీధరశాయినే ।
కమలాకాంతబాణాయ కళ్యాణాచలధన్వనే ॥
కరిచర్మాంబర భృతే కరుణారసవార్ధయే ।
నమో నమస్తే దేవాయ ! మహేశాయ నమోనమః ॥ 187

చంద్రకళావృత్తము.

ఆదిదేవర సాంబశివా లోకైకవినేయక ! మాకు నీ
ఖేద పూరిత ఘోరసముద్రాకృష్టి విమోచనయుక్తియున్,
క్లేదధారణకారణమున్ నీ కీలకదర్శన మందు సం
పాదితంబులు, మా యెదలన్నీ పాదములానఁగ నిల్చెరా ! 188

చం. వినమితమానసంబుల నివేదన లందిన చంద్రమౌళి లో
చనముల సత్కృపామృతము జాల్కొనఁ జూచుచుఁ బ్రీతి వైశ్యులం
దనిపి తపంబులం దభిమతంబు వరంబుగ నిత్తు వేడు కొ
మ్మనె నెద సంతసంబు ముఖమందున లాస్యముఁజేయ నంతటన్189

కం. తపము ఫలించి శివంకరుఁ
డుపనీతుఁడు గాగ మోద మొదవిన వైశ్యుల్
తపనా ! కామిత ఫలదా !
కృప నొక్క వరంబు నిచ్చగింతు మటంచున్. 190

కం. ఏ పాదపల్లవంబుల
రాపాడిన భక్తి సకలలాభప్రద మా
నీ పాదయుగ్మ మందున
నేపారెడు భక్తి మాకు నిమ్మని పలుకన్ . 191

ఆ.వె. భక్తి మాకు చాలు భగవంతుఁడా ! యను
వైశ్యఋషుల మెచ్చి వరమునిచ్చి
మరియు నొక్క వరము మాఱడుగుఁ డనంగ
వారు వేడి రిట్లు వేఱొకండు. 192

శా. బ్రహ్మేంద్రాదినిలింపవర్యులకు, దుర్వారోగ్రదీక్షావిధిన్
బ్రాహ్మీరూపతపోవిభూతులకు నప్రాప్యంబు నజ్ఞేయమై
బ్రహ్మాండంబుల నొక్కటై వెలుగు నీ వాసంబు కైలాస మీ
జిహ్మోన్ముక్తులమైన మాకు దయతో శ్రీకంఠ ! ఈయంగదే ! 193



తే.గీ. అనుడు సంప్రీత చేతసుఁడైన శివుడు
ఖచితనవకోటిసూర్యప్రకాశమాన
దివ్యరథముల వారల భవ్యపథము
లందు తన లోకమునఁ జేర్చె నపుడు కరుణ ! 194

***ఇది శ్రీ వాసవీపురాణమందు వైశ్యర్షులకు పరమేశ్వరసాక్షాత్కారము, కైలాసప్రాప్తి యను పదునొకండవ అధ్యాయము సంపూర్ణము.***

(తపోజ్వలంతికాగ్ని= తపస్సనే పొయ్యిలోని అగ్ని, బాభ్రవి= పార్వతీదేవి, వినేయకుడు= ఆజ్ఞాపించువాడు, ఈ ఖేదపూరిత సముద్రాకృష్టి విమోచనశీలము= ఈ బాధామయశోక సముద్రమునుండి తప్పింప గలిగినది, ఆమోదితార్ణవతారణము= వాసనామయ సాగరమును దాటించగలిగినది, ఉపనీతుడు= దరికి తెచ్చినవాడు, జిహ్మము= వక్ర గమనము)

## పది రెండవ అధ్యాయము

**కం. సరసిజసుందరనయనా !**
**సురుచిరదరహాసవదన ! సూనృతవచనా !**
**విరచితవిశ్వధ్వజినీ !**
**వరదాయిని ! గుణనిధాన వైయాకరణీ !**

శా. కైలాసంబున వైశ్యు లెల్లరును శ్రీకంఠున్ స్వయంశ్రేష్ఠునిన్
శీలోత్కృష్టసమర్చనావిధులతో సేవించియుం దృప్తులై
కాలాత్మానుమతిం గుబేరపురిలో ఖర్వాదులం గాయుచున్
శైలూషావృత శైల చైత్రరథ సంస్థానంబుల న్నిల్చుచున్ . 195

వ. విచిత్రమణిసాను గహ్వరములందును, గహ్వరోద్యానపదంబు లందును, పాదపాద్భుతలతానికుంజము లందును నిరతంబుఁ గ్రీడించు నగ్గుహ్యక సత్తము లందు సోమదత్తుని కుమార్తె కీర్తికన్యక యొకనాడు సఖీజనసహస్రంబుల నడుమ నారూఢయౌవనయు, సర్వాలంకారభూషితాంగయుఁ, జిత్తవిభ్రమ రహితాంత రంగయు నై ..... 196

సీ. పాటలీముకుళ సంభావితంబులు దిక్కు
లమలగంధంబుల నలరుచుండ
వకుళసుమాంగనావదనంబులను మూగి
అళికుమారులు ముద్దులాడుచుండ
చాంపేయకుట్మల చారుపరాగంబు
లిరుగడలను కాంతులీనుచుండ
మల్లికామాధవీమంజులమంజరీ
పూజితవనలక్ష్మి మురియుచుండ
తీయ మామిడిపండ్లు తినెడు చిల్కలతోడ
చిగురుమెక్కు పికాళి చేరి పాడ
రత్నాంచితస్వర్ణరమణీయబిలగర్భ
నికరప్రతిధ్వనుల్ నిల్పుచుండ
కలువల వెన్నెల కమలాల కెంజాయ
రదనాధరంబులన్ రగులుచుండ
హంససంఘంబుల కంబుజవనపాళు
లిగురుతూండ్లాతిథ్య మిచ్చుచుండ

తే.గీ. మొగలి పూవులు ధ్వజములై నెగడుచుండ
చైత్రరథ నందనంబుల సాటియగుచు
రజితగిరి నేలు నొక వనరాజమందు
హాళి విహరించుచుండె నొయ్యార మొలుక ! 197

సీ. ఆమె మోమును తామరని తుమ్మెదలు మూగి
పరవశమ్మున నీడుఁ బాడుచుండ
ఆమె యందెల మణులందు మోములు గ్రుచ్చి
కలహంసగణములు కదలుచుండ
ఆమె ముంగురులు మలయానిలములఁ దూగి
నుదుట రాపాడుచు మెదలుచుండ
ఆమె నెన్నుదిటిపై నలరు కస్తురిబొట్టు
కమ్మతావులు చుట్టుఁ గ్రమ్ముచుండ
ఆమె కటి కనకౌడ్యాణమణీకాంతి
హరిధనువై నింగి నిరులుఁదోల
ఆమె దేహము నుండి వే మెఱపుల రుచుల్
వనమందు వెలుగులై ప్రాకుచుండ

ఆమె నడక రాజహంస మించుచునుండ
నడుము తూనీగకుం దఱుగునుండ
ఆమె రూపము శ్రీమహాలక్ష్మి కైలాస
మందు జన్మించెనో యనగ నుండ

ఆ.వె. విద్యలందు దిట్ట విజ్ఞాననిధి శివ
ధ్యానధన్య భవ్యదైవనామ
మెదఁ దలంచుచు బిసమృదుపాణులను పారి
జాతములను కోయసాగె నంత ; 198

వసంత తిలక.
ఆ మోహనాకృతి, ననంగజయధ్వజంబున్,
వ్యామోహితామరభయంకరి నొక్క చైత్రా
రాముండు, మిత్రజనరక్తుఁడు, చిత్రకంఠుం
డా మార్గమధ్యమున నచ్చెరువందఁ గాంచెన్ . 199

తే.గీ. మానవాకారమున నందు మసలు మెఱపొ
స్వేచ్ఛ విహరింపవచ్చిన వేల్పువనమొ
కమలసౌధంబు దిగిన యా కడలికొమ్మొ
సగము క్రీడార్థ మేతెంచు శర్వుతనువొ ! 200

ఆ.వె. చేతఁ గల కళావతీతంతి పలుకదు
చిత్తమందు మెలగు శివుఁడు తొలగు
కరగి పోవు కనుల గాంధర్వగర్వమ్ము
చెలిమికాంద్ర యూసుఁ జెవిని బడదు. 201

ఉ. పాయని చూపులన్ మదనబాణవిదారిత మానసంబునన్
గాయము లేర్పడన్ నిలువఁ గాయ ముపాయము కానరాక నా
పాయము మిత్రులన్ నిలిపి భామ తలం పురివెట్ట నాత్రమై
డాయగ వచ్చె నగ్నిఁగని డాయు నిశాశలభంబు భాతిగన్ ! 202



ఆ.వె. చేరి కీర్తికన్యఁ జెరగని చూపుల
మదనతాపమొలయ మందహాస
వదనుఁ డగుచును తడబడుచు మాటలు కూర్చు
కొంచు నెట్లొ పల్కరించెఁ దుదకు. 203

మానిని. ఓ మృదుమంజులమోహిని మంగళమో యువతీమణి నీ వెవరో !
నీ మృదుదేహ విధాతృని దే మొగ ? నీ కరనీరజ మెవ్వరిదో !
ఈ మృదుపాదవిరాజితరంజన మే సురదేశపు యావముదో !
నీ మృదునామసుధారస మేయది, నే వినవచ్చు నటే సుదతీ ! 204

వ. అనుచుఁ జేరవచ్చు నపరిచితోన్మాదు తెఱంగున కించు కాత్మ కలంగి భయంబుఁ దీఱ నభయాంబికఁ దలంచి వెకలి వెగడుపడ వెడపనిఁ జెలికత్తియ ననిపి వెనుదిరుగ నతండును వెక్కసపడకఁ జెలిముఖంబునఁ దన వలపుమిటారి మిటారమునెఱింగి వెఱగొంది వలపుసందిట వెలివారూనుచు నిట్లనియె. 205

శా. ఏమీ నీ మృదు భాషణంబు వినలేనే ! నేను నీ నీలి నే
త్రామర్షంబున రాగ మోప గలనే ! రాపాడు పాలిండ్ల ముం
గాముంజీర బిగింప నేల మదనాకారంబు నా మేనిలో
కామాగ్నిన్ రగిలించె దాహమును పోకార్చంగ ముద్దీయవే ! 206

మ. చపలాక్షీ ! మధురాధరామృతము నీ చన్దోయిఁ గన్దోయి మ
ధ్య పరిష్వంగ మొసంగ నిమ్ము, నను నీ యంత్రంబు గానిమ్ము, నీ
వపరాధీనవు, జాగదేల నను, నీ వానిన్ వరింపంగ, నీ
కృప లేదేని వరింతు మృత్యువును నీ క్రీగన్నులే సాక్షిగన్ . 207

చం. అన విని కీర్తికన్యక హృదంతరగోత్రవిశిష్ట సంస్కృతిన్
వినయముఁ దప్ప కిట్లనియె వేదవిదుండవు దేవసూతి వీ
యనుచితమైన రీతిఁ బలుకాడగఁ జెల్లునె, తండ్రి చాటు బి
డ్డను తలిదండ్రు లే వరుని డాపల నుంతురొ వానిఁ జేరెదన్ . 208

కం. అనుచుఁ బడంతి చెలులతో
వెనుఁ జూడక నింటి కేగి పెద్దలతో నీ
యనుభవ మంతయుఁ జెప్పి స
దనమున నే కలత లేక తద్దయు నుండెన్. 209

కం. అచ్చట గంధర్వుండును
నెచ్చెలి యనుకొన్న పడతి నిరసింపగ లో
చిచ్చు జనించి హుటాహుటి
రచ్చకు సిద్ధంబుఁ జేసె రమణీ వార్తన్ 210

వ. ప్రేమించితిఁ బిల్ల నిమ్మంచు వచ్చిన గంధర్వపతి చిత్రకంఠుని దర్పంబుఁ గని వైశ్యఋషులుం గొంతవడి విచారించి . 211

శా. మేనల్లుండు కలండు వానికయి నీమెన్ ధారవోయంగ వా
గ్దానం బిచ్చితి మిద్ది మా నియమ మో గంధర్వ ! మాకింక న
ద్దానం దప్పగ రాదు నీవు నిక నీ దాక్షిణ్య మూరవ్యులం
బోనాడం దగు నెమ్మితో ననుచు నుద్బోధించి రా దుర్మతిన్ . 212

కం. అప్పటి కాతఁడుఁ బోయిన
నొప్పక లో రగులు విరహ మోర్వమి చేతన్
చప్పున నేతెంచెఁ దిరిగి
యొప్పింపగ గుహ్యకతతి నున్మాదమునన్ . 213

తే.గీ. వంశమర్యాదఁ దప్పని వైశ్యవరులు
తిరిగి వచ్చిన మూర్ఖునిఁ దిట్టి రంత
పొత్తు కుదురదు బుద్ధిగఁ బొమ్మటంచు
గత్తరించినఁ దల చీలి చత్తువంచు. 214

కం. చిత్రము భామను చూచుట
చిత్రము భరియింప రాని చిత్త వికృతియున్
చిత్రము త్రోపుం బడుట వి
చిత్రము గంధర్వ పతికి చెమటలు మేనన్ . 215

వ. అంతట వైశ్యులునుఁ బరిశుద్ధచిత్తంబుల గుహ్యకపతి సన్నిధిం జేరి జరిగిన వృత్తాంతంబు విన్నవించి భారరాహిత్యంబున నీశ్వరపాదపద్మసంసక్త భృంగంబులై సుఖంబున నుండిరి. 216

***ఇది శ్రీవాసవీపురాణమందలి కీర్తికన్యకా చిత్రకంఠుల వృత్తాంతమనెడు పదిరెండవ అధ్యాయము సంపూర్ణము.***

(శీలోత్కృష్ట సమర్చనా విధులు= శీలముచేత శ్రేష్ఠములైన పూజాకార్యాలు, శైలూషావృత= మారేడుచెట్లతో నిండియున్న, యావము= లత్తుక, వ్యామోహితామర భయంకరి= మోహము చెందిన అమరులనైనను భయపెట్టునది, చైత్రారాముండు= చైత్రవనంలోవిహరించు వాడు, కళావతి= చిత్రకంఠునివీణపేరు, ఆమర్షము= కోపము, ముంగాముంజీర= ఒక రకంచీర)

# పదమూడవ అధ్యాయము

**కం. వైశ్యకులక్షీరాబ్ధిజ !**
**వశ్యాఖిలవిశ్వవస్తువాసితతేజా !**
**పశ్యత్ఫాలార్థ ముకుర !**
**దృశ్యజగచ్చేలఘటిత ధృత వక్షోజా !**

వాసవి. విశ్వ సంరక్ష ణాధ్వర యాజ్ఞికున్ ప్రేమన్ బడవేసె లక్ష్మియై
విశ్వ నిర్మాణ సత్రక్రతు దీక్షితున్ ప్రేమన్ బడవేసె వాణియై
విశ్వ సంహార భార ధురంధరున్ ప్రేమన్ బడవేసె గౌరియై
విశ్వ సమ్మోహనం బది యౌవనావిష్కారము కీర్తి కన్యకున్ . 217

ఉ. నిండగు యౌవనంబు నవనీతసమానము బుగ్గ నిగ్గు లా
ఖండల శస్త్ర తుల్యములు కంటి కొనల్ మరుదేహమధ్య ము
ద్దండకటీకుచంబులఁ బదారు కళల్ విలసిల్లు కన్యకై
గుండెల మీద కుంపటిగ కూర్చొనెఁ బెండిలి సేయగా వలెన్ . 218

ఆ.వె. వయసు మీద నున్న వనితను జూడ నే
కోడెగాని కన్ను కుట్ట కుండు
నింటఁ బెరుగు కన్య కే యీడు కా యీడు
ముచ్చటలను దీర్ప మెచ్చుఁ గాదె ! 219

వాసవి. కీర్తికన్యామణీకర మందగాఁ గేల్సాచిన చిత్రకంఠుతో
కూర్తు మేనల్లునంచు వచించి సాకుంజూపెను గాని సోమద
త్తార్త చిత్తంబునం దగు నల్లుఁ డే తావందును లేక పోయె నా
మూర్తమం దెల్ల వైశ్యగణంబులన్ బూజించి పథంబు వేడినన్. 220



తే.గీ. సోమదత్తుని పిలుపునఁ గోమటీంద్రుఁ
జేరి రొకచోటఁ జర్చింపఁ జిన్న దాని
పెండ్లి విషయంబునం దొక్క పెద్ద పలికె
నక్క కొడుకుండ నెందుకీ చిక్క టంచు . 221

తే.గీ. అక్క కొడుకుండెనే గాని చక్క దనము
నందు చాలఁడు కీర్తి కేలంద గలఁడె
రంగు రూపులఁ దగు సుందరాంగుఁ డెవఁడొ
అతఁడె వరుఁడు గావలె తప్ప దనియె నొకఁడు. 222

ఉ. అందము చందమంచు మన కందగ రాని ఫలంబు కోసమై
ముందర నున్న మేనరికమున్ విడనాడుట పాడియౌనె ! యే
మందురు సాటివారు గుణ మందున తక్కువె భాగినేయుడున్ ;
అందము ముఖ్యమా! గుణమ! యంచునొకండు విమర్శఁజేసినన్.
223

శా. ఏమేమీ గుణమొండుఁ జూపి కుల మందెవ్వండు లేనట్లు మీ
రేమేమో వచియించు చుంటిరి, వివాహేచ్ఛావధూటీమతం
బేమాత్రంబు గణింప రేల? కనలేరే రాజరాజేశ్వరీ
కౌమారీ మృదు రూప మాత్మ సుత నో గౌరీశ పాదాశ్రితుల్ ! 224

మ. అని వైశ్యర్షి యొకండు రూపమున కత్యాఖ్యాన మందింపఁ బ్రా
క్తన సత్యవ్రత మెట్లు వీడెదము గంధర్వార్భకున్ మేనయ
ల్లున కీనుంటి మటంచుఁ బంపి యిపుడీ లోభంపు బొంకేల వం
చన కాదే పరికింపుఁ డంచు నొక వైశ్యాధీతి వాదాడుచున్ . 225

తే.గీ. వేయి సత్రక్రతువుల కన్న వేధ కన్న
తరు తటాకాయతుల కన్న తపము కన్న
బాహ్యమగు దానముల కన్న భక్తి కన్న
ధర్మముల మిన్న సత్యవ్రతంబు జగతి. 226

ఆ.వె. అనుచు సత్యవాక్కు నందున్న గొప్ప త
నంబుఁ దెలుప ఋషి గణంబు లెల్ల
సమ్మతించెఁ గాని శాస్త్ర విదుఁ డొకఁడు
మేనరికము చేయ రాని దనుచు. 227

ఆ.వె. వావి వరుస లేక వాంఛఁ దీరెడు దేహ
ములను గలుగు నర్భకులని కాదె
ఏకగర్భజాతు లేకంబు కానీక
స్మృతులు వెలసె నార్య మతము లందు. 228

ఆ.వె. మేనరికము నందు మేనుల రెండింట
రక్త మొందు కాదె రగులు రతిని,
వధువు మనుమరాలు వరుఁ జూడ మనుమడు
తాత యొక్కఁడే కదా ఘటింప ! 229

కం. తెలియక పూర్వుల మాటల
కలుషంబును దలను దాల్చి, కాదది యిది మా
కులమున నాచారంబని
పలుకుట ధర్మంబె జాతిపతనము కాదే ! 230

వ. అనుచుఁ బెక్కు విధంబుల మేనరికంబును ఖండింప నందొక ప్రాడ్వివాకుం
డిట్లని హెచ్చరించె. 231

ఉ. శాస్త్రము ధర్మమంచు నిటు సత్యవచఃపరిపాలనేచ్ఛుకా
భస్త్రిక, భాగినేయున కపథ్య మటం చటు శస్త్రకూప మీ
నిస్త్రప చర్చలందు మన నెయ్యము వియ్యమునందకున్నచో
నస్త్రముఁదాల్చివచ్చు మన నంతముచేయగఁజిత్రకంతుఁడున్. 232



చం. అదియును నిక్కమే నయిన నాచరణీయముఁ గాన రాదు, వే
దుదమన నెవ్వరీ విషయ దోలన మాపగఁ జాలు వారటం
చెద దురపిల్లు వైశ్యఋషు లే శుభకర్మల సిద్ధి నొందిరో
యదునుకు వచ్చె కణ్వఋషి హర్షపరాస్తవిషాదరేఖలన్. 233

ఉ. ప్రాణము లేచి వచ్చి నటు వైశ్యవరుల్ చకితాత్ములై శిర
స్త్రాణము లెల్ల మౌనిపదరాజములాన నమస్కరించి ని
ర్వాణపథోపదేశకుని వైభవమొప్ప సపర్యఁ జేసి వి
న్నాణముగా ప్రయాణకథనమ్ము వరించిరి బద్ధహస్తులై. 234

***ఇది శ్రీవాసవీపురాణమందు మేనరిక వివాహముల గురించిన సంవాద మనెడు పదమూడవ అధ్యాయము సంపూర్ణము.***

(మరుదేహము= మరునివంటి, అనగా అనంగ దేహము, ఉద్దండకటీకుచములు= పెద్దవైన కటివలయము, కుచద్వయము, అత్యాఖ్యానము= ఎక్కువగా చెప్పుట, పరాస్త= తొలగింప బడిన, ప్రయాణ కథనము= ప్రయాణ విశేషములు)

# పదునాల్గవ అధ్యాయము

**కం. అతుల సుగుణ సాంద్ర లలిత**
**నుత చరితా ! ధర్మ నిలయ నోదన వదనా !**
**పతితావన ! పరమ కరుణ !**
**క్రతు నిలయా ! హుతమయాయి ! కాలాధిగతా !**

ఉ. గౌరలు భక్తిఁగొల్వ, మది కణ్వ మహర్షియు సంతసించి తా
గౌరవ మొప్ప నీశ్వరునిఁ గాంచి నుతించి యనుజ్ఞ నొంది నేఁ
డా రజతాద్రి నుండి గగనామరగంగఁ బరిక్రమింపగాఁ
జేరుచు నిందు మిమ్ముగనఁ జిత్తము రంజిలె నంచుఁ బల్కుచున్ 235

కం. ఎప్పుడు సంతోషంబున
నొప్పెడు మీ వదనముల నెదో పరితాపం
బప్పువలెఁ దొంగి చూచెడుఁ
జెప్పుడు వీలైన మేలుఁ జేతు ననంగన్. 236

కం. మన మెఱిగిన ముని మాన్యుని
మనమునఁ దమ మననములను మనుపగ నెంతో
వినయమున విశదవదనులు
వినిపించిరి తమ మది ముడి విడని సమస్యన్ . 237

వ. సూనృతవ్రతంబున వరహీనంబును వరగౌరవంబున నన్నృతదోషంబును నడకత్తెరం బోకవలె నున్న వారి దీనస్థితికి జాలినొందిన కణ్వమునియును. 238



ఉ. వైశ్య వదాన్యులార ! మిము వాదవివేకవిశిష్టసంపదల్
వశ్య మొనర్చుకొన్న వవి వర్జ్యము లన్యకులంబు వారలన్ ,
వశ్యమనోవికారుగు బ్రహ్మసమానులు బ్రాహ్మణోత్తముల్
దేశ్య విచారమందు బహుదీక్ష వహించెదు నవ్వి శ్రద్ధతోన్. 239

కం. పెద్దలు చూపించిన మీ
హద్దుల మీరుండ లేక హతమెందు కయా ?
వద్దు సుమా పరధర్మము
ముద్దగు మీ విధుల మీరు మొనయుచు మనుడీ ! 240

వ. అనుచు హితవుఁ జెప్ప నించుక కొందలించియు నమ్మునినేత్రంబుల శాంతంబు వాయమి ధైర్యంబు చెదరక నందొక్క వైశ్య పుంగవుం డిట్లనియె. 241

ఆ.వె. బ్రహ్మ వలన మాకు బ్రాహ్మణ్యమున కన్న
నాధిపత్య మొదవె, ఆర్య ! యింక
మాకు లేని హక్కు మరి వారి కేలయా?
చెప్పు మనగ మునియుఁ జెప్పె నిట్లు. 242

కం. ఆ పర్వమె యా గర్వమె
ఆ పరమాత్మానుకంప యా పెత్తనమే
ఈ పగిది మిమ్ము సంతత
మాపదలన్ ద్రిప్పు చున్న దని తెలియరొకో ! 243

తే.గీ. జగతిఁ బ్రజలెల్ల సత్త్వరజస్తమో గు
ణంబులం దెచ్చు తగ్గు సమంబు లగుట
నమరఁజేసెను నలువ వర్గములు నాల్గు
సంఘగమనంబు సరిదారి సాగిపోవ. 244

సీ. బుద్ధి బలము నందు సిద్ధి నొందిన వారు
శీర్ష సంజాతులై చెలగి రనిరి
భుజ బలంబున మంచి విజయంబు సాధింప
భుజములందున వారు పుట్టి రనిరి

వణిజులై కృషికులై వసుధఁ జుట్టెడి వారు
తొడలఁ బుట్టితి రంచు నుడివి నారు
పరుల సేవలయందు బ్రతుకు నీడ్చెడి వారు
పాదసంభవు లంచుఁ బలికి నారు

తే.గీ. సంఘశీర్షంబు బ్రాహ్మణ జన్మ మాయె
సంఘభుజముల క్షత్రియ జన్మ మాయె
సొరిది నూర్వంఘ్రులన్ వైశ్య శూద్రు లిట్లు
సంఘమను విరాడ్రూపసంజాతు లైరి . 245

తే.గీ. సంఘసుహితంబు కొరకునై జరిగి నట్టి
సంఘవిభజన వంశానుసారమైన
నిదిగొ యిట్టులె యగు నిజపదము మఱచి
మానసికవర్ణసంకర మగును జగతి. 246

వ. అనుచు మౌని పుంగవుడు చాతుర్వర్ణ్య క్రమంబున రహస్యంబు వచింపు
చుండ నక్కజమున వైశ్యు లిట్లనిరి. 247

విశద. అయ్యా కణ్వ మునీంద్ర మీ సువచనామృత మించుక చేదు కల్గె నే
మయ్యా, యెప్పటి నుండి గోత్రముల నప్పటియట్టుల నిల్పుచుంటిమే,
మయ్యారే యిపు డిట్టు లీ వనెద వయ్యది నిక్కమె యైన లోకమం
దయ్యా గోత్రములెట్లునిల్చు, నపుడాగతినేల విధించెఁ జెప్పుమా! 248

కం. వణిజుల విషయగ్రహణ సు
గుణసాంద్రతఁ జూచి మౌని గుహ్యములగు కా
రణముల వివరణ మొనరిచె
మణివములకు వణుకు పుట్ట మార్జన మొప్పన్ . 249

తే.గీ. మానసిక వృత్తి కే వృత్తి మాన్యమగునొ
తగ నదియ చేకొనంగ స్వధర్మమగును,
ఆనువంశిక మగు జన్యుదానమందు
వృత్తి యందున నిపుణత వృద్ధియగును. 250



కం. వృత్తుల నైపుణ్యంబున
నుత్తమసంఘంబు వెలయు నోజోవిలస
ద్వృత్తము జనులకు నగు నిజ
మత్తఱి స్మృతికర్త లట్టు లని రయ్యెడలన్. 251

ఆ.వె. మనువు లందు మనకు మన్నన కలదేని
తలనుఁ దాల్చ వలయుఁ దొలక రాదు;
వర్ణ ధర్మములను బాటింప కుండ నా
వర్ణ గౌరవంబుఁ బడయరాదు. 252

ఉ. సంఘము తోడ జీవనము సల్పుట శ్రేయము లాభదాయి, యా
సంఘపు కట్టుబాట్లు మనసార ధరించుట ధర్మ మందు, రా
సంఘము నెగ్గులాడుటన సంకుచితంబగు నద్ది; మీర లీ
సంఘవిధేయులేని నిజసంస్కృతి నొప్పి సుఖించుఁడింతటన్ ! 253

తే.గీ. స్వార్థచింతన పెరిగిన సంఘమందు
కలుషములు నిండి బ్రతుకులు ఖిలములగును,
ధర్మసూత్రములం దట్టి తప్పులున్న
బాగు చేసెడి బాధ్యత బ్రాహ్మణులది. 254

తే.గీ. అట్టి బాధ్యతఁ జేపట్టు నాస యున్న
పూని సాధింప వచ్చు నా పూటనుండి
బ్రాహ్మణుఁడ వౌదు వంత నీ ప్రవచనమున
క్రొత్త సంఘంబు నీ పేర గోత్ర మగును. 255

కం. ముని పలుకులు చెవులఁ బడుచు
ననలము వనములను నమలు నటుల మనములం
దనుచితముల దహియింపగ
ననయము దమ విధులఁ దెలుపు మనిరి వణిజులున్. 256

వ. నావుఁడు క్షేత్రము ననుకూల పఱచిన వెనుక బీజంబు లుంచు కర్షకుని భంగి కణ్వుండునుఁ దన వచనామృత ధారలఁ దడిపి సిద్ధపఱచిన వైశ్యుల మనః క్షేత్రంబులఁ గర్తవ్యం బనెడు బీజావాపనంబుఁ జేయుచు. 257

తే.గీ. బ్రహ్మ ఋగ్వేద మందిట్లు వైశ్యవర్ణ
ధర్మమును జెప్పె, నగ్నికి దర్భలందు
సంస్కృతంబైన వప యట్లు సమ్మతంబు
మేనబావకు మరదలు మీ కులమున . 258

ఆ.వె. అందు వలన మరియు సందేహములు లేక
మేనరికముఁ జేసి మేలు గనుఁడు,
రంగు రూపు కంటె రమ్యంబు గుణమెన్న
సుగుణ భూషణముల సుకృతు లగుడు. 259

చం. అనుచు వచించి కణ్వ ఋషి యంత సురాపగఁ జూడఁ బోయెఁ, బా
వనమగు మౌని యానతిని వైశ్యవరేణ్యులు కీర్తికన్యకన్
ఘనముగ భాగినేయునకు కట్నము సేయగ నిశ్చయించి నె
మ్మనములఁ జింతఁ దీఱి తమ మాడువులంజని రంత వేడ్కతోన్. 260

***ఇది శ్రీ వాసవీపురాణమందు కణ్వర్షిచే సమస్యాపరిష్కారమను పదునాల్గవ అధ్యాయము సంపూర్ణము.***

(వరహీనము= వరుడు వధువుకంటె తక్కువ, మనోవికారులు= మనమునందు అవ లక్షణములు గలవారు, మఱివము= అధికారము, మార్జనము= తుడుపు, మాడువులు= స్వస్థానములు)



# పదునైదవ అధ్యాయము

**కం. దనుజన సంగర సంర**
**క్షణ సంగ పరిస్ఫుర ద్భుజ నట త్కటకా !**
**కనక నిషంగ పృషత్కో**
**పనిషంగ రట ద్భట మధుప హటావటకా !**

ఉ. అక్కడ చిత్రకంఠుఁ డసురాత్మవిచేష్టితుఁడై పరాభవం
బక్కసు మేపుచుండ హృదయంబు రగిల్చిన కీర్తికన్యకన్
దక్కగ నీని వైశ్యగణదర్ప మణంచగ దారి కాన రా
దక్కట యంచుఁ దీవ్రవిరహంబునఁ గుందుచునుండె రేబవల్. 261

సీ. ఎపుడు సంగతినుండి యెడద నూచెడి కళా
వతి మేన కేలాన వలవ దేల
ఎపుడు సంగతి నుండి యెడద నించెడి సురా
పాత్ర మోమున మోవి వలవ దేల
ఎపుడు సంగతి నుండి యెడదఁ దన్పెడి మిత్ర
వచనంబులకు చెవి వలవ దేల
ఎపుడు సంగతి నుండి యెడదఁ బండెడి శంభు
వర్ణనమ్మున మది వలవ దేల
తే.గీ. ఎపుడు లేనిది తనవైన యింద్రియంబు
లెల్లఁ దనవి కానట్లు తన్నేచు చుండ
తీవ్రమౌ ప్రతీకారేచ్ఛఁ దిక్క రేగ
హానిఁ దలపెట్టె ధూర్తుఁడై కాని రీతి. 262

ఆ.వె. ఈశ్వరుండు మెచ్చి యిచ్చిన మాయచే
నార్య సోమదత్తు నక్క కొడుకుఁ
దప్పిద మెఱుగని సుదంతుని శోషింప
సాగె నడ్డుఁ దీసి సడ్డ వట్ట. 263

తే.గీ. రోజు రోజుకు క్షీణచంద్రుని విధాన
శీర్ణుఁడగు సుదంతునిఁ జూచి శ్రేష్ఠు లంద
ఱతని శోధించి కారణ మరయ రాక
నార్తులై యుండ మానాథుఁ డనియె నిట్లు . 264

ఉ. ఈశునియాన లోకమున నెద్దడి సోకగనీము, నిత్య మా
యీశునియాన సేద్యమున నెద్దయి సాయమొనర్చుచుండె నం
దీశుఁడు, వానికిన్ మనకు నెయ్య మనాదిది, వేడుకొంద మా
యీశవహేశుఁ జేరి మన నేఁచు సమస్యఁ బరిష్కరింపగా. 265

కం. వల్లె యని వైశ్యు లెల్లరు
చల్లగ నందీశుఁ జేరి సాగిలి మ్రొక్కన్
ఫుల్ల మనోజ్ఞామృత సువచః
సల్లాపము లందతండు సంగతుఁ డయ్యెన్ . 266

చం. "బసవ" కులాధినాథుని సుభాషితముల్ విని ధైర్యమూని వై
శ్య సముదయంబు నిట్లనె, వృషాధిప శంకరుఁ గూర్మి సంశ్రుతా !
పొసగని కోర్కె కూడదన బుస్సలు కొట్టుచుఁ బోయెఁ జిత్రకం
ఠ సురసరీసృపంబు నిటు తావులు దప్పెడు మా సుదంతుడున్. 267

కం. ఏ కారణమున మా కీ
శోకం బడకించె దీని సూయాణమునన్
మా కులము నాకులంబగు
సాకుము గోకులపతీ ! ప్రసాద మ్మలరన్ . 268

కం. వలగొని వేడెడు వైశ్యుల
వలవలఁ గని వృషభపతియు వాస్తవ మెల్లన్
దిలకించి దివ్యదృక్కుల
కలవరము వలదని పలికెఁ గర్తవ్యంబున్ . 269

శా. గంధర్వుం డపరాధి కాదు తొలుతన్, గాఢార్తిశర్వాప్తమౌ
గాంధర్వాధికశక్తి మాయ యనగా గాఢోపరాగంబు చే
నంధత్వంబున నింతఁ జేసెఁ దన ప్రత్యర్థిన్ హరింపన్, తనూ
బాంధవ్యంబు ఘటింప నాత్మసఖితో, పంతంబునన్ భ్రష్టుఁడై. 270

తే.గీ. ఏడు రాత్రుల వఱకుండు నిట్టి శక్తి,
పిదప నశియించు నందాకఁ బెండ్లి కూతుఁ
బెండ్లి కొమరునితోఁ బాటు ప్రీతి నుంచు
డీశు వనమున సమకూడు నిష్ట సిద్ధి. 271

కం. అని వీడ్కొలిపిన నందీ
శునకుఁ గృతజ్ఞతలిడి వణిజులుఁ జని రట్లే
యొనరిచి సిద్ధిని వడసిరి,
యొనరింపవలె నిక పెండ్లి యోగ్యస్థాయిన్. 272

కం. ఈ లోపల కైలాసము
వాలాయము శివునిఁ జూడ బ్రాహ్మణు లమరుల్
కాలూనిరి భృంగి యటన్
కేలన్ వారించె వారి గిరి ముంగిటనే. 273

తే.గీ. తమకు నందీశ్వరానుగ్రహము లభింప
వారి భృంగీశ్వరాగ్రహ ప్రాప్తిఁ జూచి
నైజ రాజస మొకబిగిం దామసింప
గేలిఁ జేసెడు విశుల పోకిళ్ళు చూచి. 274

తే.గీ. ఓరి విశులార ! మమ్మి ట్లకారణముగ
గేలి చేసితిరి కనుకc గూలిపోవు
మీరు తలపెట్టు శుభకృతుల్, మేల మాడ
సమయమా యిద్ది ? బుద్ధిలేశమును లేదె ! 275

వ. శప్తులైన సక్థిజు లదివిని కదుంగడు కలవరంబు వడి భీతచిత్తంబుల ముహుర్ముహుర్ముఖరంబుల ముప్పులు వెట్టు తమ మూర్ఖత్వంబునకు మిగులc జింతిలుచుc బ్రాంజలులై "క్షమద్వం లోకపాలాశ్చ అకృత్యం భక్తచేష్టిత" మ్మనుచుc బ్రార్థింప దేవతలునుc బ్రీతులగుచు. 276

ఉ. పుత్రకులార ! మీరలిక భూసురు లందు పవిత్రభావస
త్పాత్రులు గందు, కీర్తిని సుదంతున కిచ్చెదు పెండ్లి వేళ నా
క్షేత్రము నందు మమ్ము నభిషిక్తులcజేసి భజింపు దంత మీ
యాత్రము లెల్ల దీరునని అర్యకులం గరుణించి యేగినన్. 277

కం. వెలుపలి శత్రువుతో లో
పలి శత్రువు కూడె నింక బ్రతుకుట తరమే ;
వెలివడ్డ చేపలను లో
పల వేసిన యట్లు వారి బ్రతుకులు నిలిచెన్. 278

ఉ. సోకిన శాపపంకిలము శుభ్రమొనర్చు కొనంగ నెంచి మం
దాకినిc జేరి క్రుంకులిడి తాపసవృత్తిని మూడు నాళు లం
దే కొలువుండి శాంతులయి దివ్యవనంబునc బెండ్లి కోసమై
నౌకల నెక్కి సాగిరి శనైచ్చరులై శుభకార్యమగ్నులై. 279

ఆ.వె. దెబ్బ దిన్న త్రాచు తీండ్రించు చందానc
జిత్రకంతుc దుగ్రచిత్తుcడగుచు
కదలు నౌక లెల్ల గాంధర్వశక్తిచే
మనుగు నట్లు చేసె ముష్కరుండు. 280

ఆ.వె. నీట మునిగిపోవు నిర్భాగ్యు లంతట
గట్టుc జేరు దారి కానరాక
త్రాహి యంచు గట్టురాచూలిc బ్రార్థింప
నీటc దేలె నౌక లోట లేక. 281

ఆ.వె. గిట్టc దప్పి కన్ను లొట్టవోయిన రీతి
నెట్టకేల కర్యు లిండ్లు చేరి
పెండ్లివేది పైన వేల్పులు ముప్పది
మూడు కోట్ల నుంచి మ్రొక్కినారు. 282

తే.గీ. అంత దివిజులు సంతృప్తి నందినారు,
కీర్తి కన్యకుc బెండిలి పూర్తి యయ్యె,
వైశ్యులందఱు నిట్టూర్పు వదలు చుండ
చిత్రకంతుని మనమందుc జిఱ్ఱు మీఱె. 283

వ. తన మాయాజాలం బంతయు మంటిపాలగుచుc బ్రేమించిన పడంతుక పరాధీనయయి మానసంబున మంటలు రేప నంతకును కారణంబైన న వ్వైశ్య కులంబునుc దుద ముట్టింపకc దీరదనుచు నెత్తిరా భీతావహు లగుచు శ్రేష్ఠి వర్గంబును దిక్కుగానక తిరిగి కైలాసంబునకుc బరుగులిడి నందీశ్వరు పాదంబులc బడి యిటుల శరణు వేడిరి. 284

హర నర్తన.

ఈశ్వరాజ్ఞ నిరంతరం బెద సంధానించెదు మమ్ము ను
క్షీశ్వరా హతమార్చ వచ్చెడి గంధర్వాధము నడ్డు మా
శాశ్వతంబుగ శత్రునాశన మొందింపం దగు దీవె మా
హేశ్వరధ్వజవాస మా హితరక్షాదక్ష మహోక్షమా ! 285

కం. భక్తుల విన్నపములు విని
దిక్తటములు దిగ్గ రనగc దీవ్రాంభారా
వోక్తి మహానలకీలా
సక్తుcడు గంధర్వు భస్మసాలము చేసెన్. 286

వ. అట్లొనర్చియు నీతఁ డింతటఁ దీటి నటుల భావింపకుడు, భావికాలంబున జన్మాంతరంబున నయినను మీ కెగ్గుఁ దలపెట్టగలవాడని పలికి నందీశ్వరుండు వీడ్కొలుప నార్యవైశ్యలోకంబును నప్పటికి గండంబు గడచె ననుచు సంతోషంబున నిండ్ల కేగి సుఖంబున నుండిరి. 287

***ఇది శ్రీవాసవీపురాణమునందు కీర్తికన్యా సుదంతుల వివాహము, గంధర్వు మరణమునను పదునైదవ అధ్యాయము సంపూర్ణము.***

(అసురాత్మ విచేష్టితుడు= రాక్షసుడావేశించినట్లు చరించువాడు, సద్ద వట్ట= లక్ష్యాన్ని చేరేందుకు, ఈశ వహేశుడు= ఈశ్వరుని వాహన శ్రేష్ఠుడు, సంశ్రుతుడు= సేవకుడు, అడకించు= వంచించు, సూయాణము= భయంకర దండయాత్ర, ప్రసాదము= అన్నము, శర్వాప్త= శివునిచే పొందబడిన, గాఢోపరాగంబు= తీవ్రమైన గ్రహకల్లోలము, శనైశ్చరులు= మందగమనులు, భస్మ సాలము= బూడిదైన మద్దిచెట్టు)



# పదునారవ అధ్యాయము

**కం. పూర్ణానందప్రద ! సం**
**పూర్ణాధ్యాత్మికవికాస పుషిత శుభాంగీ !**
**పూర్ణాయుర్దాయ దయా**
**పూర్ణా ! పూర్ణోద్భవ పరిపూర్ణ విశాంగీ !**

కం. ముని సాలంకాయనుఁ డటు
వినిపించుచు నుండ నడుమ విశులకు నందీ
శుని సామర్థ్యము నందున
ననవసరపుసందియ మ్మవాంతర మొదవన్ . 288

చం. మునివర ! నందికేశున కమోఘబలంబు నిజంబ యేని మా
కనిశము వాని కాపుదల హాని హరించుట నిక్కమేని మా
పని యిటులాయె నేమి, శివపాదపునీతమహీధరంబు నుం
డి నడుమభూమి కేల కరుణించెను భాగ్యము మమ్ము భక్తులన్? 289

వ. అనవిని మునివరుండును. 290

శా. శైవంబా వృషభేంద్రుశక్తిఁ ద్రిజగజ్జాలంబు నుద్దీప్తమై
జీవంబుల్ ప్రకటించుఁ గాదె, మిముఁ బ్రాచీనార్యులం బ్రోవనౌ
నో వింతా ! శివునాజ్ఞ నొక్క జట దక్షోన్మాదముం దీర్ప లే
దే వైశ్యోత్తములార, మీ స్థితికి కాదీ కారణం బెంతయున్ ! 291

మ. అనినన్ వైశ్యమునీశు లెల్లరును కేశాంగంబు దక్షోన్మదం
బును శిక్షించుట యెంత వింత కథ, మా పుణ్యంబు పుష్పించగా
వినిపింపం గదవే ! మునీంద్ర ! మము సంప్రీతిం గటాక్షింపవే !
యన సంసత్కథనావిశారదుఁడు దివ్యాఖ్యానదీప్తాంగుడై . 292

చం. వినుఁడిది మీ పురాకృతము నీప్సితమున్ వివరింపఁ జాలు శం
భుని తొలియాలు దక్షసుత పుణ్యచరిత్రము, విన్న వారికిం
దనుగతహేయభావముల దర్ప మడంగును, శైవదూషణా
ఘనివహముం దొలంగు నని కమ్మగఁ జెప్పగ సాగెఁ దత్కథన్. 293

తే.గీ. తొలుత దక్షప్రజాపతి తొలి తనూజ
సతిని బెండ్లాడె శివుఁడంత సంతసమున
నిరువదేడ్గురు పూర్ణచందురుని గూడి
రందరును ధర్మ రతులై రనంత జగతి. 294

ఉ. దక్షత నెల్లలోకముల దర్పమెసంగఁ బ్రజాభివృద్ధిసం
రక్షణమందు నెంతయును రక్తివహించి ప్రసిద్ధుఁడైన యా
దక్షుఁడు గర్వమూనె ప్రమథప్రభు నున్నతి సైపలేక నా
భిక్షుకుఁడా జగత్పతి, యుపేక్ష సహింతునె యంచు దుష్టుఁడై. 295

సీ. బ్రహ్మవలన నవబ్రహ్మలందున నున్న
తాసనం బందితి నన్న పొగరు
తలకెక్కి తనగొప్పతనము చాటగనెంచి
తలపెట్టె నుద్ధర్షధర్షణంబు
వాజపేయంబు నార్భాటంబుగా నెల్ల
దేవర్షి బ్రహ్మర్షి దేవ పితృ గ
ణముల నందఱఁ బిల్చి నలువొప్పఁ బూజించి
నలువ నారాయణాదులనుఁ గొల్చి

తే.గీ. పిలువఁడా శంకరుని తన పెద్దయల్లు
నుల్ల మవమాన పఱచఁ దానుత్సహింప,
ప్రజల ముందట నిజభుజపటుతఁ జాట,
తానె పరమేశ్వరుఁడ నంచుఁ దక్కొనంగ. 296



వ. అటులఁ గపటంపు పటంపు నీడ నిర్వహించు నా జన్నంబుఁ జూడ నత్యుత్సుకత్వంబున బంధుమిత్రసపరివారంబుగ నరుగు త్రిభువనజనంబుల గని దాక్షాయణి. 297

సీ. సృష్టిలో మున్నిట్టి యిష్టి కల్గెనె యెందు
దక్షుఁడన నతండె దక్షుఁడంచు
నింగి నేలలు నిండ నిఖిలచైతన్యంబు
నెలుగెత్తి యెవనిఁ గీర్తించి సాగు
నాతండు తన తండ్రియౌ గాదె తమ్మేల
పిలువలేదో యంచుఁ గలతవడుచు
పాపమా యిల్లాలు పాఁపతాల్పునుఁ జేరి
యుప్పొంగు దుఃఖంబు నుగ్గవట్టి

ఆ.వె. చూచితె హృదయేశ ! చుట్టంపు మర్యాద,
నాకుఁ దెలియ దాయె నాన్న గారి
యాగదీక్ష విశ్వమంతయుఁ దెలిసి వా
రేగు చున్నఁ గాని; యేమి కతమొ ! 298

చం. అయినను పోయిరావలయు నధ్వర మారయ, సర్వబంధువుల్
ప్రయతులు కాగ వచ్చెదరు, పండుగపూట కుమార్తె యింట లే
నయి నటులైన నే మనెద రమ్మ మనంబున నెంత కుందునో;
నియతశుభంకరా మనము నీ శ్వశురాలయ మేగి వత్తమా ! 299

వ. అనుచుఁ బ్రార్థింప నర్ధాంగి మనంబునఁ బొంగు పుట్టింటి యపేక్షా నైజంబు గుర్తించిన పరమేశ్వరుండు పరాశక్తి నాలింగనంబున నాదరించి యనునయంబున . 300

ఉ. బేలతనంబదేల పరివేష్టితలోకనియంతృహస్తకున్,
శైలతనూభవాత్మ ధృతశక్తి సమున్నయలోకమాయకున్,
కాలకరాళపంజరవికత్థిత విద్యుదుపాస్యమూర్తికిన్ ,
పాలితవిశ్వనాథకును పండుగ పుట్టిలు తప్పవా సఖీ ! 301

ఉ. అల్లుడనన్న గౌరవము నావల నుంచుము సాటివానిగా
నొల్లఁ డదేమి చిత్రమొ, యెదో మిషపెట్టి ముఖానఁ దిట్టు న
న్నెల్లరుఁ జూచుచుండ, నెటు లేగెద మీవె వచింపు మచ్చటన్
చెల్లునె నీదు మాట, నినుఁ జేతులు చాచి కవుంగలింతురే ! 302

కం. పిలువని పేరంటమునకు
పలుకని తన వారి యిండ్ల పబ్బములకు పో
వలదని పెద్దలు చెప్పెద
రలుసు కదా మనకు నచట కరుగుట దేవీ ! 303

కం. అని పలువిధముల ననునయ
మునఁ బలికిన శూలి వచనముల నలవోకన్
జనకుల తలపుల దిగఁదుడి
చెను రయమున దక్షపుత్రి చెలువుఁ దొలఁగుచున్. 304

ఆ.వె. మగనిమాట వినని మగనాలి యగచాట్లు
తెలిసి యేమిచేయగలఁడు శివుఁడు ,
కాలు నొంపఁగలఁడు, ఆలినొంపఁ దరంబె?
కన్ను లప్పగించి మిన్నకుండె. 305

వ. పుట్టింటి మక్కువ మెట్టినింటి యుక్కడమున కెక్కుడుకాగ కట్టుకున్న మగని లెక్కఁ బెట్టని దక్షప్రజాపతి ముద్దులపట్టి సతీదేవి. 306

సీ. అడుగు బయటఁబెట్ట నమ్మపయన మంచు
నందికేశుఁడు వచ్చి ముందు నిలచె,
అటు మణిభద్రుండు నిటు గుహ్యకుండును
యక్షభూతసముదయముల నడపె,
చెలి యోర్తు ముంజేత పలుకు చిల్కను నిల్పి
కలికి సూక్తులఁ మధ్యఁ గదలసాగె,
వేఱొక్క చెలికత్తె వెలి పట్టు గొడు గెత్తి
పట్టి ముందుకు సాగె పార్శ్వమందు,



తే.గీ. అద్ద మొక దాసి యొక దాసి యబ్జములను
బెత్త మొకతె యొకతె చుర కత్తిఁ బూని
జయ జయ ధ్వానముల మహోత్సాహ హృదయు
లగుచు సాగిరి దక్షుని యాగమునకు. 307

ఉ. పుట్టుక రాచపుట్టుక విభుండన నాతఁడు రాజశేఖరుం
డట్టిటు లాడబోని ప్రమథాదిమహాభటజాల మంటిరా
ముట్టునె విఘ్నపాళి, తుదముట్టవె ముప్పులు, పంచభూతముల్
పట్టవె పాదపద్మములు భక్తిసమంచితచిత్తవృత్తులన్ ! 308

సీ. సుమసౌరభము లాని సమశీతలము లైన
సురనదీపవనముల్ సురఁటి వీవ,
పతిజటాగృహమందు పదమాన వడినేగు
గంగాంబుశీకరాల్ కలఁత వాప,
తండ్రి రమ్మన నేగు తారలన్నియు వెల్గు
తళుకు లీనుచు ముందు దారిఁ జూప,
గోగణాధిపు ఘనఖురధూళి రెపరెపల్
కేతనప్రభల సంకేత మొసఁగ,
తే.గీ. వెనుక నేర్పడు నవకాశమునఁ జొరంగ
నాల్గు ప్రకృతులు సుడిగొని నాట్యమాడ,
నాన్నగారింటి కా యింతి నంది నెక్కి
యాఘ మేఘాల మీద ప్రత్యాశ నేగె. 309

వ. అచట దక్షపురంబున వీణా వేణు మృదంగ శంఖ దుందుభి నిస్వనంబుల నుత్తేజితంబును, ద్విజ దేవ మునీంద్ర ఋత్విక్పరి వేష్టితంబును, దారు మృణ్మ యాయోమయ పాత్రోపవేశ దర్భ సంచయాంచితంబును, స్వర్ణ స్రుక్భాండ సంకీర్ణంబును నగు యజ్ఞశాలా ముఖంబున సోదరీమణీ గణం బత్యంత ప్రేమానురాగంబులఁ బ్రత్యుత్థానాభివాద సమర్చనంబుల స్వాగతంబులు వలుక సతీదేవియు వారిం బరామర్శించి తల్లిదండ్రుల దెస నిరీక్షింప దొడంగి. 310

ఉ. చూచియుఁ జూడనట్లు తమ చూపులు ప్రక్కకు త్రిప్పి తప్పుకోఁ
జూచుచు యజ్ఞకార్యముల చొప్పుఁ జరించెడు వారి తీరులం
జూచి యిదేమి చోద్య మిటు చూచియుఁ గూతునుఁ బల్కరింపరే,
వేచిన కోపమా, యడుగు వెట్టుట నేరమొ నేర దయ్యెడన్. 311

ఆ.వె. ఎంత సాహసించి యేతెంచె నిటు తాను
పుట్టి నింటి వారి గుట్టు నిలుప,
కడకు తల్లిదండ్రి కడమ వెట్టిరి యన్న
మెట్టి నింటఁ దనకు అట్టు కాదె ! 312

ఆ.వె. ఆమె రక్త మట్లు అధ్వరాగ్నులు మండె,
ఆమె గుండె యట్లు యాజకోక్తు
లామె స్వాంత మట్లు హవ్యముల్ వ్రేల్చిరి
ఆమె పతికి భాగ మనదు తండ్రి. 313

చం. అపుడు దధీచి లేచి సకలాధ్వర దీక్షితు లాలకింప నే
నెపమున హవ్యభాగముల నిర్గుణనిశ్చలనిత్యసత్పదా
ధిపు హరు యజ్ఞరూపు నిటు ధిక్కృతుఁ జేసెదవోయి దక్ష ! నీ
విపథము నిన్ను పాపముల వేలుచు భ్రష్టుఁడ యంచుఁ బల్కగన్. 314

వ. ఆ మహర్షి హితవచనంబుల కా ధూర్త దక్షప్రజాపతి రోష కషాయి
తాక్షుండై. 315

సీ. ప్రేతఘట్టము లందు ప్రేతభూతములతోఁ
గూడి ముప్పొద్దులం దాడువాఁడు,
ఉన్మత్తుఁడై మేన నుడుపు లుంచక దిగం
బరుఁడుగా దిక్కులఁ బఱచువాఁడు,
ఎప్పు డెందుకు నవ్వు నెప్పు డెందుకు నేడ్చు
నో బోధపడని వినోదగాఁడు,
కాటిబూడిద మేన కంకాళములఁ దాల్చి
మచ్చుమాయలఁ ద్రచ్చు పిచ్చివాఁడు,



తే.గీ. పేరు శివుఁడట శైవసంహారుఁ డతఁడు
మత్తుఁడై మత్తజన పూజ మరగినాఁడు
వాఁడికా- హవ్యభాగంబు - వలదు వలదు
పూర్తి కానిందు మఖమంచు పుడిసిలించె. 316

వ. అంతట ఋత్విక్కులు నరుద్రీయంబగు నధ్వరంబుఁ బరిసమాప్త మొనరింప
బూని రని సాలంకాయనుండు వలుక నక్కజమందిన వైశ్యమునివరులు. 317

కం. అంతటి దక్షున కంతటి
పంతంబది యెట్లు కల్గె పరమేశునితో
సాంతము విన గోరెద మన
నంతర్ముఖుఁ డిట్లు పలికె నానందముతో. 318

***ఇది శ్రీవాసవీపురాణమునందు సతీదేవీ దక్షయజ్ఞ ప్రయాణమను పదునారవ అధ్యాయము సంపూర్ణము.***

(ఉద్ధర్ష ధర్షణంబు= తిరస్కరించుటకైన ఉత్సవము, ప్రయతులు= పవిత్రులు, శ్వశురాలయము= మామగారిల్లు, పరివేష్టిత లోక నియంతృ హస్త= తన్ను చుట్టిన లోకాలను నియమించజాలు చేయి, శైల తనూభవాత్మ ధృతశక్తి సమున్నయ= కొండరాతివలె నిశ్చలమైనట్టి శక్తితోనున్న, కాల కరాళ పంజర= కాలమనే పొడవైన అస్థిపంజరము, వికత్థిత విద్యుదుపాస్య మూర్తి= పొగడబడిన సంధ్యోపాస్యమూర్తి, ప్రత్యాశ= అడియాస, పుడిసిలించె= నీరు పుచ్చుకొని ప్రారంభించెను)

# పదునేడవ అధ్యాయము

**కం. బ్రహ్మాండోద్భవ ! యజ్ఞ**
**బ్రహ్మోద్భవ ! భవ్యభావ్య భగవద్భూషా !**
**బ్రాహ్మణ బృందోద్భాషిత !**
**బ్రాహ్మీమయ బృహదభంగ భాషాయోషా !**

శా. ఆదిన్ విశ్వమహాకృతిన్ రచన సేయంగా మహాదేవుఁ డం
బా దేవిన్ స్మరియించి పంచముఖముల్ పంచాధిభూతంబులన్
ప్రాదుర్భావముఁ జేయగాఁ బనిచె నా ప్రాణార్థముల్ తత్పదా
ర్థాదాయంబున నింద్రియోచితములౌ నాకారముల్ దాల్చగా . 319

మ. జలమం దగ్ని వసించు నగ్ని మొనఁ దేజం బుండుఁ దేజంబు వె
న్నెలగున్ తారలగున్ ఘనంబులయి మున్నీటన్ వసించున్ తుదన్,
కలుగున్ కాలము వత్సరంబు లగుచున్, కాలాహి శేషుండుగా
వెలయున్ తజ్జల మందు విష్ణువని భావించెన్ మహాదేవుఁడున్. 320

చం. తిమిరము ఛాయకాగ జగతీధృతి వర్వెను, విష్ణునాభిలో
కమలము పుట్టె నందుఁ బొడకట్టెను బ్రహ్మయు నల్మొగంబులన్,
క్రమగతిఁ బుట్టి రిద్దఱిటు కారణజన్ములు; కాని వారికిన్
తమ జననంబునందుగలతంత్ర మసాధ్య మెఱుంగ నయ్యెడిన్ . 321

చం. ఎవరు సృజించె తమ్ము, సృజియించుట కెయ్యది కారణంబు, వే
రెవరును లేరు చూడ, విన నెయ్యెడ శబ్దము లేదు, పంచ భూ
త వలయ మొక్కటే కలదు, తజ్జని మూల మెఱుంగు టెట్లు, సం
భవమె మనంబు నందయిన భవ్యనిదర్శన మంచుఁ జింతిలన్ . 322



ఆ.వె. నిలచె నెదుట నంత నిండువిగ్రహ మొండు
నిఖిలవిశ్వ మెదుట నిలచినటుల,
సగముదేహమందు సత్పురుషాకృతి
సగముదేహమందు సాధ్విరూపు. 323

వ. అట్లు సాక్షాత్కరించిన యర్ధ నారీశ్వర రూపంబు కరంబున ఢమరుకంబు మ్రోగె నంత . 324

కం. 'అ ఇ ఉణ్'ణాది 'హలం' త
మ్ము ఋ గతిపూతమ్ము నగుచు పుట్టెన్ శివతే
జ ఉదంచత్ సూత్రాళి వ
చ ఇందు ముఖిగా చతుర్దశ వినుత సంఖ్యన్... 325

వ. అట్లుద్భవించి, తన మోముఁ జేరిన పలుకుచెలి సంగతిఁ బరవశించిన బ్రహ్మదేవుండా చేతనాయుత స్థాణురూపముం గని. 326

చంద్రకళ .
ఏమి మోహనరూప మహో మాహేశ్వరమా యననోపుచున్
మా మనంబులఁ జంద్రికవై సామాకృతివై శ్రుతివై గుణా
రామమై పరమాత్ముఁడవై లో రాజిలు నిర్గుణ తత్త్వమై
తామసాంతకమై వెలుగొందెన్, తావకజన్మ మదెట్టిదో ? ! 327

కం. అని నలుమొగముల నుతియిం
చెను, విష్ణువు నుచితభక్తిఁ జేతులు మోడ్చెన్,
అనుజుల జిజ్ఞాసను గని
వినిపించెను తనదునాత్మ విశదము కాగన్. 328

మ. కొలతల్ నాలుగు మౌలికాంశములుగాఁ గ్రొంగొత్తవిశ్వంభరన్
నిలుపంబూనిన భూతపంచకము నా నిర్మాణకౌతూహలం,
బలవోకన్ మిము నా మనోభిమతమై యంత్రించితిన్ లోకముల్
వెలయింపన్ పరిపాలనమ్ము సలుపన్ బేర్కొందు మానంబులన్. 329

సీ. ఆటంకములు లేక ఆయతంబగు రీతి
కరముఁ జాపగ నది గజముఖంబు,
పొడుగు వెడల్పుతో పొందుచే చదరమై
నల్గడల్ చనునది నల్మొగంబు,
పొడుగుఁ జేరిన వెడల్పున నిలువునుఁ బొందు
చదరంబు ఘన మది షణ్ముఖంబు,
ఘనము జీవము నంది కాలాంతరము నొందు
పంచత్వ మది కాల భైరవంబు,
ఆ.వె. నేనె కారణంబు నియమంబులకు నెల్ల
నేనె మిమ్ము జగతి నిల్పినాడ ;
భవము లొదవఁ జేసి బ్రహ్మ వగుము నీవు,
తృష్ణఁ దీర్చి నీవు విష్ణు వగుము. 330

వ. అనుచు న మ్మహేశ్వరుం డిరువురకునుఁ గర్తవ్యంబుల నియమింప నంతస్సంతుష్టులైన సృష్టిస్థితిపతు లత్యంతవినయంబున నిట్లనిరి. 331

కం. మా కర్తవ్యంబుల నిక
నీ కరుణామృతవివేకనేతృత్వమునన్
ప్రాకటముగ నెఱవేర్తుము
ప్రాకృతరూపమ్ముఁ దాల్చి పాలింప గదే ! 332

సీ. నేత్రాతిరిక్తంబు నీ దివ్యరూపంబు
నిర్జరాళికిని ననిశ్చితంబు,
నిబిడీకృతాండంబు నీ దివ్యతేజంబు
నీరుకాయల పాల నీలిమంబు,
నిగమాగమపథంబు నీ వచోవిభవంబు
నిత్యతాపసవృత్తనిర్భరంబు,
నిరుపమశుభదంబు నీ దయామేఘంబు
నిన్ దలంచినఁ జాలు నిర్ఝరంబు,



తే.గీ. మేము సృజియించి పాలించు కామ జగతి
పాంచ భౌతికాతీతమై పరగు నిన్ను
తెలిసి కొన లేదు, కరుణ నీ తేజ మెల్ల
కూర్చి రూపొంద మేమెల్లఁ గొలుతు మయ్య. 333

వ. అనుచుఁ బ్రార్థింప నమ్మహాదేవుండునుఁ గరుణించి తక్షణంబు మూలాగ్రములు తెలియరాని కాలదండంబగు నొక స్తంభమై రూపొంది. 334

ఉ. తేజము రూపమైన దిక తేలికగా ననుఁ గొల్వుఁడయ్య మీ
వాజవిశేషసంపదల, పై తుదఁ జూచి వచింప నొక్కరున్ ,
బీజపదంబు నొక్కరును వేగమె కంబపు టెత్తు లోతులన్
ఓజ నెఱింగి రండనుచు నొడ్డె నమోఘము వింత పందెమున్. 335

తే.గీ. మహదహంకార మందు సంభవము లైన
హరి విరించుల లోని యహంకృతులను
విజయవాంఛానిబద్ధులై బిఱబిఱఁ జని
రాదిఁ గన విష్ణువు, నలువ యంత మరయ. 336

తే.గీ. ఏళ్ళు యుగములు కల్పము లెన్నొ గడచె,
రోమశాఖ్యులు గడచి, రారోహణ మవ
రోహణములందు లక్ష్యంబు రూఢి కాదు;
తెల్ల మొగముల తుదకు వెన్ దిరిగి నారు. 337

వ. అటుల విగళితాహంకారులై తిరిగి తమ జన్మస్థానంబులఁ జేరిన బ్రహ్మ విష్ణువులు మనంబులఁ బరమేశ్వరుం దలంచి.... 338

చంద్రకళ. హే మహేశ్వర పాహి మహాత్మా ! హే నిజహిండితసాంఖ్యమా !
మా మనంబు లహంకృతు లేదన్ మాయ హరించెను, మమ్ములన్
నీ మహోదయదర్శనభాగ్యాన్వితులఁ జేయగఁ బ్రీతిమై
సోమసుందరమై జగమెల్లన్ జూచెడు రూపముఁ దాల్చుమా! 339

వ. అనుచుఁ బ్రార్థింప నమ్మహాదేవుండును నిజరూపంబున దర్శనంబిచ్చి కరుణాంతరంగుం డయ్యును నాజ్ఞాముద్రాంకితుండై. 340

కం. కర్తగ భర్తగ మును మీ
కర్తవ్యము సలుపు డవల కారణమగు నా
నర్తనమున గతి తప్పిన
హర్తగ కైలాసశిఖరి నాకృతిఁ దాల్తున్ ! 341

వ. అనుచు నంతర్థానుండుగా నన్నలువయుఁ దన కర్తవ్యంబున నిమగ్నుండై క్రమమున .... 342

సీ. బుద్ధిచేత గురునిఁ బుట్టించె ముందుగా
మనసుచేత చంద్రమసుని జేసె,
దివ్యతేజమునందు దేవతల సృజించి
పాలనంబున నింద్రపదవి నిల్పె,
నాదతత్వమునందు నారదుని సృజించి
సత్వమందున ఋషిసప్తకంబు,
రాజసమ్మునయందు రచియించె నరులను
తామసమ్మునయందు దానవులను,
ఆ.వె. సర్వతత్వములకు సర్వంబు నుదయింప
నడ్డి వాల్చి నట్టి నలువ లోన
కలవరంబొ కలతొ కదలిక మొదలాయె
ఆసనంబు నిలువదాయె ముందు ! 343.

కం. అణు వణువున వెలి కురుకగఁ
గణఁగెడు నే ననెడు తత్వగర్వము లో లో
నణచిన కొలది తిమురు కా
రణ మరసెడు లోపుగానె రౌద్రాకృతియై . 344

తే.గీ. బ్రహ్మదేవుని సంకల్పవైరమనగ
బయటపడె నహంకారంబు భ్రష్టమగుచు
దక్షుఁ డంగుష్ఠమందు నుద్భవమునందె
మసఁగి ప్రశ్నించె నన్నేల మఱచితంచు. 345

తే.గీ. మహదహంకారమున కోడి మాటుమణఁగె
నంచు నెంచెను పరమేష్టి అంత వరకు,
మాటు మణఁగుట కాదది మాటువేసె
నంచు నెఱిఁగె నప్పుడు తన యహముఁ గూర్చి. 346

తే.గీ. జనన మట్లందె దక్షప్రజాపతి శివ
దూషణైకదక్షుండయి దోషియగుచు
నట్టియెడ నెట్లు సహియించు నభవు నునికి?
వైశ్యమునులార ! కారణం బదియ వినఁగ ! 347

***ఇది శ్రీవాసవీపురాణమందలి దక్షజననంబను పదునేడవ అధ్యాయము సంపూర్ణము.***

(ప్రాణార్ధముల్= మహాదేవుని అర్ధభాగమైన అంబాదేవి విభూతులు, పదార్థాదాయము= పదాలకర్థములైన శబ్ద స్పర్శ రూప రస గంధాలు గ్రహించి, నిబిడీకృతాండంబు= దట్టమైన అండాకారము, నీరుకాయలు= నీటి బుడగలు, హిండిత సాంఖ్యము= వ్యాపించిన యోగవిశేషము, కణగు= కడగు= ప్రయత్నించు)

# పదునెనిమిదవ అధ్యాయము

కం. **దేవీ భక్త జన ప్రియ !**
**దేవీ భక్తఘ్న ఘాతి ! దేవీ కన్యా !**
**దేవీ భక్త సహాయా !**
**దేవీ భక్తాంతరంగ దీప్తి ప్రభవా !**

తే.గీ. దక్షు శంభుదూషణదోషతత్వమునకు
దారితీసిన కథ విన్న దాంతవరులు
సందియమునఁ బ్రశ్నించిరి సంయమీంద్రు
నట్టి వానింట సతి యేల పుట్టె నంచు. 348

వ. వైశ్యశ్రేష్ఠుల ప్రశ్నంబునఁ బ్రస్ఫుటంబగు కథాశ్రవణాసక్తింగని సాలంకాయ నుండును సంతసంబున నిట్లు చెప్పందొడంగె. 349

ఉ. స్థావరజంగమప్రముఖసంపద మొత్తము బ్రహ్మసృష్టి చే
పావకుతేజ మందుకొని ప్రాప్యరతిం బరిణామమందుచున్
పావనవిష్ణుతత్త్వపరిపాలన మందు త్రిలోకవాసులై
మేవడి నాత్మవర్గముల మేరలు నిల్పగ సాగి రయ్యెడన్. 350

ఉ. దివ్యుల మన్న భావమున దేవగణం బధికారమత్తతన్
కావ్యుననుజ్ఞ దానవులు కన్నులు కానని తామసంబునన్
ద్రవ్యవిధేయులై నరులు ధర్మముఁ దప్పుచు రాజసంబునన్
భవ్యపథమ్ము వీడి రభవాంఘ్రిరహర్లయ తప్పి, కుంటగన్. 351

మ. పదవిన్యాసము సుంత మందగిల నా బ్రహ్మాండనృత్తస్థలీ
హృదయస్పందనవర్తనుండు కుపితాహేయాగ్నితప్తాంగుఁడై
ఉదయంబందెను పంచభూతహితుఁడై వ్యూఢాత్మగౌరాకృతిన్
కదలన్ సంస్కృత విశ్వసృష్టిదిశలో కైలాసశృంగమ్మునన్. 352



ఉ. అప్పటి దాక తాము హృదయంబున నే మహనీయ తత్త్వముం
గప్పుచు నుండె భావపథకమ్ముల రూపొనరింప నా ఋతం
బిప్పుడు కాలధర్మ మొదవించి జగంబు లయానుబద్ధమై
మప్పిత మంద భౌతికపుమాకృతి భవ్యము దాల్చె నుద్ధతిన్ ! 353

వ. అంతట హరి బ్రహ్మాదు లుత్సాహంబున నమ్మహాదేవుని ప్రాకృతరూపంబుఁ జూడ నేగ నట నెదుట .... 354

ఉ. బూడిద పూత మేనఁ గన, బుస్సలుఁ గొట్టెడు సర్ప హారముల్,
వాడిగఁ గేల ముమ్మొన, చివాలున అంకెలు వెట్టు నెద్దుపై
క్రీడలు వెండి కొండ కొన, తెప్పలు మూ దరమూత లెప్పుడున్,
వీడదు చంద్రవంక తల, బిచ్చము తిండి; అదేమి వృత్తమో ! 355

శా. ముల్లోకంబుల వృద్ధజీవతనువుల్ మోహాభివృద్ధిన్ సదా
కల్లోలంబుల కాలవాల మగుచున్ కాలంబు ధిక్కార ధ
మ్మిల్లాయామవశంబుఁ జేసి తమ సామీప్యం బపత్యేప్సితం
బుల్లంఘింపఁ జరింప నయ్యభవుఁ డెట్లోర్చున్ పరాధిక్యముల్ ? 356

సీ. తనువు నిలువరాదు దరికొన వలె నంచు
బూడిద నలదెను భూతవిభుఁడు,
సొమ్ములన విషపాశమ్ము లంచును మేనఁ
బాములఁ సవరించెఁ బ్రణవమూర్తి,
ముల్లోకముల నేల ముప్పొందికలఁ గేల
ముమ్మొనగా నిల్పె మోక్షదాత,
కృషికి మార్గముఁ జూప వృషభవాహన మెక్కి
తనువుకుఁ బనిఁ జెప్పె ధవళమూర్తి;

తే.గీ. కన్ను లరమోడ్చి యోగమార్గంబుఁ జూపె,
నెలను దాలిచి తలపుల నెలవుఁ జూపె,
బిచ్చమున నహంకారంపు పెచ్చు లేపె,
పూర్ణమానవతత్త్వంబుఁ బూని నిలచె. 357

తే.గీ. అట్టి విజ్ఞానవిభవంబు నవధరింప
హృదయ మజ్ఞాతమధురసహృష్టిc దనర
నబ్జనాభ భవాదు లత్యంతభక్తి
సన్నుతించి రభవు భవసాధకమును. 358

చంద్రకళ.
చంద్రశేఖర హే హర శంభో ! శంకర లోకశుభంకరా !
సాంద్రభూతవిభూతిశరీరా ! సంగభుజంగభయంకరా !
సేంద్రియార్థహిమాద్రివిహారా ! జ్ఞేయపదార్థవశంకరా !
మంద్రనాదలయాక్షరనేత్రా ! మంగళదాయక పాహిమామ్ ! 359

మ. చిరకాలంబున కీవు మా నయనరాజీవంబులం వెల్గవై
నరనారీజనపుణ్యరూపమగుచు న్నానందమందాకినీ
ఝరిణిన్ ముంచితి వింక మాకు జననిం జండాంశుసంభావనా
పరవిద్యాప్రముఖాస్థc గాంచనగు నీ వామార్ధభాగంబునున్ ! 360

వ. అని వేడినంత న న్నిటలాక్షుండు ముదం బందియు నిట్లనియె. 361

ఉ. పుత్రకులార ! మీ కృతవిభూతుల పూత మొనర్ప నిట్టి యీ
కృత్రిమరూప మొందితిని, క్రీడగ నెంచకు డయ్య ముందు మీ
గోత్రములందు దోషములc గూల్చగ బూనుడు కాలకల్పనా
వేత్రము నందు, నవ్వల నభీష్టఫలంబగు దక్షవాటికన్ . 362

ఆ.వె. దక్షు పేరు వినగ ధర్మసందేహమ్ము
వొడమె నలువ విష్ణువులకుc గూడ,
నిత్యసత్యసత్త్వ నిక్షేప మెటు లహం
కారగర్భమందు కాయమొందు ! 363

తే.గీ. ఏ యహంకారవిభవంబు నెడప నిపుడు
పురుషతత్వంబు రూపెత్తెc బుడమి యందు
నా యహంకారసాంద్రఘనాఘనాంధ
కార మందున స్త్రీశక్తి కందు వకట ! 364



కం. తర్జన భర్జన లందున
కర్జము నందాస్థc దప్పి కటకట పడు నా
భర్జిత దోషోషస్సులc
దర్జనిc గాలంబు దెసc గదల్చెను శివుcడున్. 365

వ. శివాదేశంబున దిగ్గగత్వతు లెల్లరుc దమతమ బాధ్యతల నిర్వహింపc దొడంగ ముల్లోకంబు లందును . 366

తే.గీ. కాలు నెమ్మోము నందెట్టి డాలు వొడమె,
శివుని యానతిc బాశంబుc జిందు వేసె,
దేహములు శరీరంబులై తిండి మరిగి
రాలిపోసాగె నవి కొంత కాలమునకు. 367

సీ. ఆత్మనిగ్రహముచే నవరోధములు లేక
సత్త్వదేహము లందు చావు తగ్గె,
కర్తృత్వమున నహంకారముం జేసి రా
జసము లందున తనుక్షయము పెరిగె,
లక్ష్యము లేక బలక్షయ మొందెడు
తామసతనువులc దరిగె బ్రతుకు,
నిత్యము లెల్ల ననిత్యములై జన
స్వార్థచింతన తగ్గి సమత పెరిగె;
ఆ.వె. కాలమహిమ చేతc గ్రమశిక్షణము నొంది
జగతి కుదుటcబడియె, జమున కపుడు
నడుగు కుదుటcబడియె, నుడుగదాయె నుడు జ
నకు నహం బొకింత నైన జవము ! 368

వ. స్త్రీ సంతానాధిక్యంబున నహంకారబీజుండగు దక్షుని దర్పం బెప్పటి చందంబున నంకురించు చున్నను తాత్కాలికోపశమనంబున లోకంబు శాంతంబుండ నయ్యెడ . 369

కం. బ్రహ్మకు బ్రహ్మణునకు గో
బ్రాహ్మణులకు దివ్యతత్త్వబాంధవులకుఁ బ్రా
జిహ్మగములకును మదిలో
బ్రహ్మణీరూప మరయ భావము వొడమెన్ . 370

ఉ. భావబలైకచిత్తులగు బంధువులెల్లరు నేకమార్గ మం
దా విభవైకమూర్తి వరదాభయదాయకు తాండవాకృతిన్
శైవగణాభిషిక్తశిరు శంకరు రెండవమారు మ్రొక్కుచున్
గ్రీవము లెత్తి హృద్యముగఁ గీర్తన సల్పిరి లక్ష్యసిద్ధికిన్ . 371

చంద్ర కళ .
హే మహేశ్వర భక్తజనాప్తా ! హే కరుణామయ శంకరా !
హే మహోదయ ! వర్థిలె నీ మాహేయిచతుష్పదధర్మువున్,
నీ మతం బొనగూడెను, మాకు న్నేమకముం దయసేయవే !
సోమశేఖర ! మాత భవానిం జూతుము నీ కృప కల్గినన్ ! 372

కం. అని పలు విధములఁ బ్రార్థిం
చిన, సంతోషమునఁ జంద్రశేఖరుఁడును నా
వినయవినమ్రతలం గని
వినిపించెను సతినిఁ గాంచు విధమున్, విధులన్. 373

శా. విశ్వం బెల్ల నరూపమై తనరుచున్ విశ్వంబె రూపంబు నా
నశ్వత్థాస్తరణంబునై నిఖిలమం దవ్యక్తమై తోచు నా
శశ్వద్వామఁ గనంగ నంత సులువే ? శ్వభ్రశ్లథాహంకృతిన్
దాశ్వస్థైర్య తపంబుఁ బూననగు నా దక్షుండె దక్షుండగున్ ! 374
కం. వేడుడు దక్షుని, పత్నినిఁ
గూడి తపంబున జననిని కూతురు గా ము
ద్దాడు మనుచు, నటుపై మీ
వేడుక తీరును, భవాని వీక్షింప నగున్ ! 375



కం. శుద్ధాహంకారం బది
సిద్ధంబగు నట్టి జన్మ సిద్ధాహంకా
రోద్ధతునకు మాత్రమె, మీ
రుద్ధతులై చేరు డతని నూ కొట్టింపన్ ! 376

ఉ. శంకరుఁ డట్లు వల్క తమ శంక తొలంగిన బ్రహ్మణాదులున్
శంకరు నాజ్ఞ దక్షు మొగసాలకుఁ జేరిరి, వీరిణీవిభుం
డంకిత భక్తి నెల్లరకు నంజలిఁ బట్టి సపర్యలం బ్రస
న్నాంకులఁ జేసె, వారలును నాదటఁ దెల్పిరి దైవకార్యమున్. 377

ఆ.వె. వైశ్య వర్యులార ! వాసవీ జని తొల్లి
జన్మ కారణంబు చరిత మిదియ,
మానవాత్మ లందు మను నంత వరకిద్ది
జగతి శాంతి సుఖము సంతరించు. 378

***ఇది శ్రీవాసవీపురాణమునందు నరూప సరూపయగుటకు కారణంబను పదునెనిమిదవ అధ్యాయము సంపూర్ణము.***

(మేవడి= నమ్రత, రహర్లయ= ఏకాంతమందు లయ, కుపితాహేయాగ్ని= కోపమందు పాము విడుచు విషాగ్ని, వ్యాధాత్మ= విశాలమైన ఆత్మ, గౌరాకృతి= ఏనుగువంటి రూపు, సంస్కృతవిశ్వసృష్టి= సంస్కరింపబడిన విశ్వనిర్మాణం, మప్పితము= పరిమితం, పుమాకృతి =మానవాకృతి, ధిక్కార ధమ్మిల్లాయామ= ధిక్కారమనే పొడవైన వెండ్రుకలు, ముప్పొందికలు =మూడు గుణములు, హృష్టి= సంతోషం, దోషోషస్సులు= చీకటి వెలుగులు, ఉడు జనకుడు= దక్షుడు, బ్రహ్మణుడు= విష్ణువు, ప్రాజిహ్మగములు= వృద్ధసర్పములు, బ్రహ్మణీ= పరాశక్తి, మాహేయి చతుష్పద ధర్మువు= నాలుగు పాదాల ధర్మమనే ఆవు, నేమకము= ఏర్పాటు, అశ్వత్థాస్తరణము= జ్ఞాన వేదిక, శశ్వద్వామ= ఎల్లప్పుడు ఎడమనుండేది, శ్వభ్ర శ్లథాహంకృతిన్= చిల్లులచే శిథిలమైన అహంకారమును, దాశ్వ= విడిచిపెట్టగల)

# పందొమ్మిదవ అధ్యాయము

**కం. దివ్యాభీష్ట వివర్ధన !**
**భవ్యాందోళ విలస ద్విభాకర బాలా !**
**గవ్యాలంకృత చరణా !**
**జీవ్యన్నితాంత నియత వశీకృత వేలా !**

వ. సాలంకాయనుం దటుల వచింప సందేహపరంపరం దొలగఁ జాలని దేహచిత్తంబుల వైశ్యప్రముఖు లిట్లనిరి. 379

ఉ. అంతటి గర్వశాలి సుగుణాత్ముల నంతగ నాదరించెనా ?
వింతగ నున్నదే ! కడకు భిక్షుకు నాజ్ఞ శిరంబుఁ దాల్చెనా ?
పంతము బూన కాతఁడు తపంబును సల్పెనె లోకమాతకై ?
స్వాంతము నెమ్మదింప విను భాగ్యము గూర్పవె సంయమీశ్వరా! 380

కం. అడిగెడు వారున్న కథలు
నుడువగ వెనుకాడ బోని నుడువరి మునియున్
కడు ముదమున మొదలిడె ద
క్షుఁడు సతి నొడిఁ బడసిన కథ క్షుణ్ణముగాగన్. 381

చం. నలువకుమారుఁ డాతఁ డధినాయకుఁ డాతని సృష్టి కంతకున్,
పలుచన సేయరా దతని పాత్రత మీ రనుకున్న రీతిగా
విలువలు లేక లేదు, దురభిజ్ఞత కూడదు వైశ్యులార, ప్రా
ణులఁ దగుగర్వముండఁదగు, నూల్కొనలే రటుగాక నెవ్వరున్ 382

ఉ. వచ్చిన వార లందరును బంధుజనమ్ములు గారె, ముందుగా
జొచ్చిన వాఁడు తండ్రి కద! జోత లొనర్చు టదేమి వింత? కా
వచ్చు నహంకరించుటన వానికి నైజము, కాని తండ్రినే
నొచ్చు కొనంగఁజేయు కుజనుం దనుకొంటిరె బ్రహ్మసూతినిన్ . 383



కం. లోకవిరుద్ధము రూపము
నాకవిరుద్ధమగు వేషనటనలు చూడన్
మేకొనఁ దగునె యథార్థము
కాకున్నఁ బ్రజాపతి కది కౌలీన మగున్ ! 384

మహాక్కర.
భవుని కార్యార్థ మేతెంచి నట్టి యా బ్రహ్మదు లచటి మర్యాద లరసి
భువనజననాథు దీవించి కూర్చుండ భూపతియును వారి వచ్చినట్టి
దివిజ కర్జంబు నూర్జింప నర్థించె, దివిజావళియు వాని వినయమునకు
నవఘళించిన యానందమునఁ దెల్పె నవతరించిన కార్య రూప మిటుల. 385

కం. దక్షుఁడ వీవని వచ్చితి
మక్షర హంకార శక్తి నంగజగాఁ బ్ర
త్యక్ష మొనర్తు వటంచున్
దక్ష, శివాభిమత మిద్ది ధర్షింపకుమీ ! 386

ఆ.వె. శివుని మాట చెవిని చేరెనో లేదొ – ఆ
దక్షు నేత్ర యుగము రూక్ష మాయె,
కక్ష నొంద నేలొ త్ర్యక్షునిపై ప్రజా
పతి యనంగఁ జెల్లు వాఁడపేక్ష ?! 387

వ. తీండ్రించిన కోపంబున గాంఢ్రించిన రీతి నా దక్షహర్యక్షుండు. 388

ఉ. ఎవ్వఁడు వాఁడు నన్ను నధినేతను, గీత నభిజ్ఞ సృష్టికిన్
గవ్వకుఁ గాక సేయు, నధికారము నా పయి వాని కేమిట
న్నెవ్వఁ డొసంగెఁ జెప్పు డిపుడీ మునివృత్తము వాని కోసమా ?
హవ్వ ....ఇదేమి చోద్య మహహా యని నవ్వరె లోకు లెల్లరున్. 389

తే.గీ. ఇందరు కుమార్తె లుండగ నేల నేను
తపము సల్పవలె మరొక్క తనయ కొరకు ?
అరితి మన్నింపుఁ డని దక్షుఁ డనఁగ నపుడు
నలువ కొమరునిఁ గనుగొని పలికె నిటుల. 390

ప్రియంవద. వల దవాచ్యములు వత్స, నేన కా
వలయునంటిని శివాని జన్మమున్
బులియు మాది జని పుత్రి కాగ నీ
కలిమి లోకమునఁ గ్రాలు నర్ఘ్యమై ! 391

శిఖరిణి.ప్రభాంధః ద్వంద్వంబే పదరజమునం బ్రాకట మగున్,
శుభాశీర్వాదంబై స్వయముగ భవచ్ఛుష్మముఖమం
దు భూతాత్మావాప్తిం దొడరునది సంతోషము కదే !
స్వభావోపాదేయంబగు వినుము నా పల్కు లెఱుకన్. 392

ఆ.వె. నయముఁ గదురఁ జెప్పు నాయన కెదురాడ
లేకయో, మరొకఁడు లేడటన్న
యేపు చేతనో ప్రజాపతి తల యూచెఁ
దపముఁ జేసి తాము తనయఁ బడయ. 393

ఉ. వచ్చిన వారి నెల్లఁ బలు భంగులఁ దృప్తులఁ జేసి పంపి లోఁ
జొచ్చిన దక్షుఁ డంత దన చొక్కపు నెచ్చెలి నచ్చి రాగఁ దా
మచ్చటి కంత దూరమున నచ్చపు నొంటరి తావుఁ జూచి పై
పచ్చికఁ గూరుచుండి ప్రణవం బొనరింపగ సాగి రంబకై. 394

సీ. పట్టుదలకు నాటపట్టు దక్షుని పట్టు
పట్టికై గట్టి తపంబుఁ బట్ట
గాఢతమతమంబు గర్వమేదిన యట్టు
భూగర్భ మందుండి బుగులు పోయె,
జలదరజోదాహచలము రాజి జలధి
గర్భాశయంబెల్ల గాయ పరచె,
దిగ్గజంబుల సత్త్వధిక్కారమున దిక్కు
తోచక దిక్కులు తూలి పోయె;

ఆ.వె. ముగ్గు చెదరిపోవ మూలప్రకృతి మొత్త
మహముఁ జొచ్చి వేడ నపుడు కదలె,
తూచి దక్షదంపతుల గర్భమందుండి
ప్రకట రూప మంది రాగ నదియు – 395



కం. ప్రత్యక్షంబై నిలచిన
సత్యాహంకార తైజసాత్మన్ నిత్యన్
గాత్యాయని గని దక్షు ల
పత్యంబుగ గర్భమందుఁ బడయగ వేడన్ ; 396

తే.గీ. దక్షు తత్త్వంబు నెరిగియుఁ దనకు తగిన
తావనుచుఁ బరాశక్తి సంతాన మగుచు
వర మొసంగెను వారి గర్భంబు పండ,
భవుని యానతి ఫలియింప వలయుఁ గాదె. 397

వ. అంతట సఫలమనోరథులైన దంపతులు గృహంబు మగుడ . 398

అశ్వగతి గర్భిత మానిని.
కారణ కార్య సమర్పణ మారయ కాయ సముద్భవ గారవమున్
హారి ఘనార్య జనించెడు వేడుక నంగ వివర్ణము నాతికి నా
హారము హార్య మనార్యముగా నిభయాన మగ మ్మేనయన్ ధృతిమై
వీరిణి వీర్యము నందెను దక్ష నివేశితమై పృథివిన్ గరిమన్ . 399

సీ. గర్భధారణ క్రొత్త కాదు కాని యదేమొ
క్రొత్తగా ననిపించుఁ గొమ్మ మేన
దినదినంబు నడుము దిక్కు లానెడు నట్లు
ప్రబ్బుచుండగ నింతి భార మొదవు
లోనఁ గ్రాలెడు శక్తి లోకమ్ములకుఁ గాని
పించుటకన్నట్లు ప్రిదులుఁ గడుపు
భూమి భారము నెల్లఁ బూనుచున్నా నన్న
తెన్నుఁ జూపగ నేమొ మన్ను తినును.

ఆ.వె. నెలలు నిండుచుండ నెలవంక నిండు జా
బిల్లి వోలె నెలత బిగుతు పెరిగె
దక్షు పత్ని యిపుడు దాక్షాయణీమాత
జగతిజనుల కెల్ల చల్లనమ్మ. 400

వ. అంత నొక సుముహూర్తమ్మున . 401

తే.గీ. చిమ్మ చీకటి గుండెలు చీల్చి నటుల
మూసి మెసవు మాయకు తిత్తిఁ దీసి నటుల
వేకువ కువకువల మధ్య రేకు విప్పి
మోముఁ జూపించె జగతికి మూల శక్తి. 402

ఉ. ఆరయ కెవ్వుమన్న చిరునాదము సోకిన తల్లి భావమం
దూరట కల్గెఁ దండ్రి హృదయోత్పలమున్ వికసించె, మ్రోయుచున్
మారుత మెంతొ సంతసిలె, మౌననిరీక్షణ మందు పుట్టె నోం
కారము బ్రహ్మ విష్ణు శివ కామ్యములెల్ల ఫలించెనా యనన్. 403

తే.గీ. అమ్మలను గన్న యమ్మ, ముత్తమ్మ లమ్మ
ముగ్గురమ్మల మూలపుటమ్మ తొల్లి
రూపు గొన్నట్టి దీ గాథ రేపు మాపు
తలచి శుభముల బడయుఁడు ధరణి జనులు ! 404

***ఇది శ్రీవాసవీపురాణమునందు జగజ్జనని దాక్షాయణీ రూపమునందిన పందొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము.***

(దురభిజ్ఞత= మూర్ఖత, నూల్కొను= చక్కబడు, మేకొను= సమ్మతించు, కౌలీనము= గొప్పకులమున పుట్టుక, ఊర్జించు= బయటపెట్టు, అవఘళించు= ఎక్కువగు, ధర్షించు= తిరస్కరించు, అరితి= కూరిమి, బులియు= సుఖించు, శుష్మ= తేజస్సు, భూతాత్మావాప్తి= దేహప్రాప్తి, స్వభావోపాదేయము= స్వభావముచేత పొందదగినది, ఏపు= గర్వము, జలద రజోదాహచలము= మెఱపుకు చీకటియందలి దాహమనే పట్టుదల, రాజి= రగిలి, ముగ్గు= పథకము, యానమగము= యానము+అగము)



# ఇరువదవ అధ్యాయము

**కం. పంచాక్షర పదపల్లవ**
**కాంచనరేఖాంకి తాంగి ! కౌమారీ ! హే**
**పంచాస్త్రాసన వరగుణ**
**సంచారిత భ్రూయుగా ! లసద్గుణ వరదా !**

వ. అటుల దాక్షాయణీ జననవృత్తాంతంబు వినిపించిన సాలంకాయన మునీంద్రు వచనామృతపానబద్ధ మనోరథంబులఁ దనివితీరని వైశ్యమునిచయంబు. 405

ఉ. ధన్యుల మైతిమయ్య విని దక్షసుతాజననంబు నీ దయన్
ధన్యత నొందె నంబఁ గని దక్షకుటుంబము వారు పిమ్మటన్
కన్య నొసంగిరే గరళకంఠున కన్య విచారమొందకే ?
ధన్యులఁ జేయవే మము కథాపరిశిష్టముఁ జెప్పి ప్రేముడిన్! 406

వ. అనుచుఁ బ్రార్థింప నమ్ముని వరుండును. 407

కం. కల్యాణగాథఁ జెప్పక
మూల్యాంకన మెట్లు సాగు మునుల కటంచున్
బాల్యంబు యౌవనంబును
కల్యాణము దనుకఁ జెప్పఁ గడగె నధీతిన్. 408

ఉ. దక్షునిసౌధమందు సముదర్కమహాశుభకాంతిరేఖ సం
రక్షితదీపమై చను నిరంతర వర్ష వికాస హేతి పిం
గాక్షు నిరీక్షణంబు వలె, కౌతుకమాయెదు తల్లిదండ్రులన్
వక్షములందు లాస్య మొదవంగ సనాతని శైశవంబునన్ 409

సీ. రీతిప్రభాతభేరీనినాదములందు
డమరుకశబ్దంబు డంబుమీర
తనువున నలఁదు చందనలేపనములందు
భస్మభావము లేవొ పరిమళింప
గలగల మను వెండి కాలిగజ్జెల మ్రోత
సెలయేటి సడివోలెఁ జెవులఁ జెలఁగ
బంగారు నగలందు పొంగారు కర లేవొ
మిన్నాగులై మేన మిడిసి పడగ
తే.గీ. పరిజనంబులు గణములై పదపడంగ
నాటపాటల నిర్గుణానంద మలర
రాజభోగంబు లెల్ల నా రాచబాల
మ్రోల రజతాద్రిదూతలై మోకరిల్లె. 410

మత్తకోకిల.
రోజురోజుకు రాఁజు యౌవనరోచు లంగన రూపమం
దోజ వెల్వడ సాగెఁ బీనపయోధరాస్తరణంబులన్,
కూజితంబుల మత్తకోకిల కోటికోర్కులు కూర్చుటల్
నైజమయ్యును కోర దా సతి నశ్వరంబుల నెయ్యెడన్. 411

ఉ. ప్రాయమునం దనూజ లురుభావజభావపరంపరాహతిన్
కాయగతాత్ములై మెలఁగఁ గాంచిన కాంతల తల్లిదండ్రులున్
స్థాయికి తగ్గ యల్లురను సాటి కులంబులఁ జూడ సాగి ర
మ్మాయి సతీప్రసూతిగతి మాత్రము వారికి పట్టదయ్యెడన్. 412

వ. అట్లుండ నయ్యంతఃపురభోగంబుల నడుమ నీడేరియు నైహికంబుల నొల్లక నైజంబు కల్మి నింద్రియార్థంబుల నీవాకంబునఁ జరించు నుమాదేవి కొక్క బ్రహ్మ ముహూర్తంబున నిదుర మేల్కొనబోవుచుండఁ గల యందొక దివ్య పురుషుండు ప్రత్యక్షంబై. 413



ఉ. ఆరవ యింద్రియంబున ననారత మే పొడఁ గాంచు చుండె నా
నీరవనిర్వికార మొక నిక్కపు జంగమవేషమందు నిం
డారఁగ ముందు నిల్వ సతి హావము నందెదొ హ్రీ పెనంగెఁ గై
వార మొనర్చె మానస మవారణఁ గంపము వుట్టె వాతెరన్. 414

కం. చిరునగవున నా రూపము
హరలింగముఁ జేతికిచ్చి యనవరతము నీ
పరమాకృతిఁ బూజింపుము
వరభాగ్యం బొదవు నంచు వరము నొసంగెన్. 415

ఉ. లింగ మొసంగి చన్న గురులింగని మానసమందు నిల్పుచున్
లింగము బాహులం బొదవి లేమ ముదంబున నుండ నంతలో
నింగి విహంగముల్ పొలయ నిద్దుర మేల్కొనె, చేతులందు నే
లింగము లేదు, చేతమున లింగము మాత్ర మెసంగు ముద్రయై. 416

తే.గీ. లేచి దినచర్యలం జొరలేదు తనువు
పొంతఁ దోబుట్టువులఁ జేరఁబోదు మనసు
తల్లిదండ్రుల మురిపాలఁ దడవ దాత్మ
భోజనాదుల నతివకు బుద్ధి పోదు. 417

కం. మనమున ముద్రితరూపము
మననము గావించి కొనుచు మంటి న్నీటన్
దనిపి మలచి గాలి విసరి
యనలంబునఁ గాచి నిల్పె నవకాశమునన్. 418

కం. ఏ రాత్రివేళ మూల పు
రా రాముఁడు వెల్గు కంబమై సృష్ట్యాదిన్
మారెన్ ద్వైతపదంబున
నా రాత్రి ముహూర్తమందె యామెయు నిల్పెన్. 419

కం. కదలుచుఁ గదలించుచుఁ బెను
నిదురను వదిలించి జ్ఞాననేత్రము నొసగన్
అదియె శివరాత్రి జనులకు
పదిలము శివభక్తిఁ దనరు బ్రతుకుల కిలపై! 420

సీ. ఆకాశగంగా జలాభిషేకము చేత
నను వుఁ జేయును లింగమును వరింప,
కొండగోగులపూలు కూర్చి మాలలు వేసి
మల్లె మందారాలు చల్లి మ్రొక్కు ,
ఓం నమశ్శివ యంచు నుక్తులన్ జపియించు
భ్రుకుటినేత్రము నందు పురుషు నుంచు,
బవలురేలును శంభుఁ బాటించు దాక్షాయ
ణీదేవి వేరొండు నియతి లేక;
తే.గీ. కూతు చేతలకు తొలుతఁ జేత మిడని
తండ్రి దక్షుండు తదుపరి తీంద్రమగుచుఁ
దన్ను రేఁపంగ దరిగొను తనయ వృత్త
మాప నుంకించె సూక్తుల నాలపించి. 421

శా. అమ్మా శాక్తవరామృతప్రభవ నీ యాంతర్య మేమౌనొకో!
సమ్మాన్యంబగు దక్షు నింటికిని నా సామాన్యభిక్షార్థికిన్
సమ్మోహమ్మన లోకులోర్తురె, ప్రజా సామాన్యభావమ్ములన్
సమ్మోద మ్మొనగూర్పగా వలె గదే, శాసించు వాడన్ గదే ! 422

మత్తకోకిల.
నిన్ను పూవులఁ బెట్టి చూచెడి నిర్మలోన్నతభావసం
పన్ను రాజకులేందుఁ దెత్తు నుమాకుమారి వరింపగన్,
నన్ను నీ వరహీనదోషమునం గుదింపకు మమ్మ నా
కన్నతల్లిరొ మాను మీ కొఱగాని పూజలు మ్రొక్కులున్. 423



ఆ.వె. తండ్రిమాటలందు తర్కమున్నది ప్రేమ
తత్త్వమున్న దదియుఁ దనకు మేలె,
కాని, భావమందు కదిలింపగా రాని
బ్రతుకు తోడొకండు ప్రబలుచుండె. 424

ఉ. పుట్టిన నాటి నుండి -- ఉహుఁ -- పుట్టక ముందటి తొల్లి తత్త్వము
న్నట్టిటు గాక గట్టిగ పదారు కరంబుల మానసంబునం
జుట్టెను వాడు, వాని నెటు చుట్టపు జన్మము చేత పట్టినై
నెట్టెద, నెట్టులీ జనకు నిగ్రహ మోర్తునొ విగ్రహింతునో? 425

వ. అనుచుఁ బలు విధంబుల లోలోనఁ జింతిలుచు సతీకన్యక జనకు తత్త్వంబు
నెఱింగినది గాన. 426

శా. సాంగోపాంగసమస్తవేదవిదు దుస్సాధ్యాగ్రహోదగ్రు నె
బ్భంగిం దృప్తు నొనర్తునంచు నిలిచెన్ వాదాడకే, మౌన మ
ర్ధాంగీకార మటంచు నెంచె నతడున్ దాక్షాయణీ కన్య న
ర్ధాంగిం జేయగఁ బాత్రుఁడైన వరు నుద్దామున్ గవేషింపగన్. 427

కం. వినయము ననుమత మనుకొని
జనకుఁడు ముదమునఁ జనఁ గని సతికి మనమునన్
జనియించె భయము, చివరకు
ననితరమగు తపముఁ బూనె నభవుని కొఱకై. 428

ఉ. అక్కడ బ్రహ్మ విష్ణువులు నంబకు పెండిలి యెప్పుడంచు నా
ప్రక్కన నున్న నారదుని బంపిరి కన్గొన దక్షునింటి కా
చిక్కుల సామియుం దనకుఁ జిక్కెను భోజనమంచు పొంగుచున్
గ్రక్కున నేగె నప్పడతి గాఢ తపంబొనరించు చోటికిన్. 429

కం. నారాయణ నామామృత
పారాయణ చెవిని బడుచు భయము దొలంగన్
నారదముని రాకను గని
నారాయణి సత్కరించె నయముఁ దలిర్పన్. 430

కం. మన్నన వందనమున నిలు
చున్న సతిం జూచి మౌని సుదతీ నీ ప
ప్పున్నము నెప్పుడు పెట్టెద
వన్న త్రపాకలితముగ్ధ వగపు పెనకువన్. 431

ముత్యాల సరము.
తనదు చిత్తము దప్పుగా న
ర్థమ్ము జేసుకు తండ్రి వెడలుట
తనకు మార్గము దోచకుండుట
నెల్ల కథ వినిచెన్. 432

కం. కావలసిన దయినది యిక
చేవలసినదగు పథకము జింతింపఁ దగున్,
ఈ విషయము శివునకుఁ జెవి
లో వేసిన నప్పు డెట్టు లుండు నటంచున్. 433

కం. ప్రేమించిన వరుఁడును త
న్నామోదించెడు వ్రతంబు నందుట కొఱకై
కై మోడ్చి నిల్చు సతిపై
మోమోడి విధంబుఁ జెప్పి ముడివెట్ట జనెన్. 434

తే.గీ. అచట కైలాసమున ప్రమథాంగణమున
శాంతమున గూరుచుండిన శంకరుండు
లోన నేదో వికారంబు లొగ్గడింప
నయనములు విప్పె నెదురుగ నారదుండు ! 435

ఉ. వచ్చిన వాఁడు నారదుఁడు వచ్చిన కార్యము నర్థమాయె నా
నెచ్చెలిఁ గూడు కాలమును నెట్టన నిల్చిన దీ విధంబుగన్ ,
ముచ్చటఁ దీర్తు నంచు మునిముఖ్యుని నాదరమొప్పఁ జీరఁ దా
నచ్చము జూడ వచ్చినటు నంజలి వట్టి స్తుతించె నాతఁడున్. 436



చంద్రకళ.
హే శివంకర శంకర శంభో ! హే కరుణావరుణాలయా !
హే శుభంకరసుందరగాత్రా ! హే తరుణీతరళార్చితా !
ధీ శరవ్య నమశ్శివమంత్రాధీన మహావిభవాకృతీ !
ఆశయాతపశీకర ! కల్యాణాత్మవివేకవిధాయకా ! 437

వ. అనుచు మర్మోక్తులఁ గీర్తించు దేవమునింగని శంకరుండును నర్మోక్తుల నుద్వాహనం బావిష్కరింపగా నాత్మభువుఁ బ్రార్థించు టొక్కండ కార్యంబనుచుఁ బనిచిన నతండును నిటలేక్షణునకు కోపంబు రామి నొకింత ధైర్యంబున. 438

ఆ.వె. మొదలు మదనుఁ జేరి ముక్కంటి నొక తూపుఁ
జూడు మనుచుఁ జెప్పి సురులఁ గూడి
నలువఁ జేరి శివుని పలుకులు వినిపించె
నవల నీదె భార మనుచు వేడె. 439

తే.గీ. నారదుని బాధ నెరిగిన నలువ నగుచు
అగుత ! కామ్యార్థసిద్ధి నీ కనుచు లేచి
పెద్దలందరితోఁ గూడి పెండ్లి గూర్చి
దక్షు నింటికి మాటాడఁ దరలె నపుడు. 440

ఆ.వె. దక్షు నింట నచట తనయ మన మెఱిఁగి
తల్లి వీరిణి కడు తాప మంది
భర్త ననునయింప బహువిధంబులఁ జూచె
శివుని మహిమ లెల్లఁ జెప్పి చెప్పి. 441

మ. కటువాగ్జాలము శైవకీర్తనగుణాక్రాంతంబు కర్ణాస్త్రమై
పటుకోపంబు ఘటింప దక్షవిభుఁ డాపాదోర్ధ్వతప్తాంగుఁడై,
నిటలాక్షుండట – నెత్తి జుట్టు కలదా నీడం భుజంగంబు లౌ
నటమాయావికి పెండ్లికావలెన టాహా!యంచు దూఱాడుచున్. 442

ఆ.వె. సోమరీనికి మన సుకుమారి నిత్తువా
కన్న తల్లి వయ్యు కరుణ లేదె,
చాలు చాలు వదరు చాలించు మనె, కాంత
లెంత మొత్తుకున్న నేమి ఫలము ! 443

తే.గీ. అట్టి యెడ వచ్చె బ్రహ్మ సురాళిఁ గూడి,
తండ్రిఁ గనుగొని దక్షుండు తగిన విధము
సలిపె మర్యాద లతఁడును సమ్ముదమున
సుతుని దీవించి పలికెను సూనృతముల. 444

సీ. ఎవ్వాని కోసమై యీవును నీసతి
సతిని బొందితిరయ్య జ్ఞప్తి లేదె?
ఎవ్వాని కోసమై ఇచ్ఛాపరాశక్తి
కోరి నీ సుత యయ్యె గుర్తు లేదె?
ఎవ్వాని యాజ్ఞపై నీచేత నానాడు
తపము జేయించితిఁ దగుదు నంచు
నవ్వాని యాజ్ఞపై నవ్వలి కార్యంబు
నుపదేశ మొనరింప నుంటి నిపుడు,
తే.గీ. ఎవఁడు నన్నును నిన్నును నింత జేసె
నతఁడు కొఱగానివాఁ డందువా కుమార!
వలదు పంతము, నా మాట తలను బెట్టి
భవుని జామాతగాఁ బొందు వరము గనుము. 445

వ. అంతట దక్షుండును. 446

కం. కాదనుటకు లేదు, మనసు
కాదన్నను తండ్రి మాట కర్తవ్యంబై
ఔదలఁ దాల్చక తప్పక
నాదరమున తలను వంచె నభవుఁడు మెచ్చన్. 447



వ. అట్టి యెడ. 448

ద్రుత విలంబితము.
అమరదుందుభు లాకస మంటగా
ప్రమథశైల ముపశ్రుతి వల్కగా
ప్రమదచిత్త ముపాసనఁ దేరగా
నమరమౌని నిరాశ వరించెగా ! 449

తే.గీ. జయ జయధ్వానముల భూతచయము కదల
నలువ నలు తలపాగలు నడుముఁ జుట్ట
పెండ్లి కొడుకైన ముక్కంటి విడిది సేయ
దక్షుఁ డెదురేగి తోడ్తెచ్చి తనయ నిచ్చె. 450

***ఇది శ్రీవాసవీపురాణమునందలి సతీ శివుల కల్యాణమను ఇరువదవ అధ్యాయము సంపూర్ణము.***

(అధీతి= అధ్యయనము చేసినవాడు, కర= అల, సముదర్క= రాగల, నిరంతరవర్ష వికాస హేతి= ప్రతియేటా పెరిగే దీపశిఖ, రీతి= ఇత్తడి, కరలు= అలలు, నీవాకము= అర్థోత్కర్షహేతువైన జనాదరము, సమ్మోహము= ఆకర్షణ, గవేషించు= వెదకు, తరుణీ తరళార్చితా= యవ్వన వతిలోని చైతన్యబలముచే పూజింపబడువాడు, ఆత్మ వివేక విధాయకుడు= ఆత్మగత వివేకాన్ని విధించు వాడు, ఆపాదోర్ధ్వ= పాదములనుండి పైవరకు)

# ఇరువది యొకటవ అధ్యాయము

**కం. రుద్రావాసాతీతా !**
**భద్రా ! పరితాపహారి ! భాగ్యవిధాత్రీ !**
**చిద్రూపావాహితస**
**న్ముద్రా ! సదసద్వివేకముఖసంధాత్రీ !**

కం. అంతయు విని వైశ్యులనిరి,
ఇంతకు కథ మొదటికిఁ జనెనే మునిచంద్రా,
పంతము విడి దక్షుఁడు తన
యంతఁ దనయ నిచ్చె గాదె యాగ మికేలా? 451

వ. అంతట సాలంకాయనుం డిట్లనియె. 452

కం. ఎట్టన నేమని చెప్పుదు
పుట్టుకతో వచ్చు బుద్ధి పుడకల గానీ
గిట్టదని కదా సామెత
యెట్టుల మనమూరకుండు నీర్ష్యా బుద్ధిన్ ? 453

కం. దక్షులకు సహజసిద్ధము
దీక్షాహంకార మద్ది దీటగువారిన్
నిక్షేపించును కాదన
కక్ష వహించు నెటులైనఁ గఱవగఁ జూచున్ . 454

శా. “దక్షో విగ్రహవా నహంకృతి” యనం దజ్జన్మవృత్తాంత మ
ధ్యక్షించుం గద వాని నెల్లపుడు నుత్తంభించదే వైరమున్,
శిక్షాగంధము లెట్టివైనఁ దరమే చిత్తంబులం దిద్దగాఁ
బ్రక్షాళింపగఁ జాలునే దధిధికిం బాషాణకాఠిన్యముల్ ! 455

చం. శిరమున నిల్పి శత్రువును చేటునఁ బెట్టెడు నంచు నెంచెనో,
కరముల శీతలమ్ము తన కన్నుల మంట వెలార్చు నంచునో,
నిరతము కన్నులందు పయనించు గదా సుతలంచు నెంచెనో,
ఇరువది యేడ్గు రాత్మజల నిందున కిచ్చె వివాహ మాడగన్ . 456

చం. అతఁడును నెల్ల పత్నులకు నాకస మంటగ నిండ్లుఁ గట్టి తా
సతతము రోహిణీగృహ వసంతవిలాసములందు మున్గుచున్
రతి మతిఁ దప్పకుండె దిన రాత్రు లవెన్ని గతించిపోయినన్
కుతి పిసరంత తీర దుపగూహనమందు యుగంబు లేగినన్ ! 457

వ. అట్లుండ నశ్విని భరణి కృత్తిక మృగశిర ఆరుద్ర పునర్వసు పుష్యమి ఆశ్రేష మఖ పుబ్బ ఉత్తర హస్త చిత్త స్వాతి విశాఖ అనూరాధ జ్యేష్ఠ మూల పూర్వాషాఢ ఉత్తరాషాఢ శ్రవణం ధనిష్ఠ శతభిషం పూర్వాభాద్ర ఉత్తరాభాద్ర రేవతి యనందగు నిరువది యార్గురు పత్నుల కెంతగా నిరీక్షించినను మగని యాదరంబు దొరకమి కడుంగడు పరితాపంబు నందుచు వేరొండు మార్గంబుఁ గానక తుదకు తండ్రియగు దక్షునిం జేరి తమ తమ దౌర్భాగ్యంబుల మొఱవెట్టి దురపిల్ల నతండును. 458

మ. అసలే దక్షుఁడు, దక్షుఁడంచుఁ దమి నేణాంకున్ శివాంకామృతాం
ధసుఁడైనన్ తన యల్లుఁ జేసికొన నన్యాయంబె ప్రాప్తించె నిం
క సహింపంగలఁడే – యహంకృతమహాకాయుండు ! హుంకారి యై
బుసఁ గొట్టెన్ వెస రోహిణీగృహములో భోగంబు లల్లాడగా. 459

శా. వేదోక్తంబుగఁ బెండ్లియాడి సతులన్ వేర్వేరుగా చూచుటల్
కాదా నేరము, నెత్తిఁ బెట్టుకొను ముక్కన్నుల్ నిరీక్షింపవో,
లేదీ యిద్దరు తోడు దొంగలికఁ ద్రెళ్ళింతుం గృతఘ్నావళిన్,
శాదుండై క్షయరోగమంది శశి కక్ష్యం దూలెడున్ ముందుగన్ ! 460

ఆ.వె. అనుచు శాపమిచ్చి యానందపడె ఱేఁడు
కూతులెల్ల పసుపు కుంకుమలకు
దూర మగుదు రనెడు తోపొకింతయు లేక
యహము విహ్వలింప నహిత మొదవు. 461

తే.గీ. శిరము వణకెను సిగపూవు చెదరి పోవ,
రోహిణీపతి కరముల రుచులు తరిగె,
రాజు కళఁ దప్పి తల ద్రిప్ప రజని పొగిలె,
ఖ గమనమ్ములఁ బ్రశ్నార్థకమ్ము వొడమె. 462

ఆ.వె. దివిజ భువిజ తతులు దిక్కుతోచక బ్రహ్మ
కడకుఁ జనిరి తుహిన కరుని గావ,
బ్రహ్మ నిత్య మెవనిఁ బ్రార్థించునో వాని
నామ మొసఁగి పంపె నయముఁ జేయ. 463

ప్రణవము.
ఆ పంచాక్షరి నమరేంద్రాదుల్
పాపోపప్లవ పరిహారార్థం
బాపత్కాలము నభిమంత్రింపన్
శాపోత్సర్జన శకునంబాయెన్ ! 464

ఉ. శాపము చేత క్షీణమగు చంద్రుఁడు కారణ ముద్ధరించి సం
తాపము చెందు వేళ సురతాపసి నారదుఁ డేగె నా క్షతిన్
బాపు నమశ్శివాయ యను మంత్రముఁ జెప్పి ప్రభాసతీర్థమం
దోపిన యంతఁ జేయుమనె నూరటఁ జెందగ నెల్లలోకముల్ ! 465

కం. అనిశము నెవ్వని తలపై
కునుకునొ యవ్వాని తలపు కొనలొత్తక నా
ముని చెప్పు వఱకుఁ దెలియమి
మనమున సిగ్గిలుచు చందమామ చరించెన్. 466



ఆ.వె. భరతవర్షమునకు పశ్చిమసాగర
తీరమై ప్రభాసతీర్థ మున్న
దందుఁ జేరి సల్పె నిందుఁ డుగ్రతపము
మెచ్చి శంభుఁడు దిగి వచ్చు వరకు. 467

వ. తుదకు తుహినగిరిస్వామి ప్రత్యక్షంబై తోటి యల్లుని దురవస్థకు కడుంగడుఁ
జింతిలుచుఁ దన కర్తవ్యంబుం దలంచి. 468

ఉ. మామను గౌరవించుటయు మంగళ మూర్తులు తారకావళీ
క్షేమముఁ జూచుటల్ తనకు క్షీణశశాంకుని కంటె ముఖ్య మా
నేమముఁ బాటి సేయ నొక నిర్ణయముం బ్రకటించె, చంద్రుఁడా
భామల రోజొకింటఁ జనఁ, బక్షము పక్షము క్రుంగి పొంగగన్. 469

కం. ఆ రాజట్టుల శాపముఁ
దీరుట నా రేవు సోమతీర్థంబాయెన్,
పేరొందె సోమనాథుఁడు
సౌరాష్ట్రము నందు పాపశమనుం డగుచున్ ! 470

కం. మునులు సురలు ముదమొందుచు
మునుపటి నెలవులకుఁ బోవ మునుపటి పంతం
బును మది మరువని నారద
ముని మాత్రము దారి మార్చె ముంచఁగ దక్షున్. 471

చం. అటఁ జని కాంచె సౌధమున నాత్మవచఃపరితప్త దీప్తసృ
క్తట సరదిందుఫేన ఫలితంబుల నాత్మఁ దలంచి యింకనుం
బటపట పండ్లు నూరు తనభ్రాతను బ్రహ్మకనిష్ఠ పుత్రకున్;
సట సవరించుకొంచు మునిసత్తము డిట్టులఁ బల్కె వానితో. 472

కం. బ్రతికెను నీ యల్లుఁడు శివు
బ్రతిమాలుట చేత, వాని ప్రాజ్ఞత చేతన్;
బ్రతికినవి జగము లన్నియు
బ్రతికితివి మహేశు దృష్టి పడకుండుటచే ! 473

చం. గగనవిమానయానమున గంద్రలు ప్రేలిన యట్టు లూహలో
నగవులఁ దేలియాడు జననాథుని కంధర మొక్క సారిగా
నిగళితమై గుభిల్లుమనె నిగ్గడి గుండియ, ఏమి యేమి యా
నగచరుఁడీ ఖగాధముని నాశన మద్దెనె యంచు నుగ్రుఁడై. 474

కం. యాగములం దొసగు హవి
ర్భాగములన్ మెక్కి యింత వాఁడాయెనె యా
భోగీశుఁడు, వానికి నిక
భాగముల న్నడ్డగింతు బ్రహ్మ నుడివినన్. 475

కం. శిక్షింపఁగ నుంకించిన
దక్షునిఁ గని దేవమునియుఁ దగునది నీకున్
దక్షుఁడ వట్టుల సేయగ
శిక్షింపుము తొలుత బ్రహ్మ చెయ్దము ననినన్. 476

మత్తకోకిల.
నారదోక్తము వార్త నిక్కము నక్తమానసదీపకం
బారయన్ ప్రథమార్థమౌ కలహప్రబంధము నంతమం
దౌర యెంతటి మేలు సృష్టికి ! ఔషధంబగు జాతికిన్ –
పేరు దక్షుఁడు, పెద్దలం గడు పెంకి, నెమ్మిక నేర్చునే ? 477

వ. అట్టియెడ నొక్క సుముహూర్తంబున – 478

కం. యమునా సరస్వతుల గమ
నము గంగనుఁ గూడు చోట నలువ మొదలిడెన్,
ప్రమితిన్ ప్రయాగయాగము
నమయగ సలుపంగ శివకటాక్షము కొఱకై. 479

వ. అందుఁ బాల్గొని యజ్ఞహవిర్భాగంబుల నందుకొమ్మంచు నాహ్వానము నందుకొన్న దక్షుండు ముక్కున వ్రేలుంచుకొనుచు. 480

శా. సృష్టించెన్ సకలంబు విశ్వసమితిన్ చిత్తంబుమై, యాతనిన్
సృష్టించెన్ కమలోదరుండు నతనిన్ సేవించుటల్ ధర్మముల్,
స్పష్టంబియ్యది తండ్రి స్రష్ట యెడలన్; భావ్యంబె వేరొండు వా
గ్దుష్టున్ తుష్టి యొనర్చు యాగము వయోదోషంబునం గాదుగా . . 481

మత్తకోకిల.
అంచు చయ్యన దక్షుఁడేగె ననన్యమైన త్రివేణికిన్,
నించె యాజి ప్రయాగవేదిక నిర్జరేంద్రుల తోడ నం
దుంచె శంకరు నగ్రపీఠము నుత్సహించె యజింపగా,
కాంచె నల్లుఁడు తన్ను, లేవఁడు కంద కావరమా యనన్. 482

వ. అంతట నా ప్రజాపతి కన్నులెఱ్ఱవడఁ గటంబు లదర బొమలు ముడివడ నధరంబు లల్లాడఁ గోపానలంబున మొగంబు కందఁ దన్ను గమనించి స్వాగతించు విరించి కొంచించ నిటుల వచియించె. 483

శా. తండ్రీ, నీ మతి తప్పెనో, ముసలివై తబ్బిబ్బులం గ్రాలితో,
కాంద్రించున్ జగమెల్ల నిట్టి కుమతిన్ క్రైమోడ్చి సేవించుచో,
పుండ్రాక్షుల్ నెలకొన్న యాగసుధలో పున్నాగసంచారమా !
పండ్రెండేడుల పండుగాయె నిది, వే బంపించు కాపాలికున్. 484

ఆ.వె. పదవి చేత పెద్దవాఁడని మన్నింప
పరమ శివుఁడు బాధ పడునటంచు,
వలదు తగదనంగ పదవికే చేటంచు
నిరుకులోనఁ బడియె హరి సుతుండు ! 485

తే.గీ. తటపటాయించు చుండిన తండ్రిఁ జూచి
తనను గణుతించు సురగణోత్కరముఁ జూచి
తనకు గల ప్రజాపతి గద్దెతనముఁ జూచి
కొనుచుఁ బ్రకటించెఁ దనయానఁ గనలు కనుల. 486

సీ. ఆది జన్ముఁడ నంచు నాదివాసిగ వేష
మూనెడు సంస్కారహీనుఁ డితఁడు,
పరమార్థమని చెప్పి పురవాసమును వీడి
వల్లకాడున నుండు భ్రష్టుఁ డితఁడు,
మాయమంత్రములం దమాయిక ప్రాణుల
వంచించి మనుచుండు భండుఁ డితఁడు,
కాసేపు మౌనంబు కాసేపు నృత్తంబు
స్థిరబుద్ధి లేని దుశ్శీలుఁ డితఁడు,
తే.గీ. ఇతఁ డనర్హుఁడు హవ్యంబు లీయఁ దగఁడు,
విశ్వకల్యాణ మాశించు వేదవిధుల
నితని స్థానంబును బహిష్కరించు చుంటి,
శ్రేయమిది గాన మిమ్ము శాసించు చుంటి. 487

తే.గీ. దివిజ వర్గము లిది విని దివికి తరలె,
మంద హాసంబు చెదరదు మాధవునకు,
మౌన మిసుమంత చెదర దుమాధవునకు,
అంత పంకేరుహోద్భవుం డనియె నిట్లు. 488

కం. కొడుకా, యెంతటి దురితం
బొడిగట్టితి వీవు భవుని నొద్దారింపన్,
తడవాడు వాడవా – మా
నుడువులఁ జెవిఁ బెట్టవేల నొడుపుదు వెల్లన్ ? 489

ఆ.వె. ఆదిపురుషుఁ డాతఁ డల్లుఁ డైనంత మా
త్రమునఁ జులుకఁ జేయ తగదు నీకు,
శివుఁడు లేక యాగసిద్ధి నొందుట యెట్లు,
మన్ను లేక బొమ్మ మలచ గలవె ? 490



ఆ.వె. ఈశ్వరుండు లేని యిష్టి యేమిటి కంచు
నిలిపి వేసి నలువ నిలయ మరుగ
నాపి నేను చేసి చూపింతు ననె దక్షుఁ
డట్లు దక్షయజ్ఞ మవతరించె. 491

***ఇది శ్రీవాసవీపురాణమునందలి దక్షయజ్ఞకారణం బను ఇరువది యొకటవ అధ్యాయము సంపూర్ణము.***

(ఉత్తంభించు= పొడిగించు, దధిధి= పెరుగు సముద్రం, కుతి= కోరిక శివాంకామృతాంధసుడు= శివునిచేతి భోజనం తినేవాడు, శాదుడు= మలినమంటినవాడు, దీప్త= కాలిన, సృక్తట= పెదవి అంచు, ప్రమితి= యదార్థ జ్ఞానము, అమయు= ఉపయుక్తము, ఒద్దారించు= ద్వేషించు, ఒడుపు= లక్ష్యము దాటు)

# ఇరువది రెండవ అధ్యాయము

**కం. యజ్ఞారంభ శుభాంగీ !**
**యజ్ఞాంతర్గత వరాభయానంద వనీ !**
**యజ్ఞానంతర శుభకరి !**
**యజ్ఞియ ! యజ్ఞోపవీత ! యాజ్ఞిక ! యజ్వీ !**

కం. జన్మాంతర దోషంబునఁ
జిన్మయ తత్వంబు నెఱుగ సిద్ధపడని యా
మృణ్మయ పాత్రంబగు ద
క్షోన్మాద సురాళ మెటిగి యూరుజు లంతన్. 492

ఉ. భౌతికసౌఖ్యజాలమున బద్ధుడునై చను మానవుండుఁ బ్రా
చేతసధర్మమూల మెటు జింతనఁ జేయగఁ జాలు మౌనసం
భూత వచోధనా ! పరమపుణ్యవిభూతి సహిష్ణు శక్తికిన్
సైతము నోర్వరాని యపచారము సైచెనె దక్ష పుత్రియున్ ? 493

వ. అనుచుఁ బ్రశ్నింప మునివరుం డిట్టులనియె. 494

కం. అటు తండ్రియె కావచ్చును,
ఇటు తన పతిగౌరవమ్ము నీసడ వెట్టన్-
ఎటు సైచును కులసతి తా
నటమటఁ జెందక నుపాకృతాజ నిభమ్మె ! 495



భుజంగవిజృంభితము.
రుద్రోద్రేకోద్భూతచ్చేతో రుచుల శిరములివి నిజరూప మాఱయ లేవొకో,
క్షుద్రోద్రేకోద్భూతోచ్చండాక్షుల ననవసరమగు వచోమృషోధృతిఁ దన్మహో
ముద్రాంతఃచేతోశక్తిన్నామొగమున నిటుల విభుని మోహరించిన విచ్చి, ఆ
రుద్రోద్రేకోద్భూతోద్యద్దారుణమున బలియగునని రోషరంజితశీర్షమై. 496

కం. కుడి కాలి బొటన వ్రేలిని
పుడమిని మథియింప నగ్ని పుట్టెం దానన్
బడి భస్మమాయె నా సతి
సుడివడ యాగాగ్నిశిఖల సోపానములున్ ! 497

తే.గీ. అగ్నిపర్వత ముడికి శిలాద్రవమ్ము
నొక్కసారిగ జిమ్మె నధోజగద్వి
భూతులన్నియు నందులో పూడిపోవ,
దక్షసదన మ్మనల ధూళి దాగి పోవ. 498

శా. నందీశుండది చూచి దుఃఖగతసంతాపంబు నార్ద్రాక్షుఁడై
వందే శంభు ముమాపతిమ్, పశుపతిమ్, వామార్ధ ధిష్ణ్యంబహో.....
పందల్ వోలెఁ గలంగి నిల్చితిమి నీ బాంధవ్యమధ్యంబునన్
సందేహంబున నంచు నాత్మగణమున్ సారించె శైవాద్రికిన్. 499

ఉ. ఆత్మజనంబు పోవఁ దిగు నౌదల బంధుజనంబు వోలె రా
నాత్మగణంబుఁ గాంచి భవుఁడంతరముం గనగా నిజంబుగా
నాత్మసఖీ వియోగమున నాకులమొందె, నరంబు లందు ర
క్తాత్మగమున్ హుటాహుటినిఁ దాండవ మాడెఁ దనూనిదేష్టమై. 500

సీ. కుధరమ్ముతో బాటు కువలయమ్మునుఁ గ్రుంగి
క్రుంగిన కుధరమ్ము నింగి కెగప,
దిక్కులతో బాటు దిగ్గజంబులుఁ బాఱి
పాఱిన దిక్కుల పాటు నిలుప,

తాపంబుతో బాటు తపనుండు నెగ బ్రాకి
యెగబ్రాకు తాపంబు నిలకు దింప,
సిగవేణితో బాటు సిగపూలు వెదచింది
వెదచిందు సిగవేణిఁ గుదుటఁ బరుప,

తే.గీ. ప్రళయకాలాగ్నిరుద్రుఁడై పరమ శివుఁడు
సతిని మ్రింగిన దక్ష యజ్ఞార్తిఁ దీర్ప,
తరణికరమై ప్రసారమై తలరు నొందు
జట నణవ్యంబుఁ గీలించె ఝంఝు వుట్ట ! 501

ఉ. జన్నియ లున్న వున్నయటు చాగిల నుద్గతమయ్యె స్థాణు వి
చ్ఛిన్న మహాద్భుతోత్కట విసృత్వర భీకరభైరవేయమై
భిన్నభ దక్షశీర్షమును భీషణహస్తసహస్రయుగ్మమున్
స్విన్న కటంబులున్ సెగలు చిమ్మెడు కన్నుల కాయమొం దటన్ ! 502

కం. వీరావేశంబున నా
భారీకాయంబు నందు భద్రాంకితమై
వారింపరాని స్థాణుగ
తారంభము వీరభద్రుఁడై స్ఫోటించెన్. 503

శా. వ్యత్యస్తార్థవిభూతి దూసిన వియద్యంత్రార్భటిం బేర్చుచున్
సత్యంబై తన ముందు నిల్వ నిటలాక్షాప్తిన్ పదార్థంబు నా
పత్యంబున్ సతిఁ గుక్షిఁ గొన్న క్రతువున్ భగ్నంబొనర్పం బ్రజా
పత్యంబున్ తలనీల్గుఁ ద్రెంపి మరలన్ బంపించె నుగ్రాకృతిన్. 504

వ. అంత నా రుద్ర సంభవుండగు వీరభద్రుండుఁ బరమేశ్వరునకు ముమ్మారు ప్రదక్షిణంబుఁ జేసి. 505

కం. కనకన లాడెడు కన్నులు
ననలముఁ బుక్కిట నుమిసెడు నాస్యస్వర దు
ర్జన భీకరహుంకృతులును
ఘనచండజటాభ్రచుంబిగాంగేయార్చుల్, 506

సీ. ఒక చేత వీరణం బొక చేత కాహళ
నింగి దిగ్భ్రాంతిఁ జెందంగ మ్రోయ,
ఒక చేత శూలంబు నొక చేత ఖడ్గంబు
దిగ్గజంబుల గుండె దిగ్గురనఁగ,
ఒక చేత పాశంబు నొక చేత కేశముల్
కాలాధికారంబు కలత వడగ,
ఒక చేత మంత్రంబు నొక చేత తంత్రంబు
మంత్ర తంత్రజ్ఞుల మదము లణగ,

తే.గీ. భూతగణములు తన వెంట భుగ్నభిదుర
చయములై సాగఁ బ్రమథనిచయము క్షుదిత
బహుబలములై కదలిరాగ వల్గన గతి
వెడలె దక్షాధ్వరధ్వంసవిజ్ఞుఁ డగుచు. 507

ఆ.వె. ఒంటి కాలి మీద, జంట పాదము లందు,
పాదబహుళమందు, పాదరహిత
మగుచు భూతగణము లాక్రాంతగీర్వాణ
వచనభంగులందు భద్రులగుచు; 508

ఉ. ఆకలిఁ గొన్న సింగములు హస్తికమున్ గని యొక్కమారుగా
దూకిన చందమా భృగువిధూతులు దక్షుని యాగశాలపై
దూకిరి శర్భ దశ్శరభ దూయుడు కోయుడు దుర్మదాంధులన్
నూకుడు హవ్యవాహనుని నోట యటంచు రణస్థవిష్ఠులై, 509

సీ. కొందఱు యజమాను కోట్టముల్ కూల్చంగ
కొందఱా పత్నుల కొంపఁ గూల్చ
కొంద ఱగ్నీధ్రాదు లందు దంబముఁ గూల్చ
కొందఱు వేదికల్ కూలఁగొట్ట
కొందఱు పంటిళ్ళు కొందఱు వంటిళ్ళు
కొందఱు పందిళ్ళు కూలఁగొట్ట

కొంద అగ్నుల నార్పఁ గొంద ఆహుతు లూడ్చ
కొంద ఆ పాత్రలు గుల్లఁ జేయ
తే.గీ. కొంద అందు మునులఁ బట్టి కొట్టుచుండ
కొంద అభ్యాగతులఁ బాఱఁ గొట్టుచుండ
నందఋనుఁ జేరి దక్షునియజ్ఞశాల
నాశ మొనరించి రయ్యెడఁ బాశుపతులు. 510

కం. కళకళ లాడెడు యాగము
కళ కాలము లోన ప్రళయకాలాకులమై
దళితఫల మగుటఁ జూచుచుఁ
గళవళపడి రెల్ల యజ్ఞకార్యనిరతులున్. 511

కం. బిత్తర వోయిన దక్షుఁడు
హత్తెరి వీరెవరు నన్ను యాగంబునుఁ జే
నిత్తరి నడ్డుట కంచు హ
టాత్తుగ నెదిరింప సాగె తావుల నిలువన్. 512

కం. మొన నిలచిన దక్షుని, ద
క్షుని పరివారమునుఁ గలిపి చూర్ణ మొనర్పన్
స్తనితవిషాణాంబుదమద
వనజములై మీదఁ బడిరి భవుసంతతులున్. 513

సీ. జిగిలి మీసములాడ సృవహస్తుఁడై హోమ
మును సల్పు నా భృగుమునినిఁ బట్టి
మణిమంతుఁడా సభా మంటపమ్మున నీడ్చి
పడవేయ మీసముల్ భవుఁడు పెఱికె,
నందీశ్వరుఁడు భగు సందావమ్ముం జూచి
పట్టి కన్నులు రెండుఁ బట్టి పెఱికె,



చండీశ్వరుఁడు తన్నెఁ జండమయూఖుని
పళ్ళికిలించగా పళ్లు రాల్చె ,
తే.గీ. వీరభద్రుండు నిజలక్ష్యవీక్షణమున
దక్షు పైబడి పడవేసి వక్షమందుఁ
ద్రొక్కి విలవిల లాడు నా ద్రోహి శిరము
నరికి హోమాగ్ని వైచెఁ దీవరము దీర. 514

తే.గీ. అయ్య చెప్పిన పని యైన దంచు గాక
అమ్మ చితికారకునిఁ జంపినా మటన్న
యాత్మసంతృప్తి నుత్సాహ మంది వారు
వెండి కొండకుఁ జని విన్నవించి నారు. 515

లయగ్రాహి.
పుత్రుఁడగు దక్షునకు సత్రమునఁ బట్టిన వి
చిత్రమగు దుర్గతికి క్షేత్ర దళితుండై
ఆత్రమున బ్రహ్మయుఁ ద్రినేత్రు దరిఁ జేరి తన
గోత్రమును గావుమని స్తోత్ర మొనరించెన్
మిత్రులకు రక్షకుఁడ ! శత్రులకు శిక్షకుఁడ !
మిత్రులగు శత్రులకు మిత్రుఁడగువాడా !
మిత్రుఁడగు దక్షునిక శత్రువుగ చూడకుము
పుత్రి మరణించె నిక పుత్రుఁడవు గమ్మా ! 516

వ. మహదహంకారంబు ముందు జీవాహంకారంబది యెంత, జన్నంబుల నన్నంబులు విభజింతుము నీకు మా బన్నంబులఁ దొలగించు మన్న విన్నపంబులు జేసినంత భవుండునుఁ బ్రీతుండై. 517

ఆ.వె. మేక తలను దెచ్చి మేని కంటించి నా
పేరుఁ జెప్పు దతని పెరిమె లేచు,
వెండి కొండ కతఁడు విలువ నిచ్చెదుమీద
యాగ మాచరింప నరుగు డింక ! 518

వ. అనుచు నమ్మహేశుండు బ్రహ్మాదులకు సెలవొసంగి తాను హిమవంతంబున ననిర్వచనీయంబగు స్వస్వరూపధ్యానంబునఁ దపోమగ్నుండయ్యె నంత బ్రహ్మాదులును శివానుమతంబున దక్షప్రజాపతిం బ్రతికించి యాగంబుఁ బరిపూర్ణంబుఁ జేసి సుఖంబు నుండిరి. 519

***ఇది శ్రీవాసవీపురాణమునందు దక్షయజ్ఞవిధ్వంస మనెడు ఇరువది రెండవ అధ్యాయము సంపూర్ణము.***

(సురాళము= కోపావేశము, ఉపాకృతాజము= యజ్ఞమునందు అభిమంత్రించి చంపబడు మేక, ధిష్ణ్యము= స్థానము, రక్తాత్మగము= రక్తమున నుండు వేడి, నిదేష్టము= ఆజ్ఞాపించునది, అణవ్యము=అణువులుపండు భూమి, జన్నియలు= దేవతలకోసం విడిచిన జంతువులు, ఉత్కట= వేగమైన, విస్తృత్వర= ప్రసరించు, భిన్నభ= భిత్+నభ= నభమును భేదించునది, స్విన్న= చెమటలు పట్టిన, వ్యత్యస్తార్ధ విభూతి= తడబాటుచే ప్రేలిన వస్తువు, దూసిన= వేగముగా వెలువడిన, వియద్వ్యంత్రార్భటి= పిడుగులమ్రోత, నిటలాక్షాప్తి= నుదటికన్నున్న, పదార్థము= స్థాణువు, భుగ్న భిదుర చయము= వంగిపయనించు వజ్రాయుధ సమూహము, వల్గనగతి= వేగముగా విడువబడి కాళ్ళుకదిలించుచు పొటెడి అశ్వగతి, భృగు విధూతులు= శివగణములు, స్తనిత విషాణ= గర్జించు దంతాలు, మదవనజము= మృగమనే ఒకజాతి ఏనుగు, సందావము= పలాయనము)

# ఇరువది మూడవ అధ్యాయము

**కం. దురిత దురీహ దురాశయ**
**దురహంకారాప్త కుజన దుర్మద హరణో**
**త్తర సంభావిత సుజనా**
**కర కర నికరార్చితాభ్ర కంజదళాక్షీ !**

ముత్యాలసరము.

వీరభద్రుని విజయగాథను
విన్న వైశ్యులు విశ్రమింపక
భస్మమై సతి భస్మధరు సతి
ఎప్పుడాయెను చెప్పుడనన్. 520

కం. అప్పుడు సాలంకాయను
డప్పుణ్యకథాక్రమంబు నమృతమహత్త్వం
బొప్పుగఁ జెప్పగ సాగెను
చప్పున ననభిజ్ఞులకును చదువగు రీతిన్ ! 521

ఉ. మేషముఖంబు నొంది మఘమృష్టయశోధరుఁడాయె దక్షుఁడున్,
శేషచితావిశేషమును జేత ధరించి హరుండు వ్యగ్రుఁడై
దోషదినావధుల్ తిరుగ దోషవలాహక భీతిఁజేసి ప్ర
త్యూషవిహర్త లాత్రము నధోక్షజుఁ జేరి వచింప నాతఁడున్. 522

ఉ. ఇందిర పుట్టినిల్లు ధరియించెడు స్థాణు వలక్ష్యగామియై
చిందులు వేయుటల్ కరము చిత్రమెకా దతిఘోరమంచుఁ దా
నందుకొనెన్ సుదర్శనము నాత్మగతార్థవిశేషశేషమున్
చిందర వందరై శివుని చేతిని వీడి పడంగ వేసినన్. 523

వ. సుదర్శనాహతిభిన్నంబైన సతీవిముక్తదివ్యతనూవిశేషం బష్టాదశ ఖండంబులై ధరణిం బడ నాయా క్షేత్రంబు లయ్యాయెడల శక్తిపీఠంబులైచెన్నొందె నందయ్యంబ లంకయందు శాంకరిగను, కంచి యందు కామాక్షిగను, ప్రద్యుమ్నమున శృంగళగను, క్రౌంచమందు చాముండిగను, నలంపురమున జోగులాంబగను, శ్రీశైలంబున భ్రమరాంబగను, కొల్హాపురంబున మహాలక్ష్మిగను, మాహుర్యంబున నేకవీరగను, నుజ్జయిని మహాకాళిగను, పీఠికాపురంబునఁ బురుహూతికగను, ఓఢ్యంబున గిరిజగను, దక్షవాటిక మాణిక్యాంబికగను, హరిక్షేత్రంబునఁ గామరూపగను, ప్రయాగలో మాధవేశ్వరిగను, జ్వాలాపురంబున వైష్ణవిగను, గయలో మాంగల్య గౌరిగను, వారణాసిలో విశాలాక్షిగను, కాశ్మీరమందు సరస్వతిగను వివిధ తేజోరూపంబుల నెలవొంది శుంభ నిశుంభ మహిషాద్యసుర దురహంకార సంహార విహారంబుల నహరాంతరీహా మహోన్నతులగు సుజనవ్రాతంబుఁ గాపాడు చుండ.
524

ఆ.వె. చావు దెబ్బఁ దిన్న సాయంసమయజులు
చాటు మాటులందు రాటుదేరి
చాల కాలమునకు చాలుదు మంచు ఖే
చరుల మీద దాడి సలుపఁజనిరి. 525

తే.గీ. తారకాసురుఁ డనువాడు తపము సలిపి
మరణ మన్నది లేకుండ వరము వేడ
శివతనూజుఁడు గాని నిర్జింప డంచు
నలువ వరమిచ్చె; నతఁడందు నాయకుండు. 526

చం. సతి చనిపోయి శంకరుఁడు సంసృతిఁ దప్పి చరించు చుండ నే
గతి సుతుఁ దుద్భవించు, ననుఁ గాలుని కర్పణఁ జేయునంచు లో
నతిదురభిగ్రహాప్తి నసురాధిపుఁ డుగ్రతరాపరాజితుం
గతి నెదిరించి వంచె సురగర్వమహత్త్వ మహీనమోహుఁడై ! 527

ఉ. సంగరదుర్నిరీక్ష్యుఁ డుపజాపకళానిధి కాశ్యపుండు వ
జ్రాంగుఁడు వాసవాంతకుని జన్మకు జన్మము ధారవోయ ను
త్సంగము తారకాసురవిసర్పణ మాయెఁ దదాది దైత్యులున్
సంగడి గట్టి సంతతము స్వర్గముపై గురివెట్టి రస్త్రముల్. 528

ఉ. నల్లని కారుమేఘము లనం జను రక్కసిమూక లేకమై
కొల్లగ నుక్కు తేరులనుఁ గూర్చిన గంధ్రఘురాలకమ్ములన్
బల్లిదులై విరోధి జనభంజనమం దెరగొన్న బంటులై
తల్లడ వెట్టి రెల్ల సురతారకుల న్నొక తారకాధ్యతన్. 529

ఆ.వె. తిరుగులేని వరము లిరవైన తారకుం
డరుగ నింద్రగణము లిరవుఁ దప్పి
పరుగు లిడిన వరుగఁ దెరువులు గనరాక
మరుగు లందు దూరఁ దరుమ బడుచు. 530

సీ. వజ్రాయుధము పారవైచి దేవేంద్రుండు
పారెఁ దారకు నోర్చు బలము లేక,
ధనరాసులను వీడి ధనదుఁడు పరుగెత్తె
చండ తారకు నోర్చు శక్తి లేక,
కాలపాశము వీడి కాలుఁ డెందే నేగెఁ
గవయు తారకు నోర్చు కడిమి లేక,
వరుణాగ్ని వాయువుల్ ప్రాభవంబులు దక్కి
కొలిచిరా తారకు నిలుప లేక,

తే.గీ. కడకు కడ దిక్కు వేలుపుఁ గదలె నెటకొ,
కోన ఱేఁడును రక్కసి కోనఁ జేరె,
లోకముల నెల్ల దైత్యకల్లోల మావ
హింపఁ దారకు తేజాన హింసఁ జెలఁగె. 531

ముత్యాలసరము.
మునుల పత్నులు కనుల నీరిడ
సురుల పత్నులు సొమ్మసిల్లగ
మనుజ పత్నులు మరణ మొందగ
పురుషు లందరు పుటుకు మనిరి. 532

ఆ.వె. సృష్టికార్యమెల్లఁ జెరఁ బట్టె తారకుం
డనుమతింప డాయె నమరధర్మ
శాస్త్రములను వాని చట్టముల్ బాటింప
ముగురు మూర్తులకును దిగులు పుట్ట. 533

ఉ. ఎట్టి దురాత్ము సృష్టి యొనరించితినంచు విరించి వంచె మో,
మిట్టి దురాకృతంబుఁ గన నీకొన లేకయొ మౌనమూనె ము
మ్ముట్టువు, పట్టరాని బలిమూర్ఖకృతార్థకృతాంతదానవున్
బట్టెడు బాధ్యతం బొగులు పార్థివుఁ డొండె యతండు వెన్నుఁడే ! 534

శా. ఏ కర్తవ్యము నిర్వహింప మును లోకేశుండు స్థాణుండు నా
సాకారాచ్యుతు నిర్ణయించె నిపుడా సంసారసంరక్షణం
బా కౌమోదకపాణి బాధ్యత కదే ! హంకారహింసారతిన్
లోకంబుల్ బలిగొంచు తారకుఁడు కాలూనన్–ఉపేక్షించునే !? 535

వ. కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యంబులకు నియంతయు, రూప రస గంధ శబ్ద స్పర్శ చింతల కతీతుండును, జరా మరణ శోక పాప క్షుత్పిపాసా రహితుండును, అస్తి జాయతే వర్ధతే పరిణమతే అపక్షీయతే వినశ్యతేతి గుణ వికార మృగ్యుండును, యశ శ్రీ వీర్య వైరాగ్య జ్ఞానైశ్వర్యాధీశ్వరుండును, షడింద్రియ నియామకుండునునగు షడ్గుణేశుండు మహావిష్ణువున కసాధ్యముండునా? 536



మ. సకలానర్థవినాశినిన్, సహజచిచ్చైతన్యవిశ్వంభరన్,
ప్రకటానందవిరాజితన్, పరమపారంపర్యపర్యేషితన్,
వికటోపాకరణాసురాభ్రభిదురన్, వృద్ధశ్రవోత్సేకమున్,
త్రికళన్, సోదరిఁ బ్రాణశక్తిఁ దలచెన్ దేవిన్ రయిర్వైష్ణవిన్. 537

ఆ.వె. అన్న విష్ణు వాత్మ నవధాన మొనరింప
నవతరించె నెదుట నపరశక్తి,
చెల్లిఁ జూచి వెన్నుఁ డల్లారు ముద్దుగా
నవతరింపు మనియె నవని మరల. 538

కం. కారణ మడుగదు నుడువదు
నారాయణి మారుమాట నగరాట్హిమవ
న్నారీమణి మేనా దే
వీరూఢంబై జనింప వేడ్కం జనుచున్ ! 539

మ. పరిశుద్ధాన్వయమైన హైమనగరాడ్వంశం బనుస్యూతమై
నిరపాయం బకలంకకీర్తి సతముం దీప్తంబుగాన్ మేనకన్
గిరిరాజ్ఞిన్ పితృకన్యకామణిని భక్తిం దన్ను నిత్యంబుఁ గూ
తురుగాఁ గోరెడు దాని నమ్మయన సంతోషంబునన్ గర్భమై, 540

కం. హిమవంతుని గిరిగృహము మ
హిమవంతముఁ జేసె శక్తి హిమవత్సుతయై,
అమరారి తారకుని ధృతి
హిమవంతునిఁ దండ్రిఁ జేసె నీశ్వరి కౌరా ! 541

తే.గీ. ఎదురు చూచిన క్షణములు హృదయ మొనయ
నెదుట చిన్నారి మురిపముల్ ముదముఁ గూర్ప
నాత్మ నానందపాథోధి నమృత మలర
రాజు రాజ్యంబు జగములున్ రక్ష నొందె. 542

కవిరాజ విరాజితము.

ఘన జని నాద మకార ఉకార మకారము లందున సంపుటిగాన్
ఘన జని నామ ముకార మకార అకారములన్ జనియించె నుమా
యను ప్రణవాన్విత మౌ స్వరమై వినయంబునఁ బల్కిన వారలకున్
ధనమును ధాన్యము ధైర్యము స్థైర్యము ధర్మపథమ్మున వృద్ధియగున్ ! 543

***ఇది శ్రీవాసవీపురాణమునందలి గిరిజాజన్మవృత్తాంత మనెడి ఇరువదిమూడవ అధ్యాయము సంపూర్ణము.***

(వలాహక= రాక్షస, ప్రత్యూష విహర్తలు= దేవతలు, ఉపజాపము= భేదోపాయము, విసర్పణము= ప్రసరణము, పరమ పారంపర్య= పరాశక్తి సృష్టి క్రమము, పర్యేషితము= వెదకబడినది, వికటోపాకరణాసురాభ్ర భిదుర= వంకరదారిలో వేదాభ్యాసము చేయు రాక్షసు లనెడు మేఘములకు వజ్రాయుధం, కృతార్థ కృతాంత= అశుభకార్యములు నెరవేరినవాడు, రయిర్వైష్ణవి= ప్రవాహంలా వ్యాపించే శక్తి, పితృకన్యకామణి= వైరాజులను పితృదేవతల మానసపుత్రిక)



# ఇరువది నాల్గవ అధ్యాయము

**కం. ఆనందామృత వర్షిణి !**
**గానకళాలోక చంద్రికా హిందోళా !**
**సేనా కదనకుతూహల !**
**గాన క్షీరాబ్ధి మాతృకా శ్యామాంగి !**

తే.గీ. ఆదిమధ్యాంతరహిత మహామయూఖ
మిడిసిపడు నొక్క మిణుగురు మ్రింగ నొక్క
తేని కడుపునఁ బుట్టుటా ఋషివరేణ్య !
అనుచు నాశ్చర్య పడిరి వైశ్యర్షు లంత. 544

వ. సాలంకాయనుండును నవ్వారి తర్కంబునకు మిగుల సంతసించి తలయూచి.

తే.గీ. ఏ మహాతత్త్వ మజుని సృష్టించె నపుడు,
ఆ మహాసత్త్వ మతని నియమము ముందు
కట్టుబడి యుండుటన వింతగా ధ్వనించు
నయ్యు నియమంబుఁ బాటింప నగును గాదె ! 546

ఉ. తాను సృజించు విశ్వమున ధర్మములున్ సృజియించె నమ్మహా
మానుషుఁ డాతఁ డవ్వి యవమాన మొనర్చిన నేమి ధర్మ మో
మానవవర్యులార ! అని మౌనివరుండు వచింప వైశ్యులున్
ఔనుగదా యటంచు విన నాపయి గాథ వచింప వేడినన్. 547

శా. సాలంకాయనుఁడున్ వచించె గిరిజాసౌభాగ్యచారిత్రమున్,
బాలన్ పర్వతరాజపుత్రిని సదాబాలేందుమౌళిన్ మదిన్
కీలించుం బతియంచు నప్పుడతి నా కేదారుఁ డెబ్బంగి సం
బాళించెన్, క్షతమానసం బెటుల సామాన్యస్థితిన్ బొందెనో ? 548

ఉ. తారకు నోర్వరాకఁ దమ తావులఁ దప్పి చరించు దేవతల్
దూరని తావులే దసపుదుండగముల్ భరియింప లేక లో
దూరని తీరు లేదటుల దొర్లిన కాలము లెక్క లేదు, తా
త్సారము సైపలేక యిక దండుగ వెళ్లిరి ధాత వేడగన్. 549

సుముఖీ వృత్తము.
వెడలి విరించి విపంచికలం
దడిసెడు మంచి తఱిం గరముల్
ముడిచి వచింప ముసించు విధిం
గడప నతండుఁ గరంగె దయన్. 550

వ. అటుల దివిజుల దగ్గుత్తికలం గరంగిన నలువ నాకాధిపుం జూచి. 551

కమలనగీతి వృత్తము.
ఓయి దివ్యనాయకా, కదోయి నీదు దోష
మీ యనంతదుఃఖమున కహీనకారణంబు ?
పాయవాఱ నున్న దఘము పయనమగుము మఘవ,
పాయవాఱఁ దారకాస్థ్రమఁ గడంగు మింక. 552

తే.గీ. ధాత వచనంబు కొంత రాద్ధాంత మగుచు
సాంత్వనంబును నగుచున్న సౌరు నరసి
దోషి వన్నందు కత్యంతరోషమూని
కారణముఁ జెప్పుమనె ముందు గట్టుదాయ. 553

వ. అంతఁ గమలజుండు నొకింత కోపంబున నిట్లనియె. 554

శా. కామక్రోధమదాదులందు విముఖుల్, కారుణ్యగంగాధరుల్,
క్షేమస్థైర్య విరాజమానులు కదా చింతింప మీ దేవతల్ ;
మోమాటం బటులుంచు దందు నొకఁడున్ ముఖ్యంబు కాలేదు మీ
భామాశ్రీపదవీవిమోహ వితతిప్రాకారబాహ్యంబులై ! 555



ఉ. దోషము కాదె మీ దివిజదుహ్యగవీగుణముల్ త్యజించుటల్,
దోషజు లౌచుఁ దామసము దూకుట, దుర్గుణగంధమత్తులై
శోషితదోషులౌ ఋషుల జోలికిఁ బోవుట, సాధ్వీశాపమై
దూషితవేషులౌట గన దోషము గాక మరేమి టందురో ? 556

శా. తారే లోకములం దమేయపదవీతారుణ్యసంపన్నులా ?
కారే తాపసవృత్తిదైత్యులయినన్ కామ్యార్థసిద్ధుల్ బలా !
నీ రేతావునఁ బుట్టినం గడఁగి మున్నీరై తరించుం గదే-
క్షీరాబ్ధిం బడు చిన్కు మాత్ర మరయన్ క్షీణింపదే తప్తమై ! 557

కం. ఉన్నతకులమునఁ బుట్టినఁ
బన్నుగఁ దమ ధర్మములను బాటింపనగున్,
కన్నులు నెత్తికి నెక్కినఁ
బన్నములం బడును కులము పతనంబగుచున్ ! 558

ఆ.వె. అనుచుఁ దిట్టుచున్న యజుని మోమునుఁ జూడ
లేక తలలు వంచి నాకసదులు
తప్పు సైచు మనుచు దయఁ జూపు మనుచును
దారిఁ జూపు మనుచు దండమిడిరి. 559

చం. వినయముఁ జూపు దేవతల విన్నపముల్ విని బ్రహ్మదేవుఁడున్
విను వలనూను మార్గమిక వేద్యము, విద్విషుఁ దంతమొందగా
ననె నిటు లోయి దేవపతి, హైమవతిన్, హిమవంతు పుత్రికన్,
మునుపటి తావుఁజేర్చు దఘమోక్షమునొందుదు,సేమమయ్యెడున్ !560

వ. నలువ నుడువులం గడు పుడుకుఁ దొడుకులం బడసిన వడుపున నొడలు బుల్కరించియుఁ బడయునెడఁ దడుమరాక నొండొరులు మొగంబులు జూచు కొనుచుండ నతండును వారి గొణగుడు నుడుపఁ గడంగి. 561

ఆ.వె. దక్షవాటి నుండి దాక్షాయణీదేవి
విశ్వపాలకుండు విష్ణు నాజ్ఞ
హైమవతిగ బుట్టె నామెకుఁ బుట్టును
తారకాంతకుండు త్ర్యక్షుఁ గరుణ ! 562

వ. కావున విరాగియై హిమవన్నగంబునఁ దపం బొనరించు శివుని మనంబునఁ బార్వతిం బ్రతిష్ఠింపఁ బ్రయత్నింపుడు, పొందని వీడ్కొలుపఁ గాందిశీకులై యెడనెడఁ దిరుగాడు దేవ గణంబు లెల్ల మేరువుంజేరి సమాలోచనంబుండ దేవగురుండగు బృహస్పతి యింద్రు నవలోకించి. 563

కమలనగీతి. సురపతీ ! మహేశుఁ డిపుడు సురతవిముఖమౌని,
గిరిజ యతనిఁ బతిగ మదిని గెలువ నెంచు జాణ,
మరునిఁ బిలిచి హరుని మదిని మరులు గొలుపఁ బంపు
మరి నిషూదనమున జాప్య మసలు పనికి రాదు 564

కం. అని పలుకగ ననిమిషపతి
మనసిజు మదిఁ దలచి పిలిచి మదనా నీపై
మన మిడుమల సుడిఁ గడచుట,
మనుగడ మునుపటు గడపుట మనియున్న దనెన్. 565

వ. మదనుండునుఁ దన యవసరంబున కదను దొరికిన దిక దన బలంబుఁ జూపింతునను నహంకారంబున నిట్లనియె. 566

కం. అంకెకుఁ గొని తెచ్చెదఁ గద
పొంకము నందున్న చాలు పురహరునైనన్,
సంకోచ మేల శతమఖ !
సంకేతము నిమ్ము పోయి సాధింతు వెసన్ ! 567

కం. అనవిని పురందరుఁడుఁ దా
ననుకొన్నది చేతునన్న యాతని వేనో
ళ్ళను గొనియాడి, పురహరుని
మనమున మరులన్న నేమి మాటలె యనుడున్. 568

తే.గీ. మందమారుత దోదూయమాన మకర
కేతనము వాడు, రాచిల్క రౌతువాడు,
తేని యనుమాన మవమాన మైనవాడు
రూషితాంగుఁడు పల్కె నుక్రోష మంది. 569

సీ. పండుటాకులు దించు బ్రతుకు తాపసి యైన
నరవిందమున వాని మరుల ముంతు,
నాహారమును మాని నీహారముల నాను
మునులనైన నశోకమున జయింతు,
భౌతికంబుల వోని వల్కలాజిను లైనఁ
జూతంబు వేతునా సురత మంటు,
నాజన్మబ్రహ్మచర్యానువర్తను లైన
నవ మల్లికను గొట్టి నలుతు మరుల,
తే.గీ. ఊర్ధ్వ రేతస్కుఁడైన నీలోత్పలమున
బంటు గావలెఁ గాదె నా వింటి ముందు;
మున్ను సతి నేలుకొనె గాదె, ముదిత తలపుఁ
గలుగఁజేయుట యేమంత కఠిన మధిప ! 570

కం. ఆశీర్వదించి పంపుడు,
ఈశుని కల్యాణఘడియ కేతెంచుడు మీ
రాశించు ఫలము దక్కును,
క్లేశంబులుఁ దొలగు నంచుఁ గేళుల్ మోడ్చెన్. 571

ఉ. దేవత లంత కంతునకు దీవెనలం గురిపించి, పోయి ర
మ్మో వలరాజ, స్వర్గమున కూపిరి వోయు మటంచుఁ బల్కి, రా
భావజుఁడుం బరాక్రమవిపశ్చితదర్పసమృద్ధబంభరా
రావము లగ్రభాగమునఁ గ్రాలగ సాగె హిమాద్రిఁ జేరఁగా. 572

***ఇది శ్రీవాసవీపురాణమునందలి గిరిజాశంకరులఁ గూర్చ మదనుని ప్రయాణమను ఇరువదినాల్గవ అధ్యాయము సంపూర్ణము.***

(అసపుడు= రాక్షసుడు, ముసించు= చెడు, ఆస్థ= ప్రయత్నము, ప్రమ= యదార్థజ్ఞానము, గట్టుదాయ= ఇంద్రుడు, సాధ్విపాళి= పతివ్రతల సమూహము, విద్విషుడు= రాక్షసుడు, విపశ్చిత= చదివిన)

## ఇరువది యైదవ అధ్యాయము

**కం. అతులిత కరుణా విచలీ**
**కృత దుష్కృత భక్త పాల ! కృత దివ్యాలం**
**కృత మానస పరిజన నుత !**
**నత లౌకిక తత్త్వలోక ! నలినజ వినుతా !**

పంచ చామరము.
మునీంద్రుఁ డింపు మీరఁ బల్కు మూలగాథ మధ్యలో
మనోజదర్ప మాలకించి మాన్యవైశ్య లాత్రతన్
వినీతుఁడై తపించు వాఁడు వేల్పుటౌజు ముందటన్
వినమ్రుఁడై తపించెనే కవీ వచింపవే యనన్ ! 573

కం. నుడివెడు కథ నడుమ నడుమ
వొడమెడు తడుముడులఁ గడపు బుడముల నడుగన్
కడివెడు పసిడిఁ బడసినటు
లెడద కడిమి నుడువఁ దొడగె నినుమడి మునియున్ ! 574

తే.గీ. దేవకార్యార్థ మింద్రుండు దివిజతతుల
జయజయధ్వానముల మధ్య, శంభుదీక్ష
పార్వతీవరణార్థమై పరఁగఁ జేయు
మంచుఁ బుత్తెంచ, మదనుండు మంచి దంచు. 575

సీ. తుహినార్ద్రమారుత దోదూయమానుఁడై
మకరాధిపుఁడు మేను మఱచి క్రాల,
మధుబీజముల మెక్కి మత్తుగా తూఁగాడు
కీరసముదాయంబు కెరలి సాగ,
పుండ్రేక్షుచాప త్రిపుండ్రేక్షణం బుండి
బాణపంచక మొక్క బారు తీర,
భ్రమరటంకార విభ్రమరథాంగవిముక్త
సురభూపరాగంబు సుడులు రేగ,
తే.గీ. మరులు పులుముచు ముందుగా మార్గమెల్ల
సంత పఱచుచుఁ జనగ వసంతుఁ డెలమి
పరమయోగంబు నందున్న పరమశివుని
కనులు తెఱిపింతు ననుచు నాగడముఁ బూని ...... 576

కం. అమరసఖులు వీడు కొలుప
నమరిన గరిమపు తురాయి నతివకుఁ జూపన్
తమికొని యిలుఁ జేరి సతిని
సమరంబున శివుని గెలువ సమ్మతి వేడెన్ . 577

వ. అంతట న య్యనంతసృష్టిస్థితిదక్షయగు రతిదేవి పతి వచనంబులఁ గడుం
గడు వెఱఁగంది – 578

శా. నీవేమీ, పరమేశుతోడ రణమేమీ, వైర మెట్లేర్పడెన్ ?
గ్రావంబద్ది, మృణాళ నాళమిది; నీ కాయంబ దేమైన వ
జ్రావిష్టంబె ? సమస్తవిశ్వరచనా యజ్ఞాభినీతాభవున్
భావోత్పన్నుఁడ వీవు గెల్వ గలవే పంచాశుగా ? పల్కవే ! 579

సీ. ఏమాయె దక్షుండు యీశానుఁ గాదని
యజ్ఞం బొనర్చిన యాపనమున ?
ఏమాయెఁ బరమేష్ఠి యీశానుఁ గాదని
రక్తి మున్గిన యపరాధమునకు ?
ఏమైరి రంభాదు లీశానుఁ గాదని
తాపసేంద్రుల జార్చు తప్పిదమున ?
ఏమాయె సురనాథుఁ డీశానుఁ గాదని
భోగంబులం దేలు బుద్ధి కతన ?

తే.గీ. ఏమి కావలె ననుకొంటి వీశు నోర్చి
మరలి వత్తువె, పోవద్దు, మాట వినుము;
తలకు మించిన కార్యంబుఁ దలపఁబోకు
మో రమామానసకుమార! మూరిఁబోకు. 580

ఆ.వె. అనుచు నచ్చుఁ జెప్పు ననుకూలవతిఁ జూచి
మదనుఁ డతిశయమున నదురు పడక
నింతి ననునయింప నింపైన పల్కుల
ధర్మబోధ యనఁగఁ దరకటించె. 581

కం. దేవ బ్రాహ్మణ గోగణ
సేవాధర్మంబుఁ దప్పి జీవించుటయున్
జీవించుటయా సఖియా !
జీవించెద దివిజలోకసేవార్థంబై . 582

ఆ.వె. మంచిపనికి మేను వంచి నిల్చెడువాని
మంచిదంచు మెచ్చి పంచవలయు,
వంచరాదు తప్పు లెంచిచూపుచు వాని,
నంచితంబు శ్రమనుఁ బంచుకొనుట. 583

కం. అనుమాన మదేల మగని
పనితనమును నమ్మరాదొ పడతీ రతి నీ
కనికరము కలిగె నేనిన్
పనిచెద శివునైనఁ బడతి పయ్యెదఁ బట్టన్ ! 584

ఉ. ఏయెడ జన్మమొంది మన మింతటి వారలమై చరింతుమో,
ఆ యెడ శత్రుహస్తగతమై పరపీడితమై కృశింపగన్
న్యాయమె స్వార్థచింతనము ! నష్టమునై వెనుదీయ వచ్చునే?
పాయుదుఁగాక ప్రాణములఁ బాయను బాధ్యత వెంటరమ్మికన్. 585

కం. అని మదనుఁడు పలుకుటఁ గని
మనమునఁ గళవళ పడి సతి మగఁడిక వినడం
చునుఁ దనకునుఁ జనుటె యుచిత
మనుకొని తడబడుచుఁ బలికె నాత్మేశునితో. 586

ఉ. నీ వెనువెంట నుందునని నిశ్చయముం బ్రకటించి నాడు, నే
డా వడి నొంటి వీడ నిను నైదువఁ గానొకొ ప్రాణనాథ ! ము
న్నావిధి హెచ్చరించుటన నాలిగ నావిధి చొప్పు, నీకు నా
భావము నచ్చుకున్న పద, భంగము సేతము భర్గయోగమున్ ! 587

చం. అని వెనువెంట రాగ రతి, హైమసుమావృతరథ్యముల్ విమో
హనముగ మోహరింపఁ జనె నంగజుఁ, డంత వసంతమంత్రణం
బునఁ బుయిలోట లేక వెస భూతపతిన్ హిమవన్నగంబునన్
హనువు జయించి చిత్తమున హైమవతి న్నిలుపంగ బంటుయై. 588

కం. మనసిజు సంరంభముఁ గని
దనుజారిగణంబు లెల్ల ధైర్యంబున నా
వెనువెంట బయలు దేరిరి
కనుఁగొన సుమశరసమరసుగంధార్భటులన్ ! 589

సీ. హయహేష లవి చూడ నవ్యక్తమాధుర్య
మృదు నిస్వనంబుల మేళనములు,
కేతనంబది నక్ర కించులు కోత్పాత
పటపటాత్కార దిగ్భ్రమకరంబు,
ఛత్రంబు శశముక్త చంద్రోపమానంబు
తపనాతపవిదాహ తారకంబు,
వందిమాగధులు గోర్వంక కోకిలములు,
వేదఘోషను చేయు భృంగపాళి,

తే.గీ. మనసు మధుకోశ మొనరించు మాధవమున
సమరసన్నాహమునుఁ జూచి చకితులైరి
ప్రణయమా లేక ప్రళయమా పంచశరుని
రధము పొనరించు లక్ష్య సంరంభ మంచు ! 590

తే.గీ. అటుల మదనాంగ చతురంగపటలి కదలి
రజతగిరి నెల్ల ముంచెత్తి రాయిడింప
శిలలు సుందరులై వన్నె చీరలూన
గిరికిరీటము పచ్చల గేహమాయె ! 591

సీ. బొట్టుబొట్టుగరాలు పూదేనెలం ద్రావి
మోవి పంచమమీను మావితరులు,
ఏలాలవలికల తీవ పందిళ్ళపై
కురువిందతరు పుష్పగుచ్ఛతతులు,
చందనకోటర సర్పమండల భుక్త
శేషానిలముల విశేషణములు,
నిలువెల్లఁ జిరునవ్వు లొలయు చేతుల జారి
సడిఁ జేయు విరులందు చంపకములు,
తే.గీ. మెట్ట దామర పూదేనెఁ బొట్టనిండ
మరుని మత్తెక్కఁ గీర్తించు మధుకరములు,
మొగలి తావులు, సురపొన్న పొగడ పూలు,
చైత్ర నందనముల మించె శంభు నెలవు ! 592

వ. అటుల తన పరివార పదక్రమణంబుల శృంగార రసాభిషిక్తంబై వెలుగొందు హిమవన్నగ శోభలం దిలకించుచుఁ దలయూచు మదనుం డం దగాధయోగాగ్ని మగ్నంబై మైనాకుంబలె నిశ్చలంబును జ్ఞానానందమయంబును విశ్వభావనంబునగు లక్ష్యంబుఁ గాంచి కన్నులు చెదురఁ జిత్తంబు తత్తరవడ మనంబున నిట్లు తలపోయ సాగె. 593

అష్టమూర్తి వృత్తము.
ఆహా యీతఁడ మహేశుండన ! సతీశుండు కాడో హరుఁడు నిన్నటి దాకన్ ?
దేహం బెల్ల వెలి బూదిం దిగిచి యత్మావబోధన్ స్థిరముగాఁ బవళించెం
బో హాశ్రీహరి! శరీరం బొడుపుఁ దప్పింపకోయీ! హొయలుఁ బంచి రచింతున్
వ్యూహంబున్, విరులముంతున్, యుగపదంబానురక్తుం బొనరుతున్ నిటలాక్షున్!
594

చం. అని యనిఁ జేఁ గడంగి మకరాంకుఁడు పంచగుణేక్షుచాప మె
త్తి, ననరాజికల్ దొడఁగి, తేటియ లల్లిన యల్లెత్రాటినిన్
గనులను దాటి వీనులనుఁ గ్రమ్మగ లాగి, సతీకటాక్ష సం
జనిత నితాంతతంత్రమున శంభుసమాధిని నాటె ధృష్టుఁడై. 595

మదన దర్ప వృత్తము.
బాణము గళముం దాకె నద్ది వాచెను నల్లగా
బాణము శిరముం దాకె నద్ది భాసిలెఁ దెల్లగా
బాణము జటలం దాకె నద్ది పాఱెను యేఱులై
బాణ మురమునం దాక బీట వాఱె శరీరమున్. 596

సీ. ఒక్క వ్రేటున చేతనౌఘంబు జతఁగూర్చు
మోహనమ్మున నూహ మొలవదాయె,
నాటెనా జగతినే నాట్యమాడించు యు
న్మాదనమున ముద్ర మారదాయె,
తగిలెనా లోకాలఁ దపియింపఁజేయు సం
తాపనమునఁ దాల్మి తలఁగదాయె,
తాకెనా తనువుల దాస్యంబుఁ జేయించు
శోషణమ్మున రక్తి సోకదాయె,
తే.గీ. నున్న దింకొక్కటే బాణ ముదియ గొనఁగ
రగులఁ దీసె నిశ్చేష్టాకరంబు మరుఁడు
వింట సంధించె నద్దాని వీనులాన
లాగి వదలెను శంభు లలాటమునకు. 597

ఉ. నీలసరోజకోశమది నిష్ఠురశస్త్ర మరుంతుదాస్త్ర మా
భీలవిరక్త భేదనము బిత్తలి బిత్తర వోవ నాటగన్,
కాలమయూఖముల్ కనలి క్రమ్మిన వా ముఖసీమ నెల్లెడన్
వాలిన తెప్పలం బ్రళయభాండము బ్రద్దలుగాన్ జలించెడిన్ ! 598

కం. ఆ లోచనములు రెండును
లోలోపల నుడికి యుడికి లోచూపున ది
వ్యాలాజ్యము గాగ నుదుట
నాలీఢాంబకకవాట మాయస్తంబై. 599

కం. స్థాణువు చేతనమై మై
ప్రాణము లైదుఁ గుదురుకొనఁ బ్రాతీపిక ని
ర్వాణాకృతిఁ దాల్చినదో ...
పాణింధమ కాలకూట భైషజ్యంబై ! 600

కం. విస్ఫోటంబయ్యె నయన
విస్ఫారము, కంటి మంట విస్ఫూర్జితమై
విస్ఫీతమదనభూతా
త్మాస్ఫాలన మంటు కొనియె నస్పష్టంబై ! 601

ఆ.వె. భగ భగ భగ మనుచు ఫాలనేత్రపు మంట
రేబవళ్ళకు మధ్య రేఖఁ జెఱపె,
ఖేచరులకు దిక్కు – భూచరులకు మ్రొక్కు –
గోచరింప దునికి దాచుకొనఁగ ! 602

చం. పనిచిన వేయి కన్నులునుఁ బ్రక్కన నిల్చిన రెండు కన్నులున్
పనఁటి మొగంబు లట్టు లురుబాహిరగోళవిచేష్టితంబులై
కనుకలిఁ దూలి బెగ్గడిల కంతుఁడు నిల్వున కాలి బూడి ద
య్యె ననిమిషామృతాశన మదెక్కడఁ జచ్చెనొ పాప మాయెడన్?! 603



ఉ. మంచికిఁ బోవఁ జెడ్డయగు మర్త్యుల కందు రమర్త్యకోటికిన్
మంచికి తావు లేదు కట! మాధవు సూతికి నైన శక్తికిన్
మించిన చేత చేటుకద ! మేలునుఁ గీడును లెక్క వచ్చునే
సంచితదర్పధూర్వహుల సైరణఁ దక్కిన వెఱ్ఱిచేష్టలన్ ! 604

***ఇది శ్రీవాసవీపురాణమునందు శివునిచే నంగజు నంగదహనమను ఇరువది యైదవ అధ్యాయము సంపూర్ణము.***

(మధుబీజములు= దానిమ్మగింజలు, ఆవిష్టము= ఆవేశమొందినది, అభినీత= న్యాయమైన, మూరిబోకు= విజృంభించ వద్దు, తరకటించె= తర్కించెను, హనువు= గంధ ద్రవ్యము, కించులుకము= మీది గాలి, యుగపదము= యుగళగీతము, నన నరాజికలు= పూల కత్తులు, మరుంతుదము= మర్మమును తాకునది, బిత్తలి= దిసమొల, ఆలాజ్యము= ఇంధనము, ప్రాతీపిక= ప్రతి కూలము, పాణింధమము= చీకటి, భైషజ్యము= మందు, విస్ఫారము= వింటి మ్రోత, విస్ఫూర్జితము= ప్రకాశవంతము, విస్ఫీత= బాగా వికసించిన, స్ఫాలనము= చఱపు, ధూర్వహులు= భారము వహించువారు)

# ఇరువది యారవ అధ్యాయము

**కం. సదమల మానస శుభకరి !**
**మదనోద్ధృత మానస ఘన మద సంహర్త్రీ !**
**మృదుపద సంచారిత ముని**
**హృదయాబ్జ విరాజితాక్షరీకృత తంత్రీ !**

కం. మదమణగిన మదనుని కథ
మది సుందరమయ్యు నసురుమద మడగింపన్
మొదటికె మోసము వచ్చెనె,
తుద కేమాయెను మునీంద్ర ధూర్జటి భృకుటిన్ ? 605

వ. అనుచు నాత్రంబున వైశ్యపుంగవు లడుగ మునీంద్రుండు నిట్లనియె. 606

కం. అట్టి భయానక దృశ్యముఁ
గట్టెదుటనుఁ గాంచి యక్ష గంధర్వాదుల్
చుట్టిరి దేవేంద్రుని గని
కట్టా యిట్టాయె ననుచుఁ గార్యాతురులై. 607

ఉ. ఇంద్రుఁడు నంత నబ్జభవు నెమ్మెయిఁ దోడ్కొని జ్ఞానఫాలనే
త్రేంద్రియకేంద్రసాంద్రఘనదృగ్దహనోద్ధతి శాంతి నొంద వా
క్చంద్రికలం ఘటించి శివశంకరు సన్నుతిఁ జేయసాగె ని
స్తంద్రమనఃపటుత్వజనితంబులు సొంగ సదాశివంబులన్. 608

శశికళ. శివ శివ శివ శశిధర శివయని మా
దివిషదు లనిశము సమధిక నియతిన్
భవహర నిను వినుతులఁ బ్రణవమహో
త్సవములఁ గొలుతుము గద సలిలశిఖా ! 609

శశికళ. మదనుఁడు సురగురుజన మథితుఁడు నీ
సదనమునఁ దనదు పరుసన తగదం
చుఁ దెలిసి పరహితమునఁ జొరబడెనో
పదలయకర దయ మనుపగఁ దగమో ! 610

తే.గీ. నీవు శాసించు విశ్వమ్ము నిలుపఁ దగిన
మదనుఁ డిట్లైన నెట్లు నీ మహిమ పొసగు ?
మమ్ము మన్నించి మనుపుమా మంగళకర !
లోకసంరక్షకా భక్తలోకపాల ! 611

చం. అని యొక వైపు దేవనివహంబులు శంకరు వేడుచుండ, హా
ఘనజఘనాగ్నిదీపక ! సుఖస్వనచోదక ! చూచుకోషకా !
యని యొకవైపు భస్మమున నాననముంచి రతీవధూటి భో
రున విలపించ సాగె ననిరుద్ధతనూభవపంకజాక్షియై ! 612

కం. సుమసాయకముల్ కఠినా
ద్రిమనోనికషోపలమున రేఖలు గీయన్
ప్రముదోదయమని తలచితి
వమరత్వము నంతమాయెనా మదనా ... హూ ! 613

కం. ఎందుకు యీ ముకురము లిం
కెందుకు మకరికలు కాటు కెందుకు కనులన్,
ఎందుకు వెన్నెల పోడుము
లెందుకు ప్రాణంబు మేన నేడ్చుట కేనా ? 614

కం. నేనును ననునై నేను
న్నానని నిన్ననిని నూన నానన్నానా
నూనానన నిన్నూనిన
నైన న్నానున ననూన నైనా నన్నా ! 615

శా. ఓయీ శంకర శంకలేదు నిను శంభో శంకరా యంచు నే
కాయంబున్ బిసివోదు శంక ... నిజమే; కాకున్న నిశ్శంక నీ
మాయానేత్రము విచ్చి కాముని దహింపం జాలుదే? దేవ కా
ర్యాయత్తున్ నిజమార్గగాహితహితాయత్తున్ భవత్కింకరున్ ! 616

కం. పైగా నీ సంసారము
నేగా నిలబెట్టఁ బూనె నీ యర్భకుఁడిం
తేగా కొఱగాని యెడల
పోగాలము దాపురించు పోకడ లరయన్. 617

కం. అపకారికి నుపకారము
నెపమెన్నక సేయువాఁడు నేర్పరి యనగా
నుపకారికి నపకారమ ...
విపరీతము నీకె తగుర విషధర వింటే ! 618

శా. ఐనా నిన్నని యేమి లాభ మభవా ? అర్ధాంగి నేనెంతగా
నో నీకీపని కూడ దంటి నయినన్ హోరాటఁ బర్వైత్తె గ
ర్వానీతాఘము వెంబడింప ననలం బాశించు పుర్వుం బలెన్
మీనాంకుం డసమాస్త్రశాస్త్రనికషన్ మిమ్ముం బరీక్షింపగన్ ! 619

శా. ఏలా గుండియ గుండ కాదకట ! మేనేలా హవిష్యంబు కా
దేలా ప్రాణము లంటియున్న విటు లిం కేముండె వైధవ్య మం
దేలా బభ్రువిభూషితాంగ నను మండింపం బరాకాయెనే;
నీలా నేనును నొంటిగా మనుట కేనేమైనఁ బాషాణమే ? 620

చం. బ్రతుకున నిచ్చ లేదు, జతఁ బాసిన పక్కికి వోలె వెక్కుచున్
బ్రతుకఁగ నిచ్ఛలేదు, రసభావ మపాయము కాగ నాతిగా
బ్రతుకఁగ లేను దేహమున, బాలను, నిన్ బ్రతిమాలు కొందు నా
పతివలె నన్నునుం గనుల భస్మ మొనర్చు ముదాత్తచిత్తతన్. 621



శ్లో. నమస్తేస్తు మహాభాగ విశ్వమంగళ శాశ్వత ।
అవ్యయానంద రూపాత్మా అనాథాం పాహిమాం విభో ॥ 622

శ్లో. సర్వోపనిషదా మర్థం చత్వార స్సకలాగమాః ।
న శక్నువంతి త్వాం స్తోతుం క్వాహం సర్వజగత్పతే ॥ 623

తే.గీ. అనుచుఁ బదపడి రోదించు నతివఁ జూచి
పాప మైతాల్పు పాపమం చోపికఁ గను
పాపలం దెఱచి కటాక్ష దీప కాంతిఁ
బఱపెఁ గాంతిఁ గోల్పోయిన పడఁతి నుదుట. 624

కం. అపరాధము సేయకయే
విపరీత క్షతములెట్లు విరిబోడిరా నీ
యపరాధ మేమి చెప్పుము
కృప మాలి దహింపఁ దగిన కృచ్ఛ్రంబరయన్ ?! 625

చం. అతని దహించుటన్నఁ దన హద్దులు మీరి చరించె నాతఁ డు
ద్ధతి నసహాయశూరుఁడను దర్పము మీరి తపంబు నున్న నా
మతమును లెక్క సేయక సమర్థ్యుఁడ నన్న యహంకృతిన్, జగ
ద్ధితమన నిట్టిదా గురుల దీవనలన్ వసియించు వారికిన్ ! 626

తే.గీ. ఇంద్రుఁ డధికారదాహరతేంద్రియుండు,
పదవిఁ గాపాడుకొనఁ దన పత్ని నైన
నొడ్డగల రాజకీయ తత్త్వోద్ధతుండు;
వాని పంపునఁ బ్రాజ్ఞుల వంచ నగునె ? 627

కం. బాధ్యతలు వీడి భృత్యుల
బాధ్యులఁ జేసెడు ప్రభువుల వర్జింప నగున్ ,
సాధ్యాసాధ్యము లరయక
బాధ్యతఁ దల దూర్చు వాఁడు వధ్యుఁడు గాడే ? 628

తే.గీ. అయినదేమో యయినది నీ యైదువ తన
మొల్లఁ బోనీను పుత్రి నీ యుల్లమార
నింద్రి యానుభవము లెల్ల నేలుకొందు
వాత్మభవు తోడ నౌరుల కనంగుఁ డతఁడు. 629

వ. అనుచు నుమామనోరమణుం డగణితకరుణావరుణాలయుండై వరంబుఁ గురియ రతిరమణి మణితగళంబుగ్రహణంబు వీడ మరణోత్తరణ మాత్మ మాత్రోప సర్పణంబగు ననంగు నంగసమాహరణంబునఁ బ్రాణసంక్రమణాకృష్ణ యగుచు నధర్వణు పదంబుల నుత్తమాంగం బుంచి. 630

కం. నిశ్చల తేజో స్థాణూ !
పాశ్చాత్య తమో విషాంబు పాన సహిష్ణూ !
ఆశ్చర్యము నీ మహిమము
పశ్చాత్తప్తను మహాత్మ పాలించు మనన్ . 631

తే.గీ. దైవసంఘంబు పారిజాతములు గురిసె,
ననిలుఁ డానందగంధంబు నలఁది కొల్చె,
ననలుఁ డధ్వరాహుతుల నర్చనలు సలిపె,
నలువ నలుముఖమ్ముల స్వస్తి పలికె నిటుల. 632

చంద్రకళ.
బాగు బాగు సదాశివ ! ప్రాణాప్రాణము లుండగ నొంటిమై
పోగు పోగున దాగొని దేహంబుం బొనరించెడు తత్వ మీ
వే గదా ! నను నూరక నిల్వం బెట్టుదు వంతియ బొమ్మగా
నీ గతిం గలుగుం గలుగండం చెన్నగఁ జేయఁ గలాడనే ? 633



చం. జగముల మేలుఁ గోరి నను సత్యపదోన్నతుఁ జేయుమా యికన్,
నగపతి యింటఁ బుట్టి నిను నాథునిగాఁ దపియించు చున్నదా
భగవతి దక్షపుత్రి, నిజపత్నినిఁ జేకొని తారకాసురుం
దెగ నరుకంగ జాలు సుతు దేవగణంబుల కిమ్ము శంకరా ! 634

వ. అనుచు సత్యలోకేశుం డీశుం బార్వతీప్రత్యయుం జేసి నిజలోకంబున కరిగినఁ బరమేశుండునుఁ దనచిత్తంబున సతీదేవిం దలపోయఁ దొడంగె. 635

***ఇది శ్రీవాసవీపురాణమునందు రతివిలాపమనెడు ఇరువది యారవ అధ్యాయము సంపూర్ణము.***

(జ్ఞాన ఫాలనేత్రేంద్రియ= జ్ఞానమనే నుదుటి కన్ను యొక్క, కేంద్ర సాంద్ర ఘన దృగ్దహ నోద్ధతి= దట్టముగా ఒకచోట చేరిన గొప్ప చూపుతో కాల్చుట యొక్క తీవ్రత, నిస్తంద్ర మనఃపటుత్వము= చొరవతో ముందుకు వెళ్ళే మనస్సుయొక్క గట్టితనము, సాంద్ర సదా శివంబులు= దట్టముగా ఎల్లప్పుడు శుభాలిచ్చేవి, దివిషదులు= దేవతలు, సలిల శిఖుడు= శివుడు, చూచుకోషకము= స్తనాగ్రముల వేడి, అనిరుద్ధ తనూభవ పంకజాక్షి= నిరోధించరాని ప్రేమ పంకంలో పుట్టిన పూవులవంటి కన్నులుకలది, ముకురములు= మల్లెపూలు, బిసివోదు= పట్టుదల వీడు, గాహిత= మునిగిన, హోరాట= ఆటోపం, కృచ్ఛ్రము= పాపము)

*ఏకాక్షర కంద వివరణం:*

నూన= ముందే నిశ్చయానికి వచ్చిన, ఆనన= ముఖం కలవాడా!
నిన్ను= నీ రూపార్థమును, ఊనిననైన= పొందినప్పటికీ
నేనును= నేను కూడా, ననౖనై= ఒక పూవునై
నేను+ఉన్నానని= నేను నీకు తోడున్నాని, నిన్ను= నీ దేహమును
అనిని= యుద్ధమునందు, నూనన్= నిశ్చయముగానుంచమని
ఆన= అనుమతిని, అన్నానా= చెప్పానా?
నానున= నీవుకట్టిన నానుత్రాటిచేతనే, అనూనన్= నిండుముత్తయిదువను
ఐనానన్నా= అయితినికదా! దీని బలమేమైనదో...

# ఇరువది యేడవ అధ్యాయము

**కం. కల్యాణాంచిత కాంచన**
**మాల్యాలంకృత విరాజమాన శుభాంగీ,**
**మూల్యాతీత మునిహృదయ**
**పల్యంక ప్రణవనాదభావ భవాంగీ !**

కం. రతి కోరికఁ దీర్చి జగ
త్పతి కోరికఁ దగిలెనా ! తపఃఫల మిదియా !
అతి చిత్ర మనుదు వైశ్యులు
శితికంఠుని తత్త్వమెల్లఁ జెప్పెను మునియున్ . 636

ఉ. 'ఎవ్వనిచే జనించు జగ మెవ్వని లోపల నుండు లీనమై
యెవ్వని యందు డిందు,' పరమేశు కృతంబున 'మూల కారణం
బెవ్వఁ డనాది మధ్య లయుఁడెవ్వడు, సర్వముఁ దానయైన వాఁ
డెవ్వఁడు,' వాఁడు కాడె పరమేశ్వరుఁడౌ పురుషుండు జూడగన్ ! 637

చం. అతఁడు జగన్నియంత, నియమార్భటి కందఁడు, నిత్యసత్యసం
స్థితుఁ డసమానతేజుఁ డపదేశకృషాణుఁడు, కాలకూటసం
శ్రితసితసుందరాధిపుఁడు, శ్రీఫలలగ్నమనోరథుండు, ని
ర్గతుఁడగు వాని సూక్తమున ఖండితసంశయులై చరింపరే ! 638

వ. అనుఁడు నవ్విధంబు వచింపుఁ డనుచు నవ్వైశ్యపుంగవులు బ్రార్థింప నమ్మహాత్ముండును నిట్లు వచింపఁ దొడంగె. 639

తే.గీ. ఎవఁడు లేకున్న లేకుండు నెల్ల సృష్టి,
ఎవని సంకల్పరూప మీ భువనపాళి,
పంచభూతంబు లైదింట సంచరించు
నెవఁడు, మూలకంబగు పూర్ణభవుఁడు వాఁడు ! 640

కం. తీసిన తీయని దగు నది
వేసిన వేసినది కాదు, వేయుట కైనన్
కాసిన కాయలకు తరమె
మోసెదు తరువునకు భారమునుఁ గల్పింపన్ ! 641

తే.గీ. వేల శిరములు, విశ్వంబు వీక్షణంబు,
వేల పదములు, విశ్వసంవిద్యమాన
వ్యాపకుం డతఁ డక్షరుం డక్షయుండు;
సకలమునుఁ జేర వలసిన సత్పదుండు ! 642

తే.గీ. పది విధమ్ముల దనకు దా బరిధ విల్లి
నిఖిలవిశ్వమ్ము నల్లుకొని యమనియమ
యోగబలమున బ్రాణ సంయోగమూని
సృష్టి పై నధిష్ఠించు వా డష్టమూర్తి. 643

ఉ. అన్నియు నాత డౌట నధునాతన మేల, పురాతనమ్ము రా
నున్న జగంబు లన్నియును నుఖ్యము లాతని మేని యింట, లో
నున్న చరంబు లన్నిటను నూరుపు లన్ని యమించ గల్గు ప్రా
ణోన్నతి కన్నమై దనరు నోజ నిజామృతతత్త్వ సంపదన్. 644

చం. కనులకు, కంటి పాపలకు, కారణ చర్చల గానిపించు నీ
యనితరసృష్టి యెంత వలయంబున నాలవవంతు మాత్రమే,
కనలని మూడుభాగములు కాంతిపరాఙ్ముఖ గుప్తమూర్తులై
త్రినయన కోశగర్భముల ద్రిమ్మరు నాల్గున కాత్మభూతమై. 645

కం. పుట్టుక గిట్టుకల వెనుక
గుట్టుగ నిదురించు పరమ గుహ్యంబగు నా
బెట్టు విరాడ్రూపంబై
రట్టగు నవసరము గల్గు బ్రాపంచకమున్. 646

ఉ. దేవతలా విరాట్పురుషు దేహము నన్నముగా నిగిర్చి యు
జ్ఞావగతిం గడంగ ఋతునాయకుడైన వసంతు డాజ్యమై
యావిరు లెత్తు గ్రీష్మఋతు వారిన కట్టియ కాగ హవ్యమై
పావకమౌ శరద్గుణ మపారమహాయజనాగ్ని వ్రేల్చెడిన్. 647

తే.గీ. ఏడు పరిథుల దేవత లేడు మూడు
ల పరిథుల సమిధల బేర్చి లాఘవముగ
పురుషు బంధించి రఖిల సంభూతి గోరి
యజ్ఞపశువుగ విశస నాయత్తు లగుచు. 648

తే.గీ. ఋషులు సాధ్యులు దివిజులు ఋత్విజులును
సవన పశువును దర్భల సంస్కరించి
హవ్య మొనరించి రయ్యెడ యజన విధుల
విస్తరణమున విశ్వ మావిర్భవింప. 649

ఉ. అందు సమృద్ధమైన పృషదాజ్యము నందున ప్రాణముల్ స్థితిన్
జెందగ నట్టి సర్వహుతచేతనచే వనజంతుజాలమున్
సుందరపక్షిలోకమును సుస్థిరజానపదంబులున్ విభూ
తిం దనరెన్ వసుంధర ధృతిన్ దరహాసవిలాసహేలగాన్. 650

కం. ఆ సర్వ హుతాధ్వర మం
దే సాగెను సామ లతలు ఋక్కులు ఛందో
శాసన యజస్సు లనబడు
భూసుర బాహ్యాంతరములు బూసిన వటుపై . 651

కం. పలు వరుస నొండు రెండుల
వెలసిన వజ గోగణాశ్వ వితతులు నందే
తలము ముఖము బాహువులే
తలమగు పాదోరువులగు తల మేదన్నన్. 652



కం. జ్ఞానులు ముఖమందున, భూ
జానులు బాహువుల యందు జానూరువులన్
వానీంద్రును జనియించిరి
బానిసలై శూద్రజాతి పదములఁ బుట్టెన్. 653

చం. తలపున జందురుండు గనుదమ్ముల సూర్యుడు నోట నగ్నులున్
ఫలకము నింద్రుడున్ పురుషప్రాణము వాయువు నాభి నభ్రమున్
సలిగగు శీర్షమం దమర సత్యజగద్విభవంబు బాదమం
దలఘువసుంధరన్ చెవుల నాశలు – కల్పవిభూతి యిట్టిదౌ. 654

మ. ఎవడీ సృష్టికి రూప మద్ది వివిధానేకాత్మసంకేతముల్
సవరించెన్, పురుషుం డతం డనుచు బ్రస్తావింతు రా నైకభా
గవతాఖ్యంబుల వాని, వార లెవరీ కల్పాంతముం జూతు రౌ
నవు బెంజీకటి కవ్వలం బరగు నా యాదిత్యవర్ణాకృతిన్ 655

ఆ.వె. ధాత పూర్వ మెవని ధర్మ ముదహరించె
శక్రుఁ డెవని గనె దిశా చతస్ర
మతని నాత్మ గాంచ నమృతమగు నిహము
వేరు దారి లేదు వేరు జేర.... 656

కం. ఏ యజ్ఞముచే దేవత
లా యజ్ఞపురుషుని బట్టి యజియించితిరో
ఆ యజ్ఞమె తొలి బీజము
నాయువు నీ యెల్ల జగతి కాధారమగున్. 657

కం. సృష్టి మొదలైన నాడీ
యిష్టిని గద నాటి సాధ్యు లిద్ధాస్తికులై
పృష్టేష్టావిష్టరమణ
శిష్టత సాధించి రమరచేష్టాంగణులై. 658

చం. జలమును భూమి సారమును జాగృతి నొందగ బుట్టె బూరుషుం
డలిపిరి విశ్వ నిర్మితికి నాదరు వా పరమాత్మ, యెల్లెడల్
నిలిచెడు నట్టి విశ్వజననిన్ వెలయించె దనంత దానుగా
తొలుతటి రూపమం దధికధూతము త్వష్టగ జీవధాతువై. 659

చం. జగముల సృష్టిజేయగ బ్రజాపతి గర్భము జొచ్చువాడు, ము
జ్జగముల జన్మ లేకయును జన్మల నెత్తుచు నుండువాడు, స
న్నిగమనిరూఢి విజ్ఞుల మనీష రహించు రహస్య మాతడా
భగవు మరీచికాపథము భావన గాంచెద రాత్మసాధకుల్. 660

సీ. ఆది యందెవ్వాని నాదిత్యు లధ్యాత్మ
సాధనం దమయందు సంగ్రహించి
రాది మధ్యాంతంబు లన్నియుం దానౌచు
నెవ్వాఁడు సర్వహుతేష్టి నొందె
నా దివ్యు నాదిత్యు నా త్ర్యక్షు నా త్వక్షు
నా సర్వ చేత నాహంకృతి వెల
యించు చేతల కర్థ మీయదా - యెరుగ నే
నెంత వాఁడను వైశ్య దాంతులార !

తే.గీ. ప్రజ నదృశ్యాంగుఁడై ప్రజాపతులఁ జేయు
టనువు, సృష్టి శీఘ్రంబగు ననుచు నేమొ;
మదను నారీతిఁ బ్రోచి తా మదను బారిఁ
బడెను పరమేశ్వరుఁడు, తాను పరముఁడయ్యు ! 661

తే.గీ. అనుఁడు నా వైశ్యబుషు లంత నాత్మఁ దొలుచు
సందియం బొందుఁ బ్రకటించి రందు తొలుత
పురుషుఁడే స్వయంభువు గాగఁ బుట్టెనేని
దేవత లెపుడు పుట్టిరో తెలుపు మనిరి. 662

కం. కథకుఁడు నది విని ముదమున
ప్రథమము నందున్న దేవ భావములకు గో
పథముల వినిచెను విణ్మని
కథంకథికుల మది సదవగాహము గలుగన్ . 663



భాస్కరవిలసితము.
తూరుపు కడుపున భాస్కరబింబోద్భూతి సమయమునఁ బొడచెడు రేఖల్,
సౌరకిరణముల ఛాయలు గావే ! సత్పురుషుని భవమునకును రాదే
ప్రేరితదివిషదసప్తక మాదిన్ బ్రీతిని సలుపగ నతనికి సృష్టిన్ !
వారును నతని విరాడ్వదనాంశల్, ప్రాకృతభవముల దెలియగలేరే !? 664

కం. తొలి దేవతలు ప్రకృతి శ
క్తులు, వైదికములు, మహాకృతులు, నైరూప్యం
బులు, సత్‌శివసుందరభవ
ములు; జగదుద్ధరణయజ్ఞమున యాజ్ఞికులున్. 665

ఉ. అంతయు నొక్క శక్తి, వివిధాకృతు లందురె ... దాని మాయ ల
త్యంతనిగూఢపాత్రికము లయ్యవి - కన్గొన నెంచు వార లా
వంత నిజమ్ము నేర్చినను వంచనఁ దప్పి మనీషు లౌదు రం
దంతయు నేర్చుటన్న పరమాత్మ గృహంబునఁ గాలు వెట్టుటే ! 666

చం. కనుక కిరాటులార, సుమకార్ముకుజేతకు గౌణదోషముల్
సొనపకుఁడయ్య, పౌరుషము చొప్పు నెరుంగ వివేకశీలురై
జనుఁడు, మహాత్మచేష్టలవి చాల విచిత్రములంచు నెంచుడీ !
అనియె మునీంద్రుఁడూరుజుల కాదరమొప్పఁగఁ బ్రాడ్వివాకుఁడై. 667

***ఇది శ్రీవాసవీపురాణమునందు పురుషసూక్తమను ఇరువదియేడవ అధ్యాయము సంపూర్ణము.***

(కృషాణుడు= సేద్యగాడు, సంశ్రిత= ఆశ్రయింపబడిన, పృషదాజ్యము= పెరుగుతో కూడిన నెయ్యి, దిశాచతస్రము= నాలుగు దిక్కులు, వానీంద్రు= వైశ్యులు, సలిగ= ఆశ్రయము, ఇద్ధాస్తికులు= పరిశుద్ధమైన శ్రద్ధగలవారు, పృష్టేష్టావిష్ట = యజ్ఞమున ఆవేశమునొందిన, అలిపిరి= అల్పశరీరము గల, గోపథములు= వేద మార్గములు, విణ్మని= వైశ్యముని, కథంకథికులు= అదియెట్లని ప్రశ్నించువారు, గౌణ= ముఖ్యముకాని)

## ఇరువది యెనిమిదవ అధ్యాయము

**కం. మనుజేచ్ఛావరదాయిని !**
**దనుజేచ్ఛాహృతిని ! మనుజ దనుజాంశాసం**
**హననోద్యోగవిలాసిని !**
**జననమరణతత్త్వభావ జననీ వాణీ !**

కం. ఖండిత సంశయులై బ్ర
హ్మాండానందాంబు శుద్ధమానసులై గో
మండను లంతట మునివరుఁ
గొండాడిరి వైశ్యగాథఁ గొన సాగింపన్. 668

ఆ.వె. కథకు నంతరంబు గ్రహియింప గల శ్రోత
లమరుటన్న నద్ది యరుదు గాదె !
శ్రోత దొరకి నంతఁ గైతగాఁ డాగునా
కథ వచించె నంతఁ గౌతుకమున. 669

ఉ. బాతళ నొక్కనాడు భగవానుఁడు నారదుఁ డాత్మచేతనా
వేతనుఁ డోఁజఁ జేరుకొనె ద్వీపము శ్వేతము దుగ్ధసింధుసం
జాతము సిద్ధచారణనిశాంతము నందసనందనాదిసం
ఘాతసనాథమున్ భుజగఖట్వవిరాజితవిష్ణువాసమున్. 670

మ. పరమాశ్చర్యకరంబు మౌనికుల సంపాద్యంబుఁ బ్రాకామ్యమున్
సురసంచారముఁ గోటిసూర్యకిరణస్థూణస్థశుద్ధాంతమున్
పరిశుద్ధామృతకోటిచంద్రకిరణప్రాకారపక్షాంతమున్
స్థిరసంకల్పముఁ జేసి కాంచె నచటం జింతామణీసౌధమున్. 671



శా. ఆ వైకుంఠపురంబులో నగరిలో నా మూల సౌధంబులో
లావై రత్నవితర్దిపైఁ గుదురుమై లక్ష్మీవిలాసాంకమై
కైవల్యాస్పదమై ప్రసన్నమగుచుం గైసేయు సింహాసన
స్థావిష్కారు దయామయున్ గనియె నుద్ధర్త్రగ్ర నారాయణున్ ! 672

సీ. శంఖచక్రగదాది శస్త్రంబులం దాల్చి
సకలలోకంబులన్ సాకువాఁడు
కటక హార కిరీట కనకాంబర విభూషి
తాంగుఁడై వెల్గొందు యందగాడు
కన్నులా కమలాలు కనుబొమల్ హరివిండ్లు
చిరునవ్వు దొంతరల్ చిలుకువాఁడు
పాపనాశకుఁడు సంతాపనాశకుఁడు స
ద్భక్తబృందావన పాలకుండు,

ఆ.వె. మోక్షదాయకుఁడు ముముక్షుసేవితపాద
పద్మయుగ్ముఁడైన పద్మనాభుఁ
జూచి శిరము వంచి స్తోత్రంబుఁ జేసె నిం
పార మహతి మీటి నారదుండు. 673

శ్లో. నమస్తే వాసుదేవాయ హృషీకేశాయతే నమః ।
నమస్స్వాధ్యాయ బీజాయ పరమాత్మ న్నమోస్తుతే ॥ 674

ఆ.వె. నారదస్తుతులకు నారాయణుఁడు మెచ్చి
వచ్చిన పని నెఱిఁగి వల్లె యనుచు
చెల్లి గౌరి పెండ్లిఁ జేయింపఁ దలపెట్టి
ముదల యొసఁగె నంత మునికి నిటుల. 675

మౌక్తికమాల.
శీఘ్రమె పొమ్మోయి శివునిఁ జేరన్
వ్యాఘ్రవిహార్త్రీ నియతుని జేయం
గా ఘృణి సంధింపఁగ; మనుమా వై
యాఘ్రధరక్రోథయమివి నీవై. 676

ఉ. ద్వాదశదీర్ఘవర్షములు దారుణమైన తపస్సు తోడ నా
సోదరి గౌరి దస్సినది సోమసుమార్చిత సిద్ధ యోగికై
ఖేదము నొందుచుండె మది, కీర్తి వహింపుము క్లేశనాశివై ;
చేదును మార్చి కంఠమున శీధువు నింపుము పొమ్ము నారదా ! 677

కం. హరివచనమున ముని కదలి
సురగణముల హితముఁ గోరి సుముహూర్తమునన్
హరుఁడున్న యున్నతోన్నత
గిరిశిఖరముఁ జేరుకొనియె గిరిజార్థంబై. 678

సీ. తామరతూండ్లనందగు చంద్రకిరణాల
వలె దేహకాంతులు వఱల దిశల
కట్టిమబ్బును బోలు నిట్టితోలును జుట్టి
యేణాంకువలెఁ గనుపింప నిశల
తొగరుటాకులఁ బోలు తొలి ప్రొద్దు కెంజాయ
జటధర్మవటి వోలె జగతిఁ గ్రాల
మహతి మీటిన స్వచ్ఛమాలఁ బొంగెడు నీట
కరకంజమకరందగంధ మురల
తే.గీ. కై మృణాళనాళములను కంకణముల
నాగభూషణు వలెనున్న నారదుండు
ఈశు దర్శించి స్పర్శించెఁ గ్లేశహరము
హ్లాద మీప్సితప్రదము నా పాదయుగము. 679

వసంత తిలకం.
ఆనందబాష్పజల మర్చనఁ బాద్యమై, భ
క్త్యానందవీక్షణ సుహాసిని చందనమ్మై ,
సూనమ్ములై మృదువచోరస సన్నుతుల్, వీ
ణానాద మొప్పెను వినమ్రనివేదనమ్మై ! 680

తే.గీ. సంయమీంద్రియ పూజాప్రసాద మనఁగ
భవుఁడు గనులెత్తి నారదుఁ బలుకరించె-
నీవు మునుఁగ నే తీర్థముల్ నివ్వటిల్లె
నొప్పె నే దేశముల్ చూడఁ జెప్పు మనుచు. 681

ఆ.వె. అంత నారదుండు నంతకాంతకు పల్కు
లందు పొంగు డెంద మందు పల్కె
గంగ మునిగి హిమనగాధిపుఁ గాంచితి
నంచు నపుడు భవుఁడు నడిగె నిటుల. 682

ఉ. చూచితె యెందునైన గుణసుందరి సుందరి సూనృతాస్య స్వ
ర్లోచనఁ గంబుకంఠినిఁ ద్రిలోకశుభంకర మంద హాసినిన్
మేచకదీర్ఘకేశినిని మేని కడాని యొయారినిన్ వివా
హోచితమత్తకాశినిని యో భువనాటనలోల చెప్పుమా ! 683

తే.గీ. ఆడబోయిన తీర్థ మెదురాయె ననగ
నుబ్బి తబ్బిబ్బుపడు నారదోత్తమాంగ
మతివ యందాలు వర్ణింప నడలి పోయెఁ
దుదకు నారాయణీమూర్తి మదికిఁ దోచె. 684

వ. అంత దేవర్షియుఁ దన మదికిం దోచిన హైమవతీచిత్రంబును రజిత గిరీశుని యరమోడ్పు కన్నులఁ గట్టు నట్టుల వర్ణింపసాగ నతండునుఁ దనలోని భావప్రభావచిత్రంబునకు సరి జూచికొంచుఁ దలయూచం దొడంగె. 685

ప్రియకాంత.
వలెనె మహేశా విను హిమవత్పుత్రిక నీకై
కలదు వివాహోచితమగు కాంతామణి నిన్నే
వలచి తపో మార్గమున శివా యంచు జపించున్
కలికితనంబుం బరువము కంజాక్షియుగంబై ! 686

ఆ.వె. ఆమె తనువుకాంతి యఖిలాండసంక్రాంతి
కురులనీలివన్నె సిరులమిన్ను
చన్నుదోయి తెన్ను సరసాంబుధుల చెన్ను
కలికి ముద్దుగుమ్మ గట్టుకొమ్మ ! 687

ఆ.వె. ఎవఁడు పొగడగలఁడు హిమరాజసుత మేని
యందచందములను గందువమును
వేయితలల నొక్కవాయి లేవదు చూడ
వేల్పుగురుని మాటఁ దెల్ప నేల ? 688

మ. ఇక నే నెంతటి వాడ నామె తెలుఁగున్ నీముందు వర్ణింప నో
మకరాంకాంతక ! నీ వెఱుంగని నిజంబా యేమి? నా చేత నూ
ఱకఁ జెప్పింతు విదేమి లీల ప్రభు ! సుత్రామోన్నతిం గోరి మే
నక పుత్రిన్ గ్రహియింపు మయ్య, హరియాన న్నివేదించితిన్. 689

వ. సాంగుఁడై సాధింపలేని మదనుం డనంగుఁడై సాధింప నెంచెనో యన దేవర్షి వచ్చి వెడలిన వెన్కఁ బరమేశు సర్వాంగంబులఁ దపంబు తాపంబై భావంబుల శృంగారం బావేశింప మనోఫలకంబున మహీధరాధిపుకన్యకామణి నిశ్చలచిత్రం బొక్కచో నిలువనీయదాయె! 690

సీ. రజతాచలాగ్రాన రాలలో రాయైన
స్థాణువులో గుండె చలనమొందె
యోగసమాధిలో యుగములు గడపిన
సిద్ధపురుషుధృతి చెదరిపోయె
మదనబాణము సోకి మంటలుమ్మిన కంట
జంటకై మదరేఖ లంటసిల్లె
స్మృతిగహ్వరము నుండి సతి తోడి శృంగార
చేష్టావిహారంబు చెంగలించె

తే.గీ. సతియుఁ బార్వతి యొకరను సత్య మభవు
తలపులో చేర లేదింక, తరుణి చింత
యింత యింతింత నంతంత నంతరంగ
మంత నాక్రాంత మొనరించు నంత పెరిగె. 691



తే.గీ. మాటిమాటికి మదవతి మాట దోప
మనిషి కుదురుగఁగూర్చుండ నునికిఁ దప్పి
మదనపాశము బిగిసిన మదనవైరి
కానఁ బోయెను తుహినాద్రిసానువులకు . 692

తే.గీ. కనులురెం డొక్కటైనట్లు కనుల నడుమ
బొట్టు కనుతీరు చుట్టు విభూతి వరల
నాననంబెల్ల కన్నులైనట్లుఁ దోచె
నతివ పొడఁ గాంచ గాలించు హరుని జూడ ! 693

తే.గీ. అటులఁ దిరుగాడు చుండగా నిటలనేత్రుఁ
డక్కజంబున నొక చెంతఁ జిక్కు వడియెఁ
గనులు మూడైన నేమి యా కంజయుగళ
నిగళబద్ధంబులై యట్లె నిలిచి పోయె. 694

ఆ.వె. వేయిమంది సఖుల దోయిలింతలమధ్య
పూజకొఱకు పత్రపుష్పములను
సేకరించు నట్టి శీతాచలతనూజ
శివుని కంటఁ బడియె శీతవేళ. 695

ఆ.వె. ఆమెపూజ లా మహాదేవుని వరింప
నామెతలపు లీశు నావరింప
నాతఁ డీతఁడే సుమా యంచుఁ దెల్పెడు
వాఁడెవండు మదనుదాడి ముందు ! 696

***ఇది శ్రీవాసవీపురాణమునందు నారదసందేశమను ఇరువది యెనిమిదవ అధ్యాయము సంపూర్ణము.***

(బాతళ= తడబడు, ఖట్వ= మంచము, స్థూణస్థ= స్తంభములకు నెలవైన, వైయాఘ్రము= పులితోలు కప్పిన రథము, స్వచ్ఛమాల= స్ఫటికమాల, ఆవిష్కారము= ప్రకటము, ఘృణి= వెలుగు, సుత్రాములు= దేవతలు)

# ఇరువది తొమ్మిదవ అధ్యాయము

**కం. వందిత వైశ్యజనార్ణవ !**
**నందిత నిగమార్థనిధిగణప్రతిపన్నా !**
**చందనచర్చిత తనుయుగ**
**బృందారకబృంద భావబిందూద్ధర్తా !**

కం. అనవిని వైశ్యమునీంద్రులు
మునివర వలిగట్టుపట్టి ముఖముకురమునన్
కనపడెనె శివుని రూపము
వినిపింపు మనగ మునియును వేడ్కం బలికెన్. 697

కం. సూనాదులఁ గోసి యంత
స్నానాదులు జేయ నేగె నగరాట్సుతయున్
మానసమున భవుని నిలిపి
మానసకాసారమునకు మంగళగతులన్ . 698

చం. చెలులను గూడి గౌరి సరసిం జలకమ్ముల నాడ నద్ది యా
లలనల మోములెల్లఁ గమలంబులుగాఁ జిరునవ్వు లంచలై
కలువలుగాగ నేత్రములు కాల కచావృతి నాచుకాగఁ జూ
డ్కులును బ్రవాహమై కుచనికుంజము జక్కవలై విరాజిలెన్. 699

చం. అది యెటులున్న దన్న దనుజాంతకు జన్మకు క్షేత్రశుద్ధికై
హ్రదమునఁ బొంచియున్న సురరక్షకశక్తి సముచ్ఛయాత్మసం
పద సమయం బెఱింగి మనుపన్ ద్విగుణీకృతభాగ్యశాలియై
ముదమును గూర్చు చున్నటుల ముగ్ధకు పర్వతరాకుమారికిన్ ! 700

ఉ. మానస మట్టహాసముల మానినులన్ రసవార్ధిఁ దేల్చ న
మ్మానినులున్ యథోచిత మమాసుదతిన్ ప్రియమార రక్తిఁ జే
బూనిరి యట్టహాసములు భూనభముల్ దశదిక్కులుం బ్రతి
ధ్వానము సేయ నొండొరులు భవ్యజలంబులఁ జల్లుకొంటలన్. 701

ఆ.వె. ఒడలు డస్సినంత యువిదలెల్ల కొలని
యొడ్డుఁ జేరి చలువ యుడుపులందు
మేలు జక్కదిద్ది మేనకాతనయకు
కట్టు బొట్టు దిద్దఁగడఁగి రపుడు. 702

తే.గీ. వినయసంపన్నుఁ డగువాని విద్య వోలె
దేహమున మణిభూషలు తేజరిల్ల
చంద్రికాకోమలాంబర సంభృతాంగి
నుదుట కస్తూరి ధరియించె ముదిత గౌరి ! 703

చం. పరిమళశోభితేందుముఖి పార్వతి యంత సురాపగాతటో
పరిసికతా మయంబగు నభంగశివాకృతి లింగరూపమున్
పరిచితపల్లవాంగుళుల భద్రమొనర్చి సమర్చనమ్ములన్
పరమశివున్ భజించె నిటు భక్తిసమంచిత చిత్తసంస్కృతిన్. 704

కం. త్ర్యంబక నమస్కరించెద
నంబక కోణాంతరంగ మందున నను నం
దంబుగ ధరియింపుము గో
త్రంబున కానంద మొదవ రాగావధివై ! 705

కం. నను నీ కర్పించితి నా
మనుగడ నీ కంకితంబు మహదేవా నీ
యనుమతి దయసేయుము కా
దనకుము నా ప్రాణములను దర్పణఁ జేతున్ . 706

పంచ చామరము.

విరించిసంచితప్రపంచవీక్షణేందుసుందరా
వరించితిన్ స్మరించితిన్ భవత్ప్రభన్ భజించితిన్
చరించు చుంటి సంతతం బచంచలాత్మజాతనై
హరించ రార నీకు నాకు నంతరంబు ఈశ్వరా ! 707

తే.గీ. ఇటులఁ బలుమారు పరమేశుహృదయ మలరు
నటుల వీణియపై గాన మాలపింప
రాలు కరగినవట మృగజాల మలరె
నెదుట మ్రోడులు చిగురించె నింపు మీర. 708

చం. లలితరసాలపల్లవకలాపకరాంగుళు లల్ల నల్లఁ దం
త్రుల నటియింపు చుండ ఘనతుంబిఫలాశ్రితకుంభికుంభవ
త్కలశకుచాగ్రవీణియకుఁ గాఁగుచు నర్ధనిమీలితాక్షులున్
చెలిమి ఘటింపఁ జూడ మది చెందును మోహనమాధురీసుధల్. 709

ఉ. ఆ జగదేకరూపరసమానిన శంకరుఁ డింక నెంతయున్
నైజము నోపలేక నిజనామ గుణాదులఁ గప్పిపుచ్చి ని
స్తేజపు వృద్ధ విప్రునిగ దేహముఁ దాల్చి వధూనికాయమున్
పూజ యొనర్చు తావు జని పూనిక నిల్చెను బల్కరించగన్ . 710

వ. అంత నా సారస లోచన లందు రసభంగమై . 711

సీ. మూరెడు మీసముల్ బారెడు గడ్డమ్ము
మడమల జీరాడు జడలదయ్య
మెండిపోయిన కాయ మెల్ల బూడిదపూత
నడుముఁ జుట్టిన చింకి నారపోగు
నివురుకప్పిన నిప్పు నిటలాక్షమున చోటు
ఒంటిపై వ్రేలు నూలొంటి పేట
దండి కమండువుల్ దండుగమారి మో
త యనఁజాలు కపటితనము కనుల

తే.గీ. చూడ రోతయు భయమును జుట్టుముట్ట
బెదరి పోయిన సఖియలు చెదరిపోవ
నచలమైనట్టి ధైర్య హిమాద్రి గరిమ
నగజ తలవంచి ప్రార్థించె నతిథి నిటుల. 712

తే.గీ. బ్రాహ్మణోత్తమ నీ రాక పావనంబు
పాంథజనసేవ మాకు సౌభాగ్యపథము
రండు దయసేయుడయ్య విశ్రాంతి గొనుఁడు
కరుణఁ గొనుఁ డర్ఘ్యపాద్యాదిగౌరవముల. 713

వ. అనుచు నయ్యింతి సఖులఁ జేరబిలిచి సకలవిధ పూజోపచారంబుల
నభినుతింప నక్కపట బాపండునుఁ బ్రసన్న వదనుండై. 714

తే.గీ. మంగళాంగిరొా సకలసన్మంగళాని
భవతు ! ఇష్టార్థఫలసిద్ధి వరమునిత్తు
నెవరి కూనవె యేయూరె యెందుకింత
కఠిన నియమానురక్తి యో కమల నయన ? 715

కం. అని యడిగిన భూసురునకు
తన మనమును దెలుప సిగ్గు తరుముకు రాగా
వినయమున మిన్నకుండిన
చనవును గొని చెలి యొకర్తె చరితము దెలిపెన్. 716

కం. అయ్యా యిది హిమగిరిసుత
యియ్యింతిని గౌరి యంద్రు యీశుని మదిలో
నియ్యకొని వడలు చున్నది
వియ్యం బెపుడగునొ చెపుమ విదితభవిష్యా ! 717

ఆ.వె. సఖియ పలుకు వినగ సారస్యమున సిగ్గు
ముంచుకొనగ గౌరి మోము వంచ
నతిథిదేవుఁ డంత నానందమును దాచి
పాత్రపోషణమునఁ బల్కె నిటుల. 718

శా. అయ్యో మీ సఖి పిచ్చిదాని వలె నున్నట్లున్న దా దేబెనా
చెయ్యందిమ్మని దేవురించుట లహో చిత్రంబు, చిత్రింపగా
నయ్యారే యనిపించు బ్రహ్మకును నీ యందాల రాకన్నె తా
నయ్యో భూతపతిన్ విరూపిని వివాహంబాడఁ బ్రేమించుటా ! 719

కం. మీరైన చెప్పుఁ డామెకు
తీరైన మగని వరించి తిరపడు మంచున్ ,
లేరే లోకము నందున
రారాజులు రసికమణులు రమణి వరింపన్ ? 720

ఉ. కర్ణకఠోరవాక్యములఁ గర్ణయుగంబును మూసికొంచు నా
శార్ణవ మంటగా శివ శివా యనుచుం గను లెఱ్ఱఁజేసి యో
పూర్ణదయామతీ శివవిభూతి నెఱుంగక నట్టులంటివో
నిర్ణయ మట్టిదో యెఱుఁగ నీ విక చెప్పకుమంచు పొమ్మనెన్ . 721

తే.గీ. గౌరి మనమున శివునిపై గల్గు ప్రేమ
యెంత గాఢమో తెలిసియు నింక నొక్క
పరి పరీక్షింపఁ దలపెట్టి పలికె నిటుల
తనను దాఁ దక్కువగఁ జేసి కొనుచు భవుఁడు. 722

సీ. కోమలాంగిరో నీకు కోప మేలనె గౌరి
నిజము చెప్పుట కూడ నేర మగునె ?!
తిరిపెమెత్తిన గాని తినఁ దిండిలేనివాఁ
డిల్లు వాకిలి చూడ వల్లకాడు,
పులితోలు వెలిబూడిదలు మేన, ధరియింప
నెముకపూసలు గాని యెఱుఁగఁ డతఁడు,
ఊరు పేరును లేని యులిపికట్టియ వాఁడు
తల్లిదండ్రులు లేని తాత జూడ,
తే.గీ. దండ పాములు, దయ్యాలు దండు వెడల
ముసలి యాబోతుపై నేగు విసపు తిండి;
వాని కంటెను వరియింప నేను మేలు–
కాకి ముక్కుకు దొండ పండా ! కలికిరొ ! 723

వ. అనుచు నక్కపట బ్రాహ్మణుం డనేక భంగుల శివదూషణంబు గావింపు చుండ నిక విననొల్లని గిరిపుత్రిక సహనంబుఁ గోల్పోయినను నతిథి కెదురాడక మహాదేవ మహాదేవ యంచు స్వగతంబునఁ బ్రార్థనం బొనరింపుచు మిన్నకుండ నదిచూచి సహింప నొల్లని సఖీజనంబు. 724

ఆ.వె. ఏమి తెలియు నీకు యీశుని వర్ణింప
నతిథివగుట కతన బ్రతికి పోతి
వకట ముదిమి జ్ఞాన మంటదా యిసుమంత,
బ్రతుక నేమి ఫలము బాపనయ్య ? 725

కం. పొమ్మిక నిలబడ వలదిట
కమ్మని పూవనము లోన కరి దూరి నటుల్
కొమ్మల యేకాంత సుఖము
వమ్మొనరించుటలు తగునె వాచాలుఁడవై ? 726

ఆ.వె. అనుచు నొకతె వాని నాడించె జటఁ బట్టి
పొలతి యొకతె లాగె పొత్తములను
తరుణి యొకతె దాచె దండ కమండలుల్
పరిహసించి రటులఁ బడతు లంత. 727

కం. చెలరేగిన చెలికత్తెల
వలదని వారించె గౌరి బాపటికంబున్
చులకన సేయఁగ రాదని
తెలివిడిఁ దగనట్టివాని దెప్పకుఁ డంచున్. 728

ఆ.వె. గౌరవించి పంపు దారివేరము వలదు
ముసలివాని నేల కసరుకొనుట,
మనకు తగినయట్లు మర్యాద లొనరించి
వానిఁ బంపు డనుచు వారి నంప– 729

కం. వారును నటులే యనుచుం
బాఱుని బరికింప నచట పాఱుఁడు లేఁడా
పారువఁ బరిపూర్ణంబగు
కారణరూపంబు వెలసెఁ గన్నులు చెదరన్. 730

శా. సాక్షాచ్చంద్రకిరీటమౌళి భుజగజ్ఞాతవ్యశీర్షాంగుఁడున్
త్ర్యక్షప్రత్యుపహారదక్షుఁ డనల ద్రాఘిష్ఠభాస్వంతుఁడున్
దీక్షోపాత్తవిశిష్టవిష్టపసుఖోత్సేకార్థ సంపన్నుఁడున్
వీక్షామాత్రకృతార్థభక్తసమనోభీష్టార్థుఁడై నిల్చెడిన్ . 731

కం. ఎదురుగ కైలాస పతిని
విదుషులు గని నమ్మరాక విస్మయ మందన్
పదపడి పార్వతియును గని
పదములు తడబడగ సిగ్గుపడి వెను దిరగన్. 732

తే.గీ. సిగ్గు చాటున చాటుకుఁజేరు సతిని
గాంచి శంకరుఁ డాత్రమై కరము బట్టి
కరము నందున కరమొందు కంపనముల
పడతి భయమును గమనించి పలికె నిటుల. 733

ఉ. ఈ బెదు రేల భీతహరిణేక్షణ ! యీప్సితసిద్ధి వేళ – నే
నీ బహుకాలదీక్ష ఫలియింపఁగ వచ్చితి నెందుఁ బోదువే,
హే బయకారి ! మేన సగమిత్తునె, మన్నెద జీవితాంతమున్
పైబడు సిగ్గు మాను మిక పట్టుము నా కరకంజ మిప్పుడే ! 734

వ. అనుచుఁ జలంబు నచలంబు వోలె గ్రహంబుల గ్రహరాడ్విధంబు నాకర్షింప
నుంకింప లజ్జామంధరలోచనయు హర్షసంపుల్లవదనయు రోమాంచిత తనూలతయు
నైన గౌరి వలదు కావలయు నను భంగి నల్లనల్లఁ బాణిపల్లవంబుల వారించుచు
నధరంబులు తడబడుచుండ వీణానిక్వణంబుల బోలు మంద్రస్వరంబుల చంద్రమౌళి
కిట్లనియె. 735



చం. వల దతి కౌతుకంబు నిజవల్లభ నేనెటుఁ బోదు నైన మా
వలపులు తల్లిదండ్రుల కవర్జ్యములై ప్రకటంబు కావలెన్
కలగక వారి సమ్మతిని గౌరవమొప్పగఁ బొంది పొందుఁడీ
లలితను నీ పదాబ్జకృతలాస్యను లాలితలోకపాలకా ! 736

కం. ఆ నాతి వివేకంబున
కానందము మీరి శివుని హస్తము సడలన్
ఆనందఖేదసంభృత
మానస తన కరము విడువ మసలక నేగెన్. 737

ఆ.వె. తిరిగి తిరిగి చూచు దేవతావనితను
చూచి చూచి తుదకు చూడరాక
విరహవేదనమున వెండి కొండకు నేగి
జపము చేయసాగె సతిని గూర్చి. 738

***ఇది శ్రీవాసవీపురాణమునందు గిరిజాతపఃపరీక్షయను ఇరువది త్తొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము.***

(ఆరివేరము= కలహము, పారువ= జాడ, ప్రత్యుపహారము= కానుక, ద్రాఘిష్ఠ= మిక్కిలి దీర్ఘమైన, విష్టప= లోకము, సుఖోత్సేకార్థము= సుఖింపదగు ధనము, బయకారి= విలాసవతి, మసలక= ఆలస్యముచేయక)

# ముప్పదియవ అధ్యాయము

**కం. కుసుమసుకుమార సౌహృది !**
**కుసుమాయుధమృదుకళత్ర కోమలగాత్రీ !**
**కుసుమశ్రేష్ఠికుమారీ !**
**కుసుమాంబముఖాంబుజాత కుతపమరీచీ !**

వ. అంత నక్కథాశ్రవణకౌతుకమ్మున నంతరాయమ్ము నెంతమాత్రము సహింప నొల్లని వైశ్యశ్రేష్ఠులు. 739

ఆ.వె. ఆమె యామెనగరి కాతఁ డాతని గిరి
కెవరిమటుకువార లేగి నారె !
పెండి లెట్టులాయె పెద్దాయనా చెప్పు
మనగ మునియుఁ బలికె నవ్విధమ్ము. 740

సీ. కైలాసమున నీశు నాలోచనము లందు
గౌరీవిలాసంబు కరుగదాయె
చిత్తంబు శాసింపఁ జిన్ముద్ర వహియింప
కనుల లోపల గౌరి కదలదాయె
మంచుకొండల మధ్య మించుబోడి తలంపు
చలిగాలి నిప్పులఁ జెలగనాయె
నిదురఁబోయిన గాని కుదురు చిక్కదటన్న
కలలోన గమలాక్షి కలచనాయె

ఆ.వె. మీద చందమామ మిన్నేరు లుండియు
విషపు ఘాటు మించె విరహ తాప
మంగభస్మమయ్యు నంగముల్ దహియింప
భస్మధరుఁడు మదనుబారిఁ బడియె. 741

ఆ.వె. ఇచట నిట్టులుండ నచట నారాయణీ
ప్రస్తుతాంశ మగజ భవుని గూర్చి
తలపు మలప లేక తనువెల్ల దహియించు
మదన తాపమునకు మరులఁ బడియె. 742

ఆ.వె. చెల్లి గౌరి తలపు, చెలికాఁడు శివుని మై
మరపు లెల్లఁ దెలిసి మాధవుండు
సమ్మతించె మౌనిసామర్థ్యమును మెచ్చి,
రజతగిరికిఁ గదలె రయముమీర. 743

చం. కదలెను విష్ణుమూర్తి శితికంఠు వివాహము నిర్వహింప నా
రదముని తోడ, దివ్యజనరమ్యజయధ్వను లాలకింపుచున్,
బదరుచు వైనతేయు భుజమందిరమండనుఁడై రమాసతీ
వదనమహోద్యుతీహ యెద వాకిట వీడ్కొలుపంగ దీక్షమై. 744

కం. ముందుగ నారదముని చని
కందర్పుని తండ్రి రాక గానము సేయన్
కందర్పహరుఁడు రయమున
నందీశ్వరు నెక్కి వచ్చె నరహరి కెదురై. 745

కం. అరయగ నెదురెదురుగ నా
యిరువురు నిలబడగ వారి యెడఁదల నిరవై
చెరగని దరహాసకుసుమ
మరబూచెను రెంట నొంటిమై చెలువొందెన్ . 746

ఆ.వె. సాయమొందు నెవఁడు, సాయంబుఁ జేయువాఁ
డెవ్వఁ డల్పుఁడెవ్వఁ డెవ్వఁడధికుఁ
డిరువురొక్కఁడయ్యు నిదియేమి నాటకం
బంచు మునికిఁ గలిగె నక్కజంబు. 747

ఉ. చూపుల పల్కరింతలను జొక్కిన మేనులు కౌగిలింతలోఁ
బ్రాపులఁ బుల్కరించినవి రాగలయాత్మకగీతి కైవడిన్;
హే పురుషోత్తమా సుఖులె, హే త్రిపురాంతక సేమమే కదా
తాప మదేల యంచు నెడఁదల్ ధ్వనియించిన వాత్మపక్షులై ! 748

ఆ.వె. ప్రమథగణములంత పరమేశ్వరుని తోడ
పరమపురుషుఁ గూర్చి పాడుకొనుచు
నారదాదిమునులు నారాయణా యంచుఁ
జేరి రల్లనల్ల శివుని గీము. 749

వ. అచట నా సదాశివుని సదనంబున శివగణంబులచే సత్కరింపఁ బడి సేదఁదేరిన వైష్ణవ జనంబును యథోచితంబులగు మధురవచనంబుల శైవులఁ దృప్తులఁ గావింప నెల్లరు సుఖంబుండి రంత శృంగారభావలజ్జావనతంబగు నేత్ర త్రయంబుఁ గాంచిన కామజనకుం డొకింత దరహాసంబుఁ జిందించుచు శంకరున కిట్లనియె. 750

ఉ. నీ నిజభావనారచన నిస్తుల మీ జగమెల్ల నిందులో
నే నియమంబు నిల్పగల దీవు తలంచిన లోకవృత్తమున్ ?
లేని మహత్తు మా కలది లీలలు చూపుట గాక, నీ వివా
హానకు నేను గావలెనె యండగ నిల్వబడంగ పెద్దనై ! 751

ఉ. హావము గాదు భావమును హాయిమెయిం బ్రకటింపగా వలెన్,
ఆవల మంచిచెడ్డలకు నావలివారల మాట కాయ లే
మో వరుడా శివయ్య – నిజమూ – గిరిజన్ వరియించి నాడ నం
చీవు వచింపవయ్య యన నీశుఁడుఁ జూపు మరల్చ కిట్లనున్. 752

కం. నా లోపల నున్నాఁడవు
నాలోపల నేమి కలదొ నాచేఁ బలికిం
చాలా పురుషోత్తమ యిం
కేలా యాలోచనంబు, యీ జాగేలా ! 753

వ. అనుచుఁ దనసమ్మతిం దెలుప. 754



తే.గీ. శివుని యామోదమును విన్న దివిజతతులు
దుందుభుల మ్రోసి యానందతుందిలముల
నాట్యమాడిరి నభము సన్నాహమంద,
దనుజహృదయాలు నలుఁగ సంతాపమందు ! 755

కం. అంత ననంతుఁ డనంత ని
జాంత స్సంతోషకాంతజాంతర్వాణిన్
సంతత జనసంతతి ఘన
సంతోషాయితులఁ బిలిచె సప్తర్షు లనన్. 756

కం. పిలచినదే తడవుగ ముని
కుల ముఖ్యులు వెన్నుముందు కొలువైరి, హరీ !
తలచిన కార్యముఁ దెలుపుము
తలఁ దాల్తుము నిక్కమనిరి తడుముడు లేకన్. 757

వ. అట్లమ్మునిసప్తక వినమ్రవిజ్ఞప్తికి సంతృప్తుండైన మహావిష్ణు వంత విషకంఠు వివాహవిషయంబుఁ బ్రస్తావించి హిమవంతు చెంతకుం జని యాతని తనయా జననవృత్తాంతంబెల్ల వివరించి యాతనిం గన్యాదానంబునకు సంసిద్ధునిం జేయుఁ డని యానతిచ్చిన వారును హరి హరాదుల కెల్లరకును నమస్కరించి యనుమతిం గొని హిమవంతునిఁ జేరి యర్ఘ్యపాద్యాదుల సంతృప్తులగుచు నిట్లనిరి. 758

చం. హిమనగరాడ్వరా వినుము, హిండితవిశ్వవికాసమూలమై
యమనియమాది తంత్రుల నియంత్రణ సల్పెడు నాదిశక్తి జ
న్మము తొలి యండమందు తొలిమాఱుగ, రెండవమాఱు దక్షు గే
హమున శివానియైన తెఱఁగా విదితంబె కదా జగంబునన్ ! 759

ఉ. చల్లనితల్లి భగ్గుమని చారెడు బూడిదయైన దాదిగా
చల్లనితేని క్రిందఁ దెలిచారల జీవనమోర్చి యోర్చి నీ
చల్లని యింటఁ బుట్టినది, చక్కదనాల పడంతుకైన దీ
చల్లనివేళ పెండిలి విచారముసేయగ రాదొ శైలపా ! 760

చం. అనవిని గౌరి తండ్రి ముదమంది కుమార్తెకు పెండ్లి సేయగా
తనకు తలంపు గల్గమికిఁ దద్దయు సిగ్గిలి, గుర్తుఁ జేయు నా
మునులకు మ్రొక్కి పాదములు మూర్కొని పల్కె మహానుభావులై
నను నడిపించ వచ్చితిరె నా చిరుతల్లికి పెండ్లి చేయగన్ ! 761

వ. అయ్యాది మాతకు పూర్ణావతారమై వెలసిన నా చిట్టి తల్లికి తగిన వరుని సూచింపుడు మీ సమక్షంబున కన్యాదానం బొనర్తునన నమ్మునిపుంగవులును. 762

ఉ. వేరెవరయ్య ముమ్మొదులు వేయగలాడు జగత్రయంబునన్
గౌరికి? మున్నజాండమునఁ గాటుక దిద్దినవాఁడు, మొన్న ద
క్షోరుగృహంబుఁ జొచ్చి మన మూనినవాఁడు శివుండు గాక ! ఆ
వీరుఁడె యల్లుఁడౌఁ దమకు వేర యదృష్ట మికేమి కావలెన్ !? 763

కం. అతఁ డీమెయు నౌకరి నౌకరు
సుతరా మెడఁబాయలేరు సూనృతవ్రత ! నీ
సుత తలఁపెఱింగి మసలుము
పతిసేయుము పరమశివుని, భద్రం బగుతన్. 764

వ. అనుచుఁ బ్రియంబు వల్క హిమశృంగాధినాథుండును మహాభాగ్యంబనుచు భార్యాపుత్రుల రావించి సప్తర్షుల సందేశంబును వినిపించి ప్రియపుత్రి యభిప్రాయం బడుగ వారును నెంతయు సంతసించి గౌరీమనోభిరాముం డాతడే యని విన్నవింప నతండును నత్యంతభక్తిభావంబున ఋషిగణంబును దిలకించుచు. 765

ఉ. ఏ మహనీయమూర్తిఁ గన నీ జగమెల్లఁ దపంబొనర్చు, సు
త్రామ దివాకరాదులకు త్రాణ నొసంగు నెవండు, భక్తులం
బ్రేముడి బ్రోచు నే విభుఁడు, ప్రేషిత సప్తమహర్షులార నే
మామ ననంగ వానికిటు మమ్ముల మించిన ధన్యులుందురే ! 766

కం. ఏ మాత్ర మ్మనుమానము
మీ మానసముల వలదు సుమీ! ప్రియమారన్
సోమాలంకృతవరునకు
మా ముద్దుల పట్టి నిత్తుమని వచియింపన్ . 767

ఆ.వె. అనుచు మునుల నతఁడు మనసార పూజించి
సమ్మతమున వారి సాగనంప
వారు తృప్తినొంది భవుని పెండ్లికి పెద్ద
లైతి మంచు చనిరి హరినిఁ జేర. 768

కం. హరి హర నారదు లచ్చట
సురగణముల మధ్య నెదురుచూపుల హిమవత్
గిరిపతి యంగీకారము
కొరకై కూర్చుండి రకట కోర్కుల వశులై ! 769

కం. ఆనంద తాండవంబున
నాననములు వెలుగ ఋషులు నరుదెంచుటయున్
కానం బట్టిన వారల
యాననములు వెలుగులయ్యె నానందమునన్. 770

ఆ.వె. ఔనసె హిమవంతుఁ డని నోటఁ బల్కగా
పనియె లేదు కాని పలికినారు,
ఔన ! నిజమ ! యనుచు నాశ్చర్య పడఁదగ్గ
పనియె లేదు కాని పడిరి వీరు. 771

ఉ. చింతలు దీరునింక సుర సీమకు తారకు బాధ తీరునం
చెంతయుఁ దృప్తితోడ సురులేగిరి, భూసురులున్ ఋషీంద్రులున్
శాంతమతిన్ గమించిరి, వృషాకపి సంతస మేమి చెప్పుదున్ ?!
చింతఁ దొలంగె శంభుడును శీతనగాత్మజతోడి యూహలన్ ! 772

***ఇది శ్రీవాసవీపురాణమునందలి సప్తర్షులు హిమవంతునికన్య నడుగుటయను ముప్పదియవ అధ్యాయము సంపూర్ణము.***

(బదరుచు= త్వరపడుచు, నిజాంతస్సంతోష కాంతజాంతర్వాణిన్= తనలోని సంతోషమనే అయస్కాంతమున బుట్టిన తలపుతో, వృషాకపి= విష్ణుమూర్తి)

# ముప్పదియొకటవ అధ్యాయము

**కం. మాతా వైశ్యోద్ధారిణి !**
**భ్రాతృ విరూపాక్ష కలిత వాత్సల్య నిధీ !**
**మాతా కుసుంభ పుత్రీ !**
**మాతా కలిదోష హరిణి ! మంగళ దాత్రీ !**

వ. అనంతర శివకల్యాణ యత్నంబు లెట్టివను వైశ్య ఋషుల ప్రశ్నంబున కమ్మహర్షి యొకింత విశ్రమించి యిట్లనియె. 773

కం. హరి హర గణములు వెడలగ
హరి హరు లిరువురు మిగిలిరి హరుఁడంతట నా
హరిని గని తన వివాహము
సరగున ముడివెట్టు మంచు సరసం బాడెన్ ! 774

ఆ.వె. నాల్గు తలల వాఁడు నడుముఁ గట్టిన గాని
మూడు కనుల వాని ముచ్చటెల్లఁ
దీర దంచుఁ దలచె త్రికకుత్తు నలువను
నలువ కదలి వచ్చెఁ దలచి నంత ! 775

తే.గీ. హంస వాహనమున బ్రహ్మ యరుగుదెంచ
వెనుక దేవర్షి గణమెల్ల ననుసరించ
నెల్లరును గూడి పరమేశు పెళ్ళి పనులు
నిర్ణయించిరి మాధవు నియమనమున. 776

ఉ. మాధవుఁడంత జాప్య మణుమాత్రము సల్పక శైవ శాసనో
ద్బోధకు, నుద్భట ప్రమథ భూత గణాధికు; భూనభోంతరో
త్సేధకు, వాక్పటుత్వ ఘన శేష నిభ ప్రతిభా ప్రభార్కునిన్,
శోధిత భూర్భువః ప్రకర శుద్ధుని భృంగిని బిల్చి యిట్లనెన్ . 777



వ. మహా బాహూ ! ముల్లోకంబులఁ బరమాత్ముండగు శివుని కల్యాణ వృత్తాంతంబు నుద్ఘోషింపుము; ప్రతర్దన చక్రశీర్ష చందుల నియోగించి దేవ మానవ నాగాదులగు జగత్రయ వాసులను, నింద్రాగ్ని వరుణాదులగు సర్వ లోకపాలకులను, నష్ట వసువులను, సిద్ధ చారణ సాధ్య కిన్నర గరుడ గంధర్వాదులగు ఖేచరులను, నవగ్రహంబులను, బులహ పులస్త్య స్రష్టాదులగు ప్రజాపతులను, మహాత్ములగు రాజన్యులను, వ్యాస వశిష్ఠ విశ్వామిత్ర గౌతమ దుర్వాసః పరాశరాదులగు బ్రహ్మర్షులను, నారదాది దేవర్షులను, గృహ్యసూత్ర విధాన కర్తలగు బృహస్ప త్యాదులను, దక్కుంగల యెల్లపుట్టువులను శివుని కల్యాణంబుఁజూడ నతి శీఘ్రంబు రమ్మని యాహ్వానింపుము; వచ్చువార లెల్లరను సంపూర్ణ ధన సంపన్నులఁ గావింపు మని ధనపతికి వక్కాణింపుము. 778

కం. అని హరియన భృంగియుఁ దన
యనుచర గణములను దగిన యాదేశములం
బనిచెను ముజ్జగములకును;
ధనపతియును నెల్లరకును ధనములు పంచెన్. 779

కం. ఆహూతులైన వారలు
నాహార్యము లంది మిగుల నానందముగన్
గేహంబుల విడిచి హరు వి
వాహంబునుఁ జూడఁ దరలి వచ్చిరి ప్రీతిన్. 780

సీ. వారు వచ్చెడు వియద్వాహనంబులు గ్రక్కు
కాంతిచ్ఛటల నింగి కావి గప్పి
సాంధ్య ఖద్యోత ప్రసంగ పాటల సంగ
ఖండ మేఘస్ఫూర్తి కందళించె;
దివ్య వాద్య ధ్వను లవ్యయంబుగ సాగ
కిన్నరీ వీణలు కృతులు పాడ,
సంయమీంద్రులు సల్పు సామ గానంబుల
గరుపాటె కైలాస కందరములు;

తే.గీ. బ్రహ్మ విష్ణువు లంత దిక్పతులఁ బిల్చి
పెండ్లి పనులకు తొందర పెట్టిరంత
వారు నమరులఁ బురిగొల్ప వందిమాగ
ధుల గళంబులుఁ గఱకంఠుఁ గొలిచె నిటుల. 781

చం. జయ జయ శైలజా హృదయచంద్రమ ! చంద్రకళా వరాంగమా !
జయ నిఖిలాగమాకరమ ! జాగృత మానసనాట్య వేదమా !
ప్రియ సఖిఁ జేకొనంగఁ దగు రీతిని పెండ్లికుమారు శోభతో
పయనము గమ్ము సత్వరము బంధు జనావళి తోడ శంకరా ! 782

తే.గీ. దేవతల నుతులందిన దేవ దేవుఁ
డమల దరహాస మెలయించి యనుమతింప
నమర పథముల తూర్యనాదములు మొరసె,
నలుగు పాటలు మొదలాయె నారు లందు. 783

సీ. పచ్చ కప్పురమున పసుపు నూరిన ముద్ద
కుంకుమ పూవుతోఁ గూర్చి మెదిపి
నలుగు బెట్టిరి రమా నలినజాంగన లీశు
దేహ కాంతులు నలు దెసలఁ బర్వ,
గంగ ఋషిసతుల కరముల మీదుగా
స్నాన మాడించె నుత్సాహ మలర,
మెఱపు మెఱుఁగు లీను మేలి వస్త్రంబులఁ
దెచ్చి కట్టె నలువ తేజ మొదవ,
తే.గీ. ఇంద్రుఁ డాభరణంబుల నింపు గూర్ప,
చంద్రుఁ డుడుహారమొసగి తా జటల నిలువ,
నినుడు వజ్రకిరీటంబు నునిచి మ్రొక్క
ననలుఁ డొగిఁ బాదుకల్ దొడ్గె నప్పు డంత. 784

కం. సర్వాలంకారంబుల
సర్వేశుం డఖిల విశ్వ సందీపకుఁడై
పర్వత రాజ నివాసముఁ
బర్వాలంకృతము జేయఁ బయనంబాయెన్ ! 785

ఉ. ధర్మము నాల్గు పాదములు దాల్చిన రూపమనంగ నొప్పు జ్యో
తిర్మయ పుంగవేంద్రు భుజ దేశము నందున భృంగి హస్తము
న్నర్మిలి నూతగొంచు నుచితాసనుఁడై హృదయంబు నిండుగా
నిర్మల రాగ భావనలు నింపుచు సాగె నతండు నంతటన్. 786

కం. తార్క్ష్యా రూఢుండై హరి
తార్క్ష్యంబగు హంస నెక్కి ధాతయు తాస్వ
స్తార్క్ష్యంబెక్కి సురాధిపుఁ
డార్క్ష్యోజ్వల సుప్రభాఢ్యుఁడై చనె వెంటన్. 787

కం. మును మునులు మిడియలు జదువ
ననుచర కిన్నరుల వీణియలు కీర్తింపన్
మణి భూషణములఁ దళ తళ
మను బంగరు వలువ లందు నభవుఁడు వెలిగెన్ ! 788

శా. భంభంభం భుబభోం బభోం భుభుబభోం భంభం బుభోంభోం బభోం
భం భం భూత విభో ! ప్రభో ! భృకుటి బిభ్రన్నేత్ర బభ్రూ ! ప్రలం
భాంభ స్త్రీ పరిభూ ! ప్రభూత శుభ సౌభాగ్య స్వయం భూ ! నమ
శ్శంభో యంచు నికుంభ భక్త గణముల్ శంఖాళిఁ బూరింపగన్. 789

కం. బహు దివ్యనాద పథమున
బృహద్రథంతరమున ద్విజ బృందము సాగన్
తుహినాద్రి రాజధానికి
నహిభూషణుఁ దరుగుదెంచె నానందముగన్ ! 790

కం. వరుడగుచుఁ దరలి వచ్చిన
హరునకు నెదురేగె నంత నాహ్లాదముగన్
గిరిపతి హిమవంతుఁడు దన
పరివారము తోడ సకల బంధుగణము తోన్. 791

వ. మేరు పారియాత్ర నగపతులు పెండ్లి పెద్దలై ముందు నడువ వింధ్య గంధమాదను లిరుగడల జయలు వెట్ట నిషధ మాల్యవత్ హేమకూట సహ్యా మైనాకాదులు వెంట నడువ సకల భూధర శ్రేణుల సేవలందుచు దివ్యమాల్యాంబర గంధానులేపనంబుల రత్న గ్రైవేయ కేయూర కిరీట విభూషితుండైన హిమవన్నగాధిపతి పరమేశ్వరుఁ జూచి నమస్కరింపఁ దన్మకుట మణి మండల కాంతి పుంజములు మహేశు పద యుగ్మంబు నభిషేకింపఁ బ్రసన్నుండైన పశుపతి ప్రత్యభివాదం బాచరించె నంత గిరిపతియును మహనీయార్థ వచనంబుల స్వాగతంబు వలికె. 792

ఉ. హే మహనీయ మూర్తి ! జగదీశ్వర ! శంకర ! చంద్ర శేఖరా !
మామక పూర్వ పుణ్యమున మంగళ సిద్ధి ఘటింప వచ్చితే !
సేమమె యెల్లవారలును ? శ్రీ చరణమ్ముల ధూళి సోకి మా
సీమ పునీతమాయె – దయసేయుము ! అల్లుఁడవై మహేశ్వరా ! 793

తే.గీ. అహొ ! కృతార్థుఁడనైతి నీ వల్లుఁ డగుట
శుభము కలిగెను నా వంశ విభవ మందు
సఫల మాయెను నా జన్మ సంభవమున
ధన్యుఁడను దేవ ! రారమ్ము దయ వహించి. 794

చం. అనుచు హిమాద్రి పుంగవుఁడు హర్ష సముల్లసితాంతరంగుఁడై
వినయ వినమ్ర గాత్రమున వే పులకావళి వర్ధమానుఁడై
ఘనముగ విశ్వకర్మ కృత కాంచన సౌధము నందు విశ్వ నా
థుని మది కింపుగా విడిది తోరపు భక్తి నమర్చి యంతటన్ . 795

ఆ.వె. తోడ వచ్చినట్టి తుష్య బాంధవులు సం
తోష మొందఁ దగిన తోషణముల
విడిది యిండ్లు గూర్చి విశ్రాంతి నొందగా
వేడుకొనియె నాత్మ వృద్ధి నొంద . 796

ఉ. ఎక్కడ లోటు కల్గునొ ? మహేశుని మూడవ కంటి పాప కెం
పెక్కునొ ? ఎక్కనేని హిమమెల్లఁ గరంగి మహీతలంబు దా
నెక్కడ మున్గునో యనుచు నెల్లరఁ దీర్చెను పిల్ల తండ్రిగా
పెక్కు సపర్యలందు మగ పెండిలి వారలు బాగు బాగనన్. 797

వ. అట్లు శివాగమన ప్రమోదమున తుహినగిరీంద్రుండు ద్విగుణ ప్రవర్ధమాన ప్రకాశవంతుండై స్వజనంబులఁ గూడి సేవింపుచుండ శివానుచరులై వివాహంబుఁ జూడ నేతెంచిన యింద్రాగ్ని ప్రముఖులైన దేవతలు నాత్మవేత్తలైన బ్రహ్మర్షులు నత్యంత సంతృప్తాంత రంగులై శుభముహూర్తంబు నిరీక్షింపు చుండిరి. 798

***ఇది శ్రీవాసవీపురాణమునందు శివుడు వివాహమునకేగుట యను ముప్పది యొకటవ అధ్యాయము సంపూర్ణము.***

(ఉత్సేధము= శరీరము, ఆర్క్ష్యము= నక్షత్రభవం, మిడియలు= వేదములు, బిభ్రన్= ధరించు, బభ్రువు= శివుడు, ప్రలంభ= లభించిన, పరిభూ= పరమేశ్వరుడు, బృహద్రథంతరమున= ఇంద్రుని అదుపులో, తుర్యము= తురీయము, తుష్య బాంధవులు= శివ బాంధవులు, త్రికకుత్తు= హరి)

# ముప్పది రెండవ అధ్యాయము

**కం. విద్యార్థి లోక గురుకుల**
**విద్యా సంధాత్రి ! వేద విద్యా నేత్రీ !**
**సద్యః ఫలదాత్రి ! సుజన**
**హృద్యామృత వాగ్ఝరీ ! సహృదయ ధరిత్రీ !**

వ. అనంతర కల్యాణ వృత్తాంతంబు విన నుత్సుకులైన వైశ్య ఋషులకు నమ్మహర్షి సత్తముండిట్లనియె. 799

తే.గీ. విడిది భవు బంధు గణమెల్ల విందులందు
మునిగి మరచిరా వచ్చిన పని యనంగ
నమర గురుఁడొండు దినమున హిమగిరీంద్రు
నాత్మజోద్వాహ హృత్సాంద్రు నరసి పలికె. 800

మ. సుముహూర్తంబిదె చేరువాయె ననఘా ! చూడామృతాంశున్, వశున్,
హిమవద్భూత విభూతి భూషితునిగా నింపారఁ జేయంగదే !
మము మా మాత శుభాభినందనల సమ్మానంబు సాధింప నీ;
సుముఖుండైన వరున్ మరుక్షణమ శాస్త్రోక్తం బపేక్షింపుమా ! 801

కం. గురు నానతి విని హిమవరుఁ
డురవడిఁ దన బంధు మిత్రు లుత్సాహమునన్
గిరిజా సౌభాగ్యంబుల
సురులకు దీటుగఁ గదలగ శుభ్రాత్ముండై. 802



కం. వివిధాలంకృతుఁ డయ్యును
సవినయముగ సద్వివేక సాంద్రుండగుచున్
శివుఁడున్న విడిదిఁ జేరెను
శివ శివ యని ప్రస్తుతించి చేతులు మోడ్చెన్. 803

కం. మోడ్చిన చేతుల మీదుగ
నూడ్చిన కనుఱెప్పలందు నుబ్బునఁ గన్నీ
రోడ్చిన కన్నుల మదనుని
మాడ్చిన ముక్కంటి రూపు మధురతమంబౌ ! 804

మనోజ్ఞ. మధుర మనోజ్ఞ విభాత మానిత పూర్వ భూ
మి ధరమొ యీ మకుటమ్ము ! మింటి మెఱుంగులా
గ్రథిత విభూషణముల్ ! పురాణ దివాగ్రహా
ర ధవళ శైలమొ రాగ రంజిత వక్షమున్ ! 805

చం. అనితర సాధ్యమీ మగని కంగన యౌట మదీయ కన్యకా
మణికియ దక్క నెవ్వతెకు మాత్రము దక్కును నాకు దక్క నీ
ముని గుణ మండితాభరణ మూర్తికి మామ యటన్న భాగ్యమీ
యనిమిష లెల్ల వల్లెయను నట్టులఁ బట్టెద స్వాగతాంజలిన్. 806

వ. అనుచు మనంబునం దలంచి 807

పంచచామరము.
మహామహా ! మహాద్భుతంబు మా గృహంబు నందునన్
మహా మునీంద్ర హృద్విహార మందయాన ముద్దతిన్
వహింపగా వధూ పథం బవశ్యమై పదంబులన్
రహిన్ స్పృశింప వచ్చితే – విరాన్మహస్క రావయా ! 808

కం. అని నగపతి నాగాభర
ణునిఁ గొనియాడుచుఁ బిలువగ నుతులఁ బ్రియుండున్
తన పరివారము తోడుత
చనియెను చలిమల దొర నిజ సదనంబునకున్ 809

చం. నభమున దేవ బృందములు నర్మిలి నందన నంద సౌమ సౌ
రభముల ముంచుచుండ మును నప్సరసాభవమేనకాదులౌ
ప్రభలు చరించు చుండ ముని భాస్కరు లాదట సామ గాన త్రై
ష్టుభములఁ బాడుచుండఁజనె సోమ శిఖామణి తేనియింటికిన్ . 810

కం. అంతట హిమవంతుఁడు తన
యంతఃపుర మందు హరుని హర్షాధికతన్
స్వాంతము నిండుగఁ గౌగిట
నంతఃకరణంబుఁ దగుల హత్తుకొనంగన్. 811

కం. శివుఁడును హిమవన్నగపతి
భవమును సార్థకము చేయు భావము తోడన్
కవుగిట గదియించి మునులుఁ
జవిఁజూడని భాగ్య మొసఁగె సత్కృప నొప్పన్. 812

తే.గీ. ఇరువు రొండురుల పయిని విరులు చల్లి
కొనిరి చందన చర్చలఁ దనిసి రంత
నందరును కూడి పానక మందికొనిరి,
యెదురుకోలు వేడుకల వా రేకమయిరి. 813

వ. కిన్నర స్త్రీల మనోహర గాన మంజరుల మధ్య హిమవంతుని ప్రార్థనలు మన్నించిన మహేశుండు మైనాక వింధ్యగిరీశుల హస్తంబు లాలంబ నములుగాగ మేలిమి బంగరు కాంతులీను నదియును గారుత్మత మణుల గోముఖా కారంబున నిర్మించబడినదియును ముత్యంబులముగ్గుల నలంకరింప బడినదియును వజ్రఖచిత సోపానంబుల శోభిల్లునదియును గురువింద మణిస్తంభముల నింపు గూర్చునదియును రత్నమయంబులగు చూరులు వైడూర్యకాంతుల మేల్కట్ల సమిధా కుసుమ విరచిత పల్లవ తోరణంబులఁ బ్రకాశించునదియునగు రమ్య కల్యాణ వేదికఁ బ్రవేశించి రత్నకాంచన మయంబైన దివ్యపీఠంబునఁ గూరుచుండె. 814

సీ. భృగ్వత్రి పులహాది ఋషి సత్తములఁ గూడి
వామదేవుఁడు సల్పె హోమమంత



వాణీ రమల తోడ స్వాహాది దేవ కాం
తలు పెండ్లి పాటలు కలసి పాడ
కల్యాణ శంకరుఁ గాంచి యానందించు
చుండెనో యనఁ దలలూచె నగ్ని
తరుణి రాకకు ముందు వరుని భావము లట్లు
విశ్వాచి నర్తనల్ వేగమందె

ఆ.వె. వేద ఘోష యందు విప్రలోకం బుండె
దేవ దుందుభుల ప్రభావ మందు
గానమూర్తు లైరి గంధర్వులును నట
రాజమూర్తి మనము రంజిలంగ ! 815

కం. అంతట హిమవత్పతియున్
సంతసమున గురుని యాన సచ్ఛిచ్ఛక్తిన్
సంతత శివానురక్తన్
కాంతాభరణాభియుక్తఁ గన్యం దెచ్చెన్. 816

కం. పీతాంబరముల శోభిలు
కూతుం గూర్చుండ బెట్టి కొండల తేఁడా
శీతాంశు మౌళి పదములు
శీతాంబువులందు కడిగి శిరమున దాల్చెన్. 817

ఆ.వె. కాళ్ళు కడిగి నీళ్ళు కళ్ళకద్ది కొనుచు
మీదఁ జల్లుకొన్న మేనకయును
కూతుఁ గట్టుకొనెడు కోటీశు సౌందర్య
మునకు నబ్బురమున మునక వేసె. 818

తే.గీ. అగణితానంద సంతృప్తులైన తల్లి
దండ్రులనుఁ జూచి గిరిపుత్రి తలను వాల్చి
శివునిఁ గ్రీగంట గాంచుచు సిగ్గు మొగ్గ
దొడగ బుగ్గలు సొట్టలు వడగ నవ్వె. 819

ఆ.వె. పిల్ల తల్లిదండ్రు లల్లుని దర్శించి
తృప్తి నొంది యతఁడుఁ దృప్తి నొందు
లాగు సకల రాజ లాంఛనంబు లొసంగి
అత్త మామ లనెడు హక్కుఁ గొనిరి. 820

తే.గీ. అంత సుముహూర్త మగుడు నా యద్రి కాంత
హైమ కలశంబుఁ జేబూని యంబుధార
లధిపు చేతుల మీదుగా నవతరింపఁ
జేయ హిమవంతుఁ దహిధరు చేత నిడుచు. 821

శ్లో. పరస్మై బ్రహ్మణే తుభ్యం శంకరాయ మహాత్మనే।
దద్యాం మమాత్మజాం గౌరీ మహం నిశ్రేయసేచ్ఛయా ॥ 822

సీ. అనుచు కన్యాదాన మాచరించిన యంత
నమర వాద్యమ్ము లింపార మ్రోసె
వేల్పు లెల్లరుఁ బుష్ప వృష్టిఁ గురిసి రంత
సూర్య చంద్రుల కాంతి సొంపు మీరె
దశ దిశలుఁ బ్రసన్నత వహించె నన్ని వై
పుల నుండి పిల్ల గాలులును వీచె
భూమి సస్యముల విభూతివంతం బాయె
నంతరిక్షం బంట నలమె జయలు
తే.గీ. పార్వతిని గూడి పరమేశుఁ దుర్వి యందు
రమను గూడిన వైకుంఠ రమణు నట్లు
సర్వలోక ప్రభుఁ డగుచుఁ బర్వె నెల్ల
జగము లానందమున జేరి సంస్తుతింప ! 823

***ఇది శ్రీవాసవీపురాణమునందు శివ పార్వతుల కల్యాణమను ముప్పది రెండవ అధ్యాయము సంపూర్ణము.***

(హిమవద్భూత విభూతి= హిమవంతుని కూతురు, ఊడ్చిన= సడలించిన, దివాగ్రహారము= స్వర్గమునందలి బ్రాహ్మణవీడు, నందన నంద సోమ= ఇంద్రుని వనసంపదయైన పూవుల యొక్క, త్రైష్టుభములు= త్రిష్టుప్ ఛందంలోని పాఠాలు)



# ముప్పది మూడవ అధ్యాయము

**కం. ఓంకారేశ్వరి ! శ్రీ చ
క్రాంకిత చైతన్య లహరి ! రజతాద్రీశా
హంకార వశంకరి ! వై
శ్యాంకావిష్కృత శుభకరి ! శ్యామల గాత్రీ !**

తే.గీ. ఆది శేషుఁడు వినిపింప నాలకించు
ధర్మనందను మనమున దగిలె శంక
తాను తనవారి కథ విన దలచె నితఁడు
హరుని కథలోన బడి తన్ను మరచె నేమొ ! 824

తే.గీ. శ్రోత మనమున వొడమిన రుచి నెఱింగి
వేయి శిరముల దొర తన వేయి శిరము
లొక్కమారుగ పంకించి నొక్కి పలికె–
పూర్వరంగ మీ కథయంచుఁ బుణ్య మంచు. 825

కం. మదిలోని భావ మహిపతి
మదికెట్టుల దోచె నొక్కొ మాయగ నుండెన్
మది చంచలత్వ మిట్టిద
చదివిన ఫలమేమి కలదు శాస్త్రము లెల్లన్ ! 826

వ. అంచు మది దలంచిన ధర్మనందనుండు హృదయంబున నెంతయు పశ్చాత్తాపంబు నందుచు నహిశ్రేష్ఠున కిట్లనియె. 827

క్షమావృత్తము.

అహివర నను గాపాడవే ! మానసం
బహమిక వశమం దాగదాయెన్, శుభా
వహములు గద శైవంబు లాలించినన్
సహనమున క్షమించందగున్ బాలునిన్ ! 828

ఉ. బాలకు సత్ప్రవర్తనకు బాధ్యతకున్ మదిఁ బొంగి నాగరా
జాలముఁ జేయలేదిక కథామృత నిర్ఝరి సాగె నావలన్
బాల చకోరముం దమిని బానము చేసె నటంచుఁ బల్కె నా
మూల విరాట్టు గాథ ముని ముఖ్యుఁడు వైశ్యులు సంతసింపగా. 829

సీ. కల్యాణ మైనంత కంజాక్షుఁ డొక రత్న
మకుట మొసగె వెండిమల వరునకు
కొండరాచూలికి క్రొత్తావి చెడనట్టి
కమల దామంబిచ్చెఁ గమల సదన
స్వార్జితంబులు నూత్న వస్త్రాభరణముల
నూడిద లొసగిరి సురలు వేడ్క
పాతాళ వాసులు బంగారముల నీను
మణులొసంగిరి బహుమానములుగ
తే.గీ. పెండ్లి చూడఁగ వచ్చిన పెద్దలెల్ల
వారి స్థాయికిఁ దగినట్టి వస్తువులను
భక్తితోఁ గానుకలుగ సమర్పణము చేసి
యిండ్ల కేగిరి సంతృప్తి కండ్ల వెలుగ. 830

ఆ.వె. అవల నొంటి నున్న నవదంపతులు వేడ్క
నందుకొన్న పెండ్లి యప్పనముల
నరయు చుండి రందు నవని జనులు దెచ్చు
కానుకొక్కటేని కాన బడదు. 831

మ. ఎవరేమిచ్చిన నివ్వకున్న వగలే దింతైన కానీ మదిన్
భువిజుల్ రామికి ఖేదమాయె ననుచున్ భూతాధినాథుండు య
క్ష వరున్ రమ్మని పిల్చి యిట్లనియె యక్షశ్రేష్ఠ ! చిత్రంబుగా
నవనీ జాతుల బిల్వ లేదె ! కనగా నవ్వారు రాలేదొకో ! 832

తే.గీ. దేవ దాన వోరగు లెల్లఁ దెచ్చి యిచ్చి
రెల్ల విలువైన కానుక లుల్లమలర
మానవుల నుండి లేదొక్క మాడయైన
మదము నొందిరొ లేకున్న మనము రాదొ ! 833

తే.గీ. పచ్చ కర్పూరమన్న నా కిచ్చు యనుచు
మంచి కస్తూరి యన నేను మరువ ననుచు
శాటికా చామరములన్నఁ జత్తు ననుచు
నెటిగియును భూజనులు రారదేల సఖుఁడ ! 834

తే.గీ. ఉబ్బు లింగని మదిలోని మబ్బు తునకఁ
గని కుబేరుఁడు నత్యంత వినయ మూని
తెలియదే నీకు నాచేతఁ దెలియ వలెనె
యనుచుఁ బల్కెను ధరణి యందున నిజమ్ము. 835

ఉ. హే పరమేశ ! యద్రితనయేశ్వర ! నీ వచనమ్ము లానగా
నా పరమేష్ఠి భూమి తలమందున ముందుగ నాల్గు వర్ణముల్
ప్రాపు వహింపఁ జేసెగద ! ప్రాకిరి వారును వారి వృత్తులన్
శ్రీపతులైరి దేవతల సేవలుఁ జేసిరి యింతకాలమున్. 836

శా. కానీ నేడొక తారకాసురుఁడు లోకమ్ముల్ గ్రసించెన్ ప్రభూ !
హీనంబుల్ బ్రతుకుల్ మహీతలమునం దేజీవియున్ సేమమై
లేనే లేదు, కులంబులా క్షయములై లీనమ్ములై పోయె నే
కానల్బట్టిరొ రాజు లేముని కృపం గాంక్షించిరో బ్రాహ్మణుల్ ! 837

చం. తమ కుల వృత్తుల న్విడిచి దానవు మారణ మోర్వలేక భా
గ్యములఁ ద్యజించి గోబిలము గాపురముండిరి వైశ్యు లెల్లరున్,
తమ తమ ధర్మముల్ గడపు తండ్రిని గానక వార లార్తులై
కుములుచు నుండగా-తమకుఁగూర్చగలారె ఉపాయనమ్ములన్. 838

ఉ. నావుఁడు శంకరుం డనియె నాకము మాత్రము తారకాఖ్యు దు
ర్భావము నందు క్రుంగదె స్వభావము దప్పిరె దేవతల్ ? స్వయం
సేవకులై పరీక్షలకు సిద్ధము కాగల ధీరు లెవ్వరున్
చేవఁ దలిర్ప భూతలము సేమముఁ జూడ గలారు లేరొకో ! 839

వ. అంతఁ గుబేరుం డిట్లనియె. 840

కం. పాడియు పంటయు బేరము
మూడును భూలోక గతికి ముఖ్యములైనన్
మూడును నెరపెడి వైశ్యుల
వాడి మగలు గల రిచటనె వాంఛిత ఫలులై. 841

ఆ.వె. శాంతి భద్రతలకు సంఘాత మైనను
ధర్మ సూక్ష్మములకు తక్కువైన
జగతి కుంటువడును చచ్చువడదు; కాని
బ్రతుక గలరె జనులు మెతుకు లేక ! 842

వ. ప్రస్తుతము భూమండలంబున గల పరిస్థితులఁ జక్కదిద్ద గలవారు వైశ్యులు మాత్ర మందు మార్గ దర్శకులు కాగల సిద్ధపురుషులు తమ భక్తులై తమోగుణంబు వీడి తమ శరణంబునందే గుహ్యకదేవగణమై మదీయ పురంబున కలరు కడమలు వీరి నేతృత్వము లేక బిలంబు వీడి బయటకు రాలేరు కనుక దేవర తమ చిత్తంబు వర్తింపఁ జేయగలరని ధనాధ్యక్షుండు వలుక త్ర్యక్షుండును నొకపరి ధరణీధర సుతం గాంచి కొంతవడి యోచించి యిట్లనియె. 843



శా. ముల్లోకంబుల నొక్క దాని కయినన్ ముప్పైన నేనొప్పనే !
కల్లోలం బొనగూర్చు దానవుని పోకార్చంగ కాలంబు గా
దుల్లంఘించగ రాదు బ్రహ్మ వరముల్; యుక్తంబు వైశ్యర్షులన్
బెల్లించన్, భువి కంపి మానవులలో భీతిం దొలంగించగన్ . 844

కం. అత్యంత భక్తితో తమ
నిత్యోపాసనము కతన నిత్యంబగు నీ
సత్య పదంబును జేరి ర
పత్యపు బాగోగులందు బాధ్యత లేదో ? 845

ఉ. చెప్పుము వారి కీ యెడల క్షేమము భూమికిఁ జేరి వారి వా
రొప్పుగ నుండు నట్లు ప్రవరోన్నతిఁ బన్నుట; మంచి కస్తురిన్
కప్పుర పేటికల్ గొనుచుఁ గ్రమ్మర రమ్మనుమా కిరాటులన్,
చప్పునఁ బొమ్ము నీ వనుచు సత్వర మంపెఁ గుబేరు నీశుఁడున్ ! 846

**ఇది శ్రీవాసవీపురాణమునందు శివుడు సిద్ధవైశ్యులను భూలోకమునకు పొమ్మనుట యను ముప్పది మూడవ అధ్యాయము సంపూర్ణము.**

(చత్తుననుచు= లేకుండ జీవించలేననుచు- నిత్య వ్యావహారికం, బెల్లించు= మభ్యపెట్టు)

# ముప్పది నాల్గవ అధ్యాయము

కం. **వరదాయిని ! పరమేశ్వరి !**
**పరతత్త్వప్రద ! విశాల పావనమూర్తీ !**
**పరమ దయాకరి ! శాంభవి !**
**శరణాగత భక్తలోక శాంకరి ! జననీ !**

వ. శివ సాన్నిధ్య సిద్ధికొరకెంతటి తపంబుఁ జేసిరి ! వారికా యిట్టి కష్టంబు లింక కైలాస పదంబు లభించి ఫలమేమికలదా సిద్ధ వైశ్య లేమయిరో యంచు శ్రోతలగు వైశ్య పుంగవుల నడుమ కలకలంబుఁ జెలరేగ సాలంకాయనుం డవ్వారిం గాంచి యిట్లనియె. 847

తే.గీ. తాను దేవుఁడే ! అయినను ధరణియందు
ధర్మమున గ్లాని యేర్పడ్డ తరుణమందు
జన్మమెత్తడె జగతిని జనుల మధ్య;
వాని కంటెను నధికులే వణిజ వరులు ? 848

కం. సాయుజ్య మొంది నప్పుడు
నాయనలో భాగమగుచు నడతురు జగతిన్,
స్థాయిఁ దొలంగని వారలు
సాయము చేయంగ వలదె శంకరు కృషికిన్ ! 849

వ. అంత. 850

ఉ. అర్థము లేని తర్కము లనర్థములంచు దలంచి సంచితా
నర్థ విదారకున్ మనమునందునె మన్నన వేడి వైశ్యులున్
ప్రార్థన జేసిరా మునిని భర్గు ననుజ్ఞ ఫలించె నెట్టు లా
స్వార్థ కిరాట వర్యుల కవాంఛిత బంధము లాలకించగా. 851



వ. అంతట నమ్ముని వర్యుండును ముదంబున నిట్లు చెప్ప దొడంగె. 852

తే.గీ. ఈశ్వరాదేశ మంది యక్షేశ్వరుండు
సిద్ధ వైశ్యులఁ జేరి వచించె నిట్లు
శ్రేష్ఠ పదముల గ్రాలు నో శ్రేష్ఠులార
శివుని సందేశ మొకటున్న దవధరింప ! 853

కం. వాగర్థములటు గిరిక
న్యా గిరిశు లొకటగువేళ నవనీ నీతం
బౌ గౌరవ చిహ్నం బొక
టే గనరాక మిము వల్లడి కడిగొను నయో ! 854

వ. యక్షాధ్యక్షు రూక్ష వచనంబులకు సిద్ధగుహ్యకులిదెట్టి పరోక్షశిక్షావిధి యంచు వివరం బపేక్షింప యక్షేశ్వరుండును త్ర్యక్షు మనోభీష్టంబు నెఱింగించి 855

ఉ. పొందికఁ బోకఁ దప్పదట భూవలయంబున దాయలందు మీ
రండగ చేరి వారలిడు హట్ట విభూతుల కప్పురాదులన్
దెండు శివుండు సంతసిల దీవన లందుడు వేగ పొందనన్;
దండుగమారి బేరమని దండుగ నిట్లని రా కిరాటులున్. 856

కం. భూమిం గాలిడ లేమే
సోమాంకుని వరము చేత సురల మగుటచే
మేమెట్లు మేదినీ గత
సోమాదుల దెత్తుమయ్య సూడిద లంచున్ ? 857

వ. అన విని వైశ్రవణుం డిట్లనియె. 858

ఆ.వె. మీ గతమ్ముఁ జూడ మీరున్న స్థితిఁ జూడ
జాలి వేయునయ్య మేలుఁ జేతు
పుష్పకమ్ము నెక్కి పుడమి కేగుడు మీరు
పునుగు కప్పురాలు పుణికి తెండు. 859

పృథ్వి. కుబేరుని కృపా విశేషమున గుందు కుందాడగా
ప్రబోధిత శివావధాన సముపస్థితిన్ శంక ద
ప్పి బేహరులు పుష్పకమ్ము పయి పృథ్వికిన్ వ్రాలి చూ
డ బచ్చుల నొకండునైన నచటన్ విరాజిల్లడే ! 860

తే.గీ. ఎవరి సంతతి వసుధపై నిక్క జెడునొ
వారి కీ పుణ్య గతి కేడువాఋ నకట !
నేడు కైలాస మందుండి నేల దిగుట
కిదియె కారణమని వార లుదిల పడిరి. 861

వ. ఉదిల పడుచు నుర్వినెల్ల గాలించిన సిద్ధ వైశ్యులు ఫలసిద్ధిం గాంచనేరక గతోత్సాహులై. 862

ధనద. తమ వంశీయులుండు ధనదంబగు పట్టణ మొక్కటేనియున్
గమకింపం గనంబడదు కారణ మేమగు నంచు తారకా
ధము క్రౌర్యంబు లో దలచి తారక మార్గ మెఋంగు చింతలో
గుములన్ సాగి రయ్యెడల కొండొక తెమ్మెర వీచె వారిపై. 863

ఉ. ఒప్పుగ పారియాత్రగిరి నొంటిగ నుండిన ధ్యాన తత్పరున్
కప్పలి వోలె లోదలఁచి కమ్మగ బిల్చిరి వైశ్య లిట్టులన్
తప్పు సహించుమో విమల తాపస వృత్త ! నిరోధమైతి మీ
చొప్పు నుపాంశువాస! మముఁజూచి చరింపుము కీడుఁబాపగా 864

కం. దీనాలాపములేవో
వీనుల బడి కనులు దెఋచి వీక్షించగ నా
మౌనివరుని ముందు నభో
యానంబున ముకుళిత కర యాచకులట్లై. 865

ధనద. ఎవరీ మంద భాగ్యు లిపుడేపని మీదట వచ్చిరో కదా
శివుఁడేరీతి నా బరగు చిత్తము బ్రోచునొ యంచు నాతఁడున్
దివిజుల్ గారె మీరలిటు దీనుల వోలె చరింతు రేల మా
నవ లోకంబులో ననుచు నమ్మిక బల్కగ నంత వారలున్. 866

కం. కైలాస వాసులము మా
కాలంబిటు దెచ్చె మమ్ము, కరుణావన యీ
శైలం బేమని నెల వీ
నేలం దమ పేరు చెప్పి నెగడు మనంగన్. 867

కం. అయ్యా ! యిది భార్గవ ముని
దయ్యా, దేవవ్రతుఁడని యందురు నన్నున్,
అయ్యలు సాందీపులు నే
నియ్యెడ వైశ్యుఁడనని వచియించె నతండున్. 868

కం. తమ కులము నిలుప గల్గెడు
కొమరుం డొకడుండెఁ జాలుఁ గుములగ నేలా
తమ వచ్చిన పని చెప్పిన
సమకూర్చును కోర్కులెల్ల సత్వర మంచున్. 869

తే.గీ. సిద్ధ సక్థిజు లట్టుల జింత చేసి
తమకు వచ్చిన కష్టంబుఁ ద్రవ్వుకొనిరి
శివుని మెప్పించ దగినట్టి చిన్నకాన్క
లేవొ యిప్పించి తమ నింత బ్రోవు మనిరి. 870

కం. తమ కులవృద్ధుల కోర్కుల
సమకూర్చగ నిశ్చయించి సక్థిజ మునియున్
చమరీ వాలమ్ములు ని
ట్టి మదము ఘనసారము లమరించె శాటికలున్. 871

లోలాఖ్య. సమర్పించి సంతృప్తిన్
నమస్కార మన్నంతన్
కుమారా సదా వర్ధి
ల్లు మన్నారు వైశ్యర్షుల్. 872

కం. తమ వారసుఁ డొసగిన పలు
కమనీయంబైన కానుకలతో సంతో
షముతో వారలు పుష్పక
విమానమెక్కి వెను దిరిగి వెళ్ళుచు నుండన్. 873

కం. తన యాశ్రమంబు చేరియు
తన శిష్యుని చేత కామితంబులు గొనియున్
తన సంగతి మరతురె వీ
రని భార్గవ మునివరేణ్యుc డాగ్రహ వశుcడై. 874

ఉ. భర్గుని యింట సంతతము వాసముc జేసెడి సాహసమ్మొకో
భార్గవునైన నన్ను పరిపంథి యనం జనుచుండి రక్కటా !
దుర్గతులైన తుంటరుల తోషణ భూషణ శేష పుణ్యముల్
నిర్గతి నొందుగాక ధరణీగతులై జన కర్మ హీనులై ! 875

వ. అంచు శపించినంత తేజో విహీనులైన సిద్ధ వైశ్యులు. 876

కం. అరదము కదలదు నభమున,
ధర తగులము వదలదు, మది తకపిక లాడున్,
పిరిగొను పనిచెఱుపుల మఱు
గరయగవలె ననుచు నఱుత నరముడి గాంచన్. 877

కం. భార్గవుcడగు గౌతమ ముని
సర్గము నశ్రద్ధ చేయ సమకూడె నొకో
దుర్గతి యనుకొని సిద్ధులు
మార్గము సరిదిద్దుకొనగ మరలిరి వంతన్. 878

వ. దోషంబు నెఱిcగి రోషంబు కరిగి శీర్షంబులు మఱుcగువడిన కైలాస
వైశ్యపాళి భార్గవు రౌద్రంబుదీర నిట్లు వేడుకొనిరి. 879

చం. అతుల తపోనిధీ ! విమల హాస విలాస ముఖారవింద ! సం
తత కరుణా పయోనిధి ! నితాంత నిదిగ్ధ నికామ ధీనిధీ !
కృతఫల సమ్ముదమ్ము మము కృచ్ఛ్ర ముఖమ్మున ద్రోసె నిట్లు మా
నతులను స్వీకరించి మము నట్టకుమయ్య మహర్షి సత్తమా ! 880



తే.గీ. అంత భార్గవుc డవ్వారి వంతcగాంచి
మంత్ర వేత్తల నిట్లవమాన పరచి
శివుని సాన్నిధ్యమున గుల్క సిద్ధమైరె !
బ్రహ్మ వచనంబు చెవికేల పట్టదనుచు. 881

తే.గీ. ముఖము చూడక నేగెడు మునిని జూచి
నోట మాటలు రాని కిరాటు లందు
వంశమున బుట్టు తొలిపుట్టు వహ్ని ముట్టు
నపుడు శాపము దీరునం చాత్మcదలచె. 882

తే.గీ. తప్ప దెప్పటికైన భూతలము జన్మ
మిప్పటికి తప్పుకోవలె తప్పదనుచు
శివుని ధ్యానించి తమగోడు చెప్పుకొనిరి
వాని కృపచేత కైలాస మూని రంత. 883

కం. శివుcడును వైశ్యులు దెచ్చిన
దివిలో దుర్లభము లైన దినుసులు సతితో
సవరించి సంతసించెను,
స్తవముల దిగులు విడనాడి చనిరా వైశ్యుల్. 884

**ఇది శ్రీవాసవీపురాణమునందు వైశ్యులు భూలోకమున గౌతమమునిచే శాప మొందుటయను ముప్పది నాల్గవ అధ్యాయము సంపూర్ణము.**

(వల్లడి= అకారణమైన ఆపద, కడిగొను= కబళించు, కప్పలి= ఓడ, పరిపంథి= శత్రువు, కేడువారు= నశించు, అరముడి= మాటిమాటికి, నితాంత నిదిగ్ధ నికామ ధీ= అధికముగా పెంపబడిన స్వతంత్ర బుద్ధి, సర్గము= అనుమతి)

# ముప్పది యైదవ అధ్యాయము

**కం. తామస గుణ సంహారిణి !**
**కామిత సత్త్వగుణ విభవ ఖద్యోత మణీ !**
**భౌమ రజోగుణ గర్భిణి !**
**కామాతీతార్త లోక కల్ప వనీజా !**

కం. వనజాసను మాటకు వై
శ్య నికాయము చనిరె భూమి ! యందే కైలా
స నివాసులై మనిరె? అం
చు నిలా వైశ్రవణు లడుగ సూతుండనియన్. 885

ఉ. దేవుఁడు మేలు చేసె నికఁ దీరును కర్మఫలమ్మటంచు దు
ర్భావము జేయరాదు, పరిపక్వము చెందెదు దాక కర్మమే
తావున దాగునో తుదకు తప్పదు మోయక జీవరాశికిన్;
శైవ సమర్చనా విధుల శాపము దప్పునె సిద్ధులైనచో ?! 886

తే.గీ. అప్పటికి గండము గడచె నంచు సిద్ధ
వైశ్యు లాదమరచి యుండ వైళమజనె
లక్ష దివ్య వర్షము లుమా లాస్యమందు
శివుని తాండవ క్రీడ శ్వసించు వేళ. 887

చం. అది విని వైశ్యు లేమిటి మహాశయ నిక్కమె? దివ్య వర్షముల్
పది పదివేలు దంపతులు పాల్గొను క్రీడల బట్టునే భలా !
అదియును గాక శాపమున కాయువు చెల్లదె యింత కాలమున్?
మది ననుమాన ముల్దుదువుమా యని వేడగ మౌని యిట్లనెన్. 888



కం. మీరన్నది నిజమే మరి
కారణ కార్యములు వేరు కాలముల గనన్
వేరన్నది మీరెరుఁగుడు
సారము మది నింపుకొన్న సత్యము దెలియున్. 889

తే.గీ. జీవి జీవికి జీవన సేవనమున
కాల పరిమాణ మాన సంకలనమందు
భేదమేరీతి నుండునో విదిత మయ్యు
శంక రాత్రిజల యెడల శంక లేల? 890

ఆ.వె. ఆది యన్న దెరుగ మంతంబు నెరుగము
నట్టి కాల మతని జుట్టు పోగు,
అతని జీవమాన మరయంగ శక్యమే
వణిజులార ! సుగుణి వర్యులార ! 891

చం. శివుడన స్థాణువే కద ! కృశింపని ధాతు వతండు, రూపముల్
భవము లనేకముల్ సగుణ భావము నందును శక్తి రక్తిచే
భవుఁడగు నర్ధభాగమున భార్య వసింప స్థిరంబునై సదా
భవహరుఁడై చెలంగు తన బాహ్య విశేష విముక్తి గాంచుచో. 892

వంశస్థ వృత్తము.
యమించగారాని స్వయంభు వాతఁడున్
క్రమించగా రాని రిరంసు వామెయున్
రమించగా కాల విరామ మెంచగన్
భ్రమించదే మానవ రాగ శీలమున్ ! 893

తే.గీ. పంచ భూతంబులై తోచు పారమాణు
తత్త్వ మందలి స్థాణు చైతన్యములకు
నాల్గు కొలతల జీవమై వెల్గు లీన
వర్షములు లక్షయన నెంత వైశ్యులార ! 894

తే.గీ. అన్ని వర్షంబు లీశ్వరుం డటుల నొంటిఁ
గొండ కొమ్మున పార్వతిం గూడి యున్న
పారిజాత వన ద్వార పాలకులుగ
గాధి నందీశ్వరాదులు కాపులుండ. 895

వ. అంత నొక దినంబున బాణ రావణ సురధ గాధి నందీశ్వరాదులగు తత్కాల ద్వారపాలురు ప్రాతఃకాల స్నానార్థంబు దేవగంగకుం జనుచు సమాధి యను వైశ్యర్షి నందు గాపుంచిరి. 896

ఉ. లేచిన వేళ యెట్టిదొ బలీయ విధాత కవిత్వ మెట్టిదో !
ప్రోచిన దేవరం గొలువ బూనిన వానికి లేని పోని సం
కోచము దాని వెంట నొనగూడె నవాంతర దుర్నిమిత్తముల్
దాచిన దాగ దాయెను వెతార మకారణ మా సమాధికిన్. 897

కం. అయ్యెడ ముని దుర్వాసుం
డయ్యెడ కరుదెంచె నీశ్వ రార్చన కొరకై
చయ్యన లోనికి జన, బో
నియ్యడు వాకిట సమాధి దృఢనిష్ఠమెయిన్. 898

కం. ఎదురన్నది లేని మునికి
బెదురన్నది లేక నడ్డ వెట్టిన యంతన్
గదుకంజను సింహమ్మును
కదిలించిన యట్టు లగ్ని కన్నులఁ జిమ్మెన్. 899

మ. అణు విస్ఫోటన మట్టు లగ్గు లెగయ న్నకోపి దుర్వాసు వీ
క్షణము ల్దాకె సమాధి సాధు ముఖ సంచారార్ద్ర భావమ్ములన్
ప్రణతుల్ చెల్లవు త్రాహి పాహి శరణోపాయార్థముల్ వ్యర్థముల్
వణిజుండే విధి నిగ్రహించ గలడా బద్ధాగ్రహావేశునిన్ ! 900

కం. గడ గడ లాడు కణుజుపై
బడు పెద్దపులి వలె మౌని వాగాయుధుఁడై
పడె – నీ విటఁ దగ విలపై
బడి మర్త్యుఁడవై మనుమని పాయని కినుకన్. 901

కం. తొలి గౌతమ ముని చేతను
మలిగా దుర్వాసు చేత మాటలు పడగా
వలసెనె హతవిధి యనుకొని
పలికె సమాధి ధృతి నుగ్గ బట్టిన క్షమతన్. 902

ఉ. హే మునినాథ ! శాపమున హేతువు కావలె గాదె సంయమీ?
ఏమొనరించి నట్టి చెడుగేమిటి చెప్పవె స్వామి చెప్పిన
ట్లేము చరించుటల్ దగదె ? ఈశ నవాంబిక లొంటి నుంట నీ
సేమముగోరి యడ్డితిని, చిందులు వేయుట బాడియే యిటుల్ ? 903

వ. శపించినను శాంతంబు దప్పక సమర్థించుకొన బూనిన సమాధిం గాంచి సమాన స్థితిం జెందిన సంయమీంద్రుం డిట్లనియె. 904

చం. అతఁడొక మాయగాడు, యిక నాతని భృత్యులు మీరమాయకుల్;
అతఁడును నామెయున్ సరసమాడని చోటొక టున్నదే ! మహో
న్నతమగు వాని తీరు మిథునమ్ముల బంధము, మాయలే సుమా–
అతఁడు విధించుటీరలిటులాతని మాటలు పాటి సేయుటల్ ! 905

తే.గీ. నేను లోనేగు టందువా ! నేను వేరు
అతఁడు వేరన్న భ్రమతోడి మతము వీడి
యతఁడె నేనన్న సత్యంబు నందు నున్న
వాడ నాకేమి భయమోయి వాని జేర ? 906

కం. ద్వారము కడ నలజడి విని
గౌరీపతి వచ్చి చూచి కారణ మరసెన్
వైరంబున కొక తుద తను
వేరొక తుద భృత్యుఁ డొకడు వింతగఁ దోచెన్. 907

సీ. తన యంశ దుర్వాసు దర్శనమ్మున బ్రోచి
వీడ్కోలు బలుకగా వెడలె నతఁడు,
తన భృత్యుఁడు సమాధి దయనీయ స్థితిఁ జూచి
సాంత్వనమ్ములు బల్కె శంభుఁ డపుడు,
అంతయు మనమంచి కన్నట్లు మది నిండ
సంతోష మొందుమా సచ్చరిత్ర !
పరమ యోగుల ముందు పలుకాడ వెరతుమే
మేము, నీకేల మారాము జేయ?

తే.గీ. శంభు వచనంబుల సమాధి చకితుఁ డగుచు
న్యాయమే దేవ ! ముని చేసిన పని తీరు?,
శాప మొందగ నా వల్ల పాప మేమి?
చెప్పుమా ! యన్న పరమాత్మ చెప్పె నిటుల. 908

కం. నీ కింకను నీ వొకఁడవు
నా కొఱకు శ్రమింతు వన్న నమ్మిక పోలే
దే కార్పటిక మహాశయ !
నీ కా ! ముని నాథు నడ్డు నిర్వాకమ్ముల్ ! 909

కం. నీ మీదను దయ చేతను
నీ మిడుకు నమాయకత్వ నిమ్నత చేతన్
నీ మనమున నహము దొలుగ
నా ముని శపియించె నిన్ను హైన్యము వీడన్. 910

కం. ధర నున్న వారలు ధవళ
గిరి చేరుట వరము గాని గిరి విడి ధరపై
నరుఁడై పుట్టుట కరుణయె
హర శంకర చెప్పుమనగ హరుఁ డిట్లనియెన్. 911

కం. ధరపై జేసిన తపమే
హరు చెంతకు దెచ్చె నిన్ను, హరుఁడై నీవే
చరియింప నిచ్చ గలచో
ధరపైనే సాధ్యమగును తపములు సలుపన్ ! 912

కం. అదిగాక విప్ర శాపము
తుది వఱకును దీఱలేదు, తుంటరులై నా
మదికెక్కిరి, గిరి నెక్కిరి;
చదువుల ముదుకని పదములు సవరింపరొకో ! 913

ఉ. ఇతరులఁబోలెగాక మది నిచ్చ దొలంగక సేవఁ జేయు నీ
కితరులు లేని వేళ ముని యిట్లొనరించెను నీ హితానికై,
హితవగు మధ్య లోకము మునీశ్వరు ధాటికి సాటి మేటి సం
స్థితిగని నన్ను జేరగల సిద్ధి లభించును పోయి రమ్మికన్. 914

వ. అని పలికి పరమేశ్వరుండు పార్వతిం గూడి పర్వత రాజు చేత సత్కారంబులం బొంది నిజనివాసంబున కరుగ సమాధియు మనంబున సమాధాన పడుచు రానున్న శాపఫలంబుల నోర్వదలంచుచు యథావిధి శివుని సేవింపుచుండె. 915

***ఇది శ్రీవాసవీపురాణమునందు సమాధికి దూర్వాసుని శాపవృత్తాంతమను ముప్పదియైదవ అధ్యాయము సంపూర్ణము.***

(మిడుకు= బ్రదుకు, వెతారము= దుఃఖము, చదువుల ముదుకడు= బ్రహ్మ)

## ముప్పది యారవ అధ్యాయము

**కం. ఓంకారోద్భవ జననీ !**
**ఐంకారాత్మిక చతుర్ము ఖావిష్కరిణీ !**
**హ్రీంకార రూప వాసిని !**
**శ్రీంకారార్చిత శుభాంగి ! చింతా శమనీ !**

కం. శప్త సమాధి కథ వినుచు
తప్తాంతః కరణులైన తాపస వైశ్యుల్
గుప్త కథామృత చంద్రమ
ప్రాప్తం బేతెన్ను జేర్చె పలుకు మనంగన్. 916

వ. ముని సాలంకాయనుం డపు డిట్లనియె. 917

ఉ. శాపము దీరు తీరు విని శాంతము నొందుడు వైశ్యులార ! ఈ
లోపల తారకాసురు నలోకు నొనర్చిన తీరు నీశ్వరో
ద్దీపిత షణ్ముఖోర్మికల తీరును వీనుల విందు చేతు మీ
తాపము లెల్లఁ దీర నఘ దౌష్ట్యము తీరఁ గథాక్రమంబునన్. 918

ఆ.వె. అనగ శ్రోతలెల్ల రాతురతను వీడి
తారకాసుర వర దర్ప మెట్లు
తీరెఁ జెప్పుమనుచు కోరి ప్రార్థించగా
మునియుఁ జెప్పె నిట్లు తనియు నట్లు. 919

సీ. కైలాసమును జేరి కళ కంతుఁడును గౌరి
కాపు వారలు లేని గహ్వరమున
క్రొత్త కాపురమందు క్రొంగొత్త శృంగార
కేళీ విలాస సుఖాళి మునిగి
తిరిగి మరొక వేయి దివ్య వర్షంబులు
గడపి రంతట దేవ గణము తార
కుని యాగడము లోర్వకునికిఁ జెచ్చెర వచ్చి
రసభంగ మొనరించి రసుర వేళ

తే.గీ. లాతి వారలఁ గని గౌరి లజ్జ నొంది
ధవుని జత వీడి ప్రక్కకు తప్పుకొనుచు
సురత శిఖరాగ్ర నిష్పాద్య సుఖము జాతి
వేడి నిట్టూర్పు లెదరేగ నాడె నిటుల. 920

శా. ఓరీ దేవతలార ! యింత పొగరా? ఓ జంట రే యొంటిమై
గోరంకుల్ వలె నుండ సంతతి గనన్ గోమాయువుల్వోలె స్వా
ర్థా రణ్యాఖువులై వివేక విగతిన్ హైన్యంబునం జొత్తురే !?
మీరీపై ననపత్యులై బ్రతుకుడీ మీ పాప కర్మార్థమై . 921

తే.గీ. ఎలుగు బంటుల దాడికి నేగ లేక
నలఁగి పులినోటఁ బడినట్టులాయెఁ దుదకు
దేవతలు తమ కర్మకు తిట్టు కొనుచు
మిన్నకుండిరి దుర్విధి మీదఁ బడగ. 922

చం. విడుదల యైన తేజమును విత్తెదు క్షేత్రము గాన రాక నీ
శుఁ డెదుట నున్న నగ్ని ముఖ శోణిమ నుంచిన నోర్వజాల కా
తఁడు సురగంగలో విడిచెఁ దాపము జెందిన గంగ తెల్లనన్
విడిచెను దాన షణ్ముఖుఁడు వెల్వడెఁ దారకలందు భానుఁడై. 923

కం. శరవణ భవుఁడగు శివసుతు
నురమున ధరియించి పెంచి రుత్సాహమునన్
సుర సతులగు కృత్తిక లా
ర్గురుఁ దమ పుణ్యఫలమంచు గుప్తాభ్రమునన్. 924

ఉ. కృత్తిక లాదరింపc బర గృహ్యా వివర్ధతc గార్తికేయుcడై
దత్తత సప్త మాతృకలు దాల్చిన మాతృ విధిం గుమారుcడై
యొత్తగు తెల్లు జొంపముల నుద్భవతన్ శరజన్ముcడై చనన్
మెత్తగc జేరి దేవతలు మెచ్చి వరించిరి స్కంద నాథుగా. 925

ఉ. దేవత లంత తారకుని దీర్ఘ నిరంకుశ రాజ్య దౌష్ట్యముల్
దీవరులై వచించి ప్రణుతించి శ్రయించి నమస్కరించినన్
శ్రావణ మేఘమట్లు ఘనరావము సల్పెను దిగ్దిగంతముల్
గ్రేవలు దప్ప షణ్ముఖుcడు గ్రీవములారిcట షడ్జమంబులన్. 926

చం. ప్రళయ భయంకరార్భటుల బ్రాకట రాజ్య రమా విభూతులుం
గలవర మొందc దారక సృగాలము లేచెను గ్రామసింహమై
గళమున తారకల్మెరయc గన్నుల నిప్పులు రాల మత్తులో
కళవళ పాటు లోగొనుచు కత్తులు దూయుచు దుర్విదగ్ధతన్. 927

ఉ. యుద్ధముc జేయ వచ్చిన మయూర శతాంగుcడు వాని యోధులౌ
సిద్ధులు రుద్ర చారణులు సింధుర యూధము లాక్రమించగా
యుద్ధముc జేయ సిద్ధమగు యోజనలేని సురారి తారకుం
డుద్ధతిc గాలకేయ తుర గోరగ యోధుల గూర్చుచుండగన్. 928

కం. మాయావతి నగరము రుధి
రాయస్తము గాగ తారకాసురు సేనల్
మాయా శక్తులc బోలిన
వా యోధనమందు ద్వాదశాబ్దములు ధృతిన్. 929

కం. ఎంతకుc దెమలని సమరము
నంతము జేయంగ నెంచె నపుడు కుమారుం
డెంతయు నుత్సాహమ్మునc
గుంతము చేపట్టి సాగc గూలిరి దైత్యుల్. 930



సీ. శూలపద్మాసురు శూలంబునం గ్రుచ్చి
తలగొట్టి భూమిపై దొలిపి యాడె,
నెగయు గజానను నిలికంబునంగొట్టి
చెఱుకుc జీల్చిన యట్లు చీల్చివేసె,
వృషపర్వు వక్షంబు విచ్చి పోయెడు నట్లు
సూటిగా ఛురి గుతి చూచి వేసె,
కాలకేయాదులా కార్తికేయుని తీవ్ర
సంహార శక్తిని సైపలేక

తే.గీ. కాద్రవేయులను నివాత కవచులను ద
ధీచి నేతృత్వమున గూడి దిక్కు తోచ
క పరుగులు దీసి పాతాళ గహ్వరముల
దాగి రయ్యెడ ప్రాణాలు దక్కెనంచు. 931

తే.గీ. పలుచబడి పోయె సైన్యంబు, పగఱ యందు
పలుచబడి పోయె నభిమాన, మలసి యుంటc
బలుచబడి పోయె బల, మైన వరము బలిమి
పలుచబడలేదు తారకు పంతమింత. 932

కం. ఉక్రోషంబున దైత్యుని
వక్రోద్ధతి మేరమీరి వదనంబెల్లన్
శుక్రుం డావేశించగ
విక్రాంతిం దారకుండు వెక్కస పడుచున్. 933

తే.గీ. నేత్రములc బ్రతీకారంబు నిప్పులుమియ
మూడు లోకంబులకుc జావు మూడినటుల
మత్త కరివోలె స్కందుపై కెత్తివచ్చు
తారకుని నడ్డుకొనె భవ తారకుండు. 934

తే.గీ. గరుడ వాహనమున జక్రధరుని జూచి
కాఱు కూతలు గూయుచు తారకుండు
నమ్మ్ము లీటెల గొడ్డళ్ళ గ్రమ్ముచుండ
నవ్వుచునె వాని వారించెఁ బువ్వు బొడ్డు. 935

ఆ.వె. విల్లు విరుగ గొట్టి వెన్నుఁ డా తారకు
వక్షమందు గొట్టెఁ గక్ష దీర,
పంతగించి వాఁడు పదివేల బారువ
శక్తి వేసె వెన్నుఁ జంప నెంచి. 936

చం. గణ గణమంచు మీదబడు కైదువు నోర్వగ లేక దేవతా
గణపతి చాటు చేరి హరి ఘాతిని నడ్డుమటంచు వేడగా
రణ పరిపాక మాయెనిక రాక్షసు నుంచగ రాదటంచు మా
రణ సురశక్తి సాంద్ర భిదురంబగు శక్తిని వేసె స్కందుఁడున్ . 937

శా. ఆనాడా కమలాసనాప్త వర వర్షాభోగ గర్వోద్ధతిన్
నానా బాధల నెట్టు తారకుని ప్రాణంబుల్ హరింపంగ నీ
శానోన్నిద్రిత తేజమందు వర వర్షంబైన దైవీప్రభల్
సేనా నాయకుఁ జేసి యిచ్చిన మహాశ్శక్తి హ్రీంకారమై. 938

తే.గీ. తారకాసురు శస్త్రముల్ తగుల బడగ
దారుణాస్త్రంబు లొండంటఁ దగులు వడగ
వాని కంఠంబు నందుండి వాని బ్రోచు
నమృత లింగమ్ము ఛేదించె నమర శక్తి. 939

ఆ.వె. ఐదు ముక్కలగుచు నమృత లింగంబంత
నైదు చోట్లఁ బడియె నాంధ్ర మందు
శిరము కృష్ణ చెంత శేషముల్ గౌతమిన్
వెలసె సురలు నిలుప వేరు వేర. 940



వ. పవిత్ర కృష్ణా నదీ తీరంబున నమరేంద్రుఁడు ప్రతిష్ఠించిన యమృత లింగ శీర్ష భాగం బమరేశ్వరుండై తదారామం బమరారామంబు గను, పూర్వ గోదావరీ తీరంబున కుమారస్వామి స్వయముగా ప్రతిష్ఠించిన యమృతలింగ వక్షోభాగంబు కుమార భీమేశ్వరుండై తదారామంబు కుమారారామంబుగను, గౌతమీ తీరంబున సూర్య భగవానుఁడు ప్రతిష్ఠించిన యమృతలింగ గర్భంబు భీమేశ్వరుండై తదా రామంబు దక్షారామంబుగను, గోస్తనీ తీరంబున నమృతాంశుఁడు ప్రతిష్ఠించిన యమృతలింగ మూలంబు సోమేశ్వరుండై తదారామంబు సోమారామంబుగను, వశిష్ఠా తీరంబున నారదాది సకల దేవతా సమ్ముఖంబున విష్ణుమూర్తి ప్రతిష్ఠించిన యమృతలింగ పీఠంబు రామలింగేశ్వరుండై తదారామంబు క్షీరారామంబుగను వెలసి భక్త జనంబుల గాపాడుచుండఁ గార్తికేయుండు బ్రహ్మాస్త్రంబును బ్రయోగించి తారకా సురుని ఖండించి వైచె. 941

కం. ఎంతో కాలముగా పలు
సంతాపములందు బొగులు సర్వామరులున్
సంతోషంబున స్కందుని
స్వాంతములం బొగడి తాము సాంత్వను లగుచున్ . 942

తే.గీ. జయ జయ ధ్వానముల భుజ స్కంధములను
స్కందు నెక్కించుకొని వియద్గాము లగుచు
నిజ గృహంబుల కరిగిరి నిబ్బరముగ;
ధరణి ప్రజలును హాయి సంభరితులైరి. 943

***ఇది శ్రీవాసవీపురాణమునందు తారకాసుర సంహారమను ముప్పదియారవ అధ్యాయము సంపూర్ణము.***

(గోరంకువు= దిసమొలవాడు, షణ్ముఖోర్మికలు= ఆరుముఖాల అలలు, అలోకుడు= లోకుడు కానివాడు, నిష్పాద్య= సిద్ధింపదగినది, అరణ్యాఖువు= అడవిఎలుక, గుప్తాభ్రము= రహస్యా కాశము, ఇలిక= భూమి, అలగు= దుఃఖించు, ఈశానోన్నిద్రిత= శివునిలోమేల్కొన్న తేజము)

# ముప్పది యేడవ అధ్యాయము

**కం. ఆర్యా ! హిమవద్ధీ సం**
**ధార్యా ! ఐందవ కిశోర ధారణ గుణ సౌం**
**దర్యా ! వేద వచో మా**
**ధుర్యా ! వైశ్యార్ణవ ప్రతోషా హార్యా !**

ఉ. తారకుఁ డంతమాయె, సుర తారక లాకస మంట తోష సం
చారము సల్పె, మానవులు శాంతము నొందిరి, దానవోర్ధ్వ సం
చారము లాగిపోయినవి; శంభుఁడు శాంభవితో కుమారునిం
గారము లాడుచుండ నయగారములం జని నారదుండొగిన్. 944

తే.గీ. మహతి మీటుచు నోంకార మంత్రమందు
నాది దంపతులను గొనియాడు చుండ
వినుచు శంభుఁడు తాబేటి వీపు వంటి
పుడమిలో వార్త లేమని యడిగె నపుడు. 945

కం. ఏమని చెప్పుదు తారకు
తామసముం జేసి వేల దైవ వసంతాల్
భూమిని యజ్ఞ హవిస్సుల
లేమిని కాటకము ప్రబలి లేవు యుషస్సుల్. 946

వ. అనుచు నారద మహర్షి వెండియు నిట్లనియె. 947

కం. రక్షకులు లేక మానవ
శిక్షకు లేగిరి వనముల శిక్షౌఘములన్,
రక్షకులు పారిపోయిరి
రాక్షసు నెదిరించ లేక రక్షణ కొరకై. 948

కం. రక్షణ శిక్షణ కరువై
దక్షత మరుగై వణిగ్వదాన్యులు కృషులన్
మోక్షము నొంది వనస్పతి
భక్షకులై బిలము లందు భద్రత గాంచన్. 949

కం. ఏ యెండ కా గొడుగు ప
ట్టే యెడ్డెలు మాత్ర మందె యిచ్చలు దీరన్
హో . . . యింత మంచి ఱేడే
డీ – యీ త్రిభువనములందు డీకొన నంచున్. 950

వ. యథా రాజా తథా ప్రజాయన నిల్చి రా లోకం బరాచకంబై దుర్మార్గంబుల ప్రవర్తిల్లు నట్లికపై నెట్లగునో తమ చిత్తంబని వినయంబు గదుర దేవర్షి నుడివిన శివుండును మధ్యలోకంబు చక్కబడు నుపాయంబు వచింపుమన నారదుం డిట్లనియె. 951

కం. వ్యవసాయంబును వర్తక
మవనిని ఫలియించ వలయు నాపై రక్షా
కవచము శిక్షా మంత్రా
ద్యవయవములు గూడు వాని యంతట నవియే. 952

వ. సకల శుభములకు మూలములు వ్యవసాయ వాణిజ్యములు గావున వానిని నిర్వహించు వైశ్యుల గోబిలము నుండి మొదల బయటకు రప్పించ వలయు నట్లు చేయంగల వైశ్యశ్రేష్ఠులగు సిద్ధపురుషులు తమ సన్నిధినేగల రావల తమ చిత్తంబని యూరకున్న నీశుండును. 953

కం. ఔనౌ నది నిజమే కద !
కానిమ్మీ సిద్ధ వైశ్య గణముల శాపం
బా నేలను జన్మించిన
గానీ తీరదు కదా ! జగత్త్రయ గామీ ! 954

ఉ. పొమ్మని చెప్పు మర్త్యులను భూతల మందలి గోబిలంబునన్
గమ్మున నున్నదాయల వికారము బాపి సమాజ యాజికిం
దెమ్మని చెప్పు మర్త్యకుల తేజము వర్ధిల జేయ నారదా !
పొమ్మని చెప్పి శంకరుఁడు పుత్రుని గూడి గృహంబు వీడగన్ . 955

కం. ఈశ కుమారులు జన నం
దీశుఁడు వారల బిఱుంద నేగుట గనగా
నీశాని కనుల రోషా
వేశ మొదవుట గమనించె వేలుపు మునియున్. 956

తే.గీ. కలసి వచ్చె నదృష్టంబు కాళ్ళ కడకు
గాక యిదియేమి విపరీత కాల మొక్కొ –
అర్ధ దేహము విడనాడి హరుఁడు వెడలు
టవల నర్ధాంగి మానసం బడలు కొనుట ! 957

వ. అదియె యవకాశంబనుచు నవకాశవాది యగు ముని భగవతిం జూచి
యిట్లనియె. 958

కం. పొడగంటివె తల్లి శివుని
గడుసుదనము ! నిన్ను నన్ను గాదని యెటకో
వెడలుట – తలపై నేదో
పడిన దనగఁ దీసి వేయి భడవా ! యనగన్ ! 959

కం. మీ పాదముల కడ మెలఁగు
గోపాలుర నెట్టు లిచట కూడదు పొమ్మం
చే పల్కెద చెప్పమ్మా ?
పాప తొడవుల విభునకిది భావ్యమె చెపుమా ! 960

ఆ.వె. జగదధీశులకును జగడాల జడదారి
ముప్పు తప్పదు కద చెప్పనేల –
అగ్ని కాజ్యమట్లు అలకపై మునిపల్కు
చేరి కోప మెనయ జేసె నంత. 961



సీ. అత్తపై కోపంబు దుత్తపై చూపిన
ట్లంబ చూడ్కులు దాకె నమర మునికి
పో పొమ్ము పో శంభుఁ బూజించు వారలా
శంభు నిష్టంబునే సలుపు మనుము.
మంతనంబుల వారి మధ్యలో నిరికించి
యింత జేసిన వాడ వీవు గాదె ?
మాట చెప్పుట కేమి మాయ రోగము నీకు
పొమ్మని గిరిపుత్రి పోయెఁ దాను.
తే.గీ. అడ్డు దిరిగెనె కథయంచు నమర మునియు
మిగుల నిష్కామ కర్ముండు నగుటఁ జేసి
రజత గిరి దేవనది జేరి రహిఁ జెలంగు
సిద్ధ వైశ్యుల గని పల్కె శివుని యాన. 962

తే.గీ. ప్రక్కలోనె పెద్ద పిడుగు పడిన యట్లు
ముసుగులో నుండ నుప్పెన ముంచి నట్లు
భూమి కంపించి బ్రద్దలై పొదివినట్లు
శివుని యానకు హడలెత్తి సిద్ధులపుడు. 963

సీ. మునిని జూచితిమన్న మోదంబు దీరకే
ముని వాక్యములు కొంప ముంచె నకట
చిన్నవోయిన మోము లన్నియు ముని మ్రోల
విన్నపమ్ములతో విపన్ను లగుట
దారి తోచని వారి దారిద్ర్యమును బాపు
దారి చూపుట జడదారి దగుట
గోబిలమ్మున దూరి గోప్యంబుగా నున్న
కోమట్ల సంగతి గూర్చ నగుట
తే.గీ. పలికె నారదుం డవ్వారి భాగ్యమందు
పుడమి కేగక తప్పని గడియ లగుట
పోయి గోబిలమ్మున జారు దాయల నిల
నుద్ధరింపు డటంచు నా సిద్ధ విశుల. 964

ఉ. మున్నొక సారి యక్షు దయ భూమికి వెళ్ళుట శాప మొందుటల్
కన్నుల గట్టి వైశ్యులను గ్రమ్మరఁ బోవుటచే భవిష్యముల్
మన్నగు నేమొ యంచు ముని మాటల యందలి శైవ చిత్తమున్
మన్నన జేయలేక దమమానస మా మునిముందు నుంచుచున్. 965

చం. మునివర నారదా తమరు మోక్ష గృహంబును మాటి మాటికిన్
పనిబడి వీడునట్లు మముఁబంచుట న్యాయమె చెప్పుమయ్య మీ
యనిమిషు లందు స్వార్థ మిదియా ... శివ సన్నిధి కల్గెనన్న మా
తనివి యెకింతఁ దీరకయె దారుణ శాపములందు ముంతురే ? 966

వ. అనుచు వైశ్య సిద్ధు లత్యంత దీన వదనులై తమ్ము గాపాడుమని ప్రార్థింప నమ్ముని వరుండును. 967

ఆ.వె. ఏల వైశ్యులార యింత వాపోవంగ
నేల, నేల మీర లేల వలయు
పాడు బద్ద పుడమి పాడి పంటల దేల
వలదె మీరు బోక వలను పడునె ?! 968

ఆ.వె. హరుని లీల దెలియ మీరెంత నేనెంత
కారణంబు లేక కామి గాడు,
హతము మాని వాని మతము వీడుట లెస్స
కులము మేలుఁ గోరికొనుట లెస్స. 969

ఆ.వె. అనుడు సిద్ధ వైశ్యు లనునయంబున మునిఁ
దప్పు సైపు మింక నొప్పు సేతు
మానతిమ్మనంగ నాతండు దయతోడ
పలికె నిటుల నభయ పదము గదుర. 970

ఉ. మీకు శుభంబగున్, శివుఁడు మిమ్ముల నాదటఁ బ్రోచుగాత ! మీ
దూకుడు మాని గోబిలము దూరిన వంశము జేరి ప్రేమతో
మీకు గలట్టి పుణ్యమును మీటి విపన్నుల నుద్ధరింపుడీ
శ్రీకరులార ! త్యాగ గుణ శీలురు కందు జగద్ధితంబుగన్. 971



తే.గీ. అంతఁ గైలాసమును వీడి రార్య వైశ్యు
లవని గోబిలంబును జేరి రం దగాధ
సంతమసమందు బంధు వాసంబు లరసి
కంటఁ దడివెట్టి రంతరం బంటఁ గరుణ. 972

తే.గీ. నివురు గప్పిన నిప్పుల నివురులూది
రఖిల పుణ్యంబు లూర్పులం దపగమింపఁ
గప్పు తొలగిన మణులు ప్రకాశ మొందె,
విద్యు దపగత ఘటములు వేసరిల్లె. 973

వ. అంత నవనిం జన్న వైశ్యసంతతులును తమ్ముద్ధరించిన వారిఁ గాంచి. 974

ఆ.వె. చీకురించు మాకు చీకట్లు పోగొట్టి
వెలుగు నుంచి నట్టి వేల్పు లార
మా నమస్సు లంది మమ్ము దీవింపుడీ
గమ్య మానతిండు కామ్య మలర. 975

వ. అనుచుఁ బ్రార్థింపఁ దేజోవిహీనులయ్యును సంతృప్త హృదయులైన సిద్ధ వైశ్యులును. 976

ఆ.వె. ఇది శివాజ్ఞ మీర లిల నుద్ధరింపగా
నుద్ధరింప బడిరి, యుద్ధరింపు
దుర్విఁ బాడి పంట లుద్గాఢ మగునట్లు
తిరిగి వసుధ వెలుగు విరియు నట్లు. 977

వ. అనుచు నవ్వారి నాశ్వాసించి తేజోవిహీనులైన సిద్ధులు దమసత్కృత్యంబు నహిర్బుధ్న్యునకు వివరింపఁ దిరిగి కైలాసంబునకుంజనిరి. 978

**ఇది శ్రీవాసవీపురాణమునందు భూలోకమును చక్కదిద్దుటకు శివుఁడు సిద్ధ వైశ్యులను పంపుటయను ముప్పదియేడవ అధ్యాయము సంపూర్ణము.**

(శిక్షౌఘము= శిక్షకుల కూటమి, సంతమసము= అంతటనిండిన చీకటి, అపగమించు= సమీపించు, ఉద్గాఢము= అధికము, అహిర్బుధ్న్యుడు= శివుడు, మీటు= త్యాగముచేయు, వేసరిల్లు= శ్రమనొందు)

# ముప్పది యెనిమిదవ అధ్యాయము

**కం. కామాక్షీ ! కౌమారీ !**
**కామిత వర దాయినీ ! ప్రకామార్ణవ ధీ**
**సోమాంకిత సౌందర్యా !**
**రామా రామా ! జనాభిరామా జననీ !**

ఆ.వె. ఆలు మగల మధ్య నంటిన యనుమాన
బీజము మొలకెత్తి భూజమగుట
యాది దంపతి గద ! అనృతమగును గదా !
యనుచు విశులు పలుక ముని వరుండు. 979

తే.గీ. ఆది దంపతు లైన నే మార్యవాక్కు
జరిగి తీరుట నిక్కమీ జగతి యందు
రూప రస గంధములు సోకి రుద్రుఁడైన
కష్ట నష్టంబులకు గుఱి గాక పోడు. 980

వ. అన విని శంకానివృత్తులైన శ్రోత లనంతర వృత్తాంతంబు వినిపింపుమన సాలంకాయన మునివరుం డిట్లనియె. 981

చం. శివగిరి పైన కాంచన విశిష్ట వితర్దికఁ గొల్వుదీరి, తాం
డవ జనకుండు నందిపతి డంగుర శబ్ద నిరూఢి నూత్న తాం
డవముల కల్పనంబు త్రిపుటమ్మున జేయుచు నాడుచుండగా,
శివుఁడు నిమీలితాక్షుఁడయి శీర్షము నూచుచు నుండ నత్తఱిన్. 982

కం. కొలువున బ్రహ్మేంద్రాదులు
నలరుచు దన్మయము జెంది రాదట వోవన్
కలఁగిన హృదయమ్మున బతిఁ
దల పోయుచు గౌరి వచ్చి ధవునిం జూచెన్. 983

ఆ.వె. ధవుఁడు ధవుని కొల్వు దన్మయమ్మున మున్గ
తన్వి తనువు మున్గెఁ దాపమందు
పాము బుసల నడుమ పతికి కాస్తంత దూ
రాన నిలిచెఁ గుండె రగులుచుండ. 984

ఆ.వె. అంత గొంత తడ వనంత సంతస మందు
నందికేశు నాట్య మందు మునిగి
నాట్య మాగినంత నటరాజు నగుమోముఁ
గనులు విచ్చి నటుని గారవించె. 985

ఉ. తండువు నీవు నీదయిన తాండవ మందు బ్రసిద్ధి చెంది కా
రండవమై చెలంగి నటరాజను పేరు గడించితిన్ సఖా !
నిండు మనంబు నందు నిను నిర్మల భావము నుంతునంచు బ్ర
హ్మాండము సంతసిల్ల యజమానుఁడు వల్కగ నందికేశుఁడున్. 986

తే.గీ. పట్టరాని యానంద మప్పట్టునందు
తనువు కర్షణమ్ముల దాటి తనివి నొంద
కాలు నిలువని పాశవిక ప్రచేత
గౌరిఁ జూడక శివు చుట్టుఁ గలయఁ దిరిగె. 987

తే.గీ. తన్ను గాదని శివుని ప్రదక్షిణమున
దృష్టు నొనరించు నందిని దినెడు నట్లు
చూడ్కుఁ బ్రసరించి శాపంబుఁ జుట్టె –పశువ
పొమ్ము గతిమాలి భూమిపైఁ బుట్టు మంచు. 988

వ. తినుచున్న పాయసమ్మున విషకీటకము పడ్డ చందమ్మున, చేతికందిన పంటలు వరద పాలయి నట్టుల, విజయరథమ్మొక్క సారిగ గోతిలో దిగబడిన విధమ్మున జలించిపోయిన నందియు నంబను గాంచి. 989

సీ. ఏ మాత ముఖపద్మమింతకాలము ప్రేమ
కురిపించి పెంచెనో గుఱుతు కలదు,
ఏ మాత గారాము లింతకాలము సొంత
కొడుకుగా చూచెనో గుఱుతు కలదు,

ఆడినదాటగా పాడిన పాటగా
నే మాత సాకెనో యెఱుక కలదు,
అయ్య కోపించిన నమ్మగా లాలించె
నే మాత హృదయమో యెఱుక కలదు,

తే.గీ. నేడు తన్నేవగించిన కీడు కతన
మనసు వికలమై ముఖమంత మాడి పోవ
బొంది పాతాళమున పడిపోయి నటుల,
నోట మాట రాకుండె నా పాటుజూచి. 990

ఉ. సౌధ తుషార వర్షమున శాంతము నొందిన గౌరి యంతటన్
నాథున కంజలించి మననంబున జేసిన తప్పు దిద్దగా
శోధన మూని పల్కెనిటు చూడుము నంది ! మదీయ శాపమున్
బాధిత భూమి బాగుపడ పంటలు పండగఁ గారణంబగున్. 991

ఉ. వాసవి రూప మందచట వైశ్య కుటుంబము నందు తొల్లి మా
వాసి చెలంగు, నీదు సహవాసము చేయును, భూనివాసమున్
దోసము గాదు; జానపద దోషములన్ దొలగింప, సాధు సం
త్రాసముఁదీర్చ మేమును విరామము లేక జనింపమే భువిన్ ! 992

వ. అనగా నమ్మ తనతోనుండ తనకేమి లోపమగు లోక హితార్థ మీ సేవకుం డెల్లవేళల సిద్ధమనుచు వచింపుచుండ శివుండును భార్య చతురతకు మెచ్చి తన దేహమందర్ధ భాగమొసంగి సాంబశివుడై తనరె. 993

ఆ.వె. అట్టి సమయ మందు నర్య సిద్ధులు భూమి
నుండి వచ్చి శివుని యండజేరి
తాము గోబిలమున దమ వారి కోసమై
చేసిన విధమెల్లఁ జెప్పు కొనిరి. 994

ఆ.వె. ఊబిలోని వారి నుద్ధరించుట మాకు
పుణ్యమెల్లఁ దరిగిపోయె నిపుడు
నీదు యానతినిటు నిర్వీర్యులైతిమి
నేది దిక్కు మాకు నిందు మౌళి ! 995

వ. అని పలుక సిద్ధ వైశ్యులందు ముఖ్యుండగు సమాధిం గాంచి సాంబశివుం డిట్లనియె. 996

ఉ. ఓయి సమాధి నీవు నొక యుగ్ర దురాసద శాపమందు గో
ల్పోయితి విందు నుండగల పుణ్యము నిట్టులె వీరలెల్లరున్
పోయిన పుణ్యముం దిరిగి భూమిని మాత్రమె పొందగా నగున్
పోయి గడించి రండచట పుత్ర జనమ్ముల మార్గదర్శులై. 997

ఆ.వె. నంద శాపమొంది నందియు, నందికి
మినుకు పలికి నంద చనుచు నుండ
వారి యండ మీకు వసుధ నుండును కాదె
పుణ్యమొంది రండు పోయి రండు. 998

శా. సంతోషమ్మున భూమికిం జనుడు మీ సామర్థ్య మేపారగా
కాంతారోపమ కర్మభూమి మగుడన్ కామ్యార్థ సందర్భమై
క్రాంతిం జెందగ సంగ్రహింపు డమల క్రయ్యమ్ములగ్ర్యమ్ములన్
శాంతం బొప్పగ ధర్మ మార్గముల బ్రాశస్త్యంబునన్ వెల్గుడీ. 999

**ఇది శ్రీవాసవీపురాణమునందు నందీశ్వరునకు భూలోకవాసమను ముప్పది యెనిమిదవ అధ్యాయము సంపూర్ణము.**

(డంగురము= చర్మవాయిద్యము, కారండవము= కన్నెలేడి, ప్రచేతుడు= గొప్ప మనసు గలవాడు, నంద= పార్వతి, మినుకు= మంచిమాట, క్రయ్యమ్ములగ్ర్యమ్ములు= శ్రేష్ఠములైన వస్తువులు)

# ముప్పది తొమ్మిదవ అధ్యాయము

**కం. నవ జీవన మధుకరి ! మా**
**నవ జీవన దాయిని ! జననవ సంధాత్రీ !**
**నవ నవ రస వాగ్ఝురి ! దా**
**నవ కుల తమసాపహర్త్రి ! నవ సావిత్రీ !**

కం. అనవిని వైశ్యు లటుల శివుఁ
డనవిని వైశ్యుల మనంబు లందే భావం
బనువు పడె ననుజ్ఞ వడసి
చనిరే యన మునియు సంతసమ్మున దెలిపెన్. 1000

తే.గీ. శివుని పలుకులు ములుకులై చిత్తమంట
సిద్ధవైశ్యులు లోఁగుందు చింత వెడల
నతని పాదంబులం బడి రర్థులగుచుఁ
బలుకు పలుకున బరితాప మొలుకు నటుల. 1001

సీ. మందార మకరంద మాధుర్యములు వీడి
మదనములను జేరు మధుపములమొ
కల్పద్రుమచ్ఛాయఁ గామితార్థము రోసి
విషవృక్షముల జేరు వేలుపులమొ
సస్య సంపన్న భూసారంబు విడనాడి
కఠిన భూముల ద్రవ్వు కర్షకులమొ
సంగీత సాహిత్య మంగీకరింపక
కితవుల జతగూడు కిన్నరులమొ



తే.గీ. అగుతఁ గాకున్న కైలాస నగ నివాస
మధుర జీవన రసమాని మధ్య లోక
తమమునం బడఁ దగినట్టి తప్పు కలదె?
శివుఁడు చెప్పక కుట్టునే చీమయైన ! 1002

ఆ.వె. ఏమి సేతుమయ్య యీశ్వరా నీ యందు
భారముంచి బ్రతుకు బానిసలము
తిక్త కంఠ మమ్ము తిట్టినా కొట్టినా
దిక్కు గాక పోవు దీన బంధు ! 1003

ఉ. ఏ గుణ సౌరభంబు మము నీ మహనీయ పథంబు జేర్చెనో
ఏ గుణ గౌరవంబు మము నీ పద సన్నిధి జేర్చి బ్రోచెనో
ఆ గుణ సౌధమేల శిథిలాశ్రయమై భవదాగ్రహానలో
ద్వేగ వశంబుఁ గూలె భువి వేల్పులకై బలివేత కాదొకో ? 1004

కం. కానిమ్మీరే వేల్పులు
పోని మీ్మ మానవుల్ తపోధను లైనన్
చానీ భూ స్వర్దేశా
ధీనార్భకులై దివిద్వితీయ శ్రేణిన్. 1005

వ. అంచు బలు విధంబుల నిష్ఠురంబులాడు నా శాపగ్రస్తుల జూచి భక్త
దయా పరతంత్రుఁడగు నీశ్వరుఁడు వారి ననునయించుచు నిట్లనియె. 1006

సీ. ఏ లాభ మాశించి యేరులై ప్రవహించు
వరుణుఁ డెల్లప్పుడా వసుధ పైన
ఏ శాప ఫలమున నింధనమ్ముల వ్రేల్చు
నగ్ని నిరంతర మవని పైన

ఎవని పంపున వాయు వెల్ల దిక్కుల గంధ
వాహుఁడై తిరుగును వసుధపైన
ఏల నాకాశ మెల్లెడలఁ గాపుర ముండు
పూజ్యంబునై పుణ్యభూమి పైన
తే.గీ. సూర్య చంద్రులు నిరతంబుఁ జుట్టు భూమి
నేల నే శాప మే లాభ మెవని జేసి?
బ్రహ్మ చేతికి నరులు దేవత లటంచు
భేద మున్నదె మీ చిత్త భీతి గాక ! 1007

ఉ. కావున భక్తులార భువిఁ గాలిడి నాకు ముదంబు గూర్చు దే
తావున మీరు కాలిడిన ధర్మము మెండగు రోగ బాధ లా
తావున నిండుసున్న ధనధాన్యము లేపగు వెండి బంగరుల్
లావగు మీదు కీర్తి విపులమ్మగుతన్ దిగులొంద బోకుడీ ! 1008

సీ. ధర్మ మార్గంబున ధరవరల్ నియమించి
క్రయ విక్రయంబులఁ గడుప గలరు
నవ రత్నముల యందు నాణెంబు గమనించు
పాండిత్య మేపారఁ బడయ గలరు
గోసంపదలఁ బెంచి గురుబాల వృద్ధుల
జీవనంబుల వృద్ధి చేయ గలరు
వర్తక వాణిజ్య కర్తలై ప్రజ బెంచి
తగు లాభముల నొంది తనర గలరు
తే.గీ. హయ గజాదులఁ గూర్తు రాహవములందు
నాజ్య సంపదఁ గూర్తురు హవములందు
నన్న పానంబులను గూర్తు రార్తులందు
శ్రేష్ఠులై కీర్తి గాంతురు సృష్టి యందు. 1009

వ. అంచు నాశీర్వదించు నంబాపతిం గాంచి యవును కాదనలేని డోలాయమానమానసంబుల బాదంబులంబడి గద్గద స్వనంబుల నిట్లు వేడుకొనిరి. 1010



తే.గీ. ఎందు కా కీర్తి శంకరా ! యేమి సేతు
మద్ది నీ పాద సంసేవ కుద్ది యగునె ?
నీవు లేకున్న స్వర్గమ్ము నిష్ఫలమ్ము
విషధరా ! యిట్టి మాటలు వేయు నేల? 1011

వ. అంచు విరక్తులై విషణ్ణ వదనులైన వైశ్యులం గాంచి విభూతి భూషణుం డిట్లనియె. 1012

ఉ. నా ప్రియ భక్తులార విడనాడుదునే మిము నొంటిగా? భవా
నీ ప్రభ నుక్కణింప నవనీతల మందున మీరుగాక వే
రే ప్రజ లుద్యమించ గలరే ? మిము వీడి చరింప నాకు శో
భాప్రదమే ! పదంపడి సభాజనముం దనియింప కుందునే ? 1013

కం. పెనుగొండ యనెడు బృహద
ద్రిని వెలసెద నేను మీకు తృప్తి నొసంగన్
వినుడది కైలాసంబున
కెనయగు, నగరేశ్వరుఁడన నే నందుందున్. 1014

శా. నేనే కాదట నెల్ల దేవ గణముల్ నిర్ధారితావాసులై
మీ, నా ప్రార్థన లాలకింతు రికపై మీ భాగ్య మేపారగా
మా నారాయణులున్ జనార్దనులుగా మా పజ్జ నింపారగా
మీ నేత్రోజ్జ్వల లక్ష్మి కోనకమలై మీ కోర్కు లీడేర్చెదున్. 1015

కం. మీ మాత పార్వతియు నట
బాములఁ దొలగించు వింధ్యవాసిని యగుచున్
మీ మార్గ దర్శకుడుగా
నామతిలును బ్రహ్మ భాస్కరాచార్యునిగా. 1016

తే.గీ. సందియము లెల్లఁ బోనాడి శ్రద్ధ తోడ
భువిని స్వర్గంబుఁ జేయుడీ పుణ్యమగును
మేము మీవెంట నుండగా మీన మేష
ములను లెక్కింపఁ బనియేమి ముఖ్యులార ! 1017

తే.గీ. అనుచు ధైర్యంబు వలికెడు నజుని మ్రోల
నుత్త మాంగంబులను వాల్చి చిత్తగించ
నతఁడు వీడ్కొల్ప వారును నచటినుండి
బ్రహ్మ లోకంబు చేరిరి పథకమెఱుఁగ. 1018

కం. కైలాస వాసు లేలకొ
కైలాసము వీడి రిచట కాలూని రిదే
దో లాభంబునకే కా
బోలు ననుచు నలువ విస్తుబోవుచు ననియెన్. 1019

కం. రండోయి వైశ్య వీరులు
చండీప్రియ చిత్త హరులు సద్గుణ విభవో
ద్దండులు చెప్పెదరా యిటు
దండుగ నేతెంచినట్టి తాత్పర్యంబుల్ . 1020

ఆ.వె. స్రష్ట పలుకులందు సరసమ్ము గమనించు
చిత్త శాంతి లేమి శ్రేష్ఠులపుడు
శివుని యాన దెలిపి చెప్పవే దేవరా
యేమి చేతు మనుచు నెదుట నిలువ. 1021

ఆ.వె. వారి మాట వినుచు వారిజాసనుఁడంత
శివుని దలచి వాని చిత్త మరసి
ధరణి నుద్ధరింపఁ దనవంతుఁ దలపోసి
భావి శిష్యతతికి పలికె నిటుల. 1022

తే.గీ. మాట వినకుండ ముందుగా హాటకేశుఁ
గొలిచి బ్రాహ్మణ శాపంబు గెలిచితిమని
విఱ్ఱవీగిన మీ క్రొవ్వు వట్టుఁ గలసె
నేమి సేతు మాపుడమికే యేగవలసె ! 1023

కం. మధ్యమ లోకంబన జన
మాధ్యమమే గాని యధమ మాన్యము గలదే !
మిథ్యానుమానమున నిజ
మధ్యయనము జేయరైరి యర్యులు వారల్ ! 1024

వ. అనెడు నలువ పలుకుల కత్యంత లజ్జితులైన వైశ్యులు భూలోకంబున దమకు యోగ్యంబైన ప్రదేశంబు నిర్దేశింపుడనుచు ప్రార్థింప నతండును. 1025

శా. భూలోకంబున భారతాంధ్రమున సంపూర్ణాబ్ధ తెల్వాహలో
పాలుం బంటలు దండిగాఁ గలుగ మీ యిష్టంబు లీడేరిడిన్
శ్రీలంగూర్చు ధరిత్రి యద్ది హవముం జేయించి రాచార్యులే !
కీలారంబగు బ్రహ్మకుండ మనగా కేదార సంపద్వరన్. 1026

కం. చను దండందుల నందులఁ
జను కైలాసానుకూల సర్వ సుఖంబుల్
కనినంతన నా కుండము
జనముల కగు నిహ పరార్థ సర్వ శుభంబుల్. 1027

కం. నేనును వచ్చెద మీతో
గానంబున శ్రుతి విధంబు కల్యాణ మగున్
మీ నరలోక విహారము
మా నిర్వహణమున మీకు మంగళ మగుతన్. 1028

వ. క్షేమంబగుఁ బోయి రమ్మనెడు బ్రహ్మదేవునకు నమస్కరించి సెలవొందిన సిద్ధవైశ్యులు నందుండి పాలకడలిపై శేషతల్పమున నాదిలక్ష్మి సేవింపుచుండ సుఖంబున్న మహావిష్ణువును జేరి సాష్టాంగ ప్రణామంబుల నిట్లు ప్రార్థించిరి. 1029

కం. హే భక్తజనావన జయ
హే భాస్కరకోటి తేజ హే మాధవ హే
నాభి గతానంత విభవ
మా భాగ్య విధాత విష్ణు మంగళ మీవే ! 1030

తే.గీ. అంచు బ్రార్థించు సిద్ధ జనాళి గాంచి
మోవి దరహాస చంద్రికల్ మోద మొసఁగ
మోము నందున గరుణా సముద్ర మొదవ
మోహనాబ్జాక్షుఁ డిట్లనె ముగ్ధుఁ డగుచు. 1031

కం. ధనలక్ష్మీ పుత్రులకా
వనటల్, విస్మయము కల్గు వచియింపుడు మీ
జనని వినగోరు చున్నది
ఘనముగ దీవించు వేడ్కఁ గాంచన వతియై. 1032

వ. పద్మాక్షు పరిహాస వచనంబులు కర్ణంబులంటని దీన మానసులగుట నా
వైశ్యు లంతటఁ బదపడి పద్మాక్షి పాదంబులం బడి. 1033

కం. హే మాధవ హృదయాసన
హేమా హేమాబ్జ వదన హేరాళ ధనో
ద్దామా కరుణా ధామా
హేమంత గుణాంతరంగ హే జగదంబా ! 1034

తే.గీ. అంచుఁ గీర్తించి భూలోక మందు తాము
మూత్ర మార్గంబులం బుట్టు ముట్టుపాటు
నుండి కాపాడు మంచు వారర్థి గోర
నిందిరాదేవి విభుగాంచి యిట్టు లనియె. 1035

చం. జగముల నేలువాడవని జాలి గలాడ వటంచు వారు నీ
నగరము చేరినారు హరి నామ జపంబున నేల మేలముల్ !
సుగమము సేయగాదగు వసుంధర వారల జన్మ వృత్తముల్
నిగమ నియంత! వారి మది నింపవె బాధ భరించు శక్తులన్. 1036

కం. అనవిని హరి వదనము మో
హన సదన మగుచు పదపడి హరుని దలచుచున్
తన సతి వదనము విరియగ
ధన కరులను కామధేను దయఁగొను మనుచున్. 1037

ఆ.వె. శ్రేష్ఠులార మీరు నిష్ఠతో సురధేను
శరణు వేడు డామె కరుణ గలుగ
సమయుఁ జింత మీకు సమకూరు నిష్టంబు
వత్తుమేము వసుధ చిత్తమలర. 1038

కం. హరి వచనములకు మనమున
హరు వచనములును స్ఫురించి యానందముతో
హరి దంపతులకు ప్రణమిలి
హరి హర యంచు వరసిద్ధు లానతి కొంచున్. 1039

ఆ.వె. అచటి నుండి శ్రేష్ఠు లమర ధేనువు చెంతఁ
జేరి వందనములు చేసి పల్కి
రంబ కామధేనువంచు నీ దరిచేరి
నాము తల్లి నిన్నె నమ్మి నాము. 1040

కం. హరి హర హరిసుతులును నీ
చరణములను జేరుదనగ సంకట వేళన్
శరణము జొచ్చితి మివ్విధి
కరుణను మము గావుమమ్మ కామిత దాత్రీ ! 1041

వ. పాదంబులంటి ప్రణమిల్లు వైశ్యుల దీన వదనంబుల గాంచి కరుణించి
కావలయునది వేడుకొమ్మనగ వారును. 1042

నవనందినీవృత్తము.

ముని శాప మందితిమి మున్ మునుపు గంధ
ర్వుని శాప మందితిమి రోతయగు భూమిం
జన దప్పదింక మము సాకతము సద్యో
జనువొంద జేయవె ప్రసన్నముఖి తల్లీ ! 1043

కం. శాపగ్రస్తుల మను సం
తాపము పాపములు గడుగ దమథిత మతులై
దాపున నిలచిన వారికి
తేకువ గలిగింప కామధేనువు పలికెన్. 1044

కం. తల్లీయని పిలచిన మీ
రెల్లరు నా పిల్లలైతి రిక దిగులేలా
చల్లగ నా కడుపున వ
ర్థిల్లుడు కర్ణముల నుండి దింపెద భువిపై. 1045

ఆ.వె. ఆవు తల్లి పల్కు లానంద మొదవింప
తలలు వంచి కనుల దడి యెసంగ
తల్లి సురభి మేము ధన్యుల మంచు నా
తల్లి గర్భమునకు తరలినారు. 1046

**ఇది శ్రీవాసవీపురాణమునందు సిద్ధవైశ్యులను దేవతలు వీడ్కొలుపుట యను ముప్పది తొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము.**

(చానీ= చావనివ్వు, భూస్వర్దేశాధీనార్భకులై= భూమికి స్వర్గమునకు లొంగివుండే బాలకులై, ఉక్కణించు= రక్షించు, ఆమతిలు= పుట్టు, అంభోధీహ= సముద్రమున కలియవలెనను కోరిక, కీలారము= గోసమూహము, సాకతము= అనుగ్రహము, ప్రసన్న = నిర్మలమైన , దమథిత= క్లేశమనుభవించిన)



# నలుబదియవ అధ్యాయము

**కం. బుధజన నుత ! కమల చరణ !**
**మధుర వచన విభవ సదన ! మానిత సదనా !**
**నిధన సుజన సధన కిరణ !**
**విధుత మల విధు వదన ! విధు విలసిత రదనా !**

కం. గో గర్భంబును జేరిన
మా గౌర వరేణ్యు లెట్లు మహి దిగిరో? యా
భోగట్టా వినిపింపుము
యోగీంద్ర యనగ నతఁడుఁ బ్రయోజకుఁ డగుటన్. 1047

తే.గీ. వినుఁడు వైశ్య ప్రముఖులార యనుచు నిటుల
ముని వచించెను వైశ్యుల ముదము మీర
ముగ్గురమ్మలు నయ్యలు ముచ్చట దిగి
వచ్చినట్టి విధంబు నావల విధంబు. 1048

శా. కైలాసంబును వీడి వైశ్యు లటు గోగర్భంబునం జేరి నా
రాలస్యంబిఁక నేల యంచు ద్రుహిణుం డానంద సంపన్నుఁడై
కాలాతీతుని లో దలంచి ధరణిం గాలూను కర్తవ్యమున్
పాలింప న్వెస విశ్వకర్మఁ బిలిచెన్ బ్రాహ్మీకృత స్థేయుఁడై. 1049

ఉ. వచ్చిన విశ్వకర్మఁ గని వైశ్యుల కిమ్మహి వాసయోగ్యమై
నచ్చిన పట్టణంబులను నాక పురంబుల సాటిగాగ నీ
హెచ్చిన నేర్పుఁ జూపి పదునెన్మిదిఁ గట్టు మటంచుఁ జెప్పి తా
వచ్చెను భూమిపైకి భృగు వంశము నందు జనింప ధాతయున్. 1050

వ. అంతట విశ్వకర్మయును పర్వత సన్నిభంబులగు నానా రత్న సమృద్ధములైన గృహంబుల తోడను, కైలాస శిఖరోపమములగు మణిఖచితములైన ప్రాసాదంబుల తోడను, సువిశాలంబులగు మార్గంబులు గలిగిన ప్రాకారంబుల తోడను, నాలుగు కులంబుల జనంబుల తోడను విరాజమానంబులగు జ్యేష్ఠశైల, శివ, ధనద, ధర్మవర, జగన్నాథ, పాల, పాంచాల, పాలకుండ, భీమ, కామ, వీరనారాయణ, విశాల, కళింగ, త్రిగుణ, ఇందుర, ఆనందజనద, ఏలా, ఘంటసాలపురంబు లనెడు పదునెనిమిది పట్టణంబుల నిర్మించి యిచ్చెనంత ధాతయును ధనపతిం బిలిచి. 1051

తే.గీ. వైశ్రవణ ! నీవు భువినున్న వైశ్య తతికి
సకల సౌభాగ్య సంపదల్ సవరణింప
వారి కనువుగ నవనిధుల్ వారి పట్ట
ణముల నింపుము నరవాహనా ! రయంబు. 1052

తే.గీ. అనగ ధనపతి శతధృతి యానమేర
త్వష్ట కట్టిన పట్టణ వసతులెల్ల
నింపి నిశ్చింత పౌరులు పెంపు నొంద
సిద్ధమొనరింప సాగెను చిత్తమలర ! 1053

వ. అది యట్లుండ శాప వశంబున వసుధపై గోకర్ణంబున బ్రభవించిన వైశ్య ప్రముఖు లనతి కాలంబున స్థానిక వైశ్యసంతతిం గలిసి చెలంగ బ్రహ్మదేవుని యంశంబున భృగువంశంబున బ్రసిద్ధులైన భాస్కరాచార్యు లవ్వారింజేరి యాచార్యులై వేదవిద్య లభ్యసింపజేసి ధర్మోపదేశంబు జేసె. 1054

ఆ.వె. ఆర్యులార ! మీ కులాచార ధర్మంబుఁ
జెప్పుచుంటి నెడఁదఁ జేర్చి వినుఁడు –
అతిథి పూజ సత్య మాచార్యజన వృద్ధ
సేవనంబు మీకు సేమ మగును. 1055

ఆ.వె. బ్రతుకు తెరువు మీకు వాణిజ్య గోపాల
కృషుల న్యాయమైన కృషియె హితము,
హితము సేమమైన యిమ్మైన నడవడి
దాన శీలురగుచు ధరణి మనుఁడు. 1056

ఆ.వె. శాంతి సుఖము లంది సంతోషమున మీరు
భూమిఁ బుట్టినట్టి నోముఁ దీర్చి
విధులు నిర్వహించి విధు శేఖరుని మెప్పు
గనుఁడు మీకు శుభము కలుగు గాక ! 1057

తే.గీ. అంచు దీవించి వారల యభ్యుదయము
గోరి క్రతువులు గావించె వారలంత
కలసి జీవించు చుండిరే గాని కాపు
రములు జేయ లేరైరి కారణమదేమొ ! 1058

కం. విషయము దెలిసిన భార్గవ
ధిషణుఁడు తన దివ్య యోగదృష్టిం జూడన్
విషయము తెలిసెను వారలు
విషయ సుఖంబులఁ దగులని వేల్పులగుటయే ! 1059

కం. సుర ధేనువు కడుపునఁ బడి
ధరణికి దిగి వచ్చిన ఫలితమ్మిది, మాయా
సుర పాశము నందు బడక
సురతమునకు దూరమైరి సుక్రతు భక్తిన్. 1060

ఆ.వె. భువికిఁ బంపినట్టి భూతేశు కర్తవ్య
మెట్లు దీరు వైశ్యు లిట్లు చేయ,
తానుగానె యేదొ తగిన చర్యను దీసి
కొనక తప్పద యనుకొంచు బ్రహ్మ. 1061

ఉ. శిష్యుల నెల్లరం బిలిచి క్షేమము లారసి యానతిచ్చె నో
శిష్య వరేణ్యులార, విధు శేఖరుఁ డంపిన కార్య మెద్ది? మీ
తిష్య విరుద్ధ వర్తనము తృష్యమిదెట్టిది ! మీకుగల్గు వై
దుష్యము నెల్లఁ జూపుఁడిక దూష్య జనస్థలి సంస్కరింపుడీ ! 1062

మ. పురుషార్థంబుల ధర్మ మోక్షములతో బూర్ణంబు గాబోదు మీ
నర జన్మంబును, దాని లక్ష్యమును; నానార్థంబులుం గామమున్
పరమార్థంబున కడ్డురావు, భవముల్ పండించు నవ్వానికై
సురభిన్, మీ జననిన్ మనంబలరఁగా స్తోత్రంబు గావించుడీ ! 1063

వ. అనిన నంతట గురుభక్తితత్పరులైన వైశ్యులు భాస్కరాచార్యుల వచనంబులకు మారాడక పతకాయిపర్వతాగ్రములనుండి జనని కామధేనువునిట్లు ప్రార్థించిరి. 1064

కం. తల్లీ ! నీకు నమస్సులు,
కల్లోలిత సంఘ మిందు కాపురములు వే
తెల్లారగ కావలసిన
వెల్లం దయసేయ రమ్ము- ఈవుల మొదవై ! 1065

ఆ.వె. కామధేనువమ్మ కాపుండ కామార్థ
భయమదేల మాకు భవములందు,
వేగ వచ్చి మాకు వేగమే కైలాస
మేగు దారిఁ జూపు మీవులమ్మ ! 1066

వ. అంచుఁ బెక్కు విధంబులఁ బ్రార్థింప నా సురధేనువును కరుణించి సాక్షాత్కరించి యిట్లనియె. 1067

ఆ.వె. పుత్రులార మీరు పురుషార్థములు నాల్గు
పాటి సేయవలయుఁ బరమ శివుని
జేరి సురుల మరలఁ జెన్నొందవలె నన్న,
వసుధ నుండి ముక్తి వలయు నన్న. 1068



ఆ.వె. పెండ్లి రోజుల వరిపిండి చక్కెర నేయి
కలిపి రాశిఁ జేసి పిలిచి నన్ను
తృప్తిఁ బరతు మనుడు జ్ఞప్తిఁజేసెద మీకు
కర్మ యోగ సిద్ధి కలుగు తీరు. 1069

తే.గీ. అమ్మ మాటలు విని వైశ్యులనిరి యిట్లు
కష్టమో నష్టమో కాని కామవైరి
కామితార్థంబు నెరవేర్చు కార్యమందు
కనలి పోనిమ్ము నరజన్మ కన్నతల్లి ! 1070

ఆ.వె. నీవు చెప్పినట్టి నియమంబుఁ బాటింతు
మమ్మ పెండ్లి వేళలందు, మాకు
హితము గూర్చి భవుని హితమెనర్చెడు శక్తి
నిచ్చి కావు మమ్మ యిలను మమ్ము. 1071

వ. అంత గోమాతయుఁ దగువరంబు లనుగ్రహించి భువినున్న వైశ్యులతో కలసి సంఘంబు నుద్ధరింపుడంచు నాశీర్వదించి దివంబున కేగె. 1072

ఉ. అంతట సోమశేఖరుఁడు నంబను గూడి వసుంధరా తలం
బంతటిలోన మేటి బృహదద్రి పురంబున వాసముండెఁ దా
నెంతయుఁ బ్రీతితోడ నగరేశ్వరుఁడై సతి వింధ్య వాసినీ
కాంతగఁ జెంతనుండ నరగన్నుల వైశ్యులు రాదలంచుచున్. 1073

కం. ధనలక్ష్మి నారాయణు
లును దామిచ్చిన పలుకు నిలుపగ నచటికే
చనుదెంచిరి కోనకమల
యనఁగ, జనార్దనుఁ డనగను నర్యుల కొరకై. 1074

ఉ. అంతట గుహ్యకేశ్వరుఁడు నాశ్రమగుహ్యకులార్యవైశ్యులన్
చెంతకు బిల్వ నేగి యట శిష్యులఁ దీరిచి దిద్దుచున్న దో
షాంతకు భార్గవుం గని వృషాంకుని రాకను దెల్పి మ్రొక్కగా
నంతట భార్గవుం డనునయంబున వైశ్యులఁ జూచి యిట్లనెన్ . 1075

ఉ. కారణ జన్ములార ! మిముఁ గన్న సమాజము మీ గురించి వం
దారుచు నున్నదింక కుల తంతువులై వసుగర్భ నిమ్ము పెం
పారగ విశ్వకర్మ మిముఁ బ్రాభవ మొంద రచించి నట్టి బం
గారపు పట్టణంబులను గాలిడి బాధ్యత నిర్వహింపుడీ. 1076

తే.గీ. మనల గొంపోవ వచ్చెఁ శ్రీమంతుఁ డిపుడు
మ్రొక్కు డాశీస్సు లందుడు మొదట ననఁగ
గురుల సద్భక్తి సలుపునా కోమటీంద్రు
శివుని సఖునకు బ్రణతులు చేసి రపుడు. 1077

ఆ.వె. గుహ్యకాధినాథ ! కోట్లకు మించిన
త్ర్యంబ కాజ్ఞ దీర్ప దగిన శక్తి
నిచ్చి మమ్ము గావు మీశా ! వణిక్పాల !
ప్రణుతిఁ జేతుమయ్య భక్తి నిన్ను. 1078

వ. అనుచరుల భక్తి వినయంబులకు సంతసించిన వైశ్రవణుండును. 1079

మ. ధన ధాన్యమ్ముల వృద్ధి సల్పు బలమున్, దాతృత్వ సద్వృత్తమున్,
ఘన వస్తు క్రయ విక్రయాభ్యుదయమున్, ఖండాంతర ఖ్యాతియున్,
జన సాహిత్య పదార్థ వాస్తవ పరిజ్ఞానంబు నైపుణ్యమున్
మనసారం గలిగించు చుంటి నికపై మర్యాదఁ బాటింపుడీ ! 1080

కం. అన నాచార్య వరుండును
ననుయాయుల భాగ్య గరిమ నానందముతో
తన వారిని గూడి వెడలె
ధనపతికి నమస్కరించి ధనరాసులతో. 1081



కం. త్వష్ట ముదంబున గట్టిన
యష్టాదశ పట్టణముల నాచార్య పదో
త్కృష్టంబుల వైశ్య వరులు
నిష్టమునఁ బ్రవేశమైరి యీశ్వరు లీలన్. 1082

**ఇది శ్రీవాసవీపురాణమునందు సిద్ధవైశ్యులు భూమికి దిగుటయను నలువదియవ అధ్యాయము సంపూర్ణము.**

(ద్రుహిణుడు, శతధృతి= బ్రహ్మ, బ్రాహ్మీకృతస్థేయుడై= చదువుచే పురోహితుడై, సవరణించు= సిద్ధము చేయు, ఆశ్రవుడు= విధేయుడు, సుక్రతు= శివుడు, తిష్య= శుభము, తృష్యము= అత్యాశ, వందారు= నమస్కరించు, ఇమ్ము= సుఖము, కుల తంతువు= వంశోద్ధారకుడు, శ్రీమంతుడు= కుబేరుడు)

# నలుబది యొకటవ అధ్యాయము

**కం. రామా ! చింతామణ్యా**
**రామా ! శ్రీచక్ర రాజ్య రమణీ ! శ్యామా !**
**రామారామ సుమంగళ**
**రామా ! రామార్య ! సింహరథ ! జగదంబా !**

మ. బృహదద్ర్యాది పురంబులందు సుఖులై బృందిష్ఠ సంపద్విభా
వహులై వైశ్యులు వాసముంట విని యా వైశ్యర్షు లుద్ధర్షులై
మహితాఖ్యాయిక మధ్య ధర్మసుతుఁ డేమైనాడు? క్షేమంబుగా
నహిలోకంబును వీడి వచ్చెనె? మునీంద్రాయంచు బ్రార్థింపగన్. 1083

కం. సాలంకాయనుఁ డంతట
బాలకులై కానుపించు వైశ్యుల హృదయం
బాలించి తెలియఁ జెప్పెను
బాలకుఁ డహివల్లభు విని వచ్చిన తెఱఁగున్. 1084

కం. అహివల్లభుండు పలికెడు
మహిత కథా కథన మందు మగ్నుం డయ్యున్
రహి వైశ్య వంశమందున
దుహితగ శర్వాణి పుట్టు తొగ యెట్లంచున్. 1085

కం. అడిగెడు ధర్మసుతుని గని
నుడివెను ఫణిరాజు కథను నూతన ఫణితిన్
వడి వడి పొదుపగు పదముల
నడ చెడకుండ వినువారి నైజము కొలదిన్. 1086



కం. ముక్కంటి కంటి మంటకు
గ్రక్కన దహియింప బడిన కాముని భస్మం
బక్కజముగఁ గలిపురుషుని
కిక్కగుచు సురారి కొకని కిచ్చె నసువులన్. 1087

ఉ. ఆ సురవైరి కాముకత కాకృతియై జనియించె, పేరు భం
డాసురుఁడాయె లోకము లనంగ ననంగుని సొంగ భండనం
బాసురమై దహింప రత మాలుమగండ్లకు దప్పి వావులం
బాసి చరింప సంఘమునఁ బాపము రాజ్యము చేసె నంతటన్. 1088

తే.గీ. ఎప్పు డేరాక్షసుఁడు పుట్టి ముప్పు తెచ్చు
నో కదా యంచు గనుమూయ కుండు వాఁడు
వాని వంతలు వంతల వలన జిక్కి
చిక్కిపోయెను సురసభ బిక్క చచ్చి. 1089

ఉ. ఎప్పటి యట్ల కామ బల మేచిన పిమ్మటఁ గ్రమ్మివచ్చు నా
చొప్పున క్రోధ మోహములు శుంభ నిశుంభుల పేర లోకముల్
నిప్పుకలందు నెట్టి కడు నిర్ఘృణులై చరియింప సాగి రా
చొప్పున నిర్జరుల్ బ్రతుక చోటు కనంబడ దంత వారలున్. 1090

కం. ఒక రక్కసు నెదిరింపగ
నొక సుమనసు బలియొసంగి యుడుగర లనగా
నొకరికి ముప్వురు ముష్కరు
లొకపరి పైకొనఁగ వార లొక్కుమ్మడిగా. 1091

తే.గీ. అమ్మ గౌరమ్మఁ జేరి వారార్తి తోడ
నయ్య నిర్వాకమున గల్గినట్టి చేటు
నెల్ల వివరించి రక్షింపవే యనంగ
నాఱడుల దీర్చు నా యమ్మ యారడమున. 1092

తే.గీ. సుగుణ నాశక సూత్రైక విగళి తాత్మ
లొద్దు పన్నకముల కెదురొడ్డి వివిధ
రూపముల దాల్చి వారి స్వరూపములకు
చ్యుతిని గల్పించి యమరుల ద్యుతిని బెంచె. 1093

వ. అయినను. 1094

తే.గీ. చావు దేహంబునకె కాని జీవ మూల
మాత్మ ధర్మంబునకు కాదు – అదియె నిజము
రూపముల మాపి నంతనె ప్రాపు చెడునె?
వెలుగు వెంబడి చీకటి వెక్కిరించు ! 1095

కం. పొంచిన కామాంధత మితి
మించిన దర్పంబు తోడ మిహికాదిత్యో
దంచిత పరివారంబున
నంచితముగ చిత్రకంఠుఁడై జనియించెన్. 1096

వ. ఆ గంధర్వుని గర్వంబును, కీర్తి కన్యపై మోహంబును, నందుల కతఁ దొందిన శాపంబును వినియుంటి వా వెనుకాతండు మర్త్యలోకంబున మానసాధిపతి వంశంబున విష్ణువర్ధనుఁడై జనించి నైజంబు వర్ధిల కలిపురుష లక్షణంబుల కుప్పయగుచు కామాతురుండై చరింపు చుండ. 1097

కం. నందీశ్వరు తోడ నుడివి
నందున శర్వాణి వాని నంతము చేయన్
ముందటి రూపంబున విశు
లందున జనియించి వారలందరఁ బ్రోచున్. 1098

వ. అంచు నహిపతి వాసవీ కన్య జన్మ వృత్తాంతంబును నగ్ని ప్రవేశంబును వైశ్యదంపతుల కైలాస ప్రవేశంబును సమస్తంబు వివరించి. 1099



తే.గీ. వత్స ధర్మనందన ! నీకు వలయు నంతఁ
జెప్పితిని నాకు నీ యెడ మెప్పు కతన
బ్రాహ్మణుల యెడ నీకున్న భక్తి కతన
బ్రతుకు బాగుండు గాక నీ భావి యందు. 1100

ఉ. అంతియ కాదు నీయెడల నాత్మగతంబగు బంధమేదియో
మంతన మాడుచున్నదిర మంచి వరంబొక టిత్తు నంచు, నీ
చెంతకు నీవు చీరకయె చేరగలే డసు తస్కరుండు, నీ
వింతకు ముందు వోలె గురునింటఁ బఠింపగఁ బొమ్ము మేలగున్. 1101

వ. అనుచు నహివల్లభుండు పరమానురాగంబుఁ బ్రకటింప. 1102

చం. కనులఁ గృతజ్ఞతల్ మెరయఁ గాంక్ష ఫలించిన వైశ్య బాలుఁడున్
వినమిత గాత్రుఁడై ప్రణవ వేద వినిర్మిత కీర్తనావళిన్
ఘనముగ గౌరవించి సముఖంబును వీడి గృహంబుఁ జేరగా
ననుమతిఁ గోరి నిల్చె వినయంబున నంతట నాదిశేషుఁడున్. 1103

తే.గీ. అనుమతించుచు దీవించి యమరమైన
కమల హారంబు నొకటిచ్చి కౌగిలించి
మూర్ధమందున ముద్దిడి మోదమలర
సాగనంపె నహీశుండు సాదరమున. 1104

కం. అహిపతి నిజ పరిజనములు
గుహ బయటకు దెచ్చి వీడుకొలుపగఁ దనకై
బహు దుఃఖితుఁడైన గురుని
గృహమున కేతెంచె నిరుల కిరణ ప్రభుఁడై. 1105

తే.గీ. గురువు గురుపత్నియును నెల్ల గురుకులంబు
గాఢ మేఘంబు వీడిన గగనమట్లు
ధర్మనందను రాకచేఁ దాపముడిగి
శాంత మొందెను మోముల సంతసముల. 1106

కం. గురుదేవుని గుండెలపై
శిరముంచిన శిష్యుని మది స్థిమితము నొందన్
బరువై కూరుకు పోయిన
గురు హృదయము తేలికపడి కూరుకు దీసెన్. 1107

చం. గురుకుల మెల్ల ధర్మసుతు గూర్చి యెఱింగెడు వేడ్క తోడ నా
తురత వహింప నాతఁడుఁ గుతూహల మొప్పగ నెల్ల గాథయున్
హరువుగ విన్నవించి సుమహారము నా గురుపాద సన్నిధిం
బరచి వచించె దేవ ! తమ పాదము లాన గ్రహింపుడీ నగన్. 1108

వ. అంత నాచార్య చ్యవన మహర్షియును మిక్కిలి సంతసించి . 1109

కం. మెచ్చితి నీ గురు భక్తికి
నిచ్చితి నీ కెల్ల విద్య లిమ్ముగ జనముల్
మెచ్చుగ జీవింపుము నీ
నచ్చిన కన్యను వరించి నవ్వుచు జగతిన్. 1110

వ. అంచు నాచార్యుండు ననుజ్ఞ నొసంగ ధర్మసుతుండును స్వీయ గృహంబును జేరి మాతా పితరుల సేవలో గార్హస్థ్య ధర్మంబున సుఖంబులు వడసె. 1111

***ఇది శ్రీవాసవీపురాణమునందు ధర్మనందనుఁడు ఇంటికి తిరిగివచ్చుటయను నలుబదియొకటవ అధ్యాయము సంపూర్ణము.***

(బృందిష్ఠము= మనోజ్ఞము, ఉద్ధర్షులు= మిక్కిలి సంతోషించినవారు, కిరణప్రభుడు= సూర్యుడు)



# నలుబది రెండవ అధ్యాయము

**కం. బృహదద్రి నగరవాసిని !
బృహ దఘగణ ఘన భయాద్రి భేదిని ! రజనీ
గృహ దనుజ రుధిర పాయిని !
బహుముఖ విజ్ఞాన మధిత బహు వేదవనీ !**

తే.గీ. ధర్మనందను కథ విని ధర్మ రతిని
నిర్మలానంద పరవశ నిమిషులైన
వైశ్య ఋషిగణ మంత 'మా వారి' గాథ
వివరముగ వినిపింపుమా వినెద మనఁగ. 1112

కం. పాయని తమిగల వైశ్య ని
కాయమునకు తనివి దీర్పగల ముని సాలం
కాయనుఁడును దన కర్ణ ర
సాయనమగు కథన శిల్ప సంపదఁ జూపన్. 1113

సీ. బ్రాహ్మణ దివస పూర్వార్ధాది యుగమందె
వసుధను నెలకొన్న వైశ్యులార !
స్వారోచిషము నందె సాధించి కైలాస
వాసంబు గాంచిన వైశ్యులార !
వైవస్వతమున నేడవ మహాయుగమందు
వసుధకు మరలిన వైశ్యులార !
పాల కడలి ముందు పదునెన్మిదవ మహా
వధి తపో నిధులైన వైశ్యులార !

తే.గీ. రెండు యుగములు గోబిలం బుందు వారి
తోడ సహవాస ముండి, మా తోడ నేడు
వర్తమాన మహాయుగ వర్తులగుచు
నున్న గోకర్ణ జనులార ! అన్నలార ! 1114

వ. అంచు సమ్మానించి కథాక్రమంబున కుపక్రమింప నా వైశ్యశ్రేష్ఠు లిట్లనిరి. 1115

చం. అమిత మహానుభావ ! వచనామృత దీప్త సమస్తశిష్య సం
యమిత రసానుభావ ! విషయాంతరమా యనబోక తెల్పుమా !
హిమ శిఖరంబు నుండిటు మహీగతులై మము గన్నవారి నా
మములు వినంగ జేయగదె మాన్య కథా కథనార్ణ వాకృతీ ! 1116

ఆ.వె. అనుదు మునియు నటులె యనుచు నా వివరంబుఁ
దెలుపఁ దొడఁగె నందు తెలిసి నంత
వఱకె తెలుప గలను, వరులైన వారలే
తెలియ దగిన వారు తెలియుఁ డనుచు. 1117

సీ. మన్యు, వుద్వాహుండు, మానాభ, కంకణుల్;
భగ, మిత్ర, రవి, గోధ, పంక గుణులు;
టంక, మలీమస, శంకానుపాలురు;
ప్రహ్వేంచుక, కుశా, నుపకుల మునులు;
గౌంటుక, హరి, కాళ, కుండ, కురంటక,
మధుర, మంగళ, చంద్ర, మనన, తృకులు;
తులశిష్ట, చందక, ఫలక, పట్టణ, రైభ్య,
మగధ, ఘంటక, శృంగ, మదన, కుణులు;
కవటుఁ, డిక్ష్వాకుండు, కర్ణాట, చన్నకులు;
సానక, సనక, వసంత, కలులు;
శ్రీరంగ, శివ, రేభ, శ్రీలక, మిధున, పిం
గళ, గంటసాల, కుళింగ, కృతులు;



మద్దిక, జానక, మద్ర, భద్ర, ముకుళ,
గ్రంధిశైలక, చండ, కంఠ, యుగులు;
హారిత, పృథ్వి, మందార, దుర్ధర, మను,
వైణ, వాయన, వేన, వైన్య, గుణులు;
గోశీల, గాంగేయ, గుహ్యక, మండక,
చింతాల, మృగ, నందిశీల, చితులు;
కనక, కదంబ, ప్రకంపన, చింతిమ,
బలిపద్మ, వేన్నక, పర్వతులును;
భార, భగీరధ, పౌలస్త్య, భీమ, క
కుద్మంత, వస్తిక, కుంత, కహులు;
గణప, గూఢోన్మత్త, కాశ్యప, పాంచాల,
పడగ, కరాళ, కపాల, నిశద,
దర్దర, స్మర, శంగ, ధనద, మాళవ, కాన్య,
మంజుల, క్రమ, కుంజ, వంజులులును;
కమఠ, పృచ్ఛకులు; రక్తాక్ష, పాణిసులును;
మధుపావన, సమాధి, మానసాది

తే.గీ. నామములఁ బేరు మోసిన కోమటీంద్రు,
సకల సద్గుణ రాసులు, శాంత మతులు,
వైశ్య కులమున కిల యందు వన్నె దెచ్చి
నట్టి ధర్మాత్ములయ్య మీ కాది జనులు. 1118

తే.గీ. అతిథి పూజా దురంధరు లైన వారు
నిరత సత్యానురక్తిని బరగు వారు
పరుల కుపకార మొనరింప నరుగు వారు
వారు మీ వంశ కర్తలు వైశ్యులార ! 1119

కం. పెనుగొండ పట్టణంబున
నెనరున మును వింధ్యవాసినిన్ నగరేశున్
పెనచిన భక్తిని గొల్చిరి
వినయంబున గురుల చిత్త విత్తము గెల్వన్. 1120

తే.గీ. పిదప నాచార్యులను గూడి పెద్దలంత
కోనకమలా జనార్దన మానసముల
ప్రేమ నిండగ పూజించి సేమమలర
భాస్కరాంశువు లట్టులఁ బ్రాకిరంత. 1121

కం. హరి హర హిరణ్య గర్భులు
నురమున తనువున ముఖమున నున్న సుదతులున్
వరములు గురియగ వారు న
గరముల పదునెనిమిదింటఁ గాంచిరి శుభముల్. 1122

*ఇది శ్రీవాసవీపురాణమునందు హిమాలయములనుండి క్రిందకు దిగిన సిద్ధవైశ్యుల కథనమను నలుబదిరెండవ అధ్యాయము సంపూర్ణము.*

(నెనరున= ప్రియమున)



# నలుబది మూడవ అధ్యాయము

**కం. విస్తార లోక పంజర**
**దుస్తర సంసార సింధు తుంగ తరంగ**
**ప్రస్తర రిపుషట్ ఖేరీ**
**నిస్తుల దౌర్జన్య జన్య నిద్రా దూరా !**

కం. తమ తాతల పేళ్ళు వినుచు
మమతా జలపూర్ణ నయన మానసు లగుచున్
తమ యింటి యాడు పడుచుగ
కమలభవాండ జనయిత్రి కనుబడిన విధిన్. 1123

కం. వినిపింపు మనుచు వైశ్యులు
ముని పుంగవు నడుగ నతఁడు ముచ్చట పడుచున్
వినిపించ దొడగె వాసవి
జనియించిన విధము వైశ్య జన సంఘమునన్. 1124

కం. పద్దెనిమిది పట్టణముల
గద్దియ పెన్గొండ నుండి ఘనుఁ డుద్వాహుం
డద్దియె పతకాయి యనఁగ
నొద్దిక రాజ్యంబు సలిపె నుత్సాహమునన్. 1125

చం. అతఁడుఁ బ్రభాత గోత్రమున కాద్యుఁ డనంగ యశంబు గాంచె నా
తతము ప్రభాత గోత్ర విధుత ప్రభలెల్ల నభఃప్రశోభలై
సతత సమృద్ధులైన యటు సత్కుల గౌరవ చాంద్రచంద్రికా
వితతి సమృద్ధి గాగఁ బృథివిం బలు వత్సరముల్ ప్రియంబునన్. 1126

సీ. ఉద్వాహునకు మఘుఁ డుదయించి మఘముల
సురులను మెప్పించి సుఖము లందె,
నతని పుత్రుఁడు శ్రీ మహా విష్ణువును గొల్చి
దివ్య వాహనమెక్కి తిరిగి నట్టి
మధుమంతుఁ డతఁ డొకమారు గంధర్వ లో
కము చేర నారాజు గౌరవించి,
కోకిల యను కన్న కూతురు నిచ్చి పెం
డిలిఁ జేసి పంపె నా కలికి యందు
తే.గీ. సంతతి మణిమంతుఁడు కీర్తిమంతుఁడు, నటు
పైన శ్వేతుఁడు ముచికుందుఁ డానకను వి
రోచనుండు జనించిరి రుచిర దీప్తు
లెనయఁ గుల గోత్రముల గీర్తు లెనయ జగతి. 1127

తే.గీ. అందుఁ గడగొట్టు తమ్ముని నందను లిరు
వురు తులాధార మణిధరు లరయ వార
లందు పెద్దవా డఖిల వేదాంగ విదుఁడు,
ధర్మమున జాజిలిం గెల్చి ధన్యుఁ డయ్యె. 1128

వ. అనవిని వైశ్యు లెల్లరును సాలంకాయన ప్రభూ జాజిలి యెవండు వాని నే ధర్మశాస్త్రంబున తులాధారుండు జయించె నా విస్తారముం దెలుపు డనిన నమ్ముని పుంగవుండు నిట్టులనియె. 1129

ఆ.వె. వినుఁడు వైశ్యులార విస్తారముగ తులా
ధారుగాథ విన్న ధరణి యందు
కిల్బిషంబు లెల్ల గీటడగు నిజము
ధర్మ మార్గ మందు దగులు మనము. 1130

ఉ. ఆ సమయంబు నందొక మహాటవి సాగర తీర నీరముల్
దోసిట బట్టు చోట ప్రమదొల్గ దపం బొనరింప సాగె నో
భూసురుఁ డేక దీక్ష మెయి భూజ మనంగ కుళింగ పక్షు లా
వాసము చేసికొంచు తమ వంశము భద్రముగాఁ జరింపగన్. 1131

ఉ. ఆతని పేరు జాజిలి, విహంగము లాతని నెత్తిపై పదా
ఘాతములన్ రవంబుల నకారణ వైరములం జరించినన్
భీతిలు నేమొ పక్షులని ప్రేతము వోలె చలింపకుండు, నా
ఖ్యాతి మనంబునం బెనఁగ గర్వము నొందె నివాత దీపమున్. 1132

ఉ. అంతట నొక్కనాడు తన యంతటి వాడిల లేడటంచు, నే
నెంతటి ధర్మమూర్తి నిక నెవ్వరు నాకు సమంబు ధర్మ ధ
ర్మాంతర వర్తనంబులఁ బ్రమత్తుఁడు కాని మునీంద్రుఁ డంచు ది
గ్దంతులు మూర్ఛనొందెడు విధమ్మునఁ జేసె మహాట్టహాసమున్. 1133

కం. ఒడినున్న మేఘమా స
వ్వడి జేసిన దంచు జూడ వారిద మొకఁడున్
పొడగట్టదె నింగి నవనిఁ
బొడ గట్టెను ముని యొకండు బొబ్బల తోడన్. 1134

తే.గీ. తెలిసె నంతరిక్షమునకు తెలివి ముదిరి
బ్రాహ్మణుఁడు చేయు తోష సంరంభ మంచు
పొగరు నణగించి దిక్కుల దిగులుఁ దీర్ప
గొంతు సవరించు కొనె నింగి కుస్తరింప. 1135

శా. ఓయీ జాజిలి జాలిపుట్టు నిను నీ యుత్సాహముం జూడ నే
లా యీ అంకెలు? మై ద్విజుల్ బెదర నేలా యార్చెదో బాపడా !
నీ యీ స్వల్ప తపంబు కింత పొగరా? నీ వా తులాధారు కం
టే యేమంత వరంగలించితివి శాటీమాత్ర కాషాయమా ! 1136

కం. ఆకాశవాణి పలుకుల
కాకారిత దర్ప మించు కాగ్రహ వశమై
యే కాన నుండె చెప్పుమ
నా కాతని జూడవలయు నట్టక ననఁగన్. 1137

ఆ.వె. కాన గాదు వాని కాపురము పురము
కోమటులదగు పెనుగొండ పురము
పురహరునకు పుడమిఁ బొలుపైన కైలాస
మనుచు నింగి పలుక మునియు నపుడు. 1138

కం. ఘోరారణ్యము నందతి
ఘోరంబుగ దపము సలిపి కోమటి పాటిన్
గౌరవ మొందనె యనుకొని
పాఱుఁడు పరుగెత్తె బచ్చుఁ బరిశోధింపన్. 1139

సీ. కొట్టులో గూర్చుండి కోరి వచ్చిన వారి
కంగడి సరకుల నమ్ముచున్న
వైశ్య వారిధి చంద్ర వరుఁడు తులాధారుఁ
డల్లంత దూరాన నరుగు దెంచు
బ్రాహ్మణోత్తము గాంచి భక్తితో నెదురేగి
కుశలంబు లడుగుచు గూర్మి సలిపి
యింటికి దోడ్తెచ్చి యింపుమీరగ గొల్చి
వినయంబుగా నిట్లు వేడుకొనియె,
తే.గీ. భూసురోత్తమ నీకు నీ భూమియందు
సాటి రాగల తాపసి జాడ గలదె !
నిన్ను నమ్మిన పక్షులు నింగి కెగసి
బెగ్గలించగ నేల యీ నిగ్గడింత ? 1140

చం. గడుసరి పండుటాకు చిరుగాలికి రాలిన యట్లు పేద బా
పడి మది పండి పొంగిన విపాక మదం బొక లిప్తలోన లో
బడియెను కోమటీని చిరుప్రశ్నకు, మోమును వాడిపోయె, నా
పడమటి వేల్పు దేహమును పంక మొనర్చె నవాగ్ర మేఘమై. 1141

కం. ఏమిటి యీ కోమటి యీ
కామాటము వీని పాటి కర్మరు గానో
నా మాట నోట బట్టుట
కే మెట్టున కెక్కె నేటి కీతం డనుచున్. 1142

వ.పరిపరి విధములఁజింతించిన జాజిలి తులాధారుంగని యిట్లనియె. 1143

కం. క్రయ విక్రయముల బ్రతికెడు
నియుతాత్ముల కిట్టి శక్తి నేర్వగ వశమే?
నియతాత్ముఁడ నైతిని నీ
దయ వలన వచింపు మెట్టి తపమొనరిచితో ! 1144

కం. అంతఁ దులాధారుఁడు దన
నంతగ శోధించు వాని నర్చించుచు నే
నెంతటి వాడను తండ్రీ !
అంతయుఁ దమబోంట్ల దయ యటంచుం బలికెన్. 1145

సీ. క్రయ విక్రయము లందు నియమంబు బాటింతు
నధిక లాభంబుల నాశ పడను,
మంచి వస్తువులు సామాన్యుల కంది యా
నందించు నట్లు నే నడచు కొందు,
నష్టమైనను గాని నాణెంబు గానిచో
పార వైచెద నమ్మ బలుక నెపుడు,
రొక్కంబు తగ్గిన రొక్కించ బోను వా
రిచ్చినప్పుడె తిరిగి పుచ్చుకొందు.
తే.గీ. పెద్దలగు వారు చెప్పు యీ సుద్దులందె
లక్ష్యముంతును చేయ నుల్లంఘనమ్ము
అదియె తపమన్న యెడల నా కదియె తపము
శక్తి నేనేర్వ లేదిద్ది శంభు కరుణ. 1146

సీ. సర్వ భూతములందు సమదృష్టి నుంచుట
చేతనైనంతలో సేవఁజేత
సాధు జంతువులందు సాధు వర్తను లందు
గౌరవ భావంబు గలిగి యుంట
కుల ధర్మముల యందు కుల గౌరవములందు
స్వార్థ మించుక లేక స్వాంత ముంట
ధనము చేరిన దాన ధర్మ కర్తృత్వంబుఁ
బాటించి గర్వంబు బడయకుంట

తే.గీ. ఇచ్చి యిచ్చితి ననకుంట నొచ్చుకుంట
పిన్నవారలఁ జిరు తప్పు లెన్నకుంట
మచ్చరము లేక మించుల మెచ్చుకొనుట
మంచిదందురు జగతిని మానవులకు. 1147

తే.గీ. మంచియని చెప్ప మన కనిపించు దాని
ముందు వెనుకల విశ్వాస మొందు దాని
సుంత సందేహ మొందక సంతసమున
చేసి మెప్పందుటే కదా వాసి మనకు ! 1148

వ. అంతట జాజలి మునీంద్రుం డిట్టులనియె. 1149

కం. ఘోరారణ్యము లం దా
హారాదులు లేని మా మహా తపముల నే
సారంబును లేదే? నిరా
ధారంబులె యజ్ఞములును ధర్మానుగతిన్ ! 1150

వ. అది విని తులాధారుం డనునయమున నిట్లనియె. 1151

తే.గీ. తగని కోరిక లీడేర దపము జేతు
మిహ పరమ్ముల సాధింప నిష్టి సేతు
మట్టి చేతల ఫలితం బదెట్టి మాట !
కలిగినను గావె తాత్కాలికమ్ము లవ్వి. 1152

ఆ.వె. మరల మరల పుట్టి మరణించుటను బాప
లేని యాగ తపము లూనుటేల?
నిత్య తృప్తి నొసఁగు సత్య యజ్ఞముకన్న
మిన్న కలదె మునుల మిన్న చెపుమ ! 1153

చం. జగతిని ధర్మమొక్కటియె సజ్జన మిత్రము దానిగూడి దే
హగతిని నిర్వహించుచును నందు లయింపక తామరాకుపై
నగుపడు నీటిబిందువగు నాతఁడు మాత్రమె నిత్య సత్యమై
తగులములేని మోక్షమునుతాకి సుఖించును నిందునందునన్. 1154

కం. స్వార్థాహంకారములు ని
రర్థకములనుచు దెలిసి దురాసదములకై
ప్రార్థింపక కర్మ సలుపు
పార్థివులకు పొందలేని ఫలితము గలదే ! 1155

వ. కాబట్టి ఘోర తపంబులయ్యును కామ్యంబులు గావున సిద్ధిఁ బడయవైతి
విందు సత్యంబు నెఱుంగదలఁతువేని నేడు నిరాశ్రయులై పైనచరించుచున్న ద్విజులం
బిలిచి ప్రశ్నింపుమన నాతండును నట్లుచేసె. 1156

చం. ప్రియ సుతులార నా చనవు రేలు బవండ్లును బొందియుంటిరే
నియతుఁడ గానె నా తపము నిర్మలమైనది కాదె తెల్పుడీ
భయములఁ గీలుబొమ్మలగు పామరులా మముబోంట్ల కీడు వ
చ్చు యమివరుల్ ! వచింపుడన చుంచువులంగదలించె పక్షులున్. 1157

మ.కో. ఓ మునీంద్రమ ! మేము నిన్నటు లోలగించుట లేలనన్
తాము చేయు తపంబు జూడగ ధర్మదేవత పంపుటన్
నీ మనంబున మత్సరంబు జనించి స్పర్థను బూనుటన్
తామసించితి వింక నీ ప్రభ తగ్గదా – నశియింపదా ? 1158

ఆ.వె. శుద్ధ మానసంబు శ్రద్ధచే సమకూరు
బుద్ధిశాలి యగును శుద్ధి చేత
బుద్ధి కలుగు వారు సిద్ధు లీ జగమందు
శ్రద్ధ కలుగు నాత్మ శాంతి వలన. 1159

వ. కావున నో జాజిలీ ! వాగ్వ్యాపారంబున గాక మనో వ్యాపారంబున శ్రద్ధ వహించి జీవాత్మ యందు ప్రసన్నత సాధించుమని చెప్పి నీడజంబు లంతర్ధాన మైనంత నవాక్కయిన భూసుర వరునకా వైశ్యవరుం డిట్లనియె. 1160

కం. శ్రద్ధ గల యజ్ఞమందున
విద్ధంబగు శుచియు, శ్రద్ధ వీడిన శుచియున్
బుద్ధుల యందు సమానము;
శ్రద్ధాళువు శుద్ధుఁ డతఁడె సాధకుఁ డవనిన్. 1161

తే.గీ. శ్రద్ధ గల వాని యింట భోజనము హితము
శ్రద్ధ లేనట్టి వేదాంతి చదు వహితము
పాము కుబుసంబు విడిచెడు పగిది జనుఁడు
శ్రద్ధచే పాప ఫల ముక్త సిద్ధుఁడగును. 1162

కం. అది విని జాజిలి యిట్లనె
నది మీకు ప్రవృత్తి మార్గ మగుట నిజమగున్
మదిని నివృత్తులమగు మా
కది యెట్లనుకూల మగుట కనిన నతండున్. 1163

ఉ. నీవు నివృత్తి మార్గమున నిండు తపంబును బూని పక్షులం
గావఁ బ్రవృత్తి మార్గమున గాలిడు కారణమేమి? జాజిలీ !
భావము నందు శ్రద్ధ కరువైన ఫలంబిది కాదె చెప్పుమా,
నీ విక శ్రద్ధఁ బూనవలె నిశ్చల తాపస వృత్తి గోరుచో. 1164

వ. అనుచుఁ దులాధారుండు వీడుకొలుప పశ్చాత్తప్తుఁడైన జాజిలిముని తిరిగి వనంబున కరిగె. 1165

**ఇది శ్రీవాసవీపురాణమునందు తులాధారుని కథయను నలుబదిమూడవ అధ్యాయము సంపూర్ణము.**

(వరంగలించు= ప్రకాశించు, నిగ్గడింత= మూర్ఖత్వం, నియుతాత్ములు= ధనాశగలవారు, విధుతము= విడువబడినది)



# నలుబది నాల్గవ అధ్యాయము

కం. వందే కలిదోష హరీ !
వందే కారుణ్య కల్ప వల్లీ ! సౌమ్యా !
వందే కాల నియంత్రీ !
వందే కర్మఫల దాత్రి ! వాసవకన్యా !

తే.గీ. తమ తులాధారు విజయ గాథ విని వైశ్య
మునుల మోములు కాంతుల మునిగి తేల
సంతసించిన కథకుఁడు సత్కథా వి
శేషములఁ గొనసాగించె శేషు భాతి. 1166

సీ. అట్టి ధర్మాత్ముని పట్టి మణిగ్రీవుఁ
డత్యంత దాన ధర్మాభి రతుఁడు,
అతని సూతి జటిలుఁ డతఁడు గార్గ్య మహర్షి
శిష్యుఁడై యోగ సంసిద్ధి నొంది
యవని బ్రహ్మజ్ఞానియై బ్రాహ్మణ ప్రియుఁ
డంచు నెల్ల రనంగ సంచరించె,
అతని పుత్రుఁడు భద్రుఁ డతని పుత్రుఁడు హయ
గ్రీవు లిరువురును గీర్తిఁ గనిరి,
తే.గీ. వసుధ బృహదద్రి పురమందు వైశ్యులందు
ధర్మమూర్తులు వెలయు నుద్వాహులందు
తులసి వనమున గంజాయి మొలచినట్లు
పుట్టెఁ బద్మాక్షుఁ డనువాడు పుట్టి ముంప. 1167

ఉ. దైవము ధర్మ మార్గములు దప్ప రుచింపని తండ్రి యా హయ
గ్రీవుఁడు విష్ణువే యతని గీము బవిత్రము జేసెనంచు లో
భావన జేసెనేమొ తన పట్టికి మాధవు పేరు పెట్టి వం
శావళి భక్తులై తనర సాభిరతిం బ్రకటించెఁ బ్రేముడిన్. 1168

చం. సుతుఁడును దల్లిదండ్రులకు శుద్ధ వినోదము బంచిపెట్టె సం
తతమును బోసి నవ్వుల హ్రదంబున ముంచుచు బాల్యమంతటన్,
హితవులు నేర్చు ప్రాయమును నెంతయు ముచ్చట గొల్పె నా పయిన్
పితరులు నచ్చినట్లుగనె పెండ్లము కేలుగ్రహించె మంచిగాన్. 1169

కం. తొలి యవ్వనమున కులసతిఁ
బలు తెఱఁగులఁ దృప్తి పరచు పద్మాక్షుండున్
తొలి పుత్రుని గని కులమున
వెలుఁగును బ్రసరించెఁ దండ్రి విందొనరించన్. 1170

ఆ.వె. కులము కులము గనుల కొలకు లానందాశ్రు
సంపద లలరఁ బెను సంబరమున
నుండ సంతసమున నున్న పద్మాక్షుని
కంటఁ బడియె శూద్ర కన్య యొకతె. 1171

ఉ. ఆమె వయో విలాసములు నామె ముఖాభ్రగ చంద్ర చంద్రికల్
ఆమె నవాంబకాంబకము లామె నవాధర రత్నపేటికల్
ఆమె కుచాగ్ర దీధితులు నామె కటి ప్రకటీకృతాకృతుల్
ఆమె సమస్త దేహమును నాతని లోగొనె కామ మంత్రమై. 1172

ఉ. పుట్టుక పెంపకంబు లిరు పుణ్యములై తన వెంట నంటి యు
న్నట్టి గతంపు తంతువున నాతి బలంబొక నాతి చూపునన్;
పుట్టిన రాశి యోగమును పుర్వు ముఖంబున జొచ్చి వ్రచ్చె నా
పుట్టువు విష్ణు పాదమున బుట్టిన వాగున జిక్కె మత్స్యమై. 1173

ఆ.వె. కట్టుకున్న భార్య, పుట్టిన పసివాడు,
కట్టెదుట గ్రసించు కన్నె చూపు –
మంద బుద్ధులైన మదపిచ్చి గలవారి
చిత్త మెందు జనునొ చెప్పనేల ! 1174

ఆ.వె. సతిని సుతుని వీడి సంసారమును వీడి
తాత తండ్రులందు దయను వీడి
యావదాస్తి వీడి వ్యాపారమును వీడి
వన్నెలాడి వెనుకఁ బడియె నతఁడు. 1175

ఉ. కులమున దప్పఁ బుట్టె నని కూడని సంగతిఁ బట్టె నంచు నా
కులమున బెద్ద లందరును గూడి పురంబు బహిష్కరింపగా
కలత వహింప లేదతఁడు, కాంతను గూడి వనంబు జేరి కా
వలసిన యన్ని మార్గముల వాంఛలు దీర సుఖించె నిండుగా –1176

ఆ.వె. పెద్ద కాల మట్లు పెనగిన సరసంబు
వయసు వెనుక బట్టు వరకు నొక్క
సుతుని గాంచె నతఁడు సూనృతాకారుఁడు
సుజన బాంధవుండు సుందరుండు. 1177

ఉ. చేసిన పాపమో వెనుకఁ జేరిన రోగమొ కన్నులన్ మదా
వాసమొ పుచ్చిపోయి, నసి వాసిన వృద్ధుల కళ్ళుపోయె నా
దోసము పుత్ర దర్శనము దూరమొనర్పగ శ్రోత్ర మాత్రులై
బాసటగా సుతున్ శ్రవణ బాలకుఁ డంచు వచించి రాపయిన్. 1178

చం. శ్రవణకుమారుఁడుం జిరుత ప్రాయమునుండియు దల్లిదండ్రులన్
ప్రవరునివోలె శ్రద్ధ తనరారగ సేవల నాదరించుచున్
శ్రవణసుఖంబులౌ కథల శాస్త్రపథంబుల నభ్యసించెఁ దం
డ్రి వలన నాతఁడిమ్మనెఁ బరీక్షయనం గురుదక్షిణంతటన్. 1179

తే.గీ. తండ్రినే కాదు గురువు నో తనయ మమ్ము
పాప పంకిల మందుండి బయట పడఁగఁ
దీర్థ యాత్రలు సేవింపఁ ద్రిప్ప గలవె,
నాల్గు ఋణములు దీరు ననంగ నితఁడు. 1180

కం. ఆజ్ఞాపింపుము తండ్రీ
విజ్ఞాపన మేల? నాకు వేడుక కాదే !
ప్రాజ్ఞులు మీ తోడ గలసి
సుజ్ఞాన క్షేత్రములను జూచి తరింపన్. 1181

వ. అంచు బ్రార్థింపఁ బ్రసన్నులైన తలిదండ్రు లిట్లనిరి. 1182

ఆ.వె. మాట వరుస కట్టి మాటంటిమే కాని
మాకు తెలియదేమి మా తెఱంగు !
కళ్ళు లేవు నడువఁ గాళ్ళు రావిక మేము
తీర్థ యాత్ర కెటులఁ దిరుగ గలము ? 1183

చం. వలదు కుమార మా కిపుడు వాంఛలు లేవు పరాత్ప రాజ్ఞకై
నిలిచిన వార మందులకు నిశ్చల యోగము చాలునింక నీ
వలయకఁ బెండ్లియాడి సుఖివై సుఖపెట్టుము మమ్ము, నీకు మా
వలన సుఖంబులేదెటుల; వల్లకు దుఃఖములెంత మాత్రమున్. 1184

ఆ.వె. అంత శ్రవణుఁ డనియె నానందముగ మీకు
సేవ జేయ గలుగు చిత్తశాంతి
సార హీనమైన సంసారమున గల్గు
నే సతీ సుతాది నిరతులందు ! 1185

కం. కావున తండ్రీ నా మొరఁ
గావుము నెమ్మదిగ మిమ్ముఁ గావడి లోనన్
తీవన బూవుల వలె పు
ణ్యావరణము లెల్ల ద్రిప్పి నయ మొనరింతున్. 1186



వ. ఇట్లెన్నియో విధంబుల వారలకు నచ్చంబలికి కావడి గంపలందునుచి యత్త్ర్యగస్త్యాద్యనేక ఋష్యాశ్రమంబుల దర్శించుచు వింధ్యాద్రుల గడచి ప్రయాగ కాశీ గయాది క్షేత్రంబులఁ బూజలిడి హిమాలయోన్ముఖు లగుచు సరయూ నదీ తీరంబున జనుచుండ నొక్కచో. 1187

ఉ. దాహము దాహమంచు దలిదండ్రులు వేడఁగ నంత దవ్వునన్
వాహిత ముంచి నీరములు బట్టగ కుండి నొకండు పూని యా
వాహిని జేరి ముంచునెడ వచ్చె బుడుంగు బుడుంగు శబ్దముల్
గూహిత హస్తి నీరములు గ్రోలెడు నట్టుల భ్రాంతి గొల్పగన్. 1188

ఆ.వె. శబ్ద మాగలేదు సాయకం బొక డెందు
నుండి వచ్చెనో శిఖండి యట్లు
గుండె జీల్చుకొనుచు గుద్దలించగ సాగె
శ్రవణుఁ బ్రాణములను రాక్షసముగ. 1189

తే.గీ. ఏమి జరిగెనొ తెలియ దిదేమి పాప
మెవ్వ రెందుకు జేసిరో యెరుఁగ రాదు,
ఎప్పు డెవ్వాని కే యెగ్గు నిచ్చగించి
తెట్టు లీముప్పు వాటిల్లె నిప్పు డనుచు. 1190

కం. ఆకులు దుంపలు దిని ని
ర్వ్యాకుల చిత్తుండ నగుచు యతినై వని చె
ట్లాకులు పట్టలు గట్టెడు
నా కిట్టి కృతంబు జేయ న్యాయమె యనుచున్. 1191

తే.గీ. అంధు లయ్యును నను జూచి యసువు లునుచు
కొనెడు నా తల్లిదండ్రులు మనుట యెటుల ?
హంత యెవ్వడొ వాడొక్క హత్య గాదు
మూడు హత్యలు చేసిన మూఢుఁ డనుచు. 1192

కం. పరి పరి విధములఁ బొగులుచుఁ
బొరిగొను బాణమ్ముఁ బెఱుకఁ బొరలెడు శ్రవణున్
దరితుని వలె దరిఁ జేరెను
పరితాపము కంట నీటఁ బరువుచు నుండన్. 1193

ఉ. వచ్చిన వాఁడు రాజనగ వస్త్రము లొప్పెడు నెవ్వఁ డీతఁ డీ
ముచ్చిరి యంచు లో దలచి మూల్గుచు నున్న యభాగ్యు పాదముల్
చెచ్చెరఁ బట్టి పల్కె నిటు చేసితి పాపము సైపుమయ్య నే
నిచ్చట రాజునయ్యు నిను నేనిక యంచు భ్రమించి కొట్టితిన్. 1194

ఆ.వె. దశరథుఁడను నేను దయమాలి వేటకై
వచ్చి నీకు ముప్పు దెచ్చినాడ,
శాపమిచ్చి నన్ను సమయించి శిక్షించు
మయ్య ముని కుమార యనుచు నేడ్వ. 1195

కం. అసలే ససువగు నాపై
వసుమతి మగఁడేడ్చు విధము వాలాయింపన్
పసివాడై శ్రవణుఁడనియె
వెస నొకపని జేసిపెట్టు విబుధుఁడ వైనన్. 1196

ఆ.వె. నన్ను నమ్ముకున్న నా తల్లిదండ్రులు
గ్రుడ్డి వార లెత్తుబడ్డ వారు
నీరు లేక వారు నోరెండి యున్నారు
వేగ బోయి నీటి నీగదయ్య. 1197

ఉ. ముందు శరంబుదీసి నను ముక్తునిజేయు మయోధ్య యేలికా,
నందనుఁ డేగెఁ దీరకయె నాల్గు ఋణంబుల నంచుఁ జెప్పి నా
వందన మంతిమంబు నటఁ బల్కుము పల్కుము సాంత్వనంబులన్
వందనమాచరింతునన వారిదనేత్రుఁ డయోధ్య ఱేడు తాన్. 1198



కం. ఏమంటివి శపియింపక
నేమంటివి ముని కుమార? నేనొక పాపిన్,
నీ మాతా పితరుల నే
మోమున నోదార్తు నయ్య ముదముద సడలన్. 1199

కం. నీ ప్రాణము పోక మునుపె
నా ప్రాణము దీసి కొనుట న్యాయము, నీవై
నా ప్రాణము దీయకునికి
నే ప్రాణము దీసికొందు నీ యనుమతితో. 1200

తే.గీ. అనుచు ఖడ్గంబు దీయఁగ నాగు మాగు
మీవు రాజవు నీ మేను నీది కాదు,
నేను నీ ప్రజ నగుట నీ నేరమునకు
నేనె దండింపవలె నది నీకు శిక్ష. 1201

వ. కావున నే శాసించిన యట్లొనరించి నాకు మోక్షంబు నొసంగు మనుచు శ్రవణుండు వలుక న న్నరపతియు జేయునదిలేక దుఃఖాశ్రు జలంబుల బాలకు చరణములఁ గడిగి శరాపనయనంబున బ్రాణముక్తుని గావించి యా కళేబరంబును భుజంబునబూని వాని తలిదండ్రుల మ్రోల నునిచి వారి కరంబుల వారిపాత్రం బునిచి నిలిచియుండ నా ముది వగ్గుల మగండా పాత్రంబున జలంబుఁ ద్రావునెడ నామె తనబిడ్డ నిలబడ్డ వాఁడను భ్రమంబున. 1202

ఉ. ఏమిర నాయనా యెచట కేగితి వా జలమంత దూరమా !
ఏమయి పోతివో యనుచు నెంత తపించితి మింత సేపు, మే
మేమియు జేయలేముగద యెంతకు యంతకు జాలి రాదు, నీ
మోమున ముద్దులాడును ముమూర్షువులౌ మము ముట్టఁడేలకో 1203

ఆ.వె. అనుచు మిగులఁ బొగులు నామె చేతులఁ దడిమి
భర్త యుంచిన జల పాత్ర మెత్తె,
దప్పి తీరి నంత దంపతు లిరువురు
పుత్రుఁ జేర బిలిచి రాత్ర పడుచు. 1204

మధ్యాక్కర.

ముందున్న శవ మానరాని ముది వగ్గులను జూచి రాజు
నిందించుకొనె దన్ను దానె నిర్వాద నిర్వేదుఁ డగుచు
నందించె బలిగొన్న మేను నంధ హస్తంబు లల్లాడ
మంద స్వరంబు కంపింప మాట పెగిలె నెట్టకేని. 1205

ఆ.వె. మీ కుమారుఁ డింక మీ సేవలకు లేడు
పొట్టఁ బెట్టుకొంటి పూజ్యులార,
ముందు వెనుక లేని ముని దంపతులు మీరు
శాపమునకు దగిన పాపి నేను. 1206

తే.గీ. కట్టెఁడి పలుకు లొక్క టొక్కటిగ నాటఁ
గుప్ప కూలిన యిరు పండు గుండియలకుఁ
దాకినది పుత్ర గాత్ర మోదార్పు కనగ
చల్ల దనమున దనువులఁ జల్ల పరుప. 1207

తే.గీ. వేడి తగ్గని పద్మాక్షు వాడి నోట
దూసికొని వచ్చెఁ బగ గుండె తూటు వడగ
మాట యొక్కటి శాపమై మనుజ పతికి
మిగులఁ బ్రేమించు సుతుఁ బాయ మృత్యు వగుత. 1208

తే.గీ. అటులఁ బల్కుచు నాగుండె యాగిపోయె
నా వెనుక నామె గుండెయు నాగిపోయె
మూడు గుండెల నార్పిన మొండి గుండె
శాప సంతప్త భారయై సాగిపోయె. 1209

***ఇది శ్రీవాసవీపురాణమునందు శ్రవణకుమారుని కథయను నలుబదినాల్గవ అధ్యాయము సంపూర్ణము.***

(వాహితము= వహింపబడినది, గూహిత= దాగిన, దరితుడు= భయపడినవాడు, ససువు= సాధువు, ముమూర్షువులు= చావనిచ్చగలవారు)



# నలుబది యైదవ అధ్యాయము

**కం. వైశ్యకుల కల్పవల్లిక !
వైశ్యోదయ గిరి కపర్ద వర్ధిత ధనికా !
వైశ్య జన చిత్త చిత్రిక !
వైశ్యాభ్యుదయోద్ధతా ప్రవాహ మనాకా !**

కం. శ్రవణ కథా శ్రవణంబునఁ
దవిలిన చిత్తంబు లెల్లఁ దనయుల ధర్మం
బవనికి రూపెత్తి దిగెనొ
శ్రవణుఁ డొకడె తనయుఁడనుచు సంభావింపన్. 1210

కం. కథ కొనసాగించె నపుడు
కథకుఁడు పద్మాక్షు ధర్మకాంతా సుతు సత్
కథనమున వంశ విస్తృతి
కథియించుచు వైశ్యమునుల కాంక్షఁ దలిర్పన్. 1211

ఆ.వె. అతఁడు హేమవర్ణుఁ డాతని పుత్రుండు
శివుఁడు దండ్రి వలెనె శీలవంతుఁ
డతని సుతుఁడు కాలు నర్చించి దీర్ఘాయు
వను వరంబుఁ గొన్న ముని వరుండు. 1212

ఆ.వె. అనఁగ నతని గూర్చి వినిపింపవే యంచు
వినతి సేయు విశులు వినగఁ బలికె
నతఁడు గోముఖుండు నుతిపాత్రుఁ డన చెల్లు,
భాగ్యవంతుఁ డవని భోగ్యతతికి. 1213

కం. వ్యాపారంబున రాజై
గోపాలన మందు వేణు గోపాలుండై
భూపాలనమున రైతై
భూపాలుండై సుఖించు భూమిస్పృశుఁడున్. 1214

ఉ. బోలెడు భోగ భాగ్యములు పొంగులు వారగ నిల్చు ప్రోవులున్,
కాలము దీరు దేహమున కాలుఁడు పొంచి భుజించు ప్రాయమున్,
కాల బలంబునెల్లఁ జులుకమ్మున బట్టు మనమ్ము పొంత పం
తాలకుఁ బోవ, బుద్ధి యమధర్ముని వేడుమనెం జిరాయువై. 1215

ఆ.వె. బుద్ధి చెప్పినట్టి సిద్ధికై గోముఖుం
డంతకుని గురించి సంతరించె
వివిధ భక్తి మార్గ విన్యాస గాథాను
రక్తి, నాచరించె శ్రద్ధ తోడ. 1216

తే.గీ. శ్రాద్ధ దేవుని గుణగణ శ్రవణమందు
గడపె కొన్నాళ్ళు సకల భోగములు విడచి
గడపె కొన్నాళ్ళు మనన యోగంబు నందు
కీర్తనంబున దీక్ష సాగించె నపుడు. 1217

తే.గీ. సకల భూమండ లోజ్జీవ సాక్షి సవిత
సవిత చండాంశు భోగ ముషా వధూటి
నవ వధూవరు లార్తిఁ గన్నట్టి పట్టి
త్ర్యంబ కాత్మానువర్తి ప్రత్యక్ష మగుత ! 1218

తే.గీ. శమన సమవర్తి పితృపతి శ్రాద్ధదేవ
దండధర కాల యమరాజ ధర్మరాజ
యమ కృతాంత పరేతరాట్టనెడు నట్టి
త్ర్యంబ కాత్మానువర్తి ప్రత్యక్ష మగుత ! 1219

తే.గీ. ఎడమ రక్కసి, దహనుఁడు కుడిని గొలువ,
దక్షిణాశాధి నాయకత్వంబు నెఱప
దయయు దాక్షిణ్యమును లోన దలపనట్టి
త్ర్యంబ కాత్మానువర్తి ప్రత్యక్ష మగుత ! 1220

తే.గీ. కాల సూత్రంబు ధరియించి కాల మహిష
పృష్ఠ సంచారమున నెల్ల పృథ్వి దిరిగి
క్రొత్త జీవుల కునికిని కూర్చునట్టి
త్ర్యంబ కాత్మానువర్తి ప్రత్యక్ష మగుత ! 1221

తే.గీ. జీవు లన్నింటి సృష్టించి చివర నుదుట
బ్రహ్మ లిఖియించు నట్టు లా బ్రతుకు లెల్ల
నించు కట్టిటాడక నియమించు నట్టి
త్ర్యంబ కాత్మానువర్తి ప్రత్యక్ష మగుత ! 1222

తే.గీ. విధి లిఖించిన దానికి వేల్పు దొరలు
వరములను మార్పు లొనరింప వాని నెట్టు
లనుప వలెనంచుఁ దికమక లాడునట్టి
త్ర్యంబ కాత్మానువర్తి ప్రత్యక్ష మగుత ! 1223

తే.గీ. సత్యవంతుని యసువుల సంగ్రహింపఁ
దెలిసి వెంటాడు సావిత్రి తెలివి ముందు
నిలువ జాలక యసువుల నిలిపినట్టి
త్ర్యంబ కాత్మానువర్తి ప్రత్యక్ష మగుత ! 1224

తే.గీ. సంయమని వాస ! యమలోక సార్వభౌమ !
సర్వ జీవాను వర్తి ప్రశాంతి నిలయ !
సత్వ గుణ సాంద్ర ! సర్వోప శమన ! శమన !
త్ర్యంబ కాత్మానువర్తి ప్రత్యక్ష మగుము ! 1225

తే.గీ. అనుచు గోముఖుం డతిభక్తి వినుతి సేయ
యముఁడు కరుణించి యెదుటఁ బ్రత్యక్ష మయ్యె,
మెచ్చి వచ్చితి గోముఖ నచ్చు మనియె,
మరణ మొకటుండు ననుమాట మరువ కనియె. 1226

సీ. కాల మేఘచ్ఛాయ క్రమ్మిన నెమ్మోము
కలిమి నుషా వర్ణ ఖనులు కనులు
వదలక ప్రాణముల్ శ్వాసించు నాసిక
శిక్షాస్మృతుల్ నివసించు నోరు
తను కర్మ భూషలన్ ధరియించు వీనులు
ధర్మాగ్ని కుంకుమఁదనరు నుదురు
నాశ రహిత కాల పాశంబు కుడిచేత
నెనుబోతు ముకుత్రాటి నెడమ చేత

తే.గీ. కాల మంతటి పొడవైన కాయమొకటి
నింగిఁ దగులుచు నెదురుగ నిలబడంగ
భయము నయమును గదుర విభ్రాంతి నొంది
గోముఖుని కర్ణ పుటములు కుదుట బడగ. 1227

కం. అడిగెదనని చను కదువడి
నుడువుల దొలి యడుగు పడదు నుడువఁ దడబడున్,
మడియఁబడు నెడల మనుగడ
నిడివి యొకఁడె ముడివడునని నిడువడి నడిగెన్. 1228

కం. సమవర్తీ ! వర్తనముల
సమదర్శివి గాన - నెల్ల జనులకు నొకటే
యమదర్శన మందురు గద,
సమయము దప్పకుము నన్ను సందర్శింపన్. 1229

కం. కోమటి తెలివికి శమనుఁడు
మోమున జిఱు హాస రేఖ ముద్దాడంగన్
నీ మాటను పాటింతును
మై మాయక నిల్చుదాక మన్నింతు ననెన్. 1230



ఆ.వె. యముని వరము నంది సమధికోత్సాహంబు
మేన విరియగా నమేయ భోగ్య
మనుభవింపఁ దొడఁగె ననవరతంబుగా
వైశ్య పూరుషుండు వశ్య జరుఁడు. 1231

వ. అటుల దన తనువున దరుగని కాలంబున గోర్కులు కదిలించు కలిమి నారగించు నెడ లోకంబున బెక్కేండ్లు గడచి పుత్రునకుఁ బుత్రు దుదయించి కళత్ర ముంగాంచి పుత్రార్థియై పరితపించునెడఁ బెద్ద ప్రాయంబునుం గడచె నంత తనను గుఱించియు, తన వరంబుల గుఱించియును లోకులెల్లరును కథలు కథలుగ చెప్పుకొనుటయును, క్రొత్తగా పుట్టినవారందరు నొకరి వెనుక మరొకరు నొక వింత మృగమును గాంచినటుల దర్శించి హసించి వెడలుటయును చూచి చూచి సహింప నొల్లక గోముఖుండును. 1232

కం. తన చుట్టు లోకమంతయు
దిన దినమును క్రొత్త రంగు దిద్దుకొనంగన్,
తన దేహముఁ దన భోగము
దిన దినము కృశించు తృప్తి దేవుకొనంగన్. 1233

ఆ.వె. తిన్న తిండి తినుచు విన్న మాటలు వించు
శ్వాస తప్ప క్రొత్త బాస లేక
విసుగు చెందినట్టి వసువర్తి గోముఖుం
డంతరమున నడలు నట్టి వేళ. 1234

కం. మాండవ్యుండను మునివర
మండనుఁ దొండేగుదెంచి మందాగ్రజ హృత్
మండన ! మండిత హితజన
మండల ! శుభమస్తు నీకు మంగళ మనఁగన్. 1235

కం. వచ్చిన మాండవ్యుని గని
చెచ్చెర నెదురేగి పాద సేవనమున మై
జొచ్చిన బడలిక బాపుచు
నిచ్చకముల దృష్టిఁ బరచి యిట్లని పలికెన్. 1236

కం. దండధరునింట వానిని
దండించిన మగఁడ వీవు తడయక నన్నున్
దండింపుము నేనాతని
దండితి దీర్ఘాయు వింకఁ దాళగ జాలన్. 1237

ఉ. దేహము శాశ్వతంబయిన దివ్యగణంబుల వోలె నెప్పుడున్
మోహము దీర భోగముల మున్గి సుఖింపగ వచ్చునంచు ను
త్సాహము జూపినాడ, యమధర్ము జపించి చిరాయువైతి నీ
మోహము తీర దెంతకును, మొట్టుచు నున్నది బుద్ధి ముక్తికై. 1238

కం. వలదను వివేకమును, గా
వలెనను మదియును బెనగుచు వైభవ జలధిం
గలచెదు, వైరాగ్యంబను
కలశము ప్రభవించి నన్ను కర్షించు జుమీ ! 1239

వ. అంచుఁ బెక్కు విధంబులఁ బ్రార్థింప నమ్ముని మాండవ్యుండును గోముఖున
కిట్లనియె. 1240

కం. ఎఱుఁగుదు నీ వరబలమును
నెఱుఁగుదు నీ దేహశుద్ధి నెఱుఁగుదుఁ దెఱువున్,
కొఱగాని పొదవుబ్రతుకున
తెఱఁ దీయుము మరణరమకు తెఱఁగుఁ దెలిపెదన్. 1241

కం. కలకాలము బ్రతుకుచు ముదు
సలి తనమును చూడకుండ సర్వముదినుచున్
కల కలములఁ బ్రతి వేకువ
వలనుల మేల్కొల్పునట్టి వాయస మగుమా ! 1242

ఆ.వె. తనువు మారినంత దండధరుని దండ
మునకు వీలుకలుగు మునుకొనంగ
నంచు మునిచనంగ నాతనిరూపంబు
కాకమాయె కావు కావు మంచు. 1243

చం. జరిగిన దెల్లఁ జూచుచు విచారము శోకము కాగ బందుగుల్
విర విర వోవ గోముఖుఁడు విష్కిర రూపము నుండి పల్కె న
స్థిరమగు దేహ మాత్రులము చిత్తము సత్యము నందు నిల్పి ని
బ్బరముగ నుండుడింక జని బంధములం దొలగించు కొమ్మనెన్. 1244

కం. ఇబ్బడి ముబ్బడి జీవిత
మబ్బురముగ ననుభవించి యలసిన వేళన్
సెబ్బరలగు బంధమ్ములు
ప్రబ్బిన యౌవనములం దుపాసము లగునే ! 1245

ఆ.వె. పుత్ర పౌత్ర గణము బొదిగొని ప్రార్థించె
నెల్ల వేళలందు నిల్లుఁ గదల
వలదు మమ్ముగూడి వసియింపు మంచును
జేరి భోజనంబు జేయుమంచు. 1246

కం. తన వారికి తన యందున
పనుగొను ప్రేమంబు దలఁచి ప్రతి వత్సరమున్
వినయంబున బితరుల కిడు
మినుముల దినవత్తు నంచు మింటికి నెగసెన్. 1247

ఆ.వె. నాటినుండి మనము పాటించుచుంటిమి
కాకములకు మినుప గారెలిడుచు
నాబ్దికమ్ము లందు నాచార మొక్కటి
వైశ్య వర్యులార ! వాస్తవంబు. 1248

**ఇది శ్రీవాసవీపురాణమునందు గోముఖునికథయను నలుబది యైదవ అధ్యాయము సంపూర్ణము.**

(విష్కిరము= పక్షి)

# నలుబది యారవ అధ్యాయము

**కం. గోమత జన హృదయాలయ !**
**గో మండల సుజన నయన కోశామ్నాయా !**
**గోమంత మూల నిలయా !**
**గోమండల జన హితార్థ గోదుహ సదయా !**

కం. గోముఖ కథనా నంతర
మాముష్యాయణుల చరిత మాలింపగ నా
కోమట్లు కోరి వేడఁగ
నా మునియును పలికె నిటు లనంతర గాథన్. 1249

తే.గీ. గోముఖుని యొక్క పుత్రుఁడు కుముదుఁ డనఁగ
నతని పుత్రుఁడు కల్హారుఁ డనెడి వాఁడు;
వంశమున వన్నె తెచ్చిన వారు వారు,
వసువు లందున వరలిన వారు వారు. 1250

తే.గీ. తాత తండ్రుల గారాబు తానకంబు
కష్టమన నేమొ జగతి దుఃఖమన నేమొ
రెండు పదముల కర్థ మెందుండునో-తె
లియ నటులఁ బెంచెఁ గల్హారు నయనములను. 1251

శా. ఆజన్మార్జిత భోగ భాగ్యరత తృష్ణానంద సంపద్విభా
భ్రాజన్మంగళ మందహాసమున శుభ్రాకాశ నీలాంబుదం
బై జీరొక్కటి పొల్చెఁ బుత్రధన సంప్రాప్తంబు గాకున్కి నా
లో జీమూత కణీయమస్త్రమగుచున్ లోనుండి జృంభించగన్. 1252

ఉ. వంశము నిల్పగా సుతుఁ డవశ్యము గావలె నీకు, లేక ని
ర్వంశ మగుంగదా ! నరక వాసము దప్పదు మా కటంచు వృ
ద్ధాంశువు లార్తిఁ జెంద నియతాంతర తాపము వృద్ధి జెంది శీ
తాంశు విభూషితుం గొలిచెదన్ వెతదీరఁగ నంచు నాతఁడున్. 1253

చం. వనముల దూరలేదు, నిజ వైభవ దూరమున న్నివాసమే
వనముగ మార శీతగిరివాసు వలంచి తపించు చుండగన్
దినములు మాసముల్ గడచె దీక్షను వత్సరముల్ గతించె సా
ధనమున జంకు లేదు, వరదాతకు జంకకఁ దప్పలేదికన్. 1254

కం. ఒక రాతిరి స్వప్నంబునఁ
బ్రకటంబై పలికె నిట్లు పరమేశ్వరుఁడున్
నికష వ్రత కల్హారా !
ప్రకటింపుము నీదు కోర్కె పాలింతు ననన్. 1255

ఆ.వె. సుతులు లేని బ్రతుకు సూత్రంబు లేనట్టి
గాలి పటము గాదె గణప జనక ?
తాత తండ్రు లెల్ల తపియించు చున్నారు
భిక్షపతివి పుత్ర భిక్ష నిడుమ ! 1256

వ. అంచుఁ గల్హారుండు ప్రార్థింపఁ బరమేశ్వరుండు నిట్లనియె. 1257

ఉ. కారణ జన్మ నీది, కలి కాలమునం జగదంబ జన్మకుం
గారణమై జనించు సుతుఁ గాంచెద వీవు మనంబుదీర క
ల్హార ! కుల ప్రవాహమున హైమవతీ కరుణార్ద్ర వీచికల్
తీర జనావళీ హృదయ దీప్తులు గాగ యశంబు గాంచుమా ! 1258

వ. శివ కరుణా రస వాహినీ విలసితోదయ కల్హార వదనుండైన కల్హారుండును నానందోద్వేగంబున నిట్లనియె. 1259

కం. పరమేశా ! ధన్యుఁడ నీ
వరమున భారంబు దీరె, వచియింపుము నీ
వరమున బుట్టెడు నతఁ డే
వరమున జగదంబఁ గాంచు వారిద కేశా ? 1260

వ. అంతఁ బరమ శివుండును నప్పరమ గాథనిట్లు వినిపించె. 1261

కం. గిరి విడి భువికేతెంచిన
వరముని శాపిత సమాధి వర్గము తోడన్
చిరకాలము భూవాసము
నెరపెను వైశ్యాధిపతిగ నిగ్రహ మొప్పన్. 1262

ఆ.వె. బాల్యమందు చదువు, పరువమందున ప్రేమ,
వృద్ధులందు భక్తి, వితరణేచ్ఛ
నుండి తుదకు పుత్త్రు నుద్వాహు నియమించి
ముదిమి నా సమాధి ముక్తిఁ గోరి. 1263

చం. అడుగిడ జాలనట్టి గహనాంతర సీమల గార్హ్వవాసనల్
సడిఁ గన జాలనట్టి మృగ సంయుత గాఢ తమాల వాటికల్
గడచి సమాధి కాంచె నొక క్షాళితనాకజ మోక్షకాముకున్
నిడునెఱి గడ్డపుం దొరను నిష్ఠిత మేధు సుమేధ భూసురున్. 1264

ఆ.వె. అతని సాధు రూప మంబక వ్రత ఫలం
బతని చూపు కరుణ కాల వాల
మతని మోము నిశ్చలానంద సామ్రాజ్య
మతని యాశ్రమం బజాశ్రయంబు. 1265

ఉ. దర్శన భాగ్యమొందుట, పద ద్వయమంటుట, సర్వదాపరా
మర్శిత వేద శాస్త్రచయు మానస తోషక మౌట నాతఁడున్
స్పర్శ పదంబుఁజేరకయె బాహువులం గదియించి పల్కు మో
కర్శిత శత్రు షట్క ! మదికామన దీర్తునటంచుఁ బల్కగన్. 1266



చం. పలికె సమాధి– తీరినవి బాధ్యత లింక ముముక్షువైతి నా
మెలకువ నిందు జేరితిని మీ దయ కల్గిన దింక నన్ను మీ
వలసిన యట్లు దిద్దుడని, వర్షుల వాంఛల ముంచు వైష్ణవీ
బలమున మూల మేమిటనె భక్తిని వందన మాచరించుచున్. 1267

కం. అంత సుమేధుఁడు నిట్లనె
నంతటి మోక్షార్థివైన నాలింపగ నొ
క్కింత శ్రమ దీరగ నిలుము
స్వాంతము సిద్ధంబుకాగ వైశ్య శ్రేష్ఠా ! 1268

వ. భూసురు వాత్సల్యంబున కలరిన భూమిస్పృశుండును నత్యంత భక్తి శ్రద్ధల
నయ్యాశ్రమంబు నందుండి, యందున్న సురథుఁడను నొక రాజ్యభ్రష్టుంగూడి
జన్మాంతర మైత్రింబొంది మహర్షికి సపర్యలు జేయుచుండ నత్యంత సంతుష్టుఁడైన
సుమేధుండును భవబంధబాధా తప్తులగు నాశ్రితుల కిట్లనియె. 1269

ఆ.వె. మోక్ష మార్గమునకు మూత వైష్ణవ మాయ
దాని నెఱుఁగ వశమె మానవులకు !
ఎఱుక గలుగు వార లెఱుక చేసిన గాని
యెఱుఁగు శక్తిలేక యెఱుక పడదు. 1270

ఆ.వె. వింటి గత చరిత్రఁ గంటి మీ వర్తనం
బంట గలదు మీదు జంట కిపుడు,
హతము జేసి రే మహామాయ కరుణా క
టాక్ష మందు తోష మక్షయంబు. 1271

చం. సురథ సమాధులందుఁ బొడ సూపిన సందియ మక్షియోగ మం
దరసిన మౌని పుంగవుఁడు నాంబిక తత్త్వ రహస్య భూమికల్
విరియగఁ బల్కె నిట్టు లరవింద మరంద మదాళి దృక్కులం
దొరయగ నీని మంజు దళ యోగము మాయ యనంగ జీవులన్. 1272

కం. ఛిద్రములుగ నాహారము
నిద్రా భయ మైథునములు నెలవులు కాగన్
భద్రముగ మహా మాయా
కద్రువు మన బాములందు కదలక నిలచున్. 1273

కం. పరమాణువు నుండి జగతిఁ
బరమాత్ముని వఱకు నెల్ల ప్రాణుల యందున్
చిరముగ మోహాంధ తమస
మిరవుగ వ్యాపింప జేయు నిది మాయ యనన్. 1274

తే.గీ. అట్టి మాయా మహాశక్తి నందు రవని
విశ్వ జననిగ రాజరాజేశ్వరిగను
నాది శక్తిగఁ బ్రకృతిగ నంబ లలిత
బాల మూలప్రకృత్యాది పలు విధముల. 1275

శా. సర్వ వ్యాపక నిర్వికార నిజ విస్తారావలంబంబునై
శర్వ బ్రహ్మ సురేంద్ర సూర్య సుమన స్సంఘాత సంసేవ్యమై
దుర్వారేషణ భూషితంబగుచుఁ బ్రాదుర్భూత దృష్టాంతమై
సర్వాంగీణ జగద్ధితావఘళమై శాసించు సంసారమున్. 1276

తే.గీ. ఆ మహాదేవి నర్చింపుఁ డాశ దీరు
నఖిల లాభంబు లొనగూడు నమరు యశము
మోక్షమైనను నిడుముల మోక్షమైన
నామె దయలేనిదే ప్రాప్తి నందలేరు. 1277

తే.గీ. సకల కుల వర్గ మత ధర్మ సాధనముల
ఫలము లొనగూర్చు నేకైక పరమ శక్తి
వశము కావలె నన్నచోఁ బడయ వలయు
నాత్మ శక్తిని, లేకున్న నతుల భక్తి. 1278

***ఇది శ్రీవాసవీపురాణమునందు సమాధి సుమేధుని గాంచుటయను నలుబది యారవ అధ్యాయము సంపూర్ణము.***

(ఆముష్యాయణులు= ప్రసిద్ధుడైన తండ్రివలన పుట్టినవారు, తానకము= స్థానము, జగద్ధితావ ఘళము= లోకహితం కోసం వ్యాపించునది)



# నలుబది యేడవ అధ్యాయము

**కం. మధు కైటభాది రాక్షస
నిధనానంతర విహసిత నిర్మల రూపా !
మధుర భవాలంకృత యుగ
మధుపర్క విధాతృ నేత్ర మంగళ బాష్పా !**

కం. భూమి సురుని పలుకులు విని
భూమిస్పృశుఁ డడిగె నట్టి భువనైక మహా
క్షేమంకరి కథ యేమని,
భూమీశుఁడు వంతబలుక భూసురుఁ డనియెన్. 1279

ఆ.వె. భక్తులార వినుఁడు బ్రహ్మాండ భాండం బ
నాదిగా ప్రళయ పదాహతంబు,
కాలచక్రమందు కల్పాంత ప్రళయంబు
జలము నందు ముంచు జగమునెల్ల. 1280

వ. అట్టి వేళ. 1281

ఆ.వె. అన్ని దిక్కులందు మున్నీరె మున్నీరు
మన్ను జాడ లేదు మిన్ను దప్ప,
కన్ను పొడుచుకొన్నఁ గానరాదొక ప్రాణి,
కన్ను పొడుచుకొనుట కున్న దెవరు ! 1282

కం. ఉన్నాడొక పన్నగపతి
వెన్నున బవళించి నట్టి వెన్నుం డతఁడున్
కన్నులఁ బెను నిద్దురఁ గొని
యున్నాడా యోగమాయ యోజన చేతన్. 1283

శా. ఎన్నో యేండ్లు గతించె నట్టి స్థితియం దేర్పాటుమై కాల మా
సన్నం బయ్యెను నూత్న కల్పమునకున్ సంకల్ప మాత్రంబునన్,
మున్నా విష్ణువు నాభినుండి మొలిచెం బూరాణి పద్మంబు నం
దెన్నో తేకులు నందు నన్నుదురులం దేపారె బ్రహ్మాఖ్యుఁడున్. 1284

ఆ.వె. పుట్టినాడు కాని పుట్టి యేమొనరింప
వలెనొ యెఱుక లేని నలువ యటులె
మౌన ముద్ర నుండ మఱికొంత కాలంబు
గడచె నాంత కాల గర్భమందు. 1285

ఉ. అంతట లోకమందు దనుజాంకురముల్ పొడసూపెనో యనన్
ధ్వాంత మలాకరంబులగు వారిజ నాభుని కర్ణ యుగ్మపుం
గ్రంతలఁ బుట్టినారు మధు కైటభు లూర్జిత దేహ ధారులై,
క్రాంతికి తావు లేదు, విరి గద్దియ కన్పడె చుట్టుఁ జూడగన్. 1286

చం. తఱలగ నీరు లేని దరి దవ్వుల నైనను కానరాదు, యీ
మెఱియని కేల తావలము, మీదికి పోదమటంచు వారలుం
జెఱియొక వైపు నాళమున జేతులు వైచిన యంత గద్దెపై
ముఱముఱలాడ సాగె నలుమోములు మూలము కంపమొందగన్.

కం. పని లేని బొమ్మ కప్పుడు
పని కలిగెను తన్ను దాను బ్రతికించుకొనన్,
పనికెడు పింజూష భవుల
పని బట్టగ లేడతందు పద్మజుఁ డగుటన్. 1288

కం. ఎదురుగ నుండియు జనకుఁడు
నిదురించుచు, నుండి లేని నిధి పోషింపన్ ;
కదిలించుచు విదిలించుచు
మదమున రక్కసుల జంట మైమై దరియన్. 1289



కం. మనమున జెమటలు పట్టగఁ
గనలెడు హృదయంబు నుదుప గల బలమునకై
యెనిమిది కన్నుల నెమకగ
కనిపించెను తండ్రి కనుల కౌగిలి లోనన్. 1290

ఉ. అయ్యది యోగ మాయయని, ఆ యమ సృష్టికి మూల భూతమం
చొయ్యన నంతరాత్మ చెవి నూదగ నామె గుఱించి బ్రహ్మయుం
దియ్యని స్తోత్ర రత్నముల దెప్పరముం దొలగింపు మంచు, సా
హాయ్యము జేయుమంచు వినయంబున మోములువంచి వేడగన్.
1291

ఉ. ఆమెయు మూర్ఖ రాక్షసుల నంతము జేయఁగ దప్ప దింక వ్యా
యామ మటంచు శ్రీహరికి యంత్రణముం దొలగించి లేచి పోన్,
ఆ మహనీయ మూర్తియును నాస్తరముం దిగి వెన్నుసాచి కెం
దామరలైన నేత్రముల దారుణ దృశ్యము బ్రస్తరించగన్. 1292

ఉ. సారసమెక్కి సారసజు సైరణ పైకొను సాంపరాయి కం
బారసి సారసాక్షులు దవానల కీలలఁ బ్రస్తరింప సం
హారము సేతునంచు హరి హస్తములం బిగియించి లేచె, హుం
కారము చేసె, జేసె మధు కైటభులన్ భయకంప మొందగన్. 1293

కం. బాహా బాహిగ సాగిన
మోహరమున ముష్టి ఘాతముల దేహములన్
సాహస మొక్కింత సడల
దాహవ మింకెట్లు ముగియు నాది పురుషులన్ ? 1294

తే.గీ. కొడుకులను జంప చేతులు కూడి రావొ
హరి హరించదు మధు కైటభానుజులను,
తండ్రి నణగింపఁ దనయుల తలఁపు రాదొ
హరిని జంపరు మధు కైటభానుజులును. 1295

తే.గీ. తండ్రి కొడుకుల నడుమను తఱుఁగ నట్టి
యుద్ధ మెన్నేండ్లు గడచెనో యూహ లేదు,
నలు మొగమ్ములు గన్నులు నలఁగి పోయె,
కడకు మాయామహాదేవి కదలి వచ్చె. 1296

కం. ఈసారి యోగ మాయకు
కైసాచి వలగొనగ మధు కైటభు లందన్
వేసారి వారు నాయమ
మోసంబున జిక్కి రమిత మోహితులగుచున్. 1297

ఆ.వె. యుద్ధమాపి వార లిద్ద నారాయాణా
మెచ్చినాము నీదు మేటి తనము
చెప్పు మేది కోరి చేయుచుంటివొ యుద్ధ
మట్టి వరము నిత్తు మనఁగ నపుడు. 1298

వ. శ్రీహరియు వారిపైగల యోగమాయా ప్రభావంబు గుర్తించి, రిపు బలంబును దన కర్తవ్యంబును గుర్తించి యిట్లు పలికె. 1299

కం. మధు కైటభులార ! వినుడు
బుధిత మహా సృజన నాది పూరుషు లగుటన్
నిధనమునకు లొంగరు మీ
రధిక బలాఢ్యులు మహా పరాక్రమ వంతుల్. 1300

కం. కమలజునకు ననుజులు కద
విమల మతులు నిజ వచనులు వికసిత హృదయుల్
తమరు వరములు గురియగల
సమర్థు లర్థుల గృతార్థ చరితుల జేయన్. 1301

కం. అడుగుమని యడిగితిరి నను
నడిగెద నడిగిన తడవుగ నడిగిన దానిన్
పెడచెవి నిడి, యడుగు మనఁగ
నడుగుట కిది యడుగఁ దగునె యని యడుగరుగా ? 1302

వ. అంతట మధు కైటభు లహంకరించి యిట్లనిరి. 1303



కం. నిజ వచనులనుచు మమ్ముల
భజనలు చేయుచునె యిట్లు పలుకగ నేలా ?
సుజనుఁడు జనకుఁ డనుకొనిన
నిజమాడుదు మనుచు నమ్మి నీ వడుగు మజా ! 1304

ఉ. అంతట శౌరి పల్కె నిజ మాడుదురేని వచింపు డెట్లు మి
మ్మంతము జేయువాడ ? తునుమాడక తామస ముత్సహించు మీ
స్వాంతము సృష్టి కడ్డమగు, సాగదు నూతన కల్ప కల్పనం
బంతయు మీవరంబనుచు నంజలిఁ బట్టగ నంతఁ గర్షులున్. 1305

ఆ.వె. తొలుత పలుకు లేదు కలగుండు వడి గుండె
లవియ లోన లోన బొవిలి పొవిలి
కొంత సమయమునకు వంత దీరిన యంత
మెల్ల మెల్ల నిట్లు మిడిచినారు. 1306

ఉ. మోసము చేసితే జనక ! ముచ్చటగా నిను వేడుమన్న మా
దోసము మోసమైన దిక దూషణ మేల నహంకరించి మా
చేసిన పాపమిద్ది, మృష చేత కళంకము వద్దు, చంపుమీ
నీ సమదృష్టి యిట్టిదను నిక్కున నీరము లేని తావునన్. 1307

ఆ.వె. వెన్ను డంత వేగ మిన్నంట మై బెంచి
తొడల మీద వారి యొడలు నుంచి
వంట బుట్టినట్టి వ్రణము గోసిన యట్లు
నఱికి వైచె మెడలు, నలువ మిగుల. 1308

తే.గీ. అటుల చిత్తానుసారంబు నఖిల సృష్టి
నడపు మహనీయ శక్తి యీ నరుల కొఱకు
మహిష రాక్షసుఁ జంపిన మాత జగతి
నామె కృపయున్నఁ దీరు మీ యాశయములు. 1309

**ఇది శ్రీవాసవీపురాణమునందు మహామాయ విష్ణువుచేత మధుకైటభులను చంపించుటయను నలుబదియేడవ అధ్యాయము సంపూర్ణము.**

(మెతియని= చలింపని, పనికెడి= ఆగ్రహించెడి, పింజూషభవులు= గులిమిని బుట్టినవారు, మిడియు= ఎగురు, వెలికురుకు, బుధితము= తెలియబడినది)

# నలుబది యెనిమిదవ అధ్యాయము

**కం. మహిషా సుర మర్దిని ! జన**
**మహిష గణోత్తాల గర్వ మర్దిని ! మహితా**
**వహ మహిష వాహన సుకరి !**
**మహిషాశన వాహన కృత మాయా మాతా !**

కం. అనవిని సమాధి సురథులు
వినయంబున జెప్పుమనిరి వివరంబుగ నా
దనుజుని మహిషుని జంపిన
మనుపరి మాయా మహా ప్రమాణము దెలియన్. 1310

వ. పుణ్యకథా శ్రవణాసక్తులగు వారి యభీష్టంబునకు సంతసించి సుమేధుండు నిట్లనియె. 1311

కం. సృష్ట్యాదిని జనియించిన
దౌష్ట్యం బంతట నశించి దరికొన లేదా
దౌష్ట్యంబు నంత కంతకు
సృష్ట్యాదిగ వరలుచుండెఁ జీకటి వోలెన్. 1312

కం. సృజనాత్మక తేజముతో
నిజమును గాపాడువారు నిర్జరు లనగన్
సుజనుల నంతము జేయగ
ధ్వజమెత్తెడు వారు గలరు దానవు లనగన్. 1313

కం. నిర్జరులకు నాయకుఁడుగ
నూర్జిత తేజుఁడు మహేంద్రుఁ డుద్ధతిఁ జూపన్,
దుర్జయుఁడగు మహిషాసురుఁ
డార్జించెను దానవపతి యను ఘన పదమున్. 1314



కం. సురలకు నసురులకును బెను
దురమున బెక్కేండ్లు గడఁచెఁ దుదకా దనుజుల్
సురలను జెరఁబట్టిరి సుర
పురమును బాలించిరి తమ పోతర ముబ్బన్. 1315

ఉ. స్వర్గ సుఖంబు లందెపుడు సౌష్ఠవ సంపద లందు మున్గి గో
సర్గ విభూతి వెల్గు సుర సారధి, వైరి తమిస్ర వాటికన్
నిర్గత భాస్కరుం బగిది నిగ్గులు తక్కి నతోత్తమాంగుఁడై
వర్గము గూడి యూడిగము వట్టి కనంబడెఁ బ్రొద్దు పుచ్చుచున్. 1316

కం. దేవతలను సాధింతురు
దేవతల ధనంబులెల్ల దిగ మ్రింగెద రా
దేవతల కన్నమిదు భూ
దేవతలను పట్టి మ్రింగి త్రేన్తురు దనుజుల్. 1317

తే.గీ. సూర్య చంద్రాదు లివి యెల్లఁ జూచి చూచి
కాడుగా మారు నాకంబు చూడలేక
బ్రహ్మదేవుని ముందుంచి భవుని విధుని
జగతిఁ గాపాడు డంచుఁ బ్రాంజలి ఘటింప. 1318

కం. సృష్టి స్థితి లయ కారుల
దృష్టులఁ గొలువున్న మాయ త్రిగుణోత్సుకయై
భ్రష్టాబ్రియ విస్ఫోట
స్పష్టాకృతి వోలె నిల్చె స్రష్టాసురయై. 1319

ఆ.వె. నూరు కోట్ల సూర్య లీరువాటిన యట్లు
దిగ్గజంబు లమిత దీప్తి మెఱయ
సురుల కభయ మగుచు సురవైరులకు భీతిఁ
గొలుప వెలుగు లీనెఁ గోమలాంగి. 1320

తే.గీ. దున్న రక్కసి పడగ్రుమ్మ దుమ్ముకొన్న
దేవరల మోములకు నవ్వు దివ్వె లొదవ
నాయువులఁ గాపులగు తమ యాయుధముల
నెల్ల నర్పించి మ్రొక్కిరా యేదుగడకు. 1321

తే.గీ. హిమగిరీంద్రుఁడు ధవళ సింహమును వాహ
నముగ నర్పించె నంతనా యమరులెల్ల
వెంట నడువగ జగదంబ మింట వెలసె
వేయి చేతుల విరిదండ వెల్లి విరియ. 1322

సీ. ఒక చేత వేదంబు లొక చేత నాదంబు
లొక చేత జపమాల లొకట గంట
మొక చేత చక్రంబు నొక చేత శంఖంబు
నొక చేత ఖడ్గంబు నొకట గదయు
నొక చే త్రిశూలంబు నొక చే కపాలంబు
నొక చేత డమరుకం బొకట పరశు
వొక చేత వజ్రంబు నొక చేత కోదండ
మొక చేత నంకుశం బొకట శక్తి

తే.గీ. భిండి వాలాసి ముసల భుసుండికలును
మసర ముద్గర ప్రాస తోమరములున్ను
కణయ కంపణ కుంత రోహణ కఠార
పట్టసాదుల దుర్గాంబ పరిఢవిల్లె. 1323

తే.గీ. అట్టి మాయా మహాదేవి యట్టడి గొన
బరసి మృగరాజ వాహన మధివసించి
దనుజు లదరగ సింహనాదమ్ము జేసి
సమర శంఖంబుఁ బూరించె శక్తి వెలయ. 1324

సీ. శిరమెత్తి జేజేలు జేజేలు వలుకంగ
జైజై నినాదముల్ జగతి నిండె
నంద రొక మారుగా నంతరాళము నిండ
శంఖముల్ పూరించ శ్రవము లదరె
బ్రహ్మాండ భాండంబు బ్రద్దలౌనో యంచు
నుర్వీ తలము కంప మొంద సాగె
కడలు లన్నియు నల్లకల్లోలమై పోవ
కుల పర్వతములు సంకులము నొందె

తే.గీ. సర్వ లోక భయంకర శక్తి యటుల
సంప్రహారార్థమై ముందు సాగుచుండ
మహిష దానవుఁ డా వర్తమాన మంది
సర్వ సేనాధిపతికి నుత్తర్వు నొసఁగె. 1325

కం. చిక్షురుఁడను సేనాపతి
తక్షణమే సేననెల్లఁ దరలించెను హ
ర్యక్ష విరాజిత రాజ్ఞి స
మక్షమునకు ఘోర రణ నిమంత్రితుఁ డగుచున్. 1326

కం. రణమునకు సిద్ధమై సుర
గణ సేవ్యండగు మహిషుఁడు కౌమారీ మా
రణ తేజము గాంచి విచా
రణఁ బడె నెక్కడిది యీ శరణ్యం బంచున్. 1327

కం. అచ్చెరువగు నీ రూపం
బెచ్చిఱు చిచ్ఛక్తి యగునొ – ఈ నను ద్రచ్చన్
వచ్చెనొ – యెద్దమి యైనం
జొచ్చెద రిపురాశి నంచుఁ జొరఁబడె నతఁడున్. 1328

వ. అంత నతని వెంటఁ జిక్షుర చామరోదగ్రాసిలోమ మహాహను బాష్కల బిడాలాది ప్రచండ భుజదండ పరాక్రమశాలురగు రాక్షస ప్రముఖులు రథ గజ తురగ పదాతి దళంబులఁ గూడి ఘోర సంగర రంగ ప్రవేశంబు జేయ. 1329

శా. ఘోరాకారులు శూరులైన దనుజుల్ ఘోరాస్త్ర శస్త్రంబులన్
వీరావేశమునన్ భయంకరముగా వేటాడ సాగన్ సురల్
ప్రారబ్ధోద్ధృత యుద్ధ భీరులయి పాఱన్సాగిరా మాయయున్
నీరేజానన ఘోర రూపిణిగ క్షోణింబర్వె రూక్షాక్షియై. 1330

సీ. ఆమె చూపులఁ బడి యంతరించిరి కొంద
రామె తూపుల ఛిన్నమైరి కొంద
రామె హుంకారమం దసువు లిచ్చిరి కొంద
రామె నీడల హతులైరి కొంద
రామె యూర్పులఁ బుట్టు శ్యామలాంగుల మాయ
లందు జచ్చిరి కొంద రసుర వరులు;
ఆమె సింహాస్యమం దశ్వ గజావళు
లాహారమై పోయె నంత నవని
తే.గీ. మడుఁగులై రక్త మాంసముల్ తొడిబడంగ
శాకినీ ప్రేత భేతాళ ఢాకినీ పి
శాచ భూతాది గణముల సంబరముల
కంతు లేకుండె నుగ్ర రణాంగణమున. 1331

కం. జన సమ్మర్దము గల నగ
రున నణ్వస్త్రంబు వేయ రూపఱు భంగిన్
కనబడు తన సైన్యస్థితిఁ
గని చిక్షురుఁ డుగ్రుఁడై విఘాతకుఁ డగుచున్. 1332

తే.గీ. మహిషుఁడన వీడె కాబోలు మసఁగు ననఁగ
నంబపై దాడి చేసె బలంబు కొలది
వాని శస్త్ర ప్రయోగ మా వనిత యెడల
నగ్ని కాహుతిగా వేయు నాజ్యమయ్యె. 1333

తే.గీ. చిక్షురుని జంపి జగదంబ చేసినట్టి
వ్యోమ కీలిత మారణ హోమమందు
చామరోదగ్ర కాలాది సైన్య పతులు
మంటలంబడు పుర్వులై మాడి రంత. 1334

చం. బలములు చచ్చినన్ మహిష బల్లిదుఁ డించుక నోట లేక ది
గ్వలయము దిర్దిరం దిరుఁగ వాటముగా నిజరూప మొంది కొ
మ్ములఁ బెకలించుచున్ భువనముల్ బెగడొందగ అంకె వెట్టుచున్
విలయ సదృక్ష నిశ్వసన విక్లబ విశ్వ కరుండునై చనన్. 1335

ఉ. ఆ మహిషాసు రాగ్రహము నాతని భీకర మృత్యురూపకం
బా మహిళామతల్లిక వియాతికె సాధ్యము, తక్కు దేవతల్
తామస బద్ధులై కనులు తాళక విభ్రమ చిత్తులైరి, ఆ
మోములఁ గాంతు లద్దగ నమోఘ రణంబు ఘటిల్లె నంతలో. 1336

సీ. మాయా మహాదేవి మాయ రక్కసి మధ్య
మారణాహవ మెన్న మతులు పోవు
మహిషుండు గోరాడ క్ష్మాధరంబులు మింట
నక్షత్రముల వోలె నాట్యమాడు
మున్నీరు మిన్నేరు మొగరించి ప్రవహించ
మన్ను మాగుడువాఱ మల్లడించు
హర్యక్ష సైరిభాహంకార సంఘట్ట
పదఘట్టనల భూమి పగులు వారు
తే.గీ. మాటి మాటికి రూపము మార్చు మహిషు
మాయ లన్నింటిఁ దృటిలోన మాపు, నైన
నంతు లేకుండె వాని దురంతములకు
రూపు సెడదాయె వాని కురూపములకు. 1337

తే.గీ. విసిగి వేసారి చివరకు విశ్వ జనని
తామసాకృతి నిర్జింపఁ ద్రాగె మధువు
దనుజుఁ డదిరిపడ విరావమునఁ జెలంగె,
కనులఁ గురిపించె విస్ఫులింగంబు లెగయ. 1338

కం. మహిషునిపై లంఘించి ప
ద హతుల నణగంగఁ ద్రొక్కి దారించగ నా
మహిషుఁడు వేరొక రూపము
వహియింపఁగఁ దొడఁగె నంత వదనారుణయున్. 1339

వాసవి. చంపినం జావనట్టి శరీరమున్ చంపందగు యుక్తి బూని చిత్
సంప దేపారగా, మహిషాకృతిం జంపన్ జనియించు ఘోర రూ
పంపు శీర్షోదయంబున, శేషమున్ పాదంబునఁ ద్రొక్కిపట్టి, ఖం
డింప శీర్షంబు వేర్పడఁ, జచ్చె నాడెట్లే మహిషాసురుం డనిన్. 1340

కం. మహిషుని జంపిన క్షణమున
రహియించెను నిండు హాయి, రక్ష్య ఋభువులన్
మహిషాసుర మర్దిని యని
విహరించిరి పాడుకొంచు విను వీధులలో. 1341

***ఇది శ్రీవాసవీపురాణమునందు మహామాయ మహిషాసురుని చంపుటయను నలుబది యెనిమిదవ అధ్యాయము సంపూర్ణము.***

(గోసర్గము=ప్రాతఃకాలము, విధుడు=త్రిమూర్తులు, భ్రష్టాభ్రియ విస్ఫోటము=మబ్బునపుట్టి జారినభయంకరధ్వని,స్రష్టాసుర=రాక్షసుల తపింపజేయుశక్తి, ఈరువాఋ=విహారముచేయు, అట్టడి గొనబు=యుద్ధ సౌందర్యము, సంప్రహారము=యుద్ధము, ఎచ్చిఋ=వర్ధిల్లు, ఎడ్డమి=ఆపద, ప్రారబ్ధోద్ధృత=గతదోషఫలం గా వెనుకడుగువేయు, మసగు=విజృంభించు, విక్లబ విశ్వకరుడు=విశ్వానికి అంగాలు పోగొట్టేవాడు, మన్నుమాగుడువాఋ మల్లడించు =పోరుతో నేలబురదచేయు, సైరిభము=దున్న, ఋభువులు=దేవతలు)



# నలుబది తొమ్మిదవ అధ్యాయము

కం. శుంభ నిశుంభ వినాశిని !
శుంభచ్చైతన్య సాంద్ర శుభ సంకీర్ణా !
సంభూత చేతనావన !
అంభ స్సంభూత నిర్మలాంతః కరణా !

వ. అంత సురథుం డిట్లనియె. 1342

కం. చండిక యని కాళీ చా
ముండీ యని యందురామె మొద లీమేనా
చండాదులఁ జెండిన కూ
ష్మాండి వచింపుడు మహాత్మ ! మంగళ చరితన్ ! 1343

వ. సురథ సమాధు లాసక్తు లగుటం గని సుమేధుం డనంతర గాథ నిట్లు వచించె. 1344

ఆ.వె. మహిషుఁ డంతమొంద నహిహ ప్రతాపంబు
త్రిభువనంబు లందుఁ దెప్పరిల్లె,
కొంత కాల మట్లు గుంపించినన్ లేచె
చావు లేని తామసంబు తిరిగి. 1345

తే.గీ. ఓడి పాతాళ మందు దోగాడుచున్న
యసురు లందున దీర్ఘ కాలాంతరమున
దండి మగలంచు నెల్లరు దండఁ జేర
సంభవించిరి శుంభ నిశుంభు లవని. 1346

కం. లేచినదె లేడి పరుగన
దోచిన దా జంట లేచు ధోరణి చూడన్,
నోచిరి దుర్జయ శక్తికి
దోచిరి సుర వైభవముల దోర్బల మొప్పన్. 1347

ఉ. ఎప్పటి యట్ల దేవతలు హ్రీ నత హీన తమోత్త మాంగులై
యప్పుడు విష్ణు మాయ తమ కండగ నిల్చిన తీరు చొప్పునం
దిప్పుడు బ్రోచునంచు నుతియించిరి గాంగ హిమాద్రి వాసినిన్
ముప్పుఁ దొలంగఁజేయుమని మ్రొక్కిరి నిశ్చలభక్తి తోడుతన్. 1348

చం. పిలచినఁ బల్కు తల్లియని పేరు గడించిన పెద్ద దిక్కు పే
రలసిన నిర్జరాళి కను లారని వేదన మ్రగ్గఁ జూచి పు
ష్కల కరుణాలవాల నిజ కంఠ విముక్త వివిక్త సాంత్వన
మ్ములఁ బదిలించ వైరి జన మోక్షము సంపుటి నొందె కౌశికిన్. 1349

ఉ. తేజము కౌశికీ విమల దేహ విశిష్ట విభక్తి నొంద ని
స్తేజ మహో విభూతి వెలి తిప్ప వెలారిచినట్లు నల్లనై
నైజ పరాక్రమోగ్ర వదన ద్యుతి రక్తిమ నింగి నాల్కయై
రాజిలె కాళికాంబ యన రాక్షస లోక విదాహ దక్షతన్. 1350

తే.గీ. కౌశికీ రూపమును జూడ కన్నతల్లి
కానిపించెను దేవతా గణముకెల్ల,
కష్టములు దీరెనంచు దుఃఖములు మరచి
మంచి దినములకై నిరీక్షించు చుండ. 1351

తే.గీ. కౌశికీ రూప లావణ్య పాశములకు
బద్ధులై, దానవులు మృత్యు పాశములకు
తలలు వంచిరి, కామాయుధములఁ జిక్కి
బ్రతుకు వారేరి శాంతి సౌభాగ్యములను ! 1352



ఆ.వె. మొదటఁ జూచి చండ ముండులా విషయంబు
నేలికలకు జెప్ప నాలకించి
చూచినట్లె తలచి శుంభ నిశుంభులు
మదను బారి వడిరి, మరులు గొనిరి. 1353

చం. యుగములఁ జొచ్చి చూచినను యుక్త వయో విభవాభిషిక్త సం
యుగ మదనానురక్త రసయోగ కదంబక మట్టి జాణ ము
జ్జగముల లేదు లేదనుచు చండుఁడు ముండుఁడు నేక కంఠులై
పొగడగ నాగలేక మును పొందని తెండని యాజ్ఞ వెట్టగన్. 1354

తే.గీ. అప్పు డా రాజసభలోన నొప్పు తప్పు
లరయ గల దిట్ట లో రాజులార వినుఁడు
వీరి మాటలు విన నామె వెంటఁ దెలిసి
చనుట యుక్తమై తోచెడు ననఁగ వారు. 1355

తే.గీ. అసుర మంత్రుల సుగ్రీవుఁ డనెడు వాని
మాట నేర్పున శేషుని సాటివాని
మెచ్చులాడికి నెటులైన నచ్చుఁ జెప్పి
వెంటఁ బెట్టుకు రమ్మని వెడలఁ బలుక. 1356

చం. అతఁడును నాజ్ఞ యంచు వినయంబున నేగె హిమాద్రి సాంద్ర సై
కతముల దివ్యకాంతిమయ కాంచన వేదిక నొప్పియున్న యం
త్రిత తత పౌరుష ప్రణుత, దీప్త దిగంత శుభాంగి కౌశికీ
సతిఁ గనులారఁ గాంచె, దనుజ స్థితి సాధ్వస వృత్త మొందగన్. 1357

కం. ఏమిటు వచ్చితి వను నటు
లామె కనుబొమలు చలింప నసుర సచివుఁడున్
తామసము పలుచ బడినటు
సామంబునఁ బలికె రాజ శాసన మనుచున్. 1358

ఉ. శుంభ నిశుంభు లీయెడల శూరులు, వీరులు, సాటిలేక వి
శ్వంభర నేలు వార, లభవ ప్రకరంబులఁ బారద్రోలి వి
స్రంభము మీర లోకముల రాయిడిఁ దీర్చెడు వారు; వారిలో
శుంభ దభంగ భాస్వరుని జూచి వరింపుము సేమ మయ్యెడిన్. 1359

కం. సుగ్రీవుని విన నలుగక
నిగ్రహమునఁ బలికె నో వినీతా ! నా పా
ణి గ్రహణమునకు నాతో
విగ్రహమున గెలువ వలయు వినిపింపు మటన్. 1360

కం. దేవీ వచనములను విని
దేవీ ! నీ వెరుఁగ వసుర దేహ బలంబుల్
దేవతల నొడిసి పట్టిరి,
నే వెంతటి దాన వబల ! నీల్గెద వంచున్, 1361

కం. నా మాట వినుము మేలగు,
కామాంధుల తోడి పోరు కాకువు, వలదీ
నేమము, శుంభ నిశుంభులఁ
గామించు మొకని, శుభములఁ గనుము శుభాంగీ ! 1362

వ. అనుచు దైత్య ప్రతినిధి సుగ్రీవుండుఁ బలు విధంబుల హితవుం బలుక నాలకించిన మహామాయయు నిట్లనియె. 1363

కం. దూతగ నీ పలుకులు విన
నీతులు కావచ్చు నైన నియమోన్నతికై
భీతిలు దానను గానని
నేతల కెఱిగింప బొమ్ము నిలువకు మనగన్. 1364

వ. అతండును బహిర్గత బహుకాల బద్ధ క్రోధారుణ దేహుండగుచుఁ దక్షణంబు శుంభ నిశుంభులఁ జేరి జరిగిన వృత్తాంతంబు వివరింప. 1365

తే.గీ. తోకఁ ద్రొక్కిన త్రాచులా దుమికి లేచి
బుసలు వెట్టుచు పటపట నొసలు విరిచి
శుంభుఁ డుద్రిక్తుఁడై మత్త కుంభి వోలె
పలికె ధూమ్రాక్ష సేనాపతికి నిటుల. 1366

తే.గీ. పొమ్ము తుహినాద్రి పదములఁ బొంచి యున్న
పొగరుఁ బట్టిన మాయావి పొగరణంచి
తెమ్ము ప్రాణాల తోడ నా సమ్ముఖమున
నిలుపు, మందాక చూపకు నీ ముఖంబు. 1367

కం. అది యెంతటి పని యనుచును
కదిలెను సైన్యంబు తోడఁ గాంతం జెనకన్,
సుదతిని జూచిన పిమ్మట
తుద ముట్టెను ధైర్యమెల్ల ధూమ్రాక్షునకున్. 1368

తే.గీ. ఎన్ని యుద్ధంబులం జేసె నెంతమంది
యేలికల పీచ మణగించె నెన్నఁడేని
యిట్టి దైన్యంబు గలిగెనే ! ఏమి వింత
యంచు ధైర్యంబు లోలోన నలము కొనుచు. 1369

కం. ధూమ్రాక్షుల రక్తమలఁది
తామ్రాక్షులు నిప్పులుమియఁ దామస మొప్పన్,
ధూమ్రాక్షుఁడు సకల భువన
సామ్రాజ్ఞినిఁ బట్టఁ బోయె సంరంభమునన్. 1370

చం. శలభము వోలె మీదఁబడు శాత్రవ సైన్యపతిం దహింపఁ బ్ర
జ్వలిత దవాగ్ని కీలలు దివంబులఁ దాకగ హుంకరించె ను
జ్వల మృగరాజ వాహ, రిపు వాహిని ధూమ్రుని తోడ మాడి బూ
దులయిన వంత శుంభుఁడుఁబ్రతున్నమతిన్ బ్రతిఘాతమత్తుఁడై. 1371

కం. చండ ప్రచండ భండన
పండితులై దండనాథ పద మండితులౌ
చండాసుర ముండాసుర
కండూయాహవ దితిజులఁ గని యిట్లనియెన్. 1372

కం. అది ధూమ్రాక్షుని జంపిన
మదవతి, విడువంగరాదు, మారణ రణ సం
పద మీరా సుర మాయను
కదిలించుడు నా పదముల కడ పడునటులన్. 1373

ఆ.వె. నిండు సభను చండ ముండాసురులు బాసఁ
జేసి కదలిరంత సేన తోడ
హిమగిరి పదపాళి నిమ్ముగా కూర్చున్న
మాయదారి మృత్యు మాయ కడకు. 1374

శా. చూడం జూపులు జీకటుల్ ముసరగన్ సూర్యచ్ఛటా భ్రాజమై
క్రీడా స్ఫూర్తి సహస్ర శస్త్ర పటిమన్ క్రీడించు బాలామణిన్
చూడం జాలక చండ ముండు లరిదిన్ శుష్కించు ధైర్యంబు నా
లోడింపన్ క్షణకాల మట్లె మిడిగ్రుడ్లుద్దించె నొండొండులన్. 1375

తే.గీ. సగము జచ్చియుఁ దుదకు నుత్సాహ మంది
మోహనాంగిని జెఱవట్ట మోహరమున
దూకి రాగ్రహోదగ్ర సందోహ సాంద్ర
సైన్య పంక్తుల తోడ రోసంబు తోడ. 1376

ఉ. కొండను ఢీకొనంగఁ జను కొమ్ములు దిర్గిన మేక పోతులై
దండుగ నెత్తి వచ్చు తమదాయల పాలిటి యజ్ఞవాటికా
కుండము వోలెఁ బ్రజ్వరిలె కోపన కౌశికి నేత్ర వహ్ని, యం
దుండి కరాళ కాళిక ప్రదోష పురస్సర వోలె వెల్వడెన్. 1377



సీ. ఖడ్గ పాశ ద్వీపి ఖట్వాంగ మృగచర్మ
మాలా కపాల కరాళ మూర్తి,
గ్రహ సంతతిని మ్రింగు రక్త రాక్షసి వోలె
గండరించిన ముఖ గహ్వరంబు,
కాల దీర్ఘానల జ్వాలా ప్రవాహమై
నేల ముట్టగ నింగి వ్రేలు నాల్క,
ప్రళయ ప్రచండాగ్ని రగులు నేత్రంబులు,
శుష్క మాంస శరీర శోణితేప్స,
తే.గీ. సకల లోక భయంకర వికట భృకుటి,
యమ్మహా శక్తి పద ఘట్టనమ్ము సలుప
ధరణి కంపించె, సింహనాదమ్ము సలుప
దనుజ బలములు దిక్కులఁ దాకె నంత. 1378

తే.గీ. అడ్డు వచ్చిన దనుజుల నారగించి
లోక భీకర కరవాల మాకొనంగ
లోక కంటకులై పైకి దూకు చండ
ముండుల నఱకి కాళి చాముండ యయ్యె. 1379

ఉ. భండన వార్త వించు సుర భంజక శుంభ నిశుంభు లుగ్రులై
ఖండిత హస్త హస్తియుగ కర్కశ ఘీంకృతి వోలె నార్చుచున్
దండులఁ బంచె ముబ్బడుల దౌహ్రద, కాలక, మౌర్య, కాలకే
యాండ కటాహ ఘాతకుల నండగఁ జేసి హరింప హంతకిన్. 1380

తే.గీ. పాద ఘట్టనముల హిమ పర్వతముల
కుదురు లదరఁగ దనుజులు కూడి రచట,
పుట్ట పగిలిన చలిచీమ లట్టులున్న
వారలను జూచి జగదంబ వల్లె యంచు. 1381

ఉ. భండన భూమి నిండ మద బంధితులై చెలరేగు దైత్యులన్
చెండగ కైశికీ ప్రమద చీరెను దేహము నుండి చండికన్,
చండక వాహనన్, దనుజ సంహరణోత్సుక శస్త్ర సాధ్వసన్;
దుండగులన్ హరించి పరితోషము గూర్పగ నాన వెట్టినన్. 1382

తే.గీ. వరుస మాహేశ్వ రీంద్రాణి వైష్ణవి యన
బ్రాహ్మి వారాహి కౌమారి బాల యనగ
యోగినీ శక్తులను గూడి యుద్ధ భూమి
వైరి తనువుల శిరముల పైరుఁ గోసె. 1383

ఉ. అంతటి కాలకాదు లొక యాడుది మార్కొన నెగ్గ లేక దృ
ష్టాంతము నొందుటా యనుచు నామె పరాత్పర యంట కిద్ది దృ
ష్టాంతము కాదుగా యనుచు నాసురశక్తి పరాజయమ్ము దృ
ష్టాంతము కాదుగా యనుచు నాత్మ కలంగ ననేక భంగులన్. 1384

ఉ. శుంభ నిశుంభు లంత రణ శూరుఁ డనన్య వర ప్రసాదియున్,
కుంభిని దాక రక్తమున గోల్పడు బిందువు బీజమై పున
స్సంభవ మొందు శక్తి గల సార్థక నాముని రక్తబీజునిన్
శాంభవిఁ బట్టి తెమ్మనుచు సంగర నేతగ జేసి పంపగన్. 1385

ఉ. వాఁడును దక్షిణాధిపతి వైతరణిం దరియించు నట్లు పూ
బోడిని డాసె నంగ గొని, పోడిమి గాంచి హసించె నీమెనా
వాడి మగంద్రు లోగొనఁగఁ బాసిరి ప్రాణము లవ్వ! యంచు, నీ
చేడియ తోడనా దురము ! ఛీ యని తేలికఁ జేసి వాకొనెన్. 1386

ఉ. ముగ్ధ మనోహరమ్ముగ, సమున్నయ దానవ వాక్ప్రగల్భముల్
స్నిగ్ధ విదగ్ధ హాస తటినీ ఝష కుక్షి గతంబులై చనన్,
ప్రాగ్భవ దర్శనంబగుచుఁ బ్రావగు దాక సహించి మించె నా
స్రగ్ధర దగ్ధయై తిమిర రక్షకులం బరిమార్చఁ జెచ్చెరన్. 1387

తే.గీ. దేవి విజయాట్ట హాసంబు దిశల ముట్టి
పరుల కర్ణ భేరులు మ్రోయ మరలు చుండ
దనుజ వికటాట్ట హాసముల్ దగిలి పోర
విశ్వ మెల్లయుఁ గంపించె విలయ మటుల. 1388

తే.గీ. విలయ మాకృతి నొందె నీ యిల ననంగ
యోగినీ శక్తులను గూడి యోగమాయ
చండికై దుష్ట దనుజులఁ జెండసాగె,
నేరులై నల్ల నెత్తురు పారసాగె. 1389

తే.గీ. అతుల బీభత్స భండన మందు డిందు
స్వజన సత్వంబు గమనించి సాహసించి
చండికా శక్తి వలయంబు గండిఁ గొట్ట
రక్త బీజుఁడు పుట్టి సమరంబుఁ జేసె. 1390

తే.గీ. రెచ్చి పైగొను దానవు గ్రుచ్చె వజ్ర
శక్తి నింద్రాణి, యంతట రక్తమోడి
భూమిపైఁ బడఁ గనె బొట్టు బొట్టు కొక్క
రక్త బీజుఁడు పుట్టి సమరంబుఁ జేసె. 1391

కం. అది గమనించిన చండిక
పదమనె కాళికను రక్త పానము సలుపన్,
పెదవులు మూయక నాలుక
కదనాంగణ మాక్రమింపఁ గాళిక సాచెన్. 1392

తే.గీ. ఆట కట్టిన రక్తబీజాసురుండు
వరము లన్నియు వ్యర్థమై మరుగు వడగ
శిరము జగదంబ కరవాల పరము జేసి
కాళికా కంధి నొందు కపాలమాయె. 1393

చం. అబల యనంగ నింతవర కాయుధ మంటక మిన్నకుంటచే
కబళము లాయె వాహినులు కామిని ఖడ్గ మహోదరాగ్నికిన్,
ప్రబల దళోత్తమాంగముల రాల్చిన రాక్షసి, రాక్షసాంతకిన్
కబళము సేతు మీ ప్రఖర ఖడ్గముఖంబుల కంచు నుగ్రులై. 1394

ఉ. మూల బలంబు లాహవ విమోహితులై శివమెత్తి సాగగన్
నేల చలించె నాకసపు నీలిమ ధూళి వహించెఁ జీకటుల్
గ్రాల నిశాచరార్భటికి కాల వికల్ప మనంగ, దానవో
త్కాల మహోద్ధతింగనుచు కోవుల శుంభనిశుంభు లార్చినన్. 1395

చం. కదలక, కాళ్ళ దగ్గరకు కాలము జెల్లగఁ జేరు వైరులన్
వదలక మిత్తికంపు కరవాలములుం గలగుండు చెందె నా
కదన కుతూహలంబునకు, కట్టలు దాటెను సాగరంబులున్,
కదలెఁ గులాద్రులున్, సెగలు గ్రక్కెను శేషుని వేయి నాల్కలున్. 1396

తే.గీ. తిగుచు శుంభ నిశుంభుల తేజ మరసి
దేవి దుర్గాంబ మాతృ హృద్దివ్య వాణి
పలికెఁ జెలగాట మేల మీ ప్రాణములకు?
పొందు పాతాళమున కంచు పొత్తు వలక. 1397

ఉ. ఫాలము మీది వ్రాలొకటి ప్రాప్య మొకండిల నుండ నౌనె? పో
గాలము దాపురింప హిత కామన నచ్చునె యెట్టి వారికిన్ !
లాలిత తామసాహత బల ప్రమఁ ద్రుళ్ళెడు శుంభ సోదరుల్
వాలము లూతురే యతివ వాక్యము వెంబడి వంత పాడగన్ ! 1398

వ. హ్రీంకారిణి హిత వచనంబులు రుచించని రూషితాంతరంగంబుల రూక్ష రాక్షస పక్షంబు పలు పరుష వచనంబుల శస్త్రాస్త్రంబులు సంధింప విజృంభించిన శక్తి గణంబుల దివ్య శక్తులు నిశుంభాసుర శాంబరీ మాయా ప్రయోగంబున వ్యర్థంబు లగుచుండ. 1399



కం. రయమున దుర్గ నిశుంభుని
హయములఁ దెగ వేయ నప్పు డసురుం డపరా
ప్రియ వాహన మగు సింహము
భయపడ నొక వ్రేటు వేసె భయ రహితుండై. 1400

కం. తన సింహముపైఁ జేయిడు
మొనగాడీ జగమునందు మొలకెత్తెనె వీ
డని మెచ్చియుఁ దలఁ గొట్టెను
మనుజ శుభంకరి 'నిశుంభ మర్దిని' యగుచున్. 1401

వ. తమ్ముని మరణంబు గంచు శుంభుఁ డుగ్రుండై దుర్గా ... 1402

ఉ. నిన్ను జయించు వాడొకఁడె నీకు మగండను నీమమూని యా
తెన్నుఁ దొలంగి యిందరిని తెచ్చితి వాలము జేయ నీవు ప్ర
చ్ఛన్న తమోగుణాస్పదవు, సత్త్వము గల్గిన నొంటి దానివై
నన్ను జయింపుమంచుఁ బ్రతినంబున వ్రేలిడు శుంభుఁజూచుచున్. 1403

ఉ. ఓరి సురారి ! నీకు సరి యోధులు లేరను మత్తు కన్నులం
జేరి నిజంబుఁ జూప దిది చేదు నిజంబగు గాక చూడు మీ
వీరి నిజస్వరూపమన, బిందువు లంబుధిఁ జేరి నట్లుగా
వారు లయంబు జెంది రభవా పరిపూర్ణ శరీర మంటుచున్. 1404

కం. అంతయుఁ దానై తానే
యంతట భాసించు దేవి నవలోకింపన్
సంతోషించిన శుంభుని
స్వాంతం బాదేవిఁ గోరె సమరము తోడన్. 1405

కం. అటు నిటు మిగిలిన యిరువురి
పటుతరమగు నస్త్ర శస్త్ర పాటవ మరయన్
నిటలాక్షాజాదులకును
దిటములు దప్పిన వనంగఁ దెలుపఁగ వశమే ! 1406

తే.గీ. దేవి శుంభుని బట్టి పై దెసకు విసర
నింగి నిట్టూర్చునే గాని నీల్గ డితఁడు,
గట్టిగా పట్టి నేలపై గొట్టి నపుడు
శిరము వాల్చును శేషుఁడు చెదర డితఁడు. 1407

తే.గీ. వ్రేటువడి నట్టి త్రాచులా రెచ్చి శుంభుఁ
డంబపై బడ లంఘింప నదను జూచి
యంబ శుంభుని బట్టి శూలాయుధమున
హృదయ మర్మంబు భేదించి యిలను గాచె. 1408

***ఇది శ్రీవాసవీపురాణమునందు మహామాయాదేవి శుంభనిశుంభులను సంహరించుటయను నలుబది తొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము.***

(అహిహా ప్రతాపము= ఇంద్ర ప్రతాపము, గుంపించిన= అతిక్రమించిన, పదిలించు= స్థిరపరచు, సాధ్వస వృత్తము= వెఱపు నడక, విస్రంభము= నమ్మకము, ప్రతున్న మతి= బాగా వ్యధచెందిన మనస్సు కలవాడు, ఆలోడించు= కలచు, ఉద్దించు= జతపరచు, దృష్టాంతము= చావు, ఉదాహరణము, శాస్త్రము)



# ఏబదియవ అధ్యాయము

**కం. కలి కలుషాంజన రేఖా**
**విలసిత సిత శీతకిరణ వీక్షణ చణ ! దు**
**ర్బల జన సంరక్షణ చణ !**
**జ్వలదఘ పాటవ నిదాన చణ ! ఘన వదనా !**

కం. ఆ విధమున వైష్ణవ మా
యా విధమును విని సమాధి, యవనీ సుర ! నే
నే విధమున నా దేవిని
సేవించి తరింతు ననఁగఁ జెప్పె నతండున్. 1409

తే.గీ. తపము జేయుము నీ కామితమ్ము దీరు,
మనము నిశ్చలమైన నా మాతృ హృదయ
మింతయును సేయ దాలస్య మిద్ది నిక్క
మొడిని జేరిన వారి కా యెడద వెన్న. 1410

ఆ.వె. అనుచు హితము వల్కు ముని సుమేధుని వద్ద
సెలవు గొని సమాధి చేరె నొక్క
సుజల వాహినీ సుశోభితా వాసమ్ము
వివిధ ఫలయుతమ్ము విపిన మొందు. 1411

ఉ. అచ్చట మూడు వత్సరము లాపణ వర్తకు రీతి దీక్షమై
నిచ్చల భక్తిమై తపము నిల్పెను లెస్సగ నాతఁ డంత స
ర్వోచ్చ మహద్విభూతి విభవోన్నతి పొంపిరి వోవ నాతనిన్
మెచ్చి వరంబు లిత్తునని మెల్లన మేదినిఁ బాద మూనినన్. 1412

చం. మహిష నిశుంభ శుంభ మధు మర్దిని మంగళ రూపమెత్తి స
న్నిహితము గాగ, దేహమున నిస్తుల నిర్భయ మావహింప, దు
స్సహ సుభగ ద్యుతు ల్దనివి సర్వము దీరగఁ జూచి చూచి వై
శ్యహిత సుధాకరుండు వినయంబునఁ జేసెను విన్నపంబులన్. 1413

సువదన. అమ్మా ! సమ్మాన మిమ్మైనది, పలుకులు రా వానంద మురువై,
సమ్మోహమ్మావహించెన్, స్వజన సహితుఁడన్ సాలోక్యమును మా
కిమ్మా ! కైలాస మందుండి పుడమిఁ బడి యింకెన్నాళ్ళిటులఁ గా
యమ్ముల్మోయంగ? మోక్షప్రద ! సువదన ! మాయమ్మా మనుపుమా !

కం. అని వినయమున సమాధి వ
దనమున వినిపించి నట్టి దయనీయ ప్రా
ర్థనమున హిమమై కరగిన
జనని హృదయ జలధరమ్ము జల్లులు గురిసెన్. 1415

ఉ. ఓయి సమాధి ! నీ తపము నొప్పరికించగ వచ్చుఁ గాని, నీ
ధ్యేయ మలంఘ్యమోయి, తఱియింతు వవశ్య మనిష్ట జుష్టమున్,
నీ యిలుఁ జొత్తుఁ గూఁతురుగ, నిన్నును నీ ప్రియ బంధు వర్గమున్
మాయఁ దొలంగగా నభవ మందిరమందు వసింపఁ జేర్చెదన్. 1416

వ. అందులకు మీరింకను కొన్ని జన్మంబులు నిరీక్షింప వలయు నంచు దీవించి జగజ్జనని తన దృశ్యరూపంబు నుపసంహరింప సమాధియును. 1417

మ. తన భాగ్యేందిర క్షీర సాగరునకో, దక్ష ప్రజాధీశుకో,
జనకాధీశునకో, హిమాద్రి పతికో సాధ్యంబపారార్థతన్;
తన కేమంతటి పుణ్యమున్నదని స్ఫీత స్నిగ్ధ వాత్సల్యముం
దనపైఁజూపెను యోగమాయయనుచుం దర్కించె లోలోపలన్. 1418

తే.గీ. తల్లి కరుణించి తను కన్న తల్లి గాగ
నూహ కందని వరమిచ్చి యైహికమ్ము
ననుభవించుట చాలలేదంచు నిట్లు
నెపము వెట్టెనొ యనుకొంచు విపణిఁ జేరె. 1419

తే.గీ. బంధువులఁ గూడి యిహలోక బంధుఁ డగుచు
నింత కాలము బలు జన్మలెత్తి యతఁడు
నీకు వరపుత్రుఁడై జగన్నేత్రిఁ గాంచు,
మీ కులమ్మునకును గీర్తి మీదు గట్టు. 1420

తే.గీ. అంచు దీవించి పరమేశుఁ దరిగి నంత
మహిత గుణశీలి కల్వారుఁ దహరహమ్ము
ధర్మ పత్నిని గూడి సంతాన యోగ
మంద శివభక్తి యోగ సమాధి నుండ. 1421

ఆ.వె. రూపు దిద్దుకొనియె రోహిణీపతి వోలె
నాది శక్తి పసుపు నా సమాధి
గరళ కంఠు నాన కల్వారు కులసతీ
గర్భ శుక్లపక్ష గగనమందు. 1422

కం. తఱుగని సంపద లమరిన
తఱుగరి కులమందు నేత తనయుని గను న
త్తఱి నెంత సంతసమ్మగు
మెఱవణి నంతయును జెలఁగె మేవడి తోడన్. 1423

సీ. జగదంబ మేధకు జన్మ మిచ్చిన బ్రహ్మ
శీర్షమై రూపొందె శిశువు నందు,
జగదంబ తనువుకు జన్మ మిచ్చిన క్షీర
సింధు వాకృతి నొందె శిశువు నందు,
జగదంబ శక్తికి జన్మ మిచ్చిన దక్షుఁ
డశనీయమై నిల్చె శిశువు నందు,
జగదంబ వైశ్య సంజాతయై చెన్నొంద
చిత్తంబు తానయ్యె శిశువు నందు,

ఆ.వె. మున్ను గడచినట్టి మూడు యుగంబుల
మూల శక్తిఁ గన్న ముగ్గురయ్య
లెలమి నొక్కటైరి యలివేణి గర్భస్థ
శిశువు నందు మరల శిశువు నంద. 1424

ఉ. 'ఆ జగదంబ దర్శన మహా సుకృతమ్ము మరొక్క మారు మా
తేజము నుద్ధరించు'నని దేవత లెల్లరు నంబ జన్మకై
బీజము రూపు గట్టువిధి వీక్షణ పర్వము గాగ నెంతయున్
వాజ విరక్తులై గనిరి వైశ్య కులార్ణవ నూత్న తేజమున్. 1425

ఆ.వె. ఇంత జరుగుచుండ సుంతైన దెలియరు
శెట్టి యింట నున్న చెలువ లెవరు
సంతు కలుగునన్న సంతోషమే తప్ప,
కడుపు చలువ కూడిగములు దప్ప. 1426

సీ. పుట్ట బోయెడి చిన్ని బుజ్జాయి రూపొందు
కొఱకుఁ బుంసవనమ్ము జరిపినారు,
తల్లి కడుపున బిడ్డ చల్లగాఁ జెన్నొందు
కొఱకు సీమంతమ్ము జరిపినారు,
ప్రసవ వేళను శుభగ్రహ వీక్షణములకై
జప హోమముల నెల్ల జరిపినారు,
బీద సాదల కనుల్ వేద నాదములీన
సంతర్పణము లెల్ల జరిపినారు,
ఆ.వె. తెలిసి దేవ గణము దెలియక నరులును
గొప్ప జన్మమొందు గోరు చుండ
గర్భ పూర్ణ యగుచు కల్వారు నర్ధాంగి
కనియె నరుల సురల కంటి వెలుఁగు. 1427



శా. ఆ సంతోషము నా మనోవిభవము న్నానంద సంధానమున్
వ్యాసక్తాద్భుత కార్యసిద్ధి ఫలమున్ వాత్సల్య హృద్యోగమున్
వాసంతామర వల్లి మల్లెలగుచున్ వర్షించె దివ్యప్రభా
భాసంతామర పాళి పాణిపదులై బాలుం బ్రశంశించుచున్. 1428

తే.గీ. పుట్టినంతనె కేరియల్ గొట్టు చున్న
పసి పసిడి కొండఁ జూచి విప్పారు కనులు
కుసుమ వృష్టికి పైకి నాకసము జూడ
కుసుమునకు స్వస్తి యనెడు పల్కులు ధ్వనించె. 1429

కం. కుసుమముల వర్షమును గని,
కుసుముఁ డనుచు నమరుల పలుకులు విని విప్రుల్
కుసుమాఖ్యుఁ డనిరి శిశువును
కుసుమిత కల్వార వదన కౌతుక మొప్పన్. 1430

***ఇది శ్రీవాసవీపురాణమునందు కుసుమశ్రేష్ఠి జననంబను ఏబదియవ అధ్యాయము సంపూర్ణము.***

(అనిష్ట జుష్టము= ఇష్టములేని ఎంగిలి, స్ఫీత స్నిగ్ధ= అధిక స్నేహముగల, తఱుగరి= వ్యాపారి, మెఱవణి= ఊరేగింపు, భాసంత= చక్కని, పాణిపదులు= కాలుసేతులు కలిగినవారు)

# ఏబదియొకటవ అధ్యాయము

**కం. కల్యాణావృత గేహిని !**
**కల్యాణ గుణార్ద్ర హృదయ ! కంధర వేణీ !**
**కల్యాణీ ! సర్వ జగత్**
**కల్యాణీ ! సుప్రదాన కారుణ్య ఘృణీ !**

కం. శివవర పుత్రుం దరయఁగ
శివ శిఖ వెలి పూవువోలె శీతాంశుండై
పవళించియు బంధు జనుల
భవములఁ దిమిరములు దొలఁగ భాసించె వెసన్. 1431

కం. కుసుమా యన నర విరిసిన
కుసుమంబై బోసినోటఁ గురియును నగవుల్,
కుసుమించగఁ బిలిచెడు యెద,
కుసిగుంపులు దీర నెత్తికొను వారలకున్. 1432

కం. దోఁగాడుచుఁ దండ్రి కడకు
తూఁగాడుచుఁ దండ్రి మెడకు తొగదొర వోలెన్
వీఁగాడుచుఁ దండ్రి తలకు
యోగీశుని జేసెఁ దండ్రి యోగము కొలదిన్. 1433

కం. బుడి బుడి నడకలఁ గుసుముం
డొడిఁ జేరుచుఁ గన్న తల్లి యొడ లొడగూడన్
కడు వేడుకఁ బులకల సం
దడి వొడమగ పయటఁ బట్టి తడవుడు లాడున్. 1434

కం. తల్లియుఁ దండ్రియు బందుగు
లెల్లరు గారాము సేయ నెల్ల మురిపెముల్
కొల్లగ నొందుచుఁ గుసుముం
డల్లరి గోపాలు వోలె నాటలఁ దేలెన్. 1435

కం. ఒకటొకటిగఁ బండ్రెండే
ళ్ళొక క్షణముగ గడచి పోయె నుద్ధర్షముగన్,
సుకుమార కుమారున కిక
నొక గురువును జూచువేళ నుపనత మాయెన్. 1436

కం. వరమున బుట్టిన కొమరుని
గురువున కర్పించి యింటఁ గూర్చొనుటన్నన్
బరువెక్కు గుండె నిక్కము
భరియింపఁగ వలదె కన్న బాధ్యత దీరన్ ! 1437

కం. కుల గురులగు భాస్కరులను
బిలిపించి నమస్కరించి ప్రియ వచనములన్
పలు రీతులఁ బ్రీతిఁ గొలిపి
పలికెను కల్వారుఁ దమిత భయ భక్తుల తోన్. 1438

కం. భాస్కర ! మా వైశ్యాన్వయ
భాస్కర ! మా వైభవ ప్రభా ప్రాభవ రో
చిస్కర ! మా వంశాప్త య
శస్కర ! నా మనవి సుంత సన్నిధిఁ గొనుమా ! 1439

కం. అంకమున వీఁడు మా వం
శాంకురము మహానుభావ ! అంబా కృపచే
శంకర వర పుత్రుఁ డితఁడు
కింకరుఁడగు మీకు, వీనిఁ గృపఁ జూడుమయా ! 1440

కం. మము జదివించిన యట్టులె
తమరీ పసివాని దీర్చి తగు సామర్థ్యం
బమరగఁ జేయుడు గురువర !
అమల జ్ఞానార్క ! భాస్కరాచార్య వరా ! 1441

కం. అని కల్హార శ్రేష్ఠి స
వినయ ప్రార్థన ఘటింప విప్ర శ్రేష్ఠుం
డను మోదించుచు శ్రేష్ఠిని,
యనురాగము తోడ బాలు నక్కున జేర్చెన్. 1442

కం. జననీ జనకుల కౌగిళు
లొనగూడిన యట్టులున్న యొజ్జ కవుఁగిటన్
పెనుపడు వాత్సల్యమునకుఁ
దనిసిన కుసుమాఖ్యుఁ డపుడు తరలెం దృప్తిన్. 1443

కం. గురుకులమున నతి వినయము
నరగలి లేకుండ సల్పి యగణిత విద్యల్
దొరకొన మఱి పం(డెండే
ళ్ళిరవుగ సేవించెఁ గుసుముఁ డిద్ధా చార్యున్. 1444

కం. చదువుల దొరయై వెలుఁగుచు
పదునెక్కిన శిష్యుఁ జూచి ప్రవర గురుండున్
హృదయ సుమంబున గుసుముని
గదియించి గృహంబుఁ జేర్చి కల్హారు ననెన్. 1445

కం. వణిజ కులాగ్రణి ! సన్నుత
గుణ సాగరుఁడైన నీదు కొమరుని గొనుమా;
గణనీయుఁడౌను కులమున
ఫణిపతి కొనియాడగా; బ్రపంచము బొగడన్ ! 1446

కం. కుసుముఁడు కుసుమ శ్రేష్ఠిగ
మిస మిస నవ యౌవన ప్రమేదిత వపువై
విసుమాన మాయెఁ బితరుల
కసమానానందమాయె నవలోకింపన్. 1447

కం. కొడుకును దిద్దిన కులగురు
వడుగకయే కోట్లు కోట్లు నపురూపములౌ
నుడుగర లిచ్చుచు కల్హా
రుఁడు నతని సతియుఁ బలికిరి రోచిష్ణువులై. 1448

కం. యుక్త వయస్కుఁడు శిష్యుఁడు
యుక్తాంగన తోడ వీని కుద్వాహంబున్
యుక్తంబు గాదె ! తారను
రక్తిన్ సెలవిందు దేవరా యన నతఁడున్. 1449

కం. మన మణికుండలుని తనయ
ఘన వినయాది సుగుణ ఖని కౌసుంభి యనన్
మనువున కర్హంబగు నీ
తనయునకును నీడు జోడు తలపోయుఁడనెన్. 1450

కం. అది విని కోమటి దంపతు
లదియును నీ యదియె భార మాచార్యా నీ
మదిఁ దోచినట్లు వారిని
కదిలింపుడు మాకు హితము గలుగం గరుణన్. 1451

కం. అన విని యాచార్యుఁడు నది
తన భుజమున వేసికొంచుఁ దరలెను శిష్యుల్
తన వెంట నడువ వెంటనె,
చని మణికుండలుని జూడ సన్మతి నతఁడున్. 1452

కం. గురు శిష్యు లందరికి నతఁ
దురువుగ నరుదగు నుడుగర లొసఁగుచు భక్తిన్
గురు కృప సెలవిండన, భా
స్కరుఁ డొగిఁ బరిచయము జేసె కల్హార సుతున్. 1453

కం. కల్హారుఁ డనఁగ నాతని
బల్హంగు లనంగఁ దనకుఁ బరిచయ ముంటన్
కల్హార వదన జనకుఁడు
కల్హారుని వియ్యమునకు గర్వం బొందెన్. 1454

కం. తగు సంబంధము దెచ్చిన
యగణిత వాత్సల్య సాంద్రుఁ డాచార్యున కి
మ్ముగ సమ్మతి దెలిపెను గ
మ్ముగ నిజ బాంధవుల గూడి మణికుండలుఁడున్. 1455

కం. ఆ పిల్ల తల్లి దండ్రులు
జూపిన యుత్సాహ మెదురు జూచెడు వారల్
సూపాన్నాయత్త రసన
లాపోశన బట్టఁ దెల్పె నాచార్యుండున్. 1456

కం. పుట్టక పుట్టక పుట్టిన
పట్టికి పెండ్లి యన నెంత పండుగ యింటన్ !
పెట్టిరి ముగ్గులు ప్రమదలు
కట్టిరి తోరణము లూర గడప గడపకున్. 1457

కం. ఆచార్యుల కనుసన్నల
నాచారము లెల్ల నెమ్మి నమలు జరుపుచున్
గోచార మున్నత స్థితి
సూచింప వివాహమాయె శుభలగ్నమునన్. 1458

కం. పెండిలి యేడు దినములు త
రండారోహమున ముగిసె, ప్రక్కల వారల్
నిండగు హర్షము నొందగ
మెండుగ సేసలు గురిసిరి మింటం దొరలున్. 1459

కం. కుసుమ శ్రేష్ఠి గృహస్థుగఁ
బ్రసరించెను విపణ ధిషణఁ బ్రాజ్ఞుం డగుచున్
వసువుల సముపార్జించెను
వసతులు గల్పించె బీద వారికిఁ బ్రాపై. 1460

కం. కుల గౌరవంబుఁ బుడమిని
నిలబెట్టుచు నున్న కొడుకు నేర్పును గనుచున్
ఫలవంత మాయె బ్రతుకని
తలచిన కల్హారుఁ డంతఁ దపమున కరిగెన్. 1461

కం. మానిత గార్హస్థ్య విధులు
తానవముల్ దీర్చి తల్లి దండ్రులు వ్రతులై
వానప్రస్థము బోవగఁ
దానా గార్హస్థ్య విధులఁ దాల్చెఁ గుసుముఁడున్. 1462

**ఇది శ్రీవాసవీపురాణమునందు కుసుమశ్రేష్ఠి వివాహమను నేబదియొకటవ అధ్యాయము సంపూర్ణము.**

(కుసిగుంపులు= శ్రమలు, తానవము= తనుత్వము, తరండము= ఓడ, తెప్ప)

## ఏబది రెండవ అధ్యాయము

**కం. జనయిత్రీ ! సకల భువన**
**జనయిత్రీ ! సకల భూత సమ్యగ్ధరణీ**
**జనయిత్రీ ! సకలాగమ**
**జనయిత్రీ ! వాసవాంబ ! జయ జయ జననీ !**

వ. పంచ భూతాత్మకములైన సకల శుభంబులు బడయుచు నాశ్రితులెల్లరు నమితానంద చిత్తంబుల నిరంతరంబు జయలు వెట్టుచుండ చైత్ర రథంబున సుధర్మా శోభితుండగు సుమనస్పతి వోలె వెలుగొందు కౌసుంభీపతి పెక్కుకాలంబు సుఖం బుండ నొక్కదినంబున. 1463

వాసవి. తల్లి దండ్రుల్ మనంబున జేరి యో తండ్రీ యెటులుంటివో యనన్
తల్లియుం దండ్రియు న్నెటులుంటిరో – ధ్యానం బటువోయె నింక మే
మెల్లి దర్శించి రావలె నంచు లో నెంతేఁ దలపోసి పల్కె నిం
టిల్లిపాదిం బ్రయాణము గాగ, మేటిల్లంగ నిజాభిజాత్యముల్. 1464

వా. శెట్టి యాదేశముం గొని యెల్లరున్ శీఘ్రంబుగఁ గచ్చడంబులన్
గట్టి కల్హార దంపతులున్న యా కాంతారము జొచ్చి రాత్రతన్
జుట్టి రా పుణ్య దంపతులన్ బురా స్తోత్రంబులఁ బల్కరించి రా
శెట్టియుం దల్లి దండ్రుల పాదముల్ సేవించె సతీ సమేతుండై. 1465

వా. పుత్ర గాత్రంబు గౌగిళులన్ సుధా పూరంబులఁ జేయ నా జరా
నేత్ర గంగా జలావభృథార్ద్ర సందేహం బొకఁ డుక్తమయ్యె నో
పుత్ర ! నీ పుత్రు నెప్పుడు తెత్తువో, పూర్వుల్ తరియింతురో కదా !
పుత్రి కౌసుంభి ! నీ కడుపుంగదా పొందంగల మమ్మ సద్గతుల్ ! 1466



వా. పెద్దలాశించు దానిని పొంద మే పేరున్నను నేమి – ఇంటిలో
ముద్దులన్ మూట గట్టుచు నెత్తగం బుత్రుం డొకఁడున్ననే కదా
హద్దులందుండు దుఃఖము లాత్మలందానందము నిండుఁ బిన్నలం
బెద్దలందంచు నాకుసుముండు భావించెన్ మది కుందనంతటన్. 1467

వా. తృప్తి దీరంగ పెద్దల సేవలన్ దివ్యానుభవంబు గాంచియున్
ప్రాప్త తోషాభ్ర మేఘ శతారమై వంశాంకుర శూన్య జీవితా
వాప్తి శీర్షాస్రవంబగుటన్ నిజావాసంబున కేగె శ్రేష్ఠి వి
క్షిప్త తృప్తాత్మకుం డగుచుం బరిక్షేపాత్మ జన ప్రధానుఁడై. 1468

వా. ఇంటి కేతెంచినన్, కుసుమాఖ్యులో నింతైన బ్రశాంతి శూన్యమై
కంటి కేతెంచ దెంతకుఁ గూరుకా కౌసుంభియు నంతియే, గృహం
బంటి లోలోన నెంతయు బిడ్డకై యారాటము జెందసాగె, నా
జంట ఖేదంబు గాంచిన భాస్కరాచార్యుండు వచించె నిట్టులన్. 1469

వా. పుత్ర కామేష్టిచే గుసుమాఖ్య నీ పుణ్యంబు ఫలించు, పూర్వమీ
పుత్రకామేష్టిఁ జేయుటనే కదా పుత్రుల్ గనె రాము తండ్రి, యీ
పుత్ర కామేష్టినే ద్రుపదాఖ్యుఁడున్ పుత్రుల్ గనె ద్వాపరంబునన్,
పుత్రుఁడున్ బుత్రియుం గలుగున్, యశంబుంగల్గు నిజంబు నీకునున్.

వా. శోక వారాశినందొక యోడయై చూపట్టు గురూపదేశ మ
స్తోక ధైర్యంబు గొల్పఁ గృతజ్ఞతా స్తోత్రంబుల వేడె నంత సు
శ్లోకు నాచార్యు నిట్లు – మహాశయా ! లోకంబున వంశ వృద్ధి యే
కైక కర్తవ్యమౌ పురుషార్థ మా యజ్ఞంబున మమ్ముఁ గావుమా ! 1471

వా. భక్తి నర్చించు శిష్యుని వంత బాపన్ భాస్కరుఁ డధ్వరార్థమై
యుక్త బుత్విక్కులం బిలిపించి విద్యుక్తంబుగ నిర్వహించి ప్ర
వ్యక్త యజ్ఞ ప్రసాద మపత్య భాగ్య శ్రేయము నంది యిచ్చె నా
సక్తి నా దంపతుల్ ముదమార నాస్వాదింపగ నమ్ర చిత్తులై. 1472

వా. పెద్ద లానంద మొందెదు రోజుకై, బిడ్డల్ కనువిందు జేయుచున్
ముద్దు లందించు చుండెదు రోజుకై, ముమ్ముందు పితౄణ భారమున్
రద్దు చేయంగ జాలెదు రోజుకై, ప్రాగ్దిక్కనకాంబర ద్యుతుల్
దిద్దు గర్భంబు పండెదు రోజుకై – దీక్షావ్రతు లైరి దంపతుల్. 1473

వా. అంత కౌసుంభి చూచుకముల్ వినీలాలంకృతులై కుచంబులన్
వింత పొంకంబు పర్వగ నారు సౌవీరాదృతమై చెలంగె లే
నంత కౌనేపు గాంచెఁ గ్రమంబుగా నా తన్వికి గర్భ వృద్ధియై
సంతసంబొందె నాకుసుమార్యుఁడున్ సంతృప్త మనోరథంబునన్. 1474

వా. నిండు చూలాలి కానుపు చల్లగా నిశ్శ్రేయసమై చెలంగ నా
మండి తానంద సుందర వర్తి సంపాసారి గురూపదేశ మం
దుండి గృహ్యోక్త కర్మల తోడ పిండోత్పత్తి దినంబు నుండియున్
పండుగల్సల్పె దానములిచ్చుచున్, బ్రహ్మజ్ఞులమెప్పులందుచున్. 1475

వా. మాన్య మిచ్చెన్ జనార్దను సేవకై, మందల్ నగరేశు సేవకై,
కన్యలన్ బ్రహ్మచారులకున్, ధనాగారంబులు సేవకాళికిన్ –
ధన్యులై పౌరులెల్లరుఁ బొంగగా ధమ్మిల్లము జక్కనొత్తలే
దన్య చింతాజ్ఞతన్ కుసుముండు పుత్రాయత్త మనః ప్రభావుఁడై. 1476

వా. దాన ధర్మాకృతిం జిరు గర్భ మందారం బిరు కాన్కలోయనన్
దానమిచ్చెన్ సుతన్, సుతునిన్, ప్రభాతంబయ్యె రవీందు బింబముల్
కానరా నొక్కెడన్ కుసుమాస్పదాకాశంబున బుణ్య సంభృతం
బైన వైశాఖ శుక్ల దశాహ్వయంబం దింపుగ వైభవంబుగన్. 1477

వా. ఒక్క వంశాంకురంబును గోరి తప్తోత్కంఠత నెంత గుందెనో –
ఒక్కరా ! ఇద్దరొక్క పరిన్ కళత్రోత్సంగము జేరఁ బృథ్వి నే
దిక్కు రిక్తంబగున్ కుసుమార్యు దే దీవ్యామల తోష దీధితుల్
రిక్కలం దాక ! నాతఁ డపార సంతృప్తామర రత్నమౌ తటిన్. 1478



వా. హ్లాద రాహిత్య దోష మలీమసం బావైశ్య గృహాంధకారమే
కాదు, కామ ప్రదూషిత సంఘ చక్ర స్వాంత మహాంధకారమున్
బూది చేయంగఁ బుట్టిన తల్లి రూపుం గాంచుచు నెల్ల దేవతల్
వేద మాతా నమః పరమేశ్వరీ విచ్చేసితె యంచు వేడగన్. 1479

వా. పుత్రునిం జూచు వేడుక తోడ నా పుణ్యాత్ముఁడు సూతికా గృహం
బాత్రతం జేరి చూచె సతీముఖం బానంద సుధా పునీతమున్ ,
నేత్ర సంజ్ఞావనీత శిశు ద్వయన్, నేదిష్ఠ కళత్ర పార్శ్వమున్,
పుత్రికా రూపమందొక దీధితీ పుంజంబున విశ్వరూపమున్ ! 1480

వా. మల్లె పూవంటి తెల్లని మేనితో, మైచేతులు రెండు రెళ్ళతో,
తెల్ల వేరేకు తామర నొక్కచే, దీటై చిలు కొక్క చేతిలో,
మెల్లగా మీటు వీణియ నొక్కచే, మేల్త్రా డొక చేత వ్రేలగా
నెల్ల బంగారు సొమ్ముల నొప్పు తల్లెచ్చోటిదా కోటి వెల్గులన్ ! 1481

వ. ఆ దివ్య మంగళ విగ్రహ వీక్షణంబున కనులు చెదరి కుసుమశ్రేష్ఠి నిచ్చేష్టుండై యుండ నప్పరాశక్తి కరుణా కటాక్షంబున దివ్య జ్ఞానంబు ప్రాప్తించి గతంబందు సమాధియనఁ దన పూర్వజన్మ వృత్తాంతంబెల్ల చలన చిత్రంబు వోలె మనః ఫలకంబున గదల నాటి తన తపఃఫలంబునఁ దన గృహంబు బావనమొనరింప నవతరించిన సర్వ మంగళగా గుర్తెఱింగి సద్యః స్ఫూర్తి నిట్లు స్తుతించెను. 1482

వా. కాస రానేక దైత్య వధంకరీ ! కారాచ్యుత చిత్పరేశ్వరీ !
శాసి తానంత విశ్వ శుభంకరీ ! శబ్దార్థ సమీహితాక్షరీ !
భాసి తానేక వేద్య విభావరీ ! భాస్వ ద్గ్రహ తారకోదరీ !
వాసవీ కన్యకా పరమేశ్వరీ ! వైశ్యాన్వయ కల్ప మంజరీ ! 1483

వా. దేవియున్ శ్రేష్ఠి పల్కుల కెంతయున్ దీప్తాభయ వాక్ప్రసాద సం
భావ సంస్తావయై కరుణా రస ప్రాలేయము జిల్కఁ బల్కె నే
నీవు పేర్కొన్న పేరున నుందు మన్నింపందగు, వాసవీ యనన్
నీవు నీ జన్మ లక్ష్యము జేరగా నిష్పాదిత కన్యకం జుమీ ! 1484

వా. అంచు నాదేవి శైశవ రూపమం దంతర్హిత మొంద శ్రేష్ఠియున్
పంచె నాచార్యుకై, వెను వెంటనే పర్వెత్తెను దానె జాగు సై
రించగా లేక, తాఁ గని విన్న సౌరెల్లన్ వినిపించె, నాతఁడున్
మంచి దీవించి తో నరుదెంచె నా మాహాత్మ్యము గాంచు ముచ్చటన్!

వా. వచ్చి వందారువై జగదంబ లే బాదంబుల మోము వాల్చి యా
సచ్చిదానంద దివ్య పదాక్షర స్ఫుర్యన్ చ్యుత సంశయాత్ముఁడై,
పచ్చి బాలెంతరాలి యదృష్ట సంప్రాప్తిం బ్రణుతించి, బాలకున్
గ్రుచ్చి ముద్దాడి సిద్ధము గమ్మనెన్ గుప్తాన్వయు జాత కర్మకై. 1486

వ. అంతటఁ గుసుమశ్రేష్ఠియు గురు వచనంబుల శుచి స్నాతుండై పితౄణ ముక్తుండైన సంతోషంబున దైవజ్ఞుల కధిక భక్తి ప్రపత్తుల వివిధోపహారంబుల సమర్పించి పూజించి ప్రార్థింప వారును వైశాఖ శుక్ల దశమీ శుక్రవాసరంబునఁ బునర్వసు నక్షత్ర యుక్త శుభ లగ్నంబున శుభగ్రహ వీక్షణంబుల నన్వయాభివృద్ధి కరంబగు శుభముహూర్తంబున జన్మించిన శిశుద్వయంబునకు జన్మ పత్రిక లిఖించి భాస్కరాచార్యానుమతంబున నీశ్వరానుగ్రహ ప్రాప్తుండగు పుత్రునకు విరూపాక్షుం డనియును, జగన్మాత కుసుమగుప్తున కాదేశించిన విధంబునఁ బుత్రికకు వాసవీ కన్యక యనియును నామకరణంబు గావించి రంత నాకాశవాణి యిట్లు వచియించె.

వా. విశ్వ సామ్రాజ్య శాసన కర్త్రి యీ విస్ఫూర్జిత వాసవీ యనన్,
నశ్వ రానంత భౌతిక విస్తృతిన్ నాన్యంబిది కన్యకా యనన్,
వైశ్వదేవాగ్ని మౌలిక హవ్య సత్త్వమ్మీ పరమేశ్వరీ యనన్,
శాశ్వతోత్కృష్ట కీర్తిని గూర్చి మీ సంరక్షణ చేయుతన్ సదా ! 1488

వా. నింగి మాటాడ విన్న జనంబులా నిత్యన్ పసిపాప మోముపై
వంగి కళ్ళార గాంచి తరింపఁ గైవల్యామృత పాన మత్తులై;
సంగ రాహిత్య మొల్లక పుత్రికా సంగంబునఁ దల్లి దండ్రు లు
త్సంగ చింతామణిన్ జిర సౌఖ్య సత్సంగంబునఁ దేలి రయ్యెడన్ !1489

***ఇది శ్రీవాసవీపురాణమునందు వాసవీకన్యక జననమను నేబదిరెండవ అధ్యాయము సంపూర్ణము.***

(శతారము= వజ్రాయుధము, ఆస్రవము= అలసట, పరిక్షేప= చుట్టుకొన్న, సౌవీరము= నీలాంజనము, నేదిష్ఠము= మిక్కిలి సమీపము)



# ఏబది మూడవ అధ్యాయము

**కం. బాలా! బాలారుణ రుచి**
**జాలా! జాలాకృతాభ్ర జాగ్రత్తారా**
**మాలా! మాలాత్మాయత**
**కాలా ! కాలాంత మోక్ష కారణ మాతా !**

తే.గీ. జనన మందిన జగముల జనని జనుల
నడుమ నడకలు నేర్చిన యొడుపు వినఁగ
వేడుకగు నంచు వైశ్యులు విన్నవింప
మునియు వివరించెఁ దద్వృత్తమును వినంగ. 1490

తే.గీ. కన్నవారల కన్నులు కలువ లగుచు
మోదమందుచు ముద్దుల మూటలైన
వాసవీ విరూపాక్షులం బరిఢవిల్లె
శుక్ల పక్ష శశాంకుఁడు శుద్ధుఁ డగుచు. 1491

ఉ. దినమున కొక్క క్రొత్త నిజ దీధితి దేహమునందు వర్ధిలన్
జనని కుసుంభు పట్టి సహజన్ముని తోఁగొని మెల్ల మెల్లగా
మనుజ నిజ క్రమంబు మెయి మంగళ దేహము నాదరించెఁ గాం
చిన జన మానసంబుల నశేష వినోద వికల్ప మేర్పడన్ ! 1492

తే.గీ. పురిటి పసి రోదనమ్ములు పుణ్య ఫలము
లంచు కౌసుంభి యానంద మందుచుండ
బోసి నవ్వులు వినిపించి పులకరించి
పంచె నువ్వుండ లెలమిని బంధు జనుల ! 1493

కం. కవలకు జరిపిరి పదకొం
డవ రోజున బారసాల డంబు దలిర్పన్
దవిలెను మరొొక్క నామము
భువనేశ్వరి వేయి పేర్లఁ బుణ్యప్రదమై ! 1494

కం. ఇరువది యొకటవ రోజున
నిరువుర నుయ్యాల వేసి యిరు వస కొమ్ముల్
కరములఁ గట్టిన రుచి జూ
చిరి పుడమిఁ బలుకులు నేర్వఁ జెల్లని యట్టుల్ ! 1495

తే.గీ. అబ్ధిజుల వోలె నూయళ్ళ నలరు వారి
నూచి జోలఁ బాడఁగ నందు నుంచిన గద !
తివిరి ముద్దాడ బారులు దీరు వార
లందరకు నెత్తుకొన బిడ్డ లందరాయె ! 1496

తే.గీ. అమ్మ వాసవీ పలుకవే మమ్మ యనుచు
మాటి మాటికి నెల్లరుం బలుకరింపఁ
గరుణ నూకొట్టె నది వింపుఁ గన్నతల్లి
పంచె నుగ్గిన్నె లందెల్ల బంధు జనుల ! 1497

చం. గతమున నెల్ల రూపములఁ గత్తులు వట్టి దురాత్మ లెల్లరన్
హత మొనరించి నట్టి తన యా పిడికిళ్ళకు స్వస్తి వల్కెనో
హత విమతాగ్ని పుత్రి యన నా పిడికిళ్ళను విప్పె నంతటన్
హితజన మోద మోదకము లెల్లరఁ బంచి తరించె తల్లియున్! 1498

తే.గీ. అన్ని యవతారముల మూలమైన యట్టి
పుడమిఁ బరికింప గాబోలు బోర్ల పడిన
శిశువులను జూచి కౌసుంభి చిత్త మలరఁ
బంచె బొబ్బట్లు పరిజన బంధుజనుల ! 1499

ఆ.వె. నేలబారు చూపు గాలమై దూరముల్
పట్టి లాగినట్లు ప్రాక సాగి
రంతఁ బంచె తల్లి యమృతపు పాకుండ
లెల్ల జనులకుఁ దమ యేలుబడిని ! 1500

ఆ.వె. పొన వెలికిల నింగి, బోర్ల పడగ నేల,
నదియు నిదియు నెల్ల నరయనేమొ
కూరుచుండ నేర్చె కోటి సూర్య ప్రభ –
పంచెఁ దల్లి కుడుము లంచితముగ ! 1501

చం. పుడమిని నెల్ల జీవులకుఁ బోఁడిమియై దనరారు తల్లి కీ
గడపల తోడ నేలయని గావును తమ్ముని గూడి యాడుచున్
గడపలు దాట సాగినది గాంచిన ముచ్చటఁ దల్లి దండ్రులున్
గడపలకేగి యెల్లరకు గారెలు పంచిరి తృప్తిదీరగన్ ! 1502

ఆ.వె. ఆరు నెలలు దాటె నారవ దినము రా
నఖిల బాంధవుల సమాదరించి
మేనమామ చేతి మీద నన్నప్రాశ
నమును సల్పి రతి ఘనంబు నెగడ ! 1503

కం. తొలుతగ దొలి బీజాక్షర
ములు "అమ్మా" యనఁగ నమ్మ ముఖమున పలుకై
వెలువడ నమ్మయుఁ జక్కెర
చిలుకలు ముదమందుచు నిరు చేతులఁ బంచెన్ ! 1504

తే.గీ. ఒక్క సారిగ లేచిన దిక్కు లదరి
వణకి పోవును మృదుగాత్రి వసుధ యనఁగ
మెల్ల మెల్లగ లేచిన చల్లనమ్మ
యడుగు లేయంగ నరిసె లా యమ్మ పంచె ! 1505

ఉ. అంత వసంత కాంత చిరు హాస మనంగ వనంబు లన్నిటన్
సంతస మావహించె సరస ప్రసవ ప్రథిమ ప్రమేయమై,
సంతస మావహించె శిశు జన్మ దినోత్సవ మేగుదెంచ శ్రీ
మంత కులాధినేత గృహమందున బంధు జన ప్రసాదమై ! 1506

ఆ.వె. నేల యీనినట్లు నెలత లందరును బే
రంటమునకుఁ గుసుమ నింటఁ జేరి
'ఆయురస్తు'టంచు నాశీర్వదించుచు
కదలినారు కానుకలను గొనుచు. 1507

కం. అందరి యాశీర్వచనము
లందుచు మలి వత్సరంబు నందున జగమా
నందము నొందగ నడుగిడి
రందంబుగ బిడ్డ లిద్ద రాందోళములన్ ! 1508

ఆ.వె. రెండు, మూఁడు, నాలుఁగేండు లట్టులె శైశ
వమ్ము గడచె ముద్దినమ్ము లట్ల,
కాలు నేల నిడక గారాము మారాము
లందు ముద్దు మురిపె మందుకొనుచు ! 1509

ఉ. ఐదవ యేఁడు వచ్చినది, అక్షర దేవత శారదాంబకున్
వేద పురాణ శాస్త్ర సమవేత సరస్వతి నోట వర్ధిలన్
మోదమగుం గదా ! చదువు ముచ్చట దీర్పగఁ దల్లి దండ్రులున్
వేద విదున్ గురుం బిలిచి వేడిరి బిడ్డలఁ దీర్చి దిద్దగా. 1510

ఆ.వె. 'ఓం నమశ్శివాయ' ఓనమాలై జన
గురువు దిద్ది పెట్టె నిరువురకును,
శిరము వంచి భక్తి 'సిద్ధం నమః' యంచు
నక్షరములు దిద్ది రభవు లపుడు. 1511



తే.గీ. నివురు గప్పిన నిప్పుల నివురు నూది
నటులఁ బంచాక్షరీ ప్రభూతానిలముల
తొలగెఁ దిమిరావరణము లా ద్యోత యుగము
న ననఁగ గురువు భాస్కరునకు ఫలించె. 1512

ఉ. ఆరవ యేటనుండి గురు లారు వసంతము లాట పాటలం
దీరిచి దిద్ది రిద్దరిని దీరుగ లౌకిక వర్తనమ్ములన్,
వీరికి విద్య నేర్పితిమి, వీరిని దీర్చితి మంచు దక్షిణల్
కోర రనన్య గౌరవ కకున్నిధు లౌటఁ బరాగురు స్థితిన్ ! 1513

వా. వాసవీ కన్యకా పరమేశ్వరిన్, వైదుష్య విదగ్ధతా నిధిన్,
కౌసుమా కౌళినీ కుళ యోగినిన్, కౌసుంభి కుటుంబ కౌముదిన్,
భాసురన్, శిష్యురాలిని నొజ్జలున్ భద్రంబుగఁ గన్నవారి కా
శాసనా పూర్వకంబుగ నప్పగించన్ వారుఁ గృతజ్ఞతాంజలిన్. 1514

కం. ఇన్నేందుకు . . . చాల్పాలన
నెన్నో కాన్కల నొసంగి, యీ మాపుత్రున్
కొన్నాళ్ళు గురుకులంబున
మిన్నగఁ దగు మెఱుఁగు వెట్ట మెయికొనుఁ డనఁగన్. 1515

తే.గీ. కుసుమ గుప్తుల మొఱ విన్న గురువులంత
నా విరూపాక్షు నుపనీతు నవసథమున
నుండి తమ గురుకులమునం దుంచిరంత
వైశ్య విద్యల నెల్ల నేర్పంగ నతఁడు. 1516

***ఇది శ్రీవాసవీపురాణమునందు వాసవీ విరూపాక్షుల విద్యాభ్యాసమను నేబది మూడవ అధ్యాయము సంపూర్ణము.***

(ప్రథిమ= విరివి, ద్యోతము= ప్రకాశము, కకుత్తు= శ్రేష్ఠము)

# ఏబది నాల్గవ అధ్యాయము

కం. ఓం ఐం హ్రీం శ్రీం ! లలితాం
బా ! ఐం క్లీం సౌః ! మహేశి ! పరమేశ్వరి ! ఓం
హ్రీం ఐం ఠం వం వాసవి !
సౌః ! ఆర్యా ! కన్యకా ! విశాలావాసా !

తే.గీ. వాసవీ గాథ వినుచున్న వైశ్య వరులు
చిత్ర కంఠుని దుష్కర్మ చేత మరల
బాధ తప్పదు మా వారి భవితకంటి
వా కథా విధానముఁ జెప్పుఁ డనియె మునిని. 1517

వ. అంత సాలంకాయనుండు నిట్లనియె. 1518

తే.గీ. అదియె చెప్పుచు నుంటిని విదురులార !
చిత్రకంఠుఁడు వైశ్యుల చెంత జన్మ
మొంద భూమిని బుట్టి చెన్నొంది నట్టి
విధము వంశంబు నాకథ వినఁగ మీరు. 1519

సీ. ఎవని ధనుర్విద్య యింద్రుని ఖాండవం
బగ్ని మాంద్యము దీర నప్పగించె
నెవని యగ్రజ భక్తి అవపాడి దాయల
గాంధర్వబంధంబుఁ గడపె నాడు
ఎవని బాహు బలమ్ము దివిజేంద్రు బాధించు
కాలకేయాదుల గర్వ మడఁచె
నెవని పరాక్రమం బెల్ల రాజుల గెల్చి
యమసుతు రాజసూయమ్ము గడపె



నెవని నిగ్రహ శక్తి యీశ్వరు మెప్పించి
పాశుపతాస్త్రమ్ము భద్ర పరచె
నెవని తేజోరూప మవలీల నుత్తర
గోగ్రహణ బలంబు నిగ్రహించె
నెవని సఖ్యపు భక్తి భవరోగ తిమిరారి
శ్రీకృష్ణు సారథిఁ జేసికొనియె
నెవ రజేయులుగ తమ్మిడుమలఁ బెట్టె నా
కౌరవ హతకుల కాటి కంపె

తే.గీ. వాని కౌంతేయు నర్జును సూనుఁ డగుచు
నవనిఁ బూర్ణావతారి మేనల్లుఁ డగుచు
నిరు కులమ్ముల నిలబెట్టు పురుషుఁడగుచు
కలిగె వీరాభిమన్యుండు నెల కులమున. 1520

వ. అట్టి యభిమన్యుండు యశస్వంతుండగు పరీక్షిత్తును గనె నాతండును నెవని పరిపాలనంబున కలి పురుషుం దరుణోదయ కాలంబున హిమంబు వలె దూరంబుగఁ బరుగులిడునో యట్టి ధార్మికాగ్రేసరుండైన జనమేజయునకు జన్మంబిచ్చెఁ బంచమవేదంబని ప్రసిద్ధి వహించిన మహాభారత గాథను ప్రపంచంబునఁ బ్రచార మెనరించిన నమ్మహానుభావునకు శతానందుండుదయించె నతనికి క్షేముండును క్షేమునకు విజయార్కుండు జననంబొందె నంత. 1521

శా. ఏ గంధర్వుఁడు చిత్రకంఠుఁ డనఁగా నీశాను కైలాస శై
లాగారంబున నున్న మీ విశుల కోపాగ్నేయ శప్తాత్ముఁడో
ఆ గంధర్వుఁడు జన్మ మందె విజయార్కాఖ్యాత్మజుండై భువిన్
రా గేహంబున విష్ణువర్ధనుఁడుగా రాజాన్వయం బందునన్. 1522

చం. అతఁడు షడంగ యుక్తముగ నన్ని ఋగాదులు శాస్త్ర షట్కము
న్నతుల మహాస్త్ర శస్త్రములు నర్వది నాలుగు విద్యలున్ మహీ
పతులకు నర్హమైన పలు భంగులు నేర్చెను యౌవ రాజ్య సం
గతమున రాజ్య విస్తరణ కార్యరతింజనె శౌర్యసంపదన్. 1523

మ. మద మత్తేభము లర్బుదంబులును సామర్థ్యంబు పెంపారు మం
చి దువాళంబుల పారసీకము లనిన్ సిద్ధాశ్వముల్ న్యర్బుదుల్
కదనం బందు మహా పరాక్రమ యుతుల్ కంఠీరవ స్కంధులున్
ముదలింపన్ సరివారులేని భటులున్ ముట్టళ్ళ ముందుండగన్. 1524

షట్పద. తన కుమారుని రాజు
తనకు మారుగ నుంచి
తన మూల బలముంచి రాజధానిన్
మునుముఁ బట్టెను వీఁక
మును పద్మ శైలమం
దున నుండి నలు దిక్కులన్ జయింపన్. 1525

శా. ప్రాచీ దిగ్జయ ఘోషలన్ మునిగె నా వంగాంగ కాళింగముల్
సాచెన్ చేతులు విష్ణువర్ధను దయన్ సంధింపఁ బ్రాణంబులున్
సాచివ్యార్జిత దూర పూర్వ గణ రాజ్యమ్ముల్ నమింపన్ యశః
ప్రాచుర్యుండయి యేగె నుత్తర దిశా ప్రాంతమ్ములన్ గెల్వగన్. 1526

మ. నిషధానంగ విదేహ కోసలములన్ నేపాళ కాశ్మీర కా
రుష పాంచాల త్రివిష్టపాదుల వెసం భ్రూభంగ మాత్రంబునం
బృషదశ్వాహత వృద్ధ వృక్ష తతిఁ గావించెన్ నిజోత్క్షిప్త పౌ
రుష మింద్రాదుల నివ్వెఱం బఱుప నా ప్రోష్ఠీకృత ప్రష్ఠుఁడున్. 1527

ఉ. అంతట విష్ణువర్ధనుఁ డనంత బలమ్ముల తోడ పశ్చిమా
శాంతము సాగె నందలి బలాఢ్యులు బర్బర పారశీకులున్
సంతమసంబునం బడ నిషాద పుళిందుల మ్లేచ్ఛ హూణులన్
పంతము బూని చెండె భుజ పాటవమొప్ప మహోగ్రమూర్తియై. 1528

ఆ.వె. తలలు దప్ప తమకు తమవంటు మిగులని
ధరణి పతులు తమకు తలలనైన
నిలుప మంచు వేడి నిలువుదోపిడులుగా
నిచ్చినారు వీరు తెచ్చినారు. 1529



తే.గీ. మూడు దిక్కుల నోడించి ముమ్మడించి
నట్టి యాహ వోత్సాహంబు ముట్టడింప
ముట్టడించెను దక్షి ణాముక్త కాల
కవచ మూడ్చగ రారాజ కవచ మూన. 1530

తే.గీ. కాల దిగ్వాత్య వాహినీ క్రాంతుఁ డగుచు
నేగె విష్ణువర్ధనుఁ డంత వేగిరమున
మూడు దిక్కుల వలెఁ గాదు ముట్టడింప
నీఁగఁ దొలి వాని యాటలు సాగ వచట. 1531

ఉ. మాళవ పాండ్య చేరములుఁ బహ్లవ సింహళ కోయ నాగముల్
చోళ విదర్భ రాజ్యములు సోరణ గండుల దూరి వచ్చునా
యూళల విన్న మాత్రమున నుక్కళముల్ బచరించి యుక్కణం
బీళిక లెత్త నెత్తినవి యెత్తుగడల్ రిపులన్ హరింపగాన్. 1532

తే.గీ. ప్రళయ కాలాబ్ధి కల్లోల ఫణ నిపాత
మునకు ఊమ్మొడ్డి నిలచిన మునుముఁ జూడ
నగ్ర రాజ్యాధిపత్యంబు నడ్డగించు
నలతి జనపద సాహస మ్మట్లు తోచె. 1533

కం. మబ్బుల నుఱుముల మెఱపుల
నబ్బురముగ నిబ్బరించు నంబుధి వోలెన్
బొబ్బల నుబ్బుచు ద్రొబ్బుచు
మబ్బుకొను రిపుల బలముల మాడ్చం జొచ్చెన్. 1534

తే.గీ. ఎంతఁ జేసినఁ జివరకు పంతమూని
విష్ణువర్ధను బ్రామిడి వింటి నుండి
వెడలు శర పరంపరల నువ్వెత్తు మిత్తి
దక్షిణాపథ రాజుల దర్ప మెడపె. 1535

చం. రథములు చూర్ణమయ్యె నట రాజుల కేస్గులు పీస్గు లయ్యె నా
క్రథన వికీరితాంగములఁ గాంచి చలించి విసర్జి తాయుధా
పథముల బట్టి రంతమున బార్థివు మ్రోల నమస్కృతాంగులై
ప్రథిత సువర్ణ హార నవ రత్న సమర్పణ శాంతిఁ జేయగా. 1536

కం. శాంతించిన శాంతనవ కు
లాంతకుఁడై తోచు క్షత్రి యాసుర తాపం
బంతట నిజ నగరము తన
యంతఃపుర చింత తగుల నరుగం దొడగన్. 1537

వ. మార్గంబున విలాస మానస మగ్నుండగు విష్ణువర్ధను నేత్ర పటలంబున హేమ ప్రాకార గోపుర సురక్షితంబును ప్రభు పతాకావిష్కృత రత్న సౌధ యుక్తంబును మణి తోరణ మండితంబును బాతాళ నిమ్న పరిఘావృతంబును వజ్ర కుట్టిమ శోభితంబును నభ స్పృగ్వప్ర శిఖరంబును స్ఫాటి కాట్టాల కోజ్వలంబును గదళీ చూత పున్నాగ నారంగ తిల కార్జున చాంపేయ పాట లాశోక కుట జాశ్వత్థ చందనాది నానావిధ లతాజుష్ట సదా ఫల పుష్ప విరాజమాన నంద నోప మోపవన భూషితంబును మహాత్ములగు వైశ్య వర్యుల నివాసార్థంబు విశ్వకర్మ విరచితంబును భువన భూషణంబు నైన జ్యేష్ఠశైలం బను నగరంబు వడిన యంత. 1538

తే.గీ. రాజు లందఱ గెల్చి రారాజ టన్న
ఘనతఁ గాంచిన నా రాజు మనసు గెల్చె
నా నగర శోభ బహు విస్మయమున నతఁడు
దండు మరలించె నా పుర ద్వారమునకు. 1539

సీ. భూతలాధీశుండు పుర ముఖ ద్వారాన
విడిది చేసిన వార్త విన్న యంత
వైశ్య వర్యులు తమ వాణిజ్యమున కెంత
భాగ్యంబు చేకూరె బళిర యంచు
రచ్చల గుమిఁగూడి రాజు నాహ్వానించు
పలు తెఱంగులు వ్యక్త పఱచి రంత
పట్టణ వీధుల పన్నీరు చల్లించి
ముత్యాలఁ దీర్చిరి ముగ్గు లందు
ఆ.వె. రథ్యల కిరుగడల రత్న ధ్వజము లుంచి
మణుల తోరణముల మలపినారు
కుసుమ శెట్టిఁ గూడి కోటీశు లందఱు
సాగినారు పతిని స్వాగతింప. 1540

ఉ. వాకిట వేచి యున్న పరివారముఁ జేరి వినీత బృందమున్
మాకు నధీశు దర్శనము మైకొను డంచు నుపార మిచ్చి లోఁ
బ్రాఁకి నమస్కరించి విలువైన దుకూల విలేపనమ్ములం
జేకొని పట్టణంబు దయఁ జేయు డటంచు నుతించి వేడినన్. 1541

ఉ. వైశ్యుల విన్నపంబు విని వారి వినమ్ర వచో విలాస సం
స్పృశ్య మనో వినోదమున సేమము లారసి యాదరించి ఆ
వశ్యక దాయముల్ గొని అవశ్యము వచ్చెద రేపు నానె భూ
స్పృశ్య నిమంత్రణమ్ము చెవిఁ జేరునె ఱేలకు వింత కానిచో ! 1542

తే.గీ. ఱేనిచే నరుదైన సమ్మాన మొంది
సంతసమ్మున మునిగిన సక్థిజులును
నింటి కరుదెంచి మరునాటి యిష్ట పూర్తి
కెదురు చూచుచు నుండిరి బెదురు లేక. 1543

***ఇది శ్రీవాసవీపురాణమునందు చిత్రకంఠుఁడు విష్ణువర్ధనుఁడై వచ్చుటయను నేబదినాల్గవ అధ్యాయము సంపూర్ణము.***

(అవపాడిదాయులు= న్యాయముతప్పిన బంధువులు, సాచివ్యార్జిత= సచివులచేత ఆర్జింపబడిన, ప్రోష్ఠీకృతప్రష్ఠుడు= ఎగిరెగిరిపడేవాళ్ళలో ముందున్నవాడు, క్రథన వికీరిత= హింసచే విసిరివేయబడిన, ఉపారము= కానుక)

# ఏబది యైదవ అధ్యాయము

కం. **శ్రీమద్వైశ్య కులోద్భవ**
**శ్రీమాతా! గుణ మణి గణ శింజిత సర్వా !**
**హోమావిర్భవ విభవ**
**శ్యామా ! బృహదద్రి జాత ! సక్థి ప్రభవా !**

తే.గీ. తెల్లవారెను వైశ్యుల దివ్య గాథ
వాసవీ దేవి కతమున వాసి కెక్క
తెల్లవారెను నృపతికి తేజ మెల్ల
వాసవీ దేవి కతమున వార్త కెక్క. 1544

ఉ. వైశ్యులు నిండ్లు వాకిళు లవాప్త విభూషణ సుందరమ్ములై
వశ్య జిఘాంసు రాణ్ణికరు వశ్య మొనర్చుకొనంగఁ జేసినన్
వైశ్యుల కోర్కె మాటున దివాద్యుతితో పుర వీక్షణేచ్ఛ యా
వశ్యకమై ఫలింప పరివార విభూషితుఁడయ్యె భూపుఁడున్. 1545

ఉ. సందె వెలుంగు తోడ శుచి సార పరిష్కృత శుభ్ర దేహుఁడై
చందన పుష్ప తంబుల నిసర్గమునం ద్విజ సంశ్రయుండునై
సుందర మంటపమ్ము పద చుంబితమై జయ ఘోష వెట్టగా
మందిర వంది మాగధుల మాటల పల్లకిపైఁ బ్రసన్నుఁడై. 1546

తే.గీ. పయనమాయెను పెనుగొండ పట్టణంపు
కడప ముంగిట వైశ్య సంగతియుఁ జక్ర
వర్తి కీర్తినిఁ గీర్తించు కీర్తనముల
నెదురుకోలును పలికిరి యెదల తోఁడ. 1547



కం. మదగజ వనమున మృగపతి
ముదముగ నడుగుల నిడు వడి మునుకొను భంగిన్
మద విశ పురమున నరపతి
ముదముగ నడుగుల నిడెఁ దన ముచ్చట తీరన్. 1548

తే.గీ. పుట్టి ప్రతివారు సాష్ట్రాట్టు నెట్ట యెదుట
నుండి కానంగ నగునె పో నుండు లోపు !
మనకు జన్మకో శివరాత్రి యనఁగ నిదియ
యనుచు పరుగులు దీసినా రధిపుఁ జూడ. 1549

సీ. లత్తు కలదుకొంచు లలన మధ్యన లేచి
పరుగుఁ దీసెను వీధి పంచఁ జేర
కొప్పు ముడుచు చేత కొస వెండ్రుకల తోడ
లేచి పరుగుఁ దీసె లేమ యొర్తు
ముత్యమ్ములను గ్రుచ్చు ముదిత దారము వీడి
దారి శోభిల్లగా తరలి వచ్చె
నిక వేశ్యలనఁ జెప్పనేల పడకటిండ్లు
వీడి వీడినయట్లె వీధికెక్కి

తే.గీ. రతివ లన నేల పురజను లందరున్ను
విష్ణువర్ధను వీక్షించు వేడు కలర
నిను మయస్కాంత మాశించు నెనరు కెనగ
పురము క్రిక్కిరియఁ జనిరి పురులు విప్పి. 1550

తే.గీ. ఆర్య వైశ్య నియుక్తలౌ యతివ లపుడు
విమల మంగళ నీరాజనముల తోడ
విష్ణువర్ధనుఁ బూజించి విన్నవించి
రధిప లోనికి రండు మా కతిథు లగుచు. 1551

చం. పురమున వింత లక్షుల కపూర్వ వసంత సుఖంబు లీయ నా
నరపతి సంతసమ్మున ఘనాఘను వోలె గమింపుచుండ న
బ్బురముగఁ జూచి రా నగర పుణ్య పురంధ్రులు రత్న తోరణా
భరణ మనోజ్ఞ మందిర గవాక్ష గృహాంగణ సజ్జ తాంగులై. 1552

తే.గీ. రాట్టు విడ్రాట్టు రాణువ రాక తోడ
వేశ్మ కుడ్యమా యన నిల్చె వేష్టితాత్ముఁ
డౌచు రంగారు బంగారు అవసథమున
నిలకు దిగె నొక్కొ దేవేంద్రుఁ డిచట ననుచు. 1553

కం. వచ్చిన రారాజు నపుడు
విచ్చిన పూబోడు లమిత వినయము గదురన్
నచ్చిన నీరాజనముల
మెచ్చులు వడసిరి విశులకు మెప్పు ఘటింపన్. 1554

తే.గీ. అతుల సత్కార మందిన యధిపు డంత
కుసుము కుసుము కుమారుని గూర్మి నెరప
మేడపై నుండి చూచిన మెలత వాస
వియును పరుగున దిగి వచ్చె వింతఁ జూడ. 1555

తే.గీ. వచ్చి తన పజ్జ నిలబడ్డ బాలఁ జూచి
పొమ్ము, ఇట నుండ రాదు పో పొమ్మటంచు
శ్రేష్ఠి వారించె చేసైగఁ జేసి కూతు
నైన వాసవి కదలక నచటె నుండె. 1556

సీ. వైశ్య కాంతల యందు వర్ణింప నలవి గా
నట్టి సుందర రూప మామెఁ జూడ
నూరవ్య ఘనకుల క్షీర సముద్రమం
దతివయై పుట్టిన యమృతంబు
కుసుమాంబ గర్భాభ్ర కుముదబాంధవు శోభ
జాత రోహణ గుప్త జాతి రత్న



మన్న విరూపాక్షు నారవ ప్రాణంబు
కులమెల్ల కీర్తించు కుసుమ గాత్రి

తే.గీ. మాటి మాటికి ముఖమునం దాట లాడు
కొదమ తుమ్మెద మూకను కోపగించి
కేలఁ ద్రోలుచు డీల్పడు బేల సొగసుఁ
జూచి గుటకలు మ్రింగె నా రాచ బుద్ధి. 1557

అంబురుహ.
భూమి సమస్తము గెల్చితి, నేటికి పూర్వ మిట్టి మనోజ్ఞమౌ
లేమను గాంచగ నైతిని, హ్రాదిని లీల నీ భువిఁ బుట్టెనా–
భామగ రూపము గైకొని, బంగరు పాత్ర లీ చను దోయితో
వామ మనోహర దేహము నేచకఁ బంచ బాణుఁడు నిల్చునే ! 1558

సీ. రెండు పద్మాలపై రెండు కూర్మమ్ములై
రెండు కూర్మాలపై రెండు కాహ
ళాల్రెండు బాకాల నరఁటి కంబాల్రెండు
నిరు కంబములపైన నిసుకతిన్నె
యిసుక తిన్నియ పైన నింద్రుని కాసార
మమృతంపు కొలనిపై నలరు గిరులు
గిరియుగ్మమున మధ్య వర దివ్య శంఖంబు
శంఖంబుపై నిండు చందమామ

తే.గీ. చందమామకు పై సగ మందు నలరు
కనక పట్టమ్ము నాపైన గండు తుమ్మె
దల కదంబము, పట్టమ్ము నిలుపుచున్న
హేమ తూణీర మీ సొంపు కాము పంపు. 1559

కం. ఎంతని వర్ణింపను నే
నింతిని పొంతను నుతింప నింతకు మిగులన్
కంతుఁ గను గీటు కాంత న
నంతున కైనను తరంబె యన్నున వొగడన్ ! 1560

వ. అనుచు మనంబున బరిపరి విధంబులc జింతింపుచుc బులకాంకిత విగ్రహుండై కన్యకనే కన్నార్పకc జూచుచు మదన బాణ పీడితుం డయ్యును రాజ దర్పంబుc జెదరనీక నూతన దుకూలంబుల తోడను మణి మయ భూషణంబుల తోడను నా యార్య వైశ్యుల సత్కరించి కర్పూర తాంబూలాదుల నిప్పించి కుశల ప్రశ్నంబులc బలుకరించుచు నిట్లనియె. 1561

ఉ. నిగమ సమానులార ! మిము నిత్య వదాన్యులc జూడ నేడు నా
మగుడు ప్రయాణ వేళ ననుమానము గల్గె నజేయమైన నా
మగటిమి మీకు లొంగెనని మారుని బిత్తర వెట్ట జాలు నీ
మగువ యెవర్తె? అప్సరస మానినులం దలcదన్ను నీయెడన్. 1562

కం. అధిపు మనోగత మెఱిcగియు
మధు రోహల నున్న వృద్ధ మనుజులు ప్రీతిన్
మధురముగc బలికి రంతట
విధ మెల్లను గలుగు వాసవీ జన్మ కథన్. 1563

ఉ. వాసవి యీమె మా కుసుమ వల్లభు గారబు పట్టి పుట్టె మా
కోసము యజ్ఞ మార్గమున గూరిమి తండ్రి వరాల పంటగా
శాసిత సర్వ లోక హిత సంశ్రిత సంశ్రిత వైశ్య మానసో
ల్లాసిత కన్యకా తనయ లక్షలు మాకని చెప్ప నాతcడున్ . 1564

వ. తన్ను వలగొన్న కన్య సామాన్య కాదని తెలిసినంత వలవంత వాయు మార్గంబుc దెలియమి నా వైశ్య వరుల యథావిధి కాన్కల సత్కరించి వారలc బంపి యేకాంతంబున పుష్ప శయ్యc జేరి బహు భంగులc దల్లడ మంద సాగె. 1565

***ఇది శ్రీవాసవీపురాణమునందు విష్ణువర్ధనునకు వాసవీ దర్శనమను ఏబదియైదవ అధ్యాయము సంపూర్ణము.***

(వశ్యజిఘాంసురాణ్ణికరు= శత్రురాజసమూహమును జయించినవానిని)



# ఏబదియారవ అధ్యాయము

**కం. కామాక్షీ ! కమలాక్షీ !**
**కామ దహన సంభ్రమాక్షి ! కామ శరాక్షీ !**
**వామాక్షీ ! విమలాక్షీ !**
**వామాచారాయతాక్షి ! వర కల్పాక్షీ !**

కం. అటుల నిశాపతి కుల పతి
పటుతర విరహాగ్ని కీల భగ్గు మనంగన్
చటుల మనః పటలార్భటి
కటకట మనిపించె బ్రతుకు కామార్తునకున్. 1566

కం. కుదురుగ శయనించగ లే
డదరిపడు నకారణముగ నరచును లేచున్
పదములc బాడును దిక్కుల
నదలించు హసించు నేడ్చు నను నిట్టూర్చున్. 1567

చం. దిశల జయించినాడు జగతీ రమ కౌగిలి నేలినాడు శ్రీ
వశమున నా కుబేరు వసి వాడగ లోకువc జేసినాడు శే
ష శయను సాటి వచ్చునను సద్యశ మంది చెలంగినాడహో
విశ సుదతీ వశుం డగుట వింత కదా - విధి చేత కానిచో ! 1568

కం. ఇన శశి గతులc జెఱుప నగు
తనువును మరణింపకుండ దాcపగ వచ్చున్
తనలోని కామ దేవత
పనిc బట్టగ నగునె యెంత పనివాడైనన్. 1569

కం. భోజనము లేదు వానికి
నాజుల గెలిచిన రవంత యానందము లే
దే జవరాలు రుచింపదు
భూజానికి పిచ్చి ముదిరి భూతము పట్టెన్. 1570

ఆ.వె. ఇంత జరుగుచున్న నెవ్వానికిని బిల్చి
చెప్ప దాతఁ డేమి చెప్ప గలఁడు !
క్షీణ చంద్రుఁడైన క్షితిపతి స్థితిఁ జూచి
చెవులు కొరుకుకొనిరి సేవకులును. 1571

తే.గీ. అంత మంత్రులలో బుద్ధిమంతుఁడైన
ప్రభువు మేలు కోరెడు ప్రేమ పాత్రుఁడైన
యెట్టి కార్యంబునైన జేపట్టఁ గలుగు
విజయ సింహుండు దరిఁ జేరి వివర మడిగె. 1572

శా. ఏ లోపంబు ఘటించె లోహపురుషా ! యీ చింత నీ చెంత నే
లీలం గాలిడె ? నిన్నుఁ జేర గలదే లేదన్న యే మాటయున్ !
కాలుండైనను కాలు మార్చఁ గలదే కష్టంబు నీ నిల్చుచో !
నేలా నీ కిటువంటి చింత ? తగనా ! నేఁ దీర్చగా లేనొకో ? 1573

ఉ. చెప్పుము నీ మనంబుఁ గల చింతకు కారణ మిం తదెంతగా
గొప్పది యైన నీ కొఱకుఁ గూకటులన్ బెకలించి తెచ్చెదన్
ముప్పును గాన రాదు తుద ముట్ట హరించెద మన్న నెవ్విధిన్
మప్పెదఁ జెప్పుకున్న నిను మంచిగ మల్లడి తీర భూవరా ? 1574

చం. పరిజన మెల్ల నీ కొలువు పచ్చని పందిరి క్రింద నిచ్చలున్
సురగవి దుగ్ధ పానమునఁ జొక్కిరి నేటి దినంబుదాఁక నీ
పరుసన, నేడు నీ పరువు పందిరి కెక్కును చెప్పకున్న నే
చిరమర లేక నాకు దయ సేయుము నమ్మిక మున్ననే సుమా ! 1575

తే.గీ. మంత్రి వర్యుని మొగమోట మనముఁ జొరఁగ
లోన సుడివెట్టు లావాగ్ని నూన లేక
తప్పు దనుకొంచుఁ దప్పక తప్పనంగ
రాని తప్పు నొప్పుగఁ జెప్పె రాజరాజు. 1576

ఉ. చూచితె కోమటింట కడు సుందరి కన్యక యంట యేమి యా
రాచ కుమార్తెలం గనఁగ రాని మహత్త్వము వాసవీ వధూ
లోచన యుగ్మ దీమసము లోకమునం గనుగొంటె నేత్ర నా
రాచములందు నా హృదయ రాజ్యమునోడితి నేమిచెప్పుదున్. 1577

తే.గీ. దిక్కు లన్నియు గెల్చినన్ దిక్కు లేని
వాడ నైతిని విశ కన్య వశుఁడ నైతి
నొక్క కొనగంటి విసురున నుక్కడంచి
నట్టి సుందరి కొన వ్రేలు పట్ట వలదె ! 1578

ఉ. రాజ్యము లెన్ని గెల్చితిని రక్తము చిందని రీతి నీదు ధీ
రాజ్య రమా మహత్త్వమున, రక్తము చిందిన కాని చోటు నీ
రాజ్య మహత్త్వము న్నెఱపి రామ నిజాంతర మందు ప్రేమ సా
మ్రాజ్యముగెల్చి యిమ్ము నిను రాజును జేసెద నెల్ల భూమికిన్. 1579

తే.గీ. అట్లు కాదేని నా మేన యసువు లుండ
వింక నాకు మీరును మీకు నేను లేను
చేత నయ్యెనా నా పనిఁ జేయు మయ్య
వీలు కాదన్న నన్నిట్లు విడిచి పొమ్ము. 1580

తే.గీ. గొంతు లోతున దిగబడ్డ కాంతుఁ జూచి
కాంత కౌగిళ్ళు మాత్రమే శాంత పరచు
నంచు విజయ సింహుఁడు సెల వంది వచ్చి
యాంతరంగిక మంత్రుల పొంతఁ జేరి. 1581

తే.గీ. రాజు హృదయాన విరహాగ్ని రాజు కొనుట
దాన విగళిత విక్రమం బాను వడుట
కొలిమి కొఱగాని కోమటి కుట్టు దగుట
చెప్పి గట్టెక్కు మార్గంబుఁ జెప్పు డనియె. 1582

ఉ. అంతయు విన్న మంత్రుల కొకంతతట నర్థము కాదు తాము వి
న్నంతయు సత్యమా యనుచు నానక నౌర విధాత చేత లా
వంతయు నంతుబట్టవు గదంచు యొకింతఁ దలంచి తాముగా
నెంతయుఁజింతఁ జేసి తుద కీకొని రొక్క ద్వితీయమార్గమున్. 1583

తే.గీ. చతుర సచివులు రాజ లాంఛనము తోడ
విజయ సింహుని తోడ నా విశుల కడకు
పోయి రంతట వారును పూజనముల
స్వాగతించిరి స్వగత విచారు లయ్యు. 1584

ఆ.వె. కుసుమ శెట్టి యింట కురుకుల సచివుల
కర్థతలకుఁ దగిన యతిథి సేవ
లమరి నంత వార లానందమున నుండ
విశులుఁ బూని రసలు విషయ మడుగ. 1585

ఉ. అంతటి చక్రవర్తులకు నంగడి సాముల తోడ నెయ్యమా !
సంతస మాయె మా కులము సంబరముల్ జరిపించె, కాని మీ
రింతకు మున్ను వచ్చిరన నీశ్వరుఁడే కరుణించి వచ్చె మా
చెంతకు నంచు నిక్కితిమి – చింతగు నీపరి నే విశేషమో ! 1586

కం. యాపనముఁ గోరి రారు గ
దాపాటి వినోద మనగ నచ్చుట కొదువా !
కాపాడగ నెయ్యము నన
భూపాలుర తోడ మాకు పోలిక గలదే ! 1587

వ. ఆర్య వైశ్యుల నుండి యిట్టి ప్రతి వచన మాశించిన సచివాగ్రణులును. 1588

కం. యాపనము కాదు యాచన
మీపాటి వరంబు మీర లీగల రధిపున్
కాపాడ వియ్య మందుడు
భూపతులకు గోపతులకు పోలిక లేదే ! 1589

వ. అనుచు వచింప శిరంబులపై గిరి శిఖరంబులు వడ్డ చందంబున తఱుగరు లెల్లరు తల్లడ మందుచుఁ గటకటం పడుచుండ నా తెఱంగెల్లయు గమనించుచున్న విజయ సింహుండు గుసుమ శ్రేష్ఠినిం గాంచి. 1590

ఉ. ఓ మహనీయ వైశ్య కలశోదధి పూర్ణ శశాంక ! నీకు పూ
ర్ణామల చంద్ర వంశ నిధి అల్లుడు కాఁదగు నంత నీ విలన్
కామదుఁ డౌదు వీ సకల ఖండములున్ భవదీయ సంజ్ఞకై
యేమఱ కుందు కేవలము నీ సుత భూపతి కింతి యైనచో. 1591

కం. భూమిస్పృశుఁడవు నీ వన
భూమీశుఁ డతం డనంగ బోటి నొసంగన్
భూమి సమస్తము నీ దగు
నేమున్నది పోవుటకును యిటునటుఁ జూడన్ ! 1592

కం. కులమా బలమా ధనమా
నిలబడ నీ కంటె మిన్న, నేరుపు మీరన్
చెలువము గని నీ కూతును
వలచెను కాబట్టి గాని వశమగు వరుఁడే ! 1593

తే.గీ. ఇన్ని చెప్పిన మౌనంబు నేలఁ దాల్తు
వాస్యమున నేల నానంద లాస్య మొదవ
దేల మాపైన నీ దృక్కు లింక నీవు
బదులు వలె నంచు మంత్రి యిబ్బంది పెట్టె. 1594

కం. విని విని విశ్వామిత్రుఁడు
తనువున నావేశ మంది తప్తుం డైనన్
చెనకగ సమయము కాదని
వినయమ్మున విన్నవించె విట్కుల పతియున్. 1595

కం. తమరు మహాత్ములు తమ వచ
నము లెల్లను నడపఁ దగిన నలువ పదంబుల్
సమవర్తి చక్రవర్తిని
మమ జామాతా యనుటకు మసలిక లేలా ! 1596

ఉ. మాకును కట్టుబాట్లు నియమమ్ములు నుండు కదా, యొకండనే
చేకొన రాదు నిర్ణయము, శ్రేష్ఠులఁ బెద్దలు రావలెం జుమీ !
ఏకము కావలెన్ పదియు నెన్మిది పట్టణ వైశ్యు లెల్లరున్
కైకొలుపంగగా వలయు కన్నియ పెండిలి మా కులమ్మునన్. 1597

వ. కుసుమ శ్రేష్ఠి వచనంబులం బ్రమాదంబు నూహించియు ప్రమోదంబుం బ్రకటించునటుల విజయసింహుండు తత్క్షణంబ పదునెనిమిది పట్టణములకు దూతలను బంపి పరివారంబు తోడ నచ్చోటనే వేచియుండె. 1598

***ఇది శ్రీవాసవీపురాణమునందు విజయసింహుని రాయబారమను యేబది యారవ అధ్యాయము సంపూర్ణము.***

(చిరమర= భేదము, కామదుడు= అడిగినవెల్ల ఇచ్చువాడు, నలువ పదములు= బ్రహ్మ వాక్కులు)



# ఏబదియేడవ అధ్యాయము

**కం. తర్కాతర్క విదూరా !**
**తర్కాది సమస్త శాస్త్ర దర్శన చారా !**
**కర్కశ దనుజ విదారా !**
**అర్కాది సమస్త తార కాధార భరా !**

కం. మీఁదట సాలంకాయనుఁ
డాదట వైశ్యార్థనీయు లందరి మధ్యన్
మేదిని నేలెడు సచివుల
వాదములం దెలియఁ జెప్పె వా చవు లూరన్. 1599

కం. పదు నెనిమిది నగరములను
పొదలిన విశ వంశ వరులు భూపతి భృత్యుల్
విదితముఁ జేసిన పని విని
పొదిగొని పెనుగొండ పురము పొలిమేరఁ జనన్. 1600

తే.గీ. వచ్చినారన్న వార్త లా వైశ్య నగర
వాసులకుఁ జేర లేదు పైవార లేగి
స్తోత్ర పాఠంబులం బల్కి మాత్ర లొసఁగి
హెచ్చు మర్యాదలను జేసి తెచ్చినారు. 1601

ఉ. వచ్చిన వైశ్య వర్యులను వైశ్య విభుం డెదురేగి సందిటన్
గ్రుచ్చి యొకక్కరిం గొలిచి కూరిమి నాదర మొప్ప వారలం
దెచ్చి సభాంగణ మ్మమరు దివ్య భువిన్ నగరేశు తూర్పునం
దెచ్చిఱు మండపంబున వసింపగఁ జేసెఁ బ్రదక్షిణంబులన్. 1602

తే.గీ. విశులు సచివులు వరలిన వేది నలరు
నందరికి మ్రొక్కి వందన మాచరించి
తనదు విన్నప మాలించి తగవుఁ జెప్పుఁ
డనుచు మొదలిడెఁ గుసుముండు నార్య సభను. 1603

చం. కులమున నింత దాఁక మన కూతురు నన్యున కీయలేదు నే
డలకని ధర్మ సందియము నందగ నంతటి చక్రవర్తియే
వలచి వరించి వచ్చెఁ దన వారగు మంత్రుల రూప మందు నా
కలిమినిఁగోరి– యేమనఁ బ్రగల్భులు మీరు వచింపుడీదయన్. 1604

వ. విట్టితి వాక్యంబుల వినుచుఁ గుపిత మానసులైన వైశ్య ప్రముఖులు గరం బుల గర్ణంబు లదుముకొనుచుఁ గెంపు లగుచున్న కన్నుల నమాత్య ముఖంబులం గనుచు. 1605

ఉ. ఎక్కడ దుష్ట శిక్షణకు నిష్టుల శిష్టుల రక్షణంబుకున్
దిక్కగు వర్ణ ధర్మ సుర ధేనువు చంద్రకు లాధి నాయకుం
డెక్కడ చింతపండు గుడ మేలకు లాదిగ తూచి యమ్ముటల్
దిక్కగు కోమటీంద్రు– వలదే మనువంద సమానతూకముల్ ? 1606

సీ. మ్రానులం దెగ మ్రింగు మదపు టేనుగు తోడ
చివురులఁ దిను జింక చెలిమి తగునె !
కలుముల చెలి నేలు కలవానితో పొందు
కటిక దరిద్రున కెటులఁ గలుగు !
తన వారిపైఁ గూడ దయ లేని వానితో
నమిత దయాళున కరితి తగునె !
వేదాదులను నేర్చి విద్వాంసుఁ డైన వా
డెటుల మూర్ఖుని తోడ నెలమి నెరపు !
తే.గీ. బలిమి శాంతుండు ముక్కోపి కలియ గలరె !
ధాత్రి విల్లమ్ములను దాల్చు క్షత్రియులకు
బ్రతుక దండ తక్కెడఁ దాల్చు వైశ్యులకును
పొందు పాపమ్ము – శివ శివా ! – పొసగ దయ్య. 1607



వ. అంతయువిన్న సచివాగ్రణి విజయసింహుండు లేచి యిట్లనియె. 1608

చం. ఇలువడి సొంపులం దరుణు లెందరు లేరు ధరా తలమ్మునన్
వలచెను గాన మా ప్రభువు వచ్చితి మింతకుఁ జుల్క నైతిమా !
బలమున నింద్రుఁడై వెలుగు భవ్య చరిత్రుఁడు చక్రవర్తికిన్
పెలుచన కల్ములందున కుబేరులు మీకును పొందు చెల్లదే ? 1609

తే.గీ. మంచి వాల్లభ్యమును గల మనుజ పతికి
మంచి వర్తనమున మీదు మానవతకు
వనమునకు వసంతున కున్న వావి వరుస
లమరు శోభన మవునన రయ్య మీరు. 1610

వ. అనవుడు మౌద్గల్య ఋషి వంశ సంజాతుండును మునికుల గోత్రోద్భవుండును ధర్మాత్ముండును సత్య సంధుండును నైన మౌళిశిష్టుం డను వైశ్యుండు లేచి విజయ సింహుని గని నగి. 1611

శా. జీవింపం దగు కర్మ విత్త కృషులన్ జీవించు నాయుష్యమున్
జీవాళిన్ సృజియించు వేళ విభజించెన్ బ్రహ్మ సర్వమ్ము నం
దా వాలాయము మీకు మాకుఁ గలదే ? ఆలించిరే క్షత్రియుల్
మావైశ్యాంగనఁబెండ్లి యాడుటయు మున్? మాటాడనేవచ్చిరే !1612

వ. మీ వాక్యంబులు హాస్యాస్పదము లిట్టి వృత్తాంతం బెందును జూడము వినము – అనుచు యుక్తి యుక్తంబుగఁ బలికి కూర్చుండ విక్రమ సింహుండను మంత్రి వర్యుం డిట్లనియె. 1613

శా. ఏమీ మీకిల చంద్ర వంశమనగా హీనంబుగాఁ దోచెనా ?
కోమట్లెంత తపంబుఁ జేయవలె నా కుందేందు గోత్రంబునన్
లేమన్ దానము జేయ ! మీ కులము ప్రాలేయాపగన్ జేరు నా
రామ హ్రోదిని భంగి దివ్యమగుఁ గౌరవ్యంబు మన్నించుచో. 1614

వ. నావుడు నాభీల గోత్రజుండైన మౌద్గల్యఋషి వంశజుండు మర్త్యలశిష్టుండు లేచి కోపంబున. 1615

శా. ఓయీ మంత్రి వరేణ్య ! క్షత్రియులతో నొప్పారు సంబంధ మం
టే యా కీర్తి కిరీటమే వలదు పాటిం జేయ దెండాకుకున్
మోయంజాలము చెడ్డ పేరు పదవీ మోహంబునం బాపమున్
జేయంజాలమ దింద్ర పీఠ మయినన్ జేదౌను మాబోంట్లకున్. 1616

వ. అనుచుఁ దన యభిమతంబుఁ దెలిపిన విక్రమసింహుం దరుణితాక్షుండై శ్రేష్ఠుల కంపితులంజేయుచు నిట్లనియె. 1617

ఉ. పేరుకు శ్రేష్ఠులా తమరు ! పెండ్లి విధాయకమే యెఱుంగరా ?
పాఱులు నాల్గు వర్ణముల భామల పెండిలి యాడరే ! అదే
తీరున క్షత్రియుల్ మువురు దేవుల మూడు కులంబులందు నిం
పార వివాహ మాడదగు నయ్యది ధర్మ మనాదిగా యిలన్. 1618

తే.గీ. అంత యాజ్ఞవల్క్యస గోత్రుఁ దారశిష్ట
కుల వరీయుఁడు దీనానుకూల ఘనుఁడు
పారద శ్రేష్ఠి లేచి యా పార్థివేయుఁ
బాఱఁ జూచుచు నయమున బలికె నిటుల. 1619

తే.గీ. ఇట్టి పద్ధతి భూమియం దెచటనైన
జూడలే దెందు వినలేదు చూపు మిపుడు
యోగ్య ధర్మ శాస్త్రమునైన యుక్తినైన
నున్నచో నిచ్చెదము కన్య నుర్విపతికి. 1620

వ. అనుచు వాదించి కవ్వించు పారదుఁ గని కుపితుండైన విజయసింహుండు పరిహసించుచు. 1621

ఉ. చూపెద నోయి వైశ్య ! మును శుక్రుఁడు కూతురు దేవయానినిన్
భూపు యయాతి కిచ్చినది బూటకమౌనె? ఇదే కులమ్మునన్
భూపతి యాంబికేయునకు భూస్పృశులెల్ల కుమార్తె నీయరే !
పాపనిగా యుయుత్సుఁడు ప్రభావము నొందదటోయి పారదా ! 1622

వ. అప్పటి వారికొప్పిదంబు నిప్పటివారికి తప్పిదం బెట్లగునన మైత్రేయ గోత్రంబున మద్దికుల సంభవుండైన నాగశ్రేష్ఠి లేచి ఫక్కున నవ్వుచు నయ్యా మంత్రి వర్యా మీ విక్రమసింహులు ప్రవచించిన ధర్మంబున కిది యపవాదంబగు నా ప్రకారము క్షత్రియుండు బ్రాహ్మణ కన్య నుద్వాహంబగుట యుక్తంబు కా దదియు నుంగాక. 1623

ఉ. తప్పులు నొప్పులౌను దురితమ్ములు సత్కృతులౌను అల్పముల్
గొప్పలుగా రహించు ననఁ గూతురు పెండ్లి మహర్షి చేతలం
దొప్పగుఁగాదె ! రాక్షస గురూద్వహ శాపము నంది కాదె యా
తప్పునకియ్యకొంట? యిక తప్పు విశాలిది, ముప్పు మీకయెన్? 1624

వ. ఆ తప్పునకాదె కౌరవ వంశ వినాశనము యుయుత్సుని పాండవపక్ష విలీనము నన నమాత్య శ్రేణి యందున ప్రత్యుత్తరంబు లేమి శ్రీవత్స గోత్రుండును శ్రీల కులోద్భవుండునగు సోమశిష్టుండు లేచి. 1625

ఆ.వె. దారిఁ బోవు వాడు ధనగిరి పెనుగొండ
కాంచినంత కాలు కదప లేక
పెళ్ళి పేర రాజు మళ్ళింపఁ దలచెనో
యిత్తు మిపుడె మీర లెత్తుకొనుడు. 1626

వ. అంతియ కాని మా చిట్టితల్లి వాసవి నాశించి మా కుల మాకుల మొందజేయకు డనుచుఁ బ్రార్థింప విక్రముం దత్యంత పౌరుషంబున దోకఁ ద్రొక్కిన త్రాచువలె లేచి. 1627

భుజంగప్రయాతము.
ఒరే మూర్ఖ! మీ వద్ద నున్నంత నెంతౌ
నురా? అంతయుం జేరి నూవంతయుం గా
దు రారాజ కోశంబుతో పోల్చ, మా కే
లరా మీ ధనంబుల్ ప్రలాపీ కిరాటా ! 1628

వ. రత్నాకరంబగు సింధువున బిందువంత లేని మీసంపద మా కెందులకంచు గద్దింప నంతదనుక రాజ సచివాలాపంబు లాలకించియు మౌనంబుననున్న సనక సనందనగోత్రంబున సానకులోద్భవుండైన హరిశిష్టుండు మైత్రేయస మద్ది కులోద్భవుండైన గురుశ్రేష్ఠింగూడి దుర్వాక్య శ్రవణ క్రోధాద్భ్రుకుటీ కుటిలాననుండై. 1629

మ. అకళంకేందు కులామృతాబ్ధి జననంబందెన్ విషం బట్లు వం
శ కళంకుం దన విష్ణువర్ధనుఁడు, వంశ స్వామి చంద్రుం డెకా
యెకి తల్లిన్ గురుపత్నినే వలచె నింకేమందు నీ వంశమున్?
మకుటంబంతయు మచ్చలేగద పురామంత్రమ్ము శోధింపగన్ ! 1630

ఆ.వె. ఇట్టి వంశ మందు పట్టి నిచ్చుట కన్న
నమల జనుల కాత్మహత్య మేలు,
వట్టి మాట లేల పట్టి నీయగ లేము
వదలి పొందు మమ్ము వందనమ్ము. 1631

ఆ.వె. అనుచు మందలింప నగ్ని కీలగ లేచె
మంత్రి విక్రముండు మండి పడుచు
సామ దాన భేద సాయకమ్ముల వీడి
దండ మందుకొనుచు తాండవించె. 1632

ఉ. ఓరి కిరాటులార మము నోటరు లంచుఁ దలంచినారొ మీ
భారము మోయువారెవరు? వర్తక వృద్ధుల రక్షణంబుఁ జే
కూరగ లాభముల్ బలిసి కూర్చొని బొజ్జలు పెంచినార లా
భారముఁ దీతు మీరిటుల భవ్య మృదూక్తి నిరాకరించుచో. 1633

తే.గీ. మంచిగా మాటలాడిన మాట వినరు
మంకునకు దండ మొక్కటె మంచి మందు,
వాసవిని బట్టి యిప్పుడే వధువుఁ జేతు
మెవ్వ రడ్డం బనుచుఁ గాలు ద్రవ్వె నంత. 1634

ఆ.వె. బుద్ధి నిపుణులైన సిద్ధ వైశ్యులు లేచి
రాజ సచివులార రచ్చ యేల
సమయ మిందు కొంత చర్చించుకొని మేము
చెప్పెద మన వార లొప్పుకొనిరి. 1635

వ. అంత పెద్దలగు కొంద ఱేకాంత ప్రదేశమున కేగి . 1636



సీ. జనకుని కూతురు జానకిం గొంపోయి
రావణాసురుఁ డేమి రహిని గాంచె
యజ్ఞ సంభవ ద్రుపదాత్మజం గామించి
కీచకుం డెంతగా కెరలు వొడిచె
నలపత్ని దమయంతి నడికానఁ జెఱవట్టి
దుష్ట కిరాతుఁడే తోషమందె
వరపుత్రి మన కన్య వాసవిం గొంపోవ
విష్ణువర్ధనుఁ డంతె విజయ మందు
తే.గీ. నెట్లు ఘటియిల్ల నున్నదో యట్లె యగును
రాజు బలవంతుఁ డెదిరించ రాదు మనకు
కన్నె నెత్తుకు పోవు కాదన్న గాని
మంచిగా పల్కి యిపుడు పంపించ వలయు. 1637

వ. అనుచుఁ గొంత వడి చింతించి నిర్ణయించి మంత్రి మండలి కడకేతెంచి తమ యభిమతంబు దెలుప రాజ దర్శనంబు గావలయునన వారును తమ స్థావరంబునకుఁ దోడ్కొని పోయి రాజ సముఖంబున నిలుప నతండును వైశ్య శ్రేష్ఠుల నుచితాసీనులఁ జేసి సత్కరించి ప్రియంబు సలుప. 1638

కం. కుల పెద్దలు కువలయ పతి
కలవరమును బాపుట కన గన్యక నీయం
దలచితిమి పెండ్లి పనులకు
వలయును సమయం బనంగ వసుధేశ్వరుఁడున్. 1639

తే.గీ. వల్లె యనె నైన మామీద వెల్లి విరియు
కూర్మి పెంపార మా యింటఁ గుడిచి పొందు
తనివి తీరును మాకెల్ల ననిరి విశులు
అందుకును వల్లె యని పంచె నవని విభుఁడు. 1640

***ఇది శ్రీవాసవీపురాణమునందు వైశ్య సచివ సంవాదమను యేబదియేడవ అధ్యాయము సంపూర్ణము.***

## ఏబది యెనిమిదవ అధ్యాయము

**కం. హిమవత్ కృపా కటాక్షిణి !**
**హిమవన్మహిమా హిమాద్రి ! హిమ హేమాద్రీ !**
**హిమకర భాసిత వదనా !**
**హిమ సదనా ! హిమ హిమాని ! హిత భద్రాద్రీ !**

కం. కోమట్ల మాట నమ్మిన
కామాతురుఁ డంత చెంత కన్యక వధువై
కామించి నట్లు కలలన్
వేమారు రమింప సాగె విడిది గృహమునన్. 1641

తే.గీ. అచట విష్ణువర్ధను రాక నార్య వైశ్య
తర్క చింతన చారు లుదాహరింప
భాస్కరాచార్య లద్దాని భావిఁ గనియె
దివ్య దృష్టిని, హృదయంబు తేమగిల్లె. 1642

తే.గీ. చూడ వచ్చిన మాత్రాన చుమ్మచుట్లు
విందు రుచిగొన్న నింకెంత వేదనంబొ
వృద్ధ వైశ్యుల మతి లేని బేలతనము
నూహఁ జేసిన గురువర్యుఁ డుదరి పడియె. 1643

ఉ. వైశ్యులు, విశ్వజీవిక కవశ్యము తోడ్పడువారు, వారిదౌ
కాశ్యపిదేహమున్ పసిడికాంతుల నింపెడి సొమ్ము ఁతేనిచే
స్పృశ్యము నింద్యమౌ ననెడు భీతి మనంబున రూపుఁ గొన్న యా
వైశ్య పురోహితుండు తగు వారిని బంపెఁ బరిష్కరింపగన్. 1644



ఉ. వచ్చిన విప్ర సత్తములు వైశ్య పురంబగు జ్యేష్ఠ శైలముం
జొచ్చి యువ ప్రయోజకులఁ జూచి వచించె గురూపదేశమున్
బచ్చుల వంశ గౌరవము బార్థివ పాలసు గౌరవింపగాఁ
బుచ్చుకు డంచు వాని సరిపుచ్చి నెపంబిడి త్రిప్పి పంపగా. 1645

తే.గీ. బాలనాగరు లనబడు వైశ్య యువకు
లార్య గురుదేవు సందేశ మాత్మ నిలిపి
విప్రులం బుచ్చి యోచించి విష్ణువర్ధ
ను కడ కేగి వినయమున నుడివి రిటుల. 1646

ఉ. ఓ మహనీయ రాజ! సకలోర్వి జనప్రియ సద్గుణ ప్రభా
భ్రామల తేజ రాజ! నిజ రాజ్య రమా హృదయామృ తార్ద్ర సు
త్రామ లతా విరాజ! రిపు రాజ్య వనీ హృదయ శ్లథ క్రియా
భీమమృగాధిరాజ! మము భీతిలు విణ్ణికరమ్ముఁ గావవే ! 1647

తే.గీ. వియ్య మందగ వచ్చితి వయ్య నీవు
నెయ్యమును గోరి నచ్చితి మయ్య మేము
తొయ్యలిని నీవు నిజముగ నియ్యకొన్న
వయ్య మనబోక నార్యోక్తి నియ్యకొనుము. 1648

కం, కతికిన నతుక దని కలదు
హితవరుల యనుభవముల నిహిత పదముల యం
దతిపథము లవి మనకుఁ జన
మతియుతుఁడవు నుడువ వలెనె మనుజాధీశా ! 1649

తే.గీ. బాల వచనమ్ములను విన్న ప్రభువు నోట
మాట రాలేదు ముఖమంత మత్సరించె
నలుక పెనఁగొనఁ గినువడి పలుకు మిగిలె
మతకరులు మీర లవి మాయ మాట లనుచు. 1650

ఉ. వర్తకు లన్న పల్కెడి దబద్ధము సిద్ధము లోక మందు స
ద్వర్తన మద్ది మీకు కుల వర్ధక ధర్మము కాని మా యెడన్
ధూర్తుల చర్య మానుడిక దోయిడి చేతులఁ బోము మామకా
వర్తన మన్న వాసవి వివాహము తోడనె కొండు పొండనెన్ 1651

వ. అంతఁ గార్య భంగంబునకు వెఱచిన బాలనాగరు లెల్లరు మిన్నకుండ నందుండి కార్య కుశలుండును వాగ్మి శ్రేష్ఠుండును కాలత్రయ విదుండును నగు ధన్వి యను వైశ్య దారకుండు ధైర్యంబు వహించి ముందునకుం జని భూపతిం జూచి. 1652

ఉ. దబ్బర లాడగా నెటుల ధైర్యము చాలును మాకు మీ వలెన్
నిబ్బర ముండునే పలుకు నిక్కము నీయెడ మా కులాగ్ని నీ
పబ్బము దీర్చు లేని యెడ ప్రాణము లిత్తుము తల్లి తోడు యే
సెబ్బర రాక యుండు మును జేరుము నీ పురి మేలు గోరినన్. 1653

తే.గీ. పెండ్లి యనుకొన్న తరువాత పెండ్లి ముందు
వియ్య మందెడు వారింట విందు గుడువ
పెండ్లి చెడిపోవు నది మాకు పెద్ద శాప
మట్లు జరుగుట మీ కిష్ట మగునె చెపుమ. 1654

తే.గీ. ప్రొద్దు పడమటి కొండను పొడుచు గాక
కనకగిరి పాదు కదలిన కదలు గాక
నింగి పడుగాక నీరధుల్ క్రుంగు గాక
ఆడి తప్పము జనపాల నేడు పొమ్ము. 1655

చం. కులగురు విందు రావలయు కూర్చొని మంచి ముహూర్త నిర్ణయా
కలనము జేయగా వలయు కన్యక చిత్తము దేవర ప్రభా
నిలయము జేయగా వలయు నేర్పున దీరిచి లగ్న పత్రికన్
తులుచన దెత్తుమయ్య పరితోషము గూర్ప విరామ మీవలెన్. 1656

వ. కాల హరణంబున కిట్లనుచు మా వచనంబులఁ బాటింపమేని. 1657

సీ. పసిడి దొంగలకును బ్రహ్మ హంతలకును
మద్యపానమున నున్మత్తులకును
గురుసతీ మతులకు కొండియ కాండ్రకు
తస్కరులకు లుబ్ధ తప్పులకును
గృహ దాహకులకును కుహక ధార్మికులకు
వేద వైదిక దైవ విద్విషులకు
పర సతీ రతులకు పర ధనాహర్తల
జూదగాండ్రకు దొంగ జోగులకును
తే.గీ. నెట్టి దుర్భర గతి కల్గు నట్టి గతిని
పొందెదము సూర్య చంద్రులు భూమి నభము
జలము ననిలానలాదుల సర్వమందు
వ్యాపకాత్మ స్వరూపుఁ డీశ్వరుఁడు సాక్షి. 1658

ఆ.వె. రాజరాజ నీవు రాజధానికిఁ బోయి
వేచి యుండు మయ్య వేడ్క మీర
వచ్చి పిల్తు మీ వివాహపు టేర్పాట్లు
పూర్తిఁ జేసి యెడద పూర్తి గాను. 1659

కం. అని పలికిన విని భూపతి
యును విట్యువగణము నమ్మి యూపోపదుఁడై
మనుజులు ప్రియ వచనములకు
తనువులు మరచుదురు కాదె తబ్బిబ్బగుచున్ 1660

ఉ. నమ్మిన చక్రవర్తి వదనమ్మున సమ్మతి తాండవించగా
నిమ్ముగ నొక్క రొక్కరిని నేఁకటఁ గాన్కల సత్కరించి గా
రమ్ము ఘటించి పంపె ననురాగ మెసంగగ, బాలనాగరా
స్త్రమ్ము ఫలింప వారును గృతార్థుల మైతి మటంచుఁ బోవగా. 1661

చం. యువకుల బంపి పార్థివుఁడు యోధ పటాలము వెంట రాగ రా
ఘవఁ గదలించె నిండు మది నూతన చేతన కోర్కు లీనగా
భువనము నేలు మోజు విశ పుత్రిక నేలుచు నిల్లు జేరినన్
రవణము రాణివాసమును రాజ్యము నొల్ల దదేమి చిత్రమో ! 1662

ఆ.వె. చంద్ర వంశ మందు శంతనుం డను రాజు
రామ కొఱకు రాజ్య రమను వీడి
క్షోభ మందె నెపుడొ క్షోభించె వంశంబు
మరల నిప్పు డితఁడు బరగె నటుల. 1663

ఉ. చేయడు భోజనమ్ము కయి సేయడు సొమ్ములు మేన స్నానమున్
జేయడు చెంతఁ జేర సడి సేయడు చేయున దొక్కటే సదా
ప్రేయసి నామ చింతనము బెండ్లి ముహూర్తము నిర్ణయించి వా
ర్తా యుతులై విశాత్మజులు దాపుకుఁ జేరెడు దిక్కుఁ జూచుచున్. 1664

***ఇది శ్రీవాసవీపురాణమునందు బాలనాగరుల రాయబార విజయమను యేబదియెనిమిదవ అధ్యాయము సంపూర్ణము.***

(చుమ్మచుట్లు= కడుపులోని వేదన, ఉదిరిపడు= అదిరిపడు, సరసీరుహ వేశ్యలు= తామర పూవు ఇల్లుగాగల బ్రహ్మలు, పుచ్చకుడు= పోనీయకుడు, ప్రభాభ్రామలతేజ= కాంతి అనే ఆకాశమువలె శుభ్రతేజము కలవాడా, వయ్యము= వ్యర్థము, అతిపథము= మంచిత్రోవ, దోయిడి= శూన్యము, దారకుడు= బాలకుడు, తులుచన= వెంటనే, యూపోపదుడు= యాగములలో పశువులను చంపు కొయ్య కానుకగా కలవాడు)



# ఏబది తొమ్మిదవ అధ్యాయము

**కం. కదన కుతూహల రాగా !
పద కదన కుతూహలాంగ పాటవ కరణా !
కదన కుతూహల శోణా !
కదనాంగణ వైరి వీర ఖండన నిపుణా !**

తే.గీ. విష్ణు వర్ధను ననునయ విన్నపముల
నగరి కంపిన విశ బాల నాగరులును
తిరిగి పెనుగొండ నగర మందిరము జేరి
యందు మ్రొక్కిరి తమ పెద్ద లందరకును. 1665

చం. మొగమున పోఁడి పొన్పడిన మూథులవోలె తపించు వైశ్యులా
మొగముల వెల్గులోన మొగమోడుచు మోముల నెత్తి చూడగా
మొగసల గెల్పు మోముల విమోహము గప్పెను, ముక్త చింతచే
మొగములు కాంతులీన తమమొగ్గల గ్రుచ్చి కవుంగలించుచున్. 1666

ఆ.వె. ఏమి జరిగె నయ్య ? ఏమాయె మారాజు ?
ఏమి చెప్ప వినుచు నేగినాడు ?
ఏమి మంత్ర మద్ది యెఱిగింపుడో పుత్రు
లార మాకు వీనులార వినగ ! 1667

కం. అంతట జరిగిన విషయం
బంతయు నెఱిగించె వార లంతయు విని తా
మంతకుపురి జని వచ్చిన
సంతోషం బాత్మ నెగడ సంస్థిత మతులై. 1668

వ. భాస్కరాచార్యుల నర్చించిన నతండును కుమారుల దీవించెనంత నెల్లరును గృహంబులకుంజని భోజనాదులఁ దృప్తినంది కొండొక తడవు విశ్రమించిన యనంతరంబు నగరేశ్వరస్వామి మంటపంబును జేరి యాచార్యుల కెఱంగుచు నిట్లనిరి. 1669

ఉ. ఆపద తప్పి పోయినది, ఆనక చేయునదేమి ? చెప్పగా
నోపిన వారు మీరు పురుషోత్తమ ! ఉత్తమ మార్గమేదొ, ఆ
భూపతి బారినుండి మము బ్రోచెడి భారము మీయదే కదా,
చూపుడు దాన బోయెదము, చోదిత వైశ్య కులార్ణవాధిపా ! 1670

తే.గీ. వృద్ధ వైశ్యుల పలుకులు వినుచు గురుఁడు
దేవ గురువును బోలిన ధిషణ తోడ
దివ్య దృష్టిని పరికించి తెలిపె నిట్లు
దారి తెలియక విలపించు వారి కపుడు. 1671

శా. ఓ వైశ్యోత్తములార ! ఇప్పుడిక మీ యూరవ్వులన్ జ్ఞాతులన్
కైవారంబులఁ బిల్వనంపి తగు ప్రాకామ్యంబులన్ దేల్చి నా
డీ వార్తన్ వినిపింపు డానక మతంబేమౌనొ దానిన్ తులా
జీవంబైన గ్రహింపుడీ మనుపుడీ చిర్నవ్వులన్ దూతలన్ ! 1672

వ. నలుబది ప్రవరలు గల భార్గవ ఋషిగణమందలి రెండు వందల గోత్రములవారికిని, ముప్పది యారు ప్రవరలు గల శాండిల్య ఋషిగణమందలి రెండు వందల యేబది రెండు గోత్రముల వారికిని, ద్వార్షేయ త్రయార్షేయ చతురార్షేయ దశార్షేయాదులైన ఇరువది యైదు ప్రవరలుగల ప్రభాత ఋషిగణ మందలి అరువదియారు గోత్రముల వారికిని, కాశ్యప ఋషిగణమందలి నూటతొంబది యాఱు ఏకార్షేయ గోత్రముల వారికిని శీఘ్రముగ నాహ్వానము లంపింపుడన నా వైశ్య శ్రేష్ఠులును ప్రభాత రశ్మివంత మాండవ్య మదనాంగీరసాఖండలక విడిమ్మీర నఘోటక తుందిల తుహినాహార చరణత్రయ చండిక పౌండ్రిక దేవల ధార్మిక మైత్రేయ మంజుళముని గోత్రజులకును, సనక సనందన నారద గోత్రీయులకు, నూర్మి గోత్రులిరువురకును, సుదంక మరు నంజ్ఞిక కాశ్యప కల్మాషపాద గోత్ర ప్రవర్తకులకును, దత్తాత్రయ ధాతృక చ్యవన జహ్ను ముక్తిప్రద నిరతమ మౌద్గల్య పౌతిమాష్య గౌపవన గౌతమాయన గోత్రజులకును, సైతవ గార్గ్యాయన పారాశర్య యాజ్ఞవల్క్య యాజ కాఘుహారిస గోత్రజులకును, పౌండ్రక పురుకుత్స పుష్పదంతాది గోత్రీయులకును, చిత్రక చిత్ర చిత్రగుప్త వామన వామదేవ వాయువ్యస్యస గోత్రీయులకును, చతుష్కర్ణ చరమతత్వ చలితవ్రత గోత్రజులకును, నింద్రద్యుమ్న జాబాలాయ నోద్ధారకాయన మాధ్యందిన సౌకరాయన సాయకాయన గోత్రజులకును, కాషాయన కౌశికాయన బాష్కళాయన పారాశర్య పావనత్రయ గోత్రోద్భవులకును, హరి తోద్వాహ కంబుగ్రీవ గోవ్ర తోత్తమ పారద పల్వల సక్తుప్రస్థ భీషణ విజయకర్ణక నాచికేత పులస్త్య సూనృత గోత్రీయులకు, గౌతమ భార్గవ జైమిని మతంగక ఘృతకౌశి కాసురాయ ణాయాస్క స్త్రైవణి గోత్రజులకును, ప్రీతమానస పరమతత్వక విశ్వామిత్ర స్సుతీక్ష్ణ కనకపాలక సనస్సుజాత సంవర్తక గోత్రజులకును, తుంబుర పేశల వరుణ కృత్స్నద కపిల సాందీప నాపస్థంబ మందపాల భారద్వాజస గోత్రజులకును, బృహదశ్వ ఋశ్యశృంగ వాలఖిల్య కూర్మ కాజంధన సాపజంధనిస గోత్రజులకును, ఆసురీ మాందీస కైశోర్య కాప్య ముద్గల గోత్రజులకును, మార్కండేయ మంజుప్ర తాపున్వ శాండిల్య శమీక శ్రీధర గోత్రీయులకును, పవన ప్రమద ఘటోద్భవ రైభ్య హరివక్త్ర వేదనిధి పవిత్రపాణి కౌండిన్య భృగు గోత్రజులకును, అక్షయాక్షో బోధాయన పిశంగళ సత్యవ్రత మహాసేన కౌత్సుక కాముకాయన స్థూలశీర్ష గోత్రజులకును, కృష్ణద్వైపాయన కుమారహరీత కుమార గోత్రజులకును, విదర్భ కౌండిన్య వత్సపాల బార్భవ పథ సోహార మాధవ ముచికుంద శరభ గోత్రీయులకును, ధౌమ్య తుర్యవ్రత మౌసల హయగ్రీవ శక్తి పావన విష్ణు గోత్రజులకును, వర్ధన జాతవేద శుక గార్గ్య కృష్ణ కాయా స్యాంగీర సాభూత త్వష్టక విశ్వరూ పాశ్వి గోత్రజులకును, దధీ చ్యధర్వణ మృత్యు ప్రధ్వంసన మరీచి బృహస్పతి వశిష్ఠ పుండరీక గోత్రజులకును, త్రిజల కాంచన శౌనక విప్రచిత్త వృష్టి కల్మాష స్వయంభూ పరమేష్ఠీ సనారు సనాత నాశ్వలాయన విష్వక్సేన గోత్రజులకును, జాబాలి శార్‌జరవ మునికులజులకును, సకల వైశ్య బృందమునకు నాహ్వానములంపుచు దూతల కిట్లనిరి. 1673

ఆ.వె. మారుమాట లేక మాన్య వైశ్యుల నెల్ల
గురువునాన విషయ గురుత గాంచి
సభకు రమ్మటంచు స్వాగతంబులు వల్కి
వెంటబెట్టు కొనుచు వేగ రండు. 1674

వ. అనుచు వచింప దూతలును వారివారి నిర్ధారిత దేశంబులకు పయనమైరి. 1675

***ఇది శ్రీవాసవీపురాణమునందు కుసుమశ్రేష్ఠి వైశ్యులందర నాహ్వానించుటయను నేబదితొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము.***

(పోఁడి పొన్పదు= నిస్తేజమగు, మొగమోడు= సంకోచించు, తులాజీవము= గౌరవముగా బ్రతుకుటకు తగిన పద్ధతి)



# అరువదవ అధ్యాయము

**కం. అరి మానస దుర్గంధో**
**త్తరణ ప్రక్ష్వేళనా ప్రదర్శిత విభవా !**
**హరి హర హిరణ్య తుందిల**
**శరణీయ విభూతి సాంద్ర చరణ ద్వంద్వా !**

కం. దూతలచే లేఖలు గొని
దూతల వచనముల వినుచు తోషిత మతులై
వ్రాతలఁ జర్చించు కొనుచు
దూతల సెలవొసగి వారు తోడం గదలెన్. 1676

సీ. సత్యమ్ము ధర్మమ్ము సమదీక్ష పాటించు
మాండవ్య మదనర్షి మహిత గోత్ర
ముల మన్యు మానాభ మునికులమ్ముల నుండి
గోవింద గోపసిం హావితథులు
నత్యధికు లైనట్టి యంగిరోఽ ఖండలా
ఖ్యులయొక్క గోత్రోద్భవులు, ప్రసిద్ధు
లనుపాల యనపకు లాన్వయులును, కంపుఁ
డను శంభు గోత్ర కంకాన్వయుండు,
తే.గీ. నిచుల గోత్రజుఁ డైనట్టి నింబుఁ డనఁగ
కమ్ర వంశోద్భవుండును కలసి పదునె
నిమిది గణముల వారలా నిముషమందె
వచ్చి రేలాపురము నుండి వాజులెక్కి 1677

సీ. గణపతి గోత్రుండు ఘంటకాన్వ యుఁడైన
బీద బాపల మొక్కు భీమ శ్రేష్ఠి,
గంటుకాన్వయ మందు గని దాన ధర్మాల
శార్జరవ గోత్రుండు శంకరుండు,
కాశ్యప గోత్రుండు కవటాకు లాక్షుండు
శరణాగ తేష్టుండు శంభు శ్రేష్ఠి,
కౌశికాయన గోత్ర కాకోల వంశుండు
బంగారు వస్త్రాల బభ్రు వరుఁడు,
తే.గీ. వసువు గోత్రంబు గోధన్య వంశము వసు
మంతుఁ డనెఁడు గోదాన నిరంతరుండు
పదునెనిమిది గణంబులు పల్లకీల
వీరనారాయణ పురంబు వీడి రాగ. 1678

సీ. గోవ్రత ఋషి గోత్ర గోశీల కులజుండు
సత్య ప్రియుండగు సాంబ శ్రేష్ఠి,
రాణ పులస్త్య గోత్రము పున్నశీల వం
శము ధర్మ గుణశాలి శంభు శ్రేష్ఠి,
మందార గోత్రంబు మందార నేత్రుండు
పంక వంశోత్పన్న మంక శ్రేష్ఠి,
వారి చుట్టపు వారు వణిజ శ్రేష్ఠులు ముప్ప
దొక్క గణంబులు నొక్కటగుచు
తే.గీ. రాజు కోరికయును తమ రాజు తగవు
తలచి తర్కించు కొనుచు రాఁదగిన వాహ
నముల నెక్కుచును విశాల నగర మందు
నుండి కదలిరి వెసఁ బెనుగొండ జేర. 1679

సీ. వైరాజ ఋషి గోప వంశోద్భవులు మధు
మాధవ గర్గి రమా ధవులును,
సద ప్రియవ్రత గోత్ర సంజాతుఁ డైనట్టి
ప్రఖ్యాత పద్మాఖ్య పరిషదుఁడును,
పరమతత్వస గోత్ర బడిపెద్ది శిష్టాన్వ
య హరి విశాలాక్షు లనెడు వారు,
ప్రీత మానస గోత్ర పేరిశిష్టాన్వయం
బున కృష్ణ మంగళు లనెడు వారు,
తే.గీ. సర్వ సంపన్ను లైనట్టి సత్య వ్రతులు
ముప్పదెనిమిది గణముల నొప్పువారు
శివపురము నుండి మంగళ రవము లెసఁగ
నెడ్ల బండ్లెక్కి వచ్చిరి యెదలు బొంగ ! 1680

సీ. చాండిల్య గోత్రుండు సత్యవాక్పాలుండు
చిని వంశజుఁడు భద్ర శ్రేష్ఠి యనఁగ
ముని శమీకుని గోత్రమున మేటి శిరి వంశ
పావకుండైన సుభద్రుఁ డనఁగ
శ్రీధర గోత్ర శిరీష వంశోద్భవుం
డైన ముఖ్యుండు రుద్రాఖ్యుఁ డనఁగ
మాగధ భర్గర్షి మాళవ గోత్రజుల్
నంది కాంపిల్య సునంది వంశ
తే.గీ. ములను బుట్టిన వారైన ముని కపర్ది
సూరిశిష్టుఁడు కాళింగుఁ డూరుజులగు
నలుబది గణంబు లాచంట నగరమందు
బయలు దేరిరి సంతోషవంతు లగుచు. 1681

సీ. ధనద పురాధ్యక్షుఁ డన మహాతేజస్స
గోత్రుండు నిక్ష్వాకు కుల విభుండు
మాధవ శ్రేష్టియు మఱియు నాగ శ్రేష్ఠి
గురుశిష్ట, కాల, భద్ర, రుచిగుప్త
లగ్రజన్ములఁ గూడి యరుగు దెంచుచు నుండ
విప్రచిత్రర్షి గోత్ర ప్రసూతుఁ
డు కురంట కాన్వయుండు కుబేర మానుఁడు
కాళశ్రేష్ఠి యనెడు కాల ఘనుఁడు
ఆ.వె. నాదిగా గలట్టి యరువది నాలుగు
గణము లెల్ల యశ్వ గణము లెక్కి
ధనద పురము నుండి దండుగా కదలిరి
పెద్ద శ్రేష్ఠి కబురు పెట్ట నంత ! 1682

సీ. పౌలస్త్య గోత్రుండు బ్రాహ్మణ భక్తుండు
గణపతి కులజుండు కర్ణవేది
నిజకులాసక్తుండు నిజ భూషణోపేతుఁ
డేనుగెక్కుచు ధర్మశ్రేష్ఠి కదల
మాధ్యందినాసుర మాండిస సైకతా
యన గోత్రు లనఁగ నర్కాగ్ని చంద్ర
హరి కాల భద్ర మంద్రాది వంశజులగు
గురు సూర్య నాగాది గోమఠీయు
ఆ.వె. లందలంబు లెక్కి యరుదెంచ సాగిరి
నలుబది గణములు ఘనంబు పేర్మి
ధర్మ పురము నుండి ధర్మ సందేహంబు
బాపగోరి కులము బాగు గోరి ! 1683

సీ. కౌండిన్య గోత్రుండు పండిత ప్రియుడైన
పాలకుండ నగర పాలకుండు
సూసాళ్ళ కులజుండు శూర వీరశ్రేష్ఠి
కాల కంజన గోత్ర కలితులైన
భర్గ మణిగ్రీవ పారశాబర కరా
ళన్మయాన్వయ జాతు లైనవారు
విశ్వేశ్వరుండును వీరభద్రుండును
యెనుబది గణముల నేలువారు
తే.గీ. నిఖిల భూవలయంబును నిండునట్లు
వివిధ వాహనముల నెక్కి విక్క విరిసి
పాలకుండ పురంబున బయలుదేరి
చెలఁగి పెనుగొండ పురమును చేరుకొనిరి. 1684

సీ. సరుగు భారద్వాజస ఋషి గోత్రజుఁడును
బలిశిష్ట వంశ విభావసుఁడును
సతత దాన నిరతి సజ్జన ప్రీతుండు
పొనర జగన్నాథ పురపతి యన
దనరు భద్రుండును మను వైన్య గోత్రుల
గయ భీమ వంశ వికాస మతుల
కలిమి కుబేరులు కమలాక్షుఁడును విశా
లాక్షుఁ డాదిగ నిగమాగ్రణులను
తే.గీ. కలసి యరువది నాలుగు గణము లనఁగ
హయము లధిరోహణము చేసి బయలు వెడలె
పురి జగన్నాథమున నుండి పొలుపు మీర
తరుణి వాసవీ కన్యను తలఁచు కొనుచు. 1685

సీ. గౌతమ గోత్రుండు గ్రంధిశీల కులుండు
శంకర భక్తుండు శంకరుండు
ప్రకట కళింగాధిపతి యైన వైశ్యుండు
హయ వాహనం బెక్కి బయలుదేరి
ముకుళ గాంగేయాది ముని గోత్రములఁ బుట్టి
బంధుక తుంబాది వంశములకు
నాయకు లైనట్టి నాగ కామ శ్రేష్ఠు
లాదిగా గల వారి నాదరించి

ఆ.వె. ఇష్ట సఖుల సత్కరించి ముప్పది నాల్గు
గణము లనుసరింప గరువ మూని
గోరథంబు లెక్కి గోగణంబుల గట్టి
వడి కళింగ పురము వదలి నారు. 1686

సీ. మార్కండ గోత్రులౌ మరుకులాధీశులు
ప్రోల పుంసికులనఁ బోలు వారు,
పురుకుత్స పౌండ్రక పుష్పదంతుల గోత్ర
మున ప్రోలిశిష్టాభిజనము నుండి
వేద కాళీ ముకుం దాదిశేషాఖ్యులు,
కైశోర్య బాభ్రవ కావ్య వత్స
పాద గోత్ర కుణిక పాల వేణో చండ
వంశజులగు వారు, భద్ర బుద్ధి

తే.గీ. బలి విరూపాక్షు లాదిగా వైశ్య లెల్ల
కులము రక్షింప ధర్మసత్కులురు నగుచు
పుణ్య జనపాళి పాంచాలపురము నుండి
నడచి రరువది యారు గణముల తోడ. 1687

సీ. గురువు పారాశర్య గోత్రంబునం బుట్టి
పడగశీలాన్వయ పాలుఁడనఁగ
పావన గోత్రుండు పాంచాల వంశుండు
సత్య ధర్మాగ మాసక్తుఁ డనఁగ
వరుస భీమాచ్యుతుల్ వాయు వేగంబున
క్రౌంచ గౌళాఖ్య గోత్రజులు నైన
మలయాచ లాన్వ యామల కీర్తు లైనట్టి
వైశ్యోత్తముల తోడ వచ్చినారు

తే.గీ. పరఁగ ముప్పది గోత్ర సంపదల తోడ
తేజులం బూన్చి నట్టి యా తేరులెక్కి
భీమ పట్టణమున నుండి భీకరముగ
కన్యకను గోరికొను వాని కాంతు మనుచు. 1688

సీ. మదనర్షి చందర్షి మంగళ ఘంట రై
భ్యర్షి గోత్రముల నుద్భవములైన
దారు దర్దుర వంశ ధాములై శాంతులై
కోప కఠోర గుణోప గతులు,
పుడమి బార్హస్పత్య పుండరీక వసిష్ఠ
గోత్రజు లైనట్టి గోహరీంద్ర,
పృథ్వి, వీస్తు, క్రాను పృధు వంశజులు రుద్ర
వీర మాధవ ముకుం దోరుజులును,

తే.గీ. గణము లరువది నాలుగు కలసి కదలి
రధిక సంతోషమున వివాహమున కట్లు
త్రిగుణ పట్టణమున నుండి తీవ్రమైన
చర్చ లందున మునుగుచు చల్లగాను. 1689

సీ. గురువు విశ్వామిత్ర గోత్రజుండు విని కు
లాన్వయ ఘంటసాలాధి పతియు
వీర శ్రేష్ఠి యనెఁడు వీరాగ్రణి కపిల
గోత్రుండు మాసంత కులజుఁడైన
శ్రీరంగుఁడను వాడు, శ్రీధర్మ విష్ణు కు
రంటాఖ్య ఋషుల గోత్రజులు నగు హ
యగ్రీవ శంఖ మణిగ్రీవ వంశోద్భ
వులు లింగ భాను బలులను వారు
ఆ.వె. భువిని పేరు గన్న భూమిస్పృశుల నెల్ల
నెనిమిది గణములను నేనుఁగుల ప
యి నధిరోహణ మొనరించి వేగిరమున
ఘంటసాల పురము కదలినారు. 1690

సీ. తత వాలఖిల్య గోత్రమున బుట్టిన వాఁడు
వేన్న కులాభిజ నోన్నతుండు
ధన్యాఖ్యుఁ డైన బాంధవ జనప్రియుఁడు గ
జముపై పది గణ కులముల తోడ
వసు శంకు గోత్రముల్, వంశముల్ మణికుంట
శ్రేష్ఠి మార్కండేయ శ్రేష్ఠి మాళ
వ మనోహరాదిగా వైశ్య బాంధవులను
గోరథంబుల మీద కూర్చి తెచ్చె
ఆ.వె. కామ పురము నుండి కామితార్థములైన
రక్త బంధములకు రక్తి గొలుప,
న్యాయ మార్గమునకు గాయంబు కల్పించు
వారి వంపుఁ దీర్చి వంకఁ జేర్ప. 1691



సీ. అటు సనందన ఋషి పటు గోత్ర జాతుండు
సానక వంశ సంజాతుఁ డైన
మాధవ శ్రేష్ఠిగా మంచి పేరును గన్న
వాఁడు, జనులు మెచ్చు వాఁడు నైన
పీఠికా పుర పతి పీఠంబు కదలించె
చండ వంశజ గోత్ర జాతులైన
కేశ శుంగ కులోచ్చ కేదారములఁ బుట్టి
యేడు గోత్రంబుల నింపు గల్గు
ఆ.వె. నీగి బలి శిబులన నీవుల మొదవులఁ
గూడి, చెచ్చెర పెనుగొండఁ జేరె
ధర్మ సంకటమున ధరఁ గుందు కుసుముని
యండఁ జేరి వాని నాదుకొనఁగ ! 1692

సీ. నిపుణ పవిత్రపాణియ గోత్ర చిరుబిళ్ళ
వంశజ గురునాగ వణిజ వరుఁడు,
బోధాయనస గోత్ర బుదురాన్వయ విరాజ
మానుఁడు శివుఁడను మాన ధనుఁడు,
పింగళ ఋషి గోత్ర బీజ్యుండు, యనసాన్వ
య జనుఁ డీశాన్యుండు యత్న ప్రియుఁడు,
నంగర్షి గోత్రుండు, హరి నామధేయుండు,
ద్రోణ వంశజుఁడగు తొడల పుట్టు,
తే.గీ. వైన్య గోత్రజుఁడును శూల వంశజుండు
నింద్రుఁ డను వాఁడును హయము లెక్కి వచ్చె
పదియు తొమ్మిది గణముల వారు కూడి
జనద పురము నుండి బిరాన చనవు మీర ! 1693

సీ. ఉద్వాహ వంశాబ్ది నుదయ మందిన యట్టి
కుసుమసెట్టి ప్రభాత గోత్రజుండు,
పెనుగొండ వైశ్యులఁ బెద్ద వాఁడగు మౌళి
శిష్టాది బంధుల చెంత జేర్చి
పదునేడు ఘన వైశ్య పట్టణంబుల నుండి
వచ్చు బంధు జనుల స్వాగతింప
నెదురు చూచుచు నుండ నేగు దెంచిరి వైశ్య
వరులంద రొక్క సాగరము వోలె

తే.గీ. వారి సమ్మర్దమును జూచి యూరి ప్రజలు
నుత్సవము జేసికొనిరి సంపత్సమేత
ముగను పెనుగొండ పట్టణమును నలంక
రించి లేని సంతోషమ్ము నించి కొనుచు. 1694

ఆ.వె. వారి రాక గాంచి వైశ్యోత్తములఁ గూడి
యున్న కుసుమసెట్టి మన్ను సోక
దండమునకు వోలె దండపాటునఁ జేరి
యక్కుఁ జేర్చుకొనియె నొక్కరొకరి ! 1695

కం. వారును వీరును కలిసిన
యారామము వోలె నగర మానందముతో
దారుణ విషమును మ్రింగిన
యా రుద్రుని వోలె పొలచె నాలోకింపన్ ! 1696

ఉ. స్థానికు లైన వారు తమ తావుకు వచ్చిన బంధు లందరన్
గాన మృదంగ వాద్యముల గంధ విలేపన గౌర వాదరా
ఖ్యాన ఘృతాన్న పానముల హాయిని గూర్చిరి పట్టణంబునన్
మానిత బంధు వర్గమును మాటల వేడుక సేద దీరగా ! 1697



ఆ.వె. సేద దీరినంత శ్రేష్ఠి సమూహంబు
భాస్కరార్యుఁ జేరి భక్తి సలిపి
సేమ మరసి వానిచే ననుమతిఁ బొంది
విడిదులకును జేరి విడిసి రంత. 1698

**ఇది శ్రీవాసవీపురాణమునందు పెనుగొండకు పదునెనిమిది పట్టణముల నుండి వైశ్యుల యాగమనమను నరువదవ అధ్యాయము సంపూర్ణము.**

(సరుగు= వర్ధిల్లు)

# అరువదియొకటవ అధ్యాయము

**కం. వ్యాస మహాఋషి కృతి సం**
**వాసిని ! సకల కవితా ప్రవర్తక సుకళా**
**శాసని ! వరగుణ దాయిని !**
**వాసవి ! విపులార్థ శబ్ద వాచక నిపుణా !**

కం. మరుసటి దినమున వైశ్యులు
వరుసగ కాలోచితముల వాలాయమునన్
దీరిచికొని శుచులై, భూ
సురులను దృప్తి పరచిరి వసు మణి పటములన్ ! 1699

కం. తెల్లని యుడుపులు దాలిచి
తెల్లని సుమ హారములను దేహము నెల్లన్
కొల్లగ ధరియించి కనెన్
మెల్లన నాచార్యు వెనుక మిను సిగ వేల్పున్. 1700

కం. నగరేశ్వరు లింగమునకు
మొగిడిచి కరములు తమతమ ముడుములు నేలన్
తగులగ నెదలం బరచిరి
తగు మార్గము చూపి బ్రోవ తగవులు దీరన్ ! 1701

ఆ.వె. అంత వారి వారి యాసనంబులు జేరి
కొంత తడవు వరకు సంతసమున
మొగడు లేచి పోవ ముచ్చట్ల మునిగిరి
వాసవాంబఁ గూర్చి ధ్యాస లేక. 1702



ఆ.వె. స్వామి నగరు తూర్పు వాకిటఁ గూర్చున్న
కూర్చు వారిఁ గనుచు కుసుమ శ్రేష్ఠి
శ్రేష్ఠమైన రీతి సేవించి హరువుగ
హరునిఁ దలఁచి తెలిపె నాత్తరమున. 1703

ఉ. బాంధవ శ్రేష్ఠులార! మిముఁ బ్రార్థనఁ జేసెద మాటి మాటికిన్
బాంధవు వోలె వచ్చి నర పాలుఁడు వాసవిఁ గాంచి పెండ్లితో
బాంధవ మేర్పఁడం దలచెఁ, బాలితులై పలుకాడ మెట్టు లీ
బాంధవ మేదు చెప్పుడిక బంధు జనావన కార్య దక్షులై ! 1704

చం. అడుగు కదల్ప లేను తమ యానతి లేక; మదీయ కన్యకన్,
కడు ముదితాత్మజన్, కుల వికాస వరిష్ఠ వరూథ హేతువున్,
బడితల కిచ్చి చేయుటనఁ బాడియె యోచనఁ జేయుడయ్య; వం
గడమున చెడ్డ పేరు కద కన్య కులాంతర మేగుటల్ భువిన్ ? 1705

ఆ.వె. అనుచు నలలు లేని యంబోధి వలె నిశ్చ
లాత్ముఁ డైన కుసుమ నాననమున
నీరు కప్పియున్న నీటి చిచ్చును జూచి
నోట మాట పోఁ గిరాటు లంత ! 1706

సీ. విష్ణు వర్ధన రాజ వృత్తాంత మెక్కడ
మదుల దున్నెడు మన మనుగ డెచట?
దుష్టులఁ దునుమాడు శిష్ట రక్షకుఁ డెట
యెనుములఁ గాపాడు మనుగ డెచట?
విల్లమ్ములను బట్టు వీరత్వ మెక్కడ
ధనము బ్రోవెత్తెడు మనుగ డెచట?
మాంసంబు మెసవు నమానుషం బెక్కడ
మాషముల్ తిను మన మనుగ డెచట?

తే.గీ. పొసగ దేమాత్రమును పెండ్లి పొసగ దనుచు
వారిలో వారు తర్కించు వారు నైరి,
పొసగదని చెప్పి రాజుతో పోరు సలుప
గలమె యోచింపు డనియెను కడమ వారు. 1707

వ. అంతియఁగాక కడమవారు రాజపక్షము వహించి. 1708

శా. ధర్మాత్ముండును, సత్య సంధుఁడును, చంద్రాంశన్ తదీయాన్వయా–
ధర్మఘ్నుండును, బ్రాహ్మణావనుఁడునై ధాత్రీ జనాధీశుఁడౌ
ధర్మజ్ఞుండగు విష్ణువర్ధనునితో ధర్షించుటా? వాని మై
నిర్మాల్యంబున కుద్ది కాము కదవే నిష్పాద్య మూహింపగన్ ! 1709

ఆ.వె. కాళ్ళ కడకు వచ్చె కమ్మని సంబంధ
మూరకున్న నిపుడు, చేర దెపుఁడు;
కళ్ళు మూసికొనుచు కన్య నీయుము నీదు
కొంప పసిడి తోడ కొల్లబోవు ! 1710

వ. అనుచునుండ నది భరింప లేని కొందఱు వైశ్యులు లేచి యిట్లనిరి. 1711

కం. ఎక్కడిదీ ధర్మము ! ధన
మొక్కటియే పరమ పదమొ ! ఒగి కలి యందున్
దిక్కు పరాశర ధర్మము,
దిక్కు సజాతుల వివాహ దీక్షలు వినరే ? 1712

ఆ.వె. తప్పరాదు జాతి ధర్మంబుఁ దప్పిన
నరులు జేర వలయు నరకమునకు,
తప్పరాని యట్టి ధర్మంబుఁ దప్పక
నడచు వారు కీర్తిఁ బడయు వారు. 1713

వ. కావున నీ రాజుతో సంబంధము లగ్గు కాదని ఖండింప వారి వచనములు వినుచు జగన్నాథపురము నుండి వచ్చిన కమలాక్ష విశాలాక్షు లిట్లనిరి. 1714



తే.గీ. విష్ణువర్ధన భూపాలు వియ్యమన్న
భువిని దుర్లభ మైనట్టి పుణ్య ఫలము
దైవ వశమునఁ బ్రాప్తించె, ధర్మ చర్చ
మురిగి పోనిత్తురే యెట్టి మూర్ఖులైన ! 1715

వ. జగన్నాథ పురాధిపతి యగు భద్రుండది విని మండిపడుచు నిట్లనియె. 1716

మ. తన ధర్మంబు పరిత్యజించి యెవఁడే ధర్మేతరంబున్ బురా
తన మర్థాకరమంచు నెంచుకొను నాతం డాసవాయత్తుఁడౌ
జనుషాగ్రాన్వయు పోల్కి ఊరి నడుమన్ చాటింప పాత్రుండునౌ
పనుపన్ మేరల, నంతమున్ నరకమై బాధల్ ఘటించున్ సుమీ ! 1717

వ. ఆ మాటలకు కుసుమ శ్రేష్ఠి మున్నగు వైశ్యప్రముఖులు సంతసింప; కళింగ వాసులగు కామశ్రేష్ఠి, నాగశ్రేష్ఠి మున్నగు వారు కనులెఱ్ఱఁ జేయుచు నిట్లనిరి. 1718

కం. మూడవ కులమునఁ బుట్టిన
వాఁడగు వైశ్యునకు రాజు వరుఁడగు కాదే !
గోడాడఁగ నేల గడుసు
లాడక మన కన్య నిచ్చి యనుపుఁడు వేగన్. 1719

వ. అంత గౌతమ గోత్రుండైన శంకరశ్రేష్ఠి శంకరుని స్మరింపుచు చెవులు మూసికొని. 1720

కం. శివ శివ మీ కటు వచనము
ల వినఁగఁ జాలను శమించు లాచిన పాపం !
తివిరెదు మనములు స్థిరపడ
సవరించుఁడు శ్రాంతిఁ గూర్చి, సముఖం పుణ్యం ! 1721

వ. అనవిని పాలకుండ పురాధీశ్వరులైన విశ్వేశ్వరుండును, వీరభద్రుండును భ్రుకుటుల ముడులు వైచి యిట్లనిరి. 1722

చం. అలసటఁ దీరిపోయినది, ఆదర మట్టిద పెద్ద కొం డదే !
సొలయిక మాని పెద్దలకు సూడిద లిచ్చెడు జాతి ధర్మమే
కెలయఁగఁ జేసి రాజవరు కేళికి కాన్కగ కన్య నీయగా
పొలపొలలేల, మానుడిఁక, పొల్తుక నిచ్చి యశంబు గాంచుడీ. 1723

వ. అంత పాలకుండ పురవాసుండేయగు వీరశ్రేష్ఠి కోపంబున లేచి తమ నగరాధీశుల నిరోధించుచు. 1724

ఉ. దానము సేయఁగా తరుణి తండులమే పరికింప, వాసవిన్
దానము సేయఁగా తరలు తన్వియె? ఆ మహనీయ జన్మమున్
దానము సేయఁగా తరమె? దానమొసంగిన కోమటీనికిన్
దానము సేయఁగా వలెను, తర్కములేల వృధా ప్రయాసగన్? 1725

ఆ.వె. కాదు కూడదంచు ఖలుల మాటల చొప్పు
నాచరించి రేని అమరు ముప్పు,
శాప మొందె నేని చాంద్రాయణ వ్రతం
బొనరఁ జేయ వలయు నొజ్జలార ! 1726

వ. అని కూర్చుండ ధర్మపురాధీశులగు గురు, నాగార్య, సూర్యశ్రేష్ఠ్యాదు లాగ్రహో దగ్రులై తమ శ్రుతపాండిత్యము నిట్లు ప్రవచించిరి. 1727

ఆ.వె. తెలివి, పనియు లేక, కలిమి లేకున్నను,
హితుల మేలు మరచు పతితునకును
జాయ కూతు నీయ చాంద్రాయణ వ్రతం
బాచరింప వలయు నదియ నిజము. 1728

తే.గీ. ఎట్టి యవకరములును లేనట్టి రాజు
వరుఁడుగా వచ్చి నిలచిన వంకఁ బెట్టి
కాదు పొమ్మంచు నాడుట కాదు పాడి,
నిలతురే రాజు కాదన్న కలిమి తోడ? 1729

వ. అంతట ధర్మపురాధిపతి యైన ధర్మశ్రేష్ఠి యనువాఁడు లేచి చిరునగవు చెదరక మధురాక్షరముల గూర్చిన కమ్మని వాక్యముల నిట్లనియె. 1730

ఉ. ఇమ్మను వారు శాస్త్రముల నెప్పుడు చూడని వారు, చూచినన్
నమ్మని వారు, నమ్మినను నమ్మని యట్లు నటించి స్వార్థ మై
కమ్మున నుండు వారు, స్మృతి కారుల లక్ష్యము లేని వారు, బిం
కమ్మున తప్పు చేసియును కాదను వారు, స్మరింప నేటికిన్ ! 1731

కం. వ్యర్థమ్ములు వాక్యమ్ము ల
నర్థ కరమ్ములును నిట్టి నర భాషణముల్,
స్వార్థము రాజున కిచ్చిన,
సార్థకమగు తగిన వరుని సాధించుటచే. 1732

వ. ధర్మశ్రేష్ఠి మృదు వచనంబులు చెవికెక్కని ధనదపురాధ్యక్షుఁడైన కాళశ్రేష్ఠి మున్నగు వారు లేచి కోపంబున. 1733

ఆ.వె. లెందు లెందు వీరి మొండి వైఖరి తోడ
రాజు తోడ పగలు రాజుకొనును,
కన్య రాజుకిచ్చి కదలి పోదము రండు
మేలు కలుగు దీన మేలుకొనుడు. 1734

వ. అని లేవఁబోవ మహత్తేజస గోత్రజుఁడగు మాధవశ్రేష్ఠి రాజువలని భయము వలదని వారింపుచు నిట్లనియె. 1735

ఉ. రాజన నేల నంత భయ రాజ్యము మీ ముఖ సీమలందు, మీ
భోజన మంగవించి మనబోవునె రాజును బూజునైన? నీ
భూజను లెల్లరున్ మనకు పూజలు చేయవలెన్ నిజంబుగాన్ !
తేజము దక్కి యున్న భువి తేజము నింపి రహించు వారమే. 1736

ఆ.వె. పట్టణములు లేవు పరిపాలనము లేదు,
మనము లేక ధరణి ధనము లేదు,
సర్వ శూన్యమైన సార్వభౌముఁడు నెందు
గలఁడు నమ్మకమును గాంచుఁ డయ్యు ! 1737

వ. అంతట నాచంట నగరాధీశు లసహనము చెంది. 1738

కం. ఆలోచింపకయే యెటు
లాలోచన చేసిరి మము నాహ్వానింపన్,
చాలింపుడు మీ తర్కము
చాలా పని గలదు మాకు చనగా వలయున్. 1739

వ. అనుచు గోడ మీది పిల్లి వాటము చాట రుద్ర భద్ర సుభద్రులను వార లొకింత లౌక్యము వాటింపుచు. 1740

ఆ.వె. కులము గౌరవంబు నిలబెట్టుచును మీరు
నిర్ణయింపుఁ డయ్య నేతలార,
పెండ్లి చూచినట్టి పెను సంతసంబున
కదల వలయు మేము ఘంటసాల. 1741

వ. అన విని శివపురాధి పతులైన మధు, మాధవ, గర్గశ్రేష్ఠులను వారును తొందర పడుచు. 1742

ఉ. ఇప్పటికైన తేల్చుకొనుఁ డిష్టులు బంధులు నిర్ణయించుటా,
ముప్పున తల్లి దండ్రులనె మొండిగ నాపద గెంటు మంటయా !
నిప్పుక వంటి కూతురును నేత కొసంగుట యిష్టమేని మే
మొప్పమి కేమికారణము ? ఊఁ యనుటొక్కటె మేలి మంత్రమౌ! 1743

వ. అనుచు చర్చ ముగింప యత్నింప పెద్దిశిష్ట గోత్రోద్భవుండైన వైశ్యోత్తముండు లేచి. 1744

కం. అడుగుట నేరమె బంధుల
కడు నేస్తుల వరుని గూర్చి కన్యక నీయన్
గడఁగు తలిదండ్రులకు నీ
యెడ కుల ధర్మము గద, అటులే యగు గాదే ! 1745



ఆ.వె. అనగ వైశ్యు లెల్ల ననరుఁ దీరగ రెండు
వర్గములుగఁ జీలి వాదులాడ
వారి వినుచు వైశ్య వరుఁడైన కుసుముండు
మౌళిశిష్టు తోడ మాటలాడె. 1746

ఆ.వె. నేల విడిచి సాము నేర్పుగా సాగించు
బంధు జనులఁ జూచి బడలి వారు
కోప మెడద లందు కోష్ఠించి వారల
చేరి వినయ మొప్ప చెప్పి రిటుల. 1747

కం. దొడ్డది సమస్య చూడఁగ
బిడ్డల మము దాట వేయ పెద్దలు మీరల్
విడ్డూరము చర్చించుట
గడ్డము పట్టెద మొకింత కలఁతఁ దొలఁగుఁడీ ! 1748

వ. విశ్రాంతి యనంతరము మరల కూర్చుందము, లెస్సగ నాలోచించి చేఁదగు కార్యము నిశ్చయింతము, మొదల గృహములకుఁ బోదము రండని ప్రార్థింప నందరును కోలాహలముగ స్వస్థానములకేగి స్వస్థత నొందిరి. 1749

***ఇది శ్రీవాసవీపురాణమునందు వైశ్య మహాసభయను అరువదియొకటవ అధ్యాయము సంపూర్ణము.***

(ముదుములు= మోకాళ్ళు, వరూథము= ఇల్లు, కవచము, బడితలు= ఆయుధవిశేషము, లాచిన= పొంచిన, అంగవించు= అతిక్రమించు, కెలయు= విజృంభించు)

# అరువది రెండవ అధ్యాయము

**కం. శ్రీ వాసవి కరుణామయి !**
**దేవాసుర యోగ మధ్య తేజిత వాణీ !**
**శ్రావణ సంధ్యా రమణీ !**
**తేవన సంచార లోల దేవీ ! జననీ !**

కం. అంతట కుసుమాఖ్యుఁడు తన
యంతర బంధువులఁ దెలిసి యందొక్కొకరిన్
స్వాంతము వెల్లడిఁ జేయఁగ
నాంతరములఁ గలసి యడిగి యగణిత తృప్తిన్. 1750

చం. కులగురువైన భాస్కరులఁ గూడి వినీతుల నీతిమంతులన్
కులగత ధర్మ వర్ధనుల కుందన మానిత మానసేంద్రులన్
తులిత మహాసముద్ర పరితోషులు, తోషిత విత్త సాంద్రులున్
గలరిట నూటరెండు కుల గౌరవమున్నిలబెట్టు గోత్రియుల్ ! 1751

ఉ. వారు పరిష్ఠ గోత్రముల వైశ్యులు, వాసవి నెంత మాత్రమున్
గోరికలన్ మునింగి జతఁ గోరెడు రాజుకు పెండ్లి సేయ రా
దారటఁ గల్గునందు రటులైన త్యజింతురు ప్రాణమైన సా
ధారణ తంతు వస్త్రమటు, తక్కిన వా రెదిరింప భీరువుల్. 1752

వ. అనుచు వివరింప నాచార్యుండును దలయూచి మందహాస మొనరించి నూటరెండు గోత్రముల వారిని దన యొద్దకు బిలిపించి వారి స్థిరసంకల్పము నభినందించుచు. 1753



చం. మునుకొని వచ్చి హస్తముల మోడ్చి సభక్తి నమస్కరించి యా
సనములఁ గూరుచున్న తన ఛాత్రుల శాశ్వత కీర్తిమంతులై
తనరగ దీవనల్ గురిసి, ధర్మమునం జరియించు వారి ధ
ర్మ నియతి లో యెడంద పులమారగఁ జేయగ గద్గదంబునన్. 1754

పద్మనాభం.
యాగాగ్ని సంజాత యోగాగ్ని సంసక్త యౌ వాసవీదేవి మానంబు గావన్
భోగంబు భాగ్యంబు త్యాగంబు గావించి భూభర్తతో కయ్యమాడంగ మీరల్
వాగళ్ళమో లేక వాణిజ్యమో దప్ప వ్యాపాదనం బన్న పర్వెత్తు వా రే
యోగంబునం సిద్ధమైనారొ వాచింప యుక్తంబొకాదో విమర్శింత మిందే!

తే.గీ. అంచు నాచార్యుఁ దర్థింప నార్య విశులు
వెనుక ముందాడుచునె తమ మనము నున్న
మాట పైకి రా ముఖము మోమాట పడగ
పల్కి రెట్టులో దిక్కులు పల్కి నట్లు. 1756

ఉ. కాయమునన్ జరా మరణ క్రాయకు లుండుట నైజమే కదా !
గాయ మధర్మ మీ తనువుఁ గ్రమ్మక మున్నె, రుజా సముద్రమై
హేయము కాక మున్నె త్యజియించుట మంచిది కాదె ధర్మ సం
ధాయక యజ్ఞమందు మొన నైన మొనేతర మందు నైననున్ ! 1757

చం. తెలియును శస్త్ర చాలనము దేహ ధనమ్ములఁ గావ నేర్చుటన్
తెలియును మంత్ర చండిమము తేఁకువ నొంద విరోధి యోగమున్
తెలియును తంత్ర మార్గములు దిగ్గురనన్ రిపు తంత్ర జాలమున్
తెలియును ప్రాణ దానమును ధేను వధూ శిశు రక్షణంబునన్. 1758

శా. మనపై యెంతటి నమ్మకంబు కలదో మాతా మహా దేవికిన్
మన వంశంబునఁ బుట్టి సంతసమునన్ మట్టాడు నిశ్చింతగన్
మనమే ఆమెను గాలి కొగ్గి యిటులన్ మౌనంబుగా నున్నచో
మన మేమౌదుము? మానహీనులము కామా? భావి నిందించదే! 1759

కం. ఇది మా నిశ్చయమగు మా
మదిఁ దోచిన తెఱఁగు వినుచు మా కర్తవ్యం
బది యెట్టిదొ తెల్పు డనుచు
నెదురుగఁ దలవాల్చి యున్న యిష్టులఁ గనుచున్. 1760

కం. కృత నిశ్చయమున నున్న వి
జిత ధర్మువులార వధువు చిన్మయి కాకు
న్న తెగువ యిట్లే యున్నే ?
హితమగునె హుతాశనార్తి హేరంబమునన్ ! 1761

తే.గీ. అనఁగ నివ్వెఱఁ గందిన ఆర్య వైశ్య
గణము గురు ముఖమును గాంచి గౌర వాద
రముల సన్నంబుఁ గానీక తమ మతంబు
వినిచె నెవరైన నిట్టులే పనుతు మనుచు. 1762

కం. స్థిరమగు శిష్యుల వాక్కుల
స్థిర మానస వృత్తి నిలిపి తృప్తిఁ దలిర్పన్
గురుదేవులు మరల నిటుల
గురుతించెను లోపములను కులికోక్తులలో. 1763

చం. తెలిసిన శస్త్ర చాలనము తేల్చదు రాజ బలంపు వాగురన్
తెలిసిన మంత్ర చండిమము తీర్చదు రాజ పురోహితోక్తమున్
తెలిసిన తంత్ర మార్గములు త్రెంపవు మంత్రుల వ్యూహ తంత్రమున్
తెలిసిన ప్రాణదానమును దిద్దదు వాసవి మోము వ్రాతలన్ ! 1764

చం. కుపిత మనస్కులై రిపులఁ గూల్తుము మేమను టొప్పు గాక మీ
రుపగత కార్య శోధనకు యోచన చేయరె శాంత చిత్తులై !
రిపు బల మెంత యుండునని రింజ గొనంగ నుపక్రమింతు రీ
విపుల విజేత నొంచుటన విత్తుట, కోయుట, విక్రయించుటే ? 1765

కం. ఏడింట నారు వంతులు
కీడెంచుట వలనఁ గాదె క్రీడా స్ఫూర్తిన్
క్రేడించిరి కులజు లగుచు
తాడించుచుఁ గాలు కాలు తమ నెలవులకై ! 1766

కం. తులువల వొగడుచుఁ దమ మన
ముల పొంగుల నీరుఁ జల్లు ముని సన్నిభుఁడౌ
కులగురు హృదయము నెరుగఁగఁ
దలమునుకగ నగుచు విశ శతకమును వొగులన్. 1767

వ. అంతట శిష్యుల తలఁపులఁ జదివిన గురుండును. 1768

కం. ధర్మము నందున నాప
ద్ధర్మములను వినఁగ లేదె ? తనువున కంటెన్
ధర్మము కలదే జగమున
ధర్మంబున మర్మ మిదియ ధర్మ శ్రేష్ఠీ ! 1769

కం. తనువుండిన మనముండును,
మనముండిన మననముండు, మననము తోడన్
ఘనమగు బుద్ధియు, ధర్మము.
తనువును రక్షింప వలదె ధర్మముఁ గావన్ ! 1770

కం. గురు ముఖమున నిట్టి పలుకు
నెరుగని బేహారులంత నేదిన శౌర్యో
ద్ధరతన్ ధైర్యంబు నిగుడ
గురు బోధల వెగటు నిటుల గుప్పిలి విప్పెన్. 1771

ఆ.వె. చెవుల కింపు మీర చెలువొందు మీ నుడుల్
పిరికి వాయె పోరు నురుకు వేళ,
ధర్మ వర్తనం బధర్మ వర్తన మాయె,
పలుకఁ దగునె యిట్లు భాస్కరార్య ! 1772

సీ. ధర్మ శాస్త్రంబుల మర్మంబుఁ దెలుపుచు
ధర్మ సూక్ష్మంబుల దంటఁ జేర్చి,
వివిధ పురాణ సేవిత మూర్తివై మమ్ము
సత్కథా గోష్ఠితో సత్కరించి,
భారత రామ కథా రహస్యంబుల
వీరత్వమును మాకు విక్రయించి,
ఉపనిషత్తుల లోన నపనేయముల మధ్య
నాత్మ వస్తువె సత్య మనుచుఁ దెలిపి,
తే.గీ. తనువు ధర్మ సాధనము మాత్రమ యటంచు
నిద్ది నిలువదు, పోవును కొద్ది కాల
మందె క్రొత్తది సమకూరు నంచుఁ దెలిపి,
యిప్పు డద్దాని కొఱకె జీవింపు మనుదె ? 1773

వ. అనుచు వచింప గురుండును లోలోపల సంతసించుచును వాక్కుల విరోధంబుఁ బ్రకటింపుచు నిట్లనియె. 1774

మానిని. చెప్పితి శాస్త్రము చెప్పిన మాటలు, చెప్పుట నాదగు చేత సుమీ !
ఒప్పుటయో మది నొప్పక పోవుటొ ఒప్పగు మీ యెడ నొప్పనమౌ
నప్పుడు చెప్పితి నాతత ధర్మము నాదట శిష్యుల కందరకున్
నప్పిన నాచరణమ్మునఁ బెట్టఁడు నప్పనిచో కుల నర్మకులే ! 1775

ఆ.వె. బలము చాలనపుడు బలవంతు లగు వారి
నెదుర రాదు బలిమి నొదుగ వలయు
నిదియ ధర్మ సూక్ష్మ మింద్రాదులకు నైన
యుద్ధ విద్యలందు పద్ధ తిదియ. 1776

తే.గీ. బ్రాహ్మణులు గారు ధర్మంబు పాటి సేయ,
క్షత్రియులు గారు ధర్మ సూక్ష్మంబుఁ దెలియ,
వైశ్యులగు మీకు ధర్మ సంవాద మేల ?
తెలిసియుఁ దెలియని యటుల మెలగుఁ డయ్య ! 1777

ఉ. అందుఁ గుసుంభ గుప్తునకు హర్షముఁ గూర్పగనే గదా విధే
యాందువు లైతి రియ్యెడల ? అన్యుల యందిటు పాటి సేతురే !
కందు కులంబు కంటునని కయ్య మొనర్తురె ! దేహ ముక్తులై
ముందుగ స్వర్గ లోకమున ముచ్చట లాడగ తొందరింతురే ! 1778

ఆ.వె. అనుచు నర్మ గర్భమగు మాట లాడుచున్
కదన లోలు రగుచుఁ గదలు వారి
గుండె బలము తెగువ గురుతింప యత్నించు
గురుని కిటులననిరి కోమటీంద్రు. 1779

కం. తగులం బరీక్ష సేయఁగ
తగవే గురురాజ మీకు, ధరణిం గలరే
పగగొని శిష్యులపైఁ బడ
రగిలెడి గురువుల వెదుకగ రక్కసు లందున్ ? 1780

తే.గీ. మ్రొక్కెదము మీకు, మీ ధర్మ ముకుళమునకు,
వేడెదము మిమ్ము మా వేడ్క విశ్వసింప,
చూపుఁడొక త్రోవ మా చొప్పు రూపెరింగి
నారు గావున, మిము నమ్మినార మయ్య ! 1781

వ. అనుచు నేక కంఠమున ప్రార్థించు నూటరెండు గోత్రముల వారిని చూచి వల్లె యనుచు భాస్కరుండిట్లనియె. 1782

ఉ. ఎట్టి మహోన్నతంబులగు నీహలు మీయవి; విశ్వసింపగా
నిట్టి పరీక్షఁ బెట్టితిని, నెంతయుఁ దృప్తినిఁ బొంది నాడ మీ
రెట్టి ప్రలోభ శోభలకు నింతయు లొంగని వారలౌట, మీ
యట్టి దృఢేచ్ఛ నేగ గల యార్తుల కెందును లేవు ఓటముల్ ! 1783

ఉ. ఆలము సేయుటా, మరలుటా యను సంగతిఁ జూత మావలి
క్కాలము నందు మీ కులము కాదని పోయెడు వారు పోదురో,
గేలి యొనర్తు రంచు ముడిగిబ్బల వోలె పరాక్రమింతురో –
తేలిన వెన్క చూత మిది తేల్చుదు రేపు సభాంగణమ్మునన్. 1784

కం. వచ్చెద నేనును చర్చలఁ
జొచ్చెద నిరువాదముల ప్రచోదన కరునై
ప్రచ్చెద వితండ వాదము
నిచ్చెద నుచితాభి మతము నిద్ధాకృతినై ! 1785

కం. శుభమగు గాక కులంబున
శుభమగు మీ గోత్రములకు, శుభమగు మీకున్,
శుభమగు వాసవి జన్మకు,
శుభమగుతన్ వెడలి రండు జ్యోతిష్మతులై ! 1786

కం. గురు వచనముల వినుచు మది
నురు తోషము నొంది మేన నురువగు చింతా
భరమును దించి నటుల విడ్
వరులు ముదంబున ననుమతి వడసిరి చనఁగా ! 1787

***ఇది శ్రీవాసవీ పురాణమునందు గురు పరీక్ష నెగ్గిన ద్వ్యుత్తరశత గోత్రంబుల వారి కథయను అరువది రెండవ అధ్యాయము సంపూర్ణము.***

(మట్టాడు= సంచరించు, రింజ= మల్లయుద్ధంలో ఒకపట్టు, క్రేడించు= తొలగు, నర్మకులు= పరిహాసం చేయువారు, అందువు= సంకెల, ముడిగిబ్బ= ఆబోతు)



# అరువది మూడవ అధ్యాయము

**కం. మందాకినీ స్రవన్తీ !**
**మందానిల చలిత కంఠ మాలాభరణా !**
**సంధావ జనావని ! త్వం**
**వందారు జనానుకూల వచనాభరణా !**

కం. మరునాటి యుదయమందున
మరు నాటిన వాని యింటి మధ్యము నందున్
గురువుకు నమస్కరించుచు
వరుసగఁ గూర్చుండి రంత వణిజులు వనటన్. 1788

తే.గీ. ఉడుకు రక్తమ్ము పెనుసెగ లుమియు ప్రాయ
మున్న బాల నాగరులు వారున్న సభకు
వచ్చి చేరి గురువునకు వందనమ్ము
చేసి కూర్చొని రొక ప్రక్క గాసిలుచును. 1789

ఉ. స్థావర జంగమాదులకు చల్లని వెన్నెల లొక్క రీతి సం
భావనలిచ్చు చందురుని భాతి నిజానన హాస చంద్రికల్
క్రోవలుఁ గాగ నెల్లరకు కోవెలలో శివువోలె నున్న భూ
దేవుఁడు సన్నఁ జేయ విశ దేవుఁడు లేచి వచించె నిట్టులన్. 1790

ఉ. తప్పక కన్య నిచ్చెదము, తప్పిన చచ్చెద మంచు నాగరుల్
చెప్పిన చొప్పుఁ జూడ పసి చేతలటంచు తృణీకరించుటో,
తప్పయి పోయెనంచు వసుధాపతి వేడుటొ, యేమి చేయుటో
చెప్పు డభీష్టముల్ గురుని చెంగట శాంత గభీర చిత్తులై ! 1791

చం. సమయము లేదు చర్చలకు స్వామి కడుంగడు కాంక్షనుండె, దో
షము మన జాగుచేత, కలుష మ్మొదఁగూడని యోజఁ బల్కుడీ
ప్రముఖ వినీతులార ! మన బాల జగజ్జననీ విభూతి లో
కము వినుతింపఁ జేయఁదగు కార్యము మీ పరమైన దింతకున్. 1792

తే.గీ. కుసుమ గుప్తుని పల్కులఁ గూడియున్న
కిటుకు కనిపెట్టి నట్టి కోమటుల కొంద
అధిపు పక్షంబు వహియించు నధిక సంఖ్యు
లర్భకులఁ గాంచి ధృతినిట్టు లనిరి బిగిని. 1793

ఉ. బాలకులార, మీకుగల బాధ్యత వీరికి లేదు కాదె, మీ
రేలినవారి యంతరము నేర్పడఁ బల్కిన వారు, మేము మీ
కూలముఁ జొచ్చినార మనుకూలుర మీ మహి నేలు రాజుకే
బాలిక నిచ్చి పెండ్లి జరుపంగ వచించుచు నుంటి మీ యెడన్. 1794

సీ. చంద్రాన్వయము పాల సంద్రమ్ముగాఁ జూడ
చంద్రుఁడై యందున జననమంది,
సకల భూమికి నేత, సద్ధర్మముల త్రాత,
సకల సంపదల ప్రసన్నుఁ డగుచు,
సద్గుణంబుల రత్న సాగరాంగణ మౌచు,
కీర్తి చంద్రికలకు కేతు వగుచు,
లోక పాలకుఁడైన వైకుంఠు నంశంబు
నంబుట్టి వెలుగొందు నంశమూర్తి,

తే.గీ. విష్ణువర్ధన క్షత్రియ జిష్ణుఁ డతఁడు,
వరుస నున్నత కులమందు వరుఁ డతండు,
కులము కులమంచు కథఁ జెప్ప వలదు నేడు
ముప్పు గడచెడి మార్గమ్ము నొప్ప వలయు. 1795



తే.గీ. అనఁగ నా బాల నగరులు హస్తములను
చెవులు మూసికొనుచు శివ శివ యటంచు
బాల్య చేష్టల కర్థం బకాల్య మగుచు
పెద్దలకుఁ జేరె నెట్లంచు దిద్దఁ జనక. 1796

శా. అయ్యా మాదిది పిల్ల చేష్ట నిజమే ! ఆనాటి యాపన్న వే
ళయ్యా మాటల నాడ రాదను వృథాలాపంబులే తట్ట లే
దయ్యా ! మీకు నమస్కరింతుము, వివాహమ్మాడఁగా భూపతిన్
తియ్యంబోడి సహింప బోదు, వినరే తేమాన జీవాతువుల్ ! 1797

వ. అనుచు వచింప నయ్యారు వందల పండ్రెండు గోత్రముల వారు నొక్కుమ్మడి
బాలకులపైఁ బడుచు. 1798

శా. ఓరీ బాలకులార ! యింత పొగరా? ఉద్రీవులై క్రాలు మీ
కోరాటంబులు నీల్గు గాక ! వెలి వక్రోక్తిన్ మహీశున్ పరీ
వారంబుల్ గనుచుండ నంత చొరవా వంచింప? నింకేమిటన్
వారింపందగు క్రుద్ధ సింగమును, నిర్వంశంబు గాకుండగన్ ! 1799

వ. అనుచు నాచార్యుం గనుంగొనుచు. 1800

ఉ. చూచితిరా మహాత్మ ! నృపు జోలికి పోవఁగ నేల వీరికిన్
తోచిన యట్లు కన్యకను దోసిట నుంచెద మంచుఁ బల్కి నే
డా చినదాని నిచ్చుటకు నాకులపాటున కర్థ మేమి? దో
బూచుల రాజుతోడ? పసి పూతల కేల శిరోజ వేశముల్ ! 1801

చం. కలబడ లేము చంద్రకుల కాంతుని తోడ బలంబు లేమిచే,
కులగురు లేమి చెప్పుదురు, కూడనిచో సమయంబు దప్పగా
కలుషము వచ్చునేమి? కులకన్యను పై కులమందు నీయగా
కలుషము వచ్చునేమి? వరకావ్య సమాన ! వినీతి సత్తమా ! 1802

వ. అంతట నాచార్యుండును సభాసదులందరఁ గలయం జూచి. 1803

ఆ.వె. ఏక వాక్యమందు నేకమై గట్టెక్క
వలయు మీర లిట్టి వనట లందు,
కలి పరాశరోక్త కార్యంబు ధర్మంబు,
కాక, బహుజనోక్త కార్య మొండె. 1804

తే.గీ. కనుక మీరెల్ల చర్చించి కఱుదు మీర
వెరవు కన్గొని రాజుచే వెఱపుఁ దొలగి
మేలుఁ గాంచుడు, సౌఖ్యంబు వ్రాలు గాక !
వినుత గుణశీలు లార ! త్రైవిద్యు లార ! 1805

వ. ఇంక నేనాశ్రమంబునకు వెడలెద సంశ్రుతంబు నానక నా కెరింగింపు డనుచు నాచార్యుండు వెడల బహుజనోక్తంబు గర్హించుచు నా నూట రెండు గోత్రంబుల వారిట్లనిరి. 1806

తే.గీ. ఏల బాలకులగు వారి గేలి సేతు
రవల ధర్మాపహాసంబు నలవరింతు
రిటుల సేయుట తప్పు కానటుల నడతు
రేల నీ వైపరీత్యంబు లేల మీకు? 1807

చం. పదుగురు నౌననం బరిగె పల్మరు పిల్చిన వృక్షమౌనె? మీ
వదనము నందపహ్నవము వంచన గాదె ! నిజంబుగా కుసుం
భ దుహిత, యజ్ఞ సంభవ, ప్రఫుల్ల పదాంబుజఁ గామి కీయఁగా
హృదయములొప్పుకున్నవె? సహించెనె మీపెదవుల్ వచింపగా? 1808

ఆ.వె. అనుచు నుండ నంత నందఱు నొక సారి
యొకరి మోము నొకరు యోర గనులఁ
జూచు కొనుచు సిగ్గు దాచుకో యత్నించి
విఫలమగుచు నుడుల సఫల మైరి. 1809

తే.గీ. ఔను, మా యందు, మా మాటలందు మీకు
తప్పు కనిపించు నది మీదు తప్పు కాదు,
మీరు సిద్ధాంతముల మేర మీరలేరు,
వర్తనంబునఁ బాటించు వారమేము. 1810



కం. మానిని మీకును మాకును
మానిత మిది నిక్కువంబు, మంత్రాంగమునన్
ప్రాణము లెక్కువ కావా !
తేనిని కాదన్న మనకు తెప్పలు పడుటే. 1811

వ. అట్లన నా నూట రెండు గోత్రములవారును నవ్వుచు నిట్లనిరి. 1812

చం. కుల మటులుంత మా నృపతి గుబ్బెత లెందరు? వాని మానసా
కులమునఁ జేరు కన్యక దుకూలమునం బడు సంఖ్య యెంత? రా
కులమున నీమె స్థానమెది? కోటను జూడగఁ బోవ నాలు పం
కిలమున కూతు జాడఁ గను కీలెఱుగం గలరే వచింపుడీ ! 1813

ఉ. అట్టి మదోత్కరంబుఁ, గఠినాభినయాత్మక కోటరంబునన్
మెట్టి సుఖంబు నొందగల మిండతగా తలపోసిరేమొ మా
పట్టి సురాలయాలయను, పార్థివు పంపు నవజ్ఞఁ జేసి తా
బట్టిన కన్యకా వ్రతము భద్రముగా సవరించు నీయెడన్ ! 1814

ఆ.వె. ధర్మ వర్తనులకు ధర్మ వర్తను లందు,
పాప వర్తనులకు పాపు లందు
సఖ్య మొనరుఁ గాని, సద్ధర్మ దుష్కర్మ
రతుల మధ్య నెటుల రక్తి కుదురు? 1815

వ. అంతట నధిక సంఖ్యాకులగు వైశ్యు లధిక రోషంబున. 1816

ఉ. చాలును చాలు వంశమున చావు దొలంగ వచింపు చుండ మీ
మేలును గాననైరి, మిడిమేలపు మాటల నాడుచుంటి రీ
కాలము తేనిదైన దిక కాగల దంతయు వాని చిత్తమే,
వీలును జూచికో దగును బిడ్డలఁ గాచెడి చోటులంజుమీ ! 1817

తే.గీ. దేశమును గాచు నొక్క ప్రదేశ మిచ్చి,
ప్రాంతమును గాచు నొక చిన్న పల్లె నొసఁగి,
వంశమును గాచు నొక ప్రాణి బలియొసంగి
తెలివికా డిడుమలఁ బాయు తీరు లివియ ! 1818

ఉ. పూర్వము బ్రాహ్మణుం డొకఁడు, పుణ్యజనావళి బోధకుండు, మై
సర్వము నైన కూతురుకు ఛత్రపతిం బతిఁ జేయలేదె? మై
గర్వితులై చరించు భువి కాంతులఁ గూల్చిన పాలు తల్లి యా
తెర్వున క్షత్రియాణి గదె ! తీరుగ నుండెనె వర్ణ ధర్మముల్? 1819

ఉ. క్షత్రియ బ్రహ్మ సంభవులె కాదని త్రోసిన వర్ణ ధర్మముల్
పాత్రము లౌనె వైశ్యులకు పాటి యొనర్చగ, నెందుకీ వృథా
స్తోత్రము లాత్మ హానికర సూత్రములై జను, వాటి జోలి కే
మాత్రము పోక, కన్యను క్షమాపతి కిచ్చి యశంబుఁ గాంచుడీ !1820

కం. రాజుకు కన్య నొసంగిన
రాజత్వము కలుగు మనకు, రత్నాదులతో
రాజిలు గృహములు, నంతట
యాజనమున దోషములును యజ్ఞాంగములౌ ! 1821

వ. అనుచు బుద్ధులుఁ జెప్పుచుండ నన్నూట రెండు గోత్రముల నేత్రము లెఱ్ఱవడ. 1822

ఉ. యోగ్యముఁ గాని మాటల నియోగముచే మము నమ్మఁ బల్కగా
యోగ్యమె మీకు, బంధులకు, యోచనఁ జేయుడు మిత్రులంబలెన్,
భోగ్యము లేమి తక్కువ, విభూషలు చూడరె? యజ్ఞ ద్రవ్యముల్
మృగ్యములే మనిండ్ల? మితి మీరకుడీ గురు భాషణమ్ములన్ ! 1823

ఆ.వె. గత యుగంబులందు గతియించి పోయిన
నీతులెల్లఁ దెచ్చి నిక్కు చుందు
రావు పాలు తెచ్చి దేవాన్నమనినంత
గొనము నిలుచు నేమి దినము కంటె? 1824

ద్విపదలు. అశ్వ గో మేధ యాగాచరణము, మ
హేశ్వరాసాదిత జ్యేష్ఠ భాగమును,
పరలోక మేగిన పలల శ్రాద్ధమును,
పరిణేత మృతిజెంద పడతి పెండ్లియును, 1825



దేవర న్యాయాన స్త్రీ సంతుఁ గనుట,
ఆవలి కుల వివాహములు కూడవని
పారాశరుఁడు మున్నె పలికి యుండుటను
ఆ రాజు కేము కన్యక నీయ బోము. 1826

వ. అని పలుకు పీఠికా నగరాధిపతి యగు మాధవశ్రేష్ఠిని కామ పురాధిపుఁడైన ధనియును, ఘంటసాల పురాధీశుఁడైన వీర శ్రేష్ఠియును, మాసంతకుల సంభూతుఁడైన శ్రీరంగశ్రేష్ఠియు నభినందింపుచుండ సంఖ్యాధికుల నేలాపుర వాసులగు శుంభు నింబ నిచోళులనువార లధిక్షేపించుచు. 1827

ఆ.వె. పొందు, విష్ణువర్ధనుండు మనల నెల్ల
పిల్ల పాపతోడ గుల్లఁ జేయు,
బలము చేత నైన పడతి నెత్తుకు పోవు
నిజము, శక్తి పరుఁడె విజయమొందు. 1828

వ. ఆపై మీరేమి చేయగలరో చెప్పుడని ప్రశ్నింప మన్యు మానాభ గోత్రజులైన వైశ్య శ్రేష్ఠులందరు వారి వచనంబుల దృణీకరించుచు. 1829

తే.గీ. రాజు రాక్షసుఁడై పైకి రాక మున్నె
హృదయ మందీశ్వర ధ్యాన మిరవు కొనఁగ
వాసవీ కన్యకనుఁ గూడి వహ్ని యందు
దుముకుదుము, రాజు పాపాల దుముకులాడు. 1830

వ. సందేహము లేదు, సర్వాధికమగు మరణము నొంది యైనను కుల ధర్మములు పాటింతుమని ఖండితముగ పలుక పులస్త్య గోత్రజులును, గోశీల వంశమున బుట్టిన మహేశ్వర నృసింహాదులును వల్లె యనుచు. 1831

తే.గీ. ఎడఁద నోటిని యూరించు యెదుటి చెయిద
మోగు, నిజ ధర్మమున కన్న బాగు కాదు,
పేరు చెడగొట్టు సంపద పేర్మి యేల?
పేయ నిజధర్మ నిష్ఠయే శ్రేయ మగును. 1832

వ. కాబట్టి సందేహము లేక పావకాననమున బ్రవేశించు చున్నారమని నిశ్చయముగఁ జెప్ప వారి దృఢ వచనంబులకు భయపడిన వ్యతిరేకు లెల్లరును నోట మాట రానివారలై యెట్టకేలకు నిట్లనిరి. 1833

ఉ. నరకముఁ గూర్చు నాత్మ హననమ్మది గాఢ తమాంధకారమం
దరయరు కీర్తి, కీర్తి రహితాత్ముల నేరిని, ధర్మ శాస్త్రముల్
నరులకు చెప్పు నీతి యిది, నమ్ముడు రెంటికి చెడ్డ రేవలై
పరము నిహమ్ములన్ చెడుట ప్రాణములన్ బలివెట్టుటన్నచో. 1834

ఆ.వె. కాదు కూడ దనుచు కాష్ఠంబులఁ బడిన
పడుఁడు, మీకు మాకు చెడును బంధు
బంధనమ్ము లింక బధిర ఛాందసులార !
మిడుతలవలె నగ్ని మిట్టి పడుఁడు. 1835

ఆ.వె. అంత నల్ప సంఖ్యులైన వైశ్య వరులు
వంశ మాన విత్త భంగమందు
చకిత గోకు లాగ్ర జన్మ రక్షణమందు
ప్రాణ హాని స్వర్గ పథము మరియు, 1836

తే.గీ. కులము నాచారమును పాటి సలుపలేని
వృద్ధుఁడైన వానప్రస్థుఁ డిద్ధ గతిని
నగ్ని, జల, భృగుపాతాదు లందు మడియ
నఘము నొంద డిదియు శాస్త్ర మనిరి తుదకు. 1837

వ. ఆరు వందల పంద్రెండు గోత్రముల వారింకను రాజుకు కన్య నిచ్చుటయే మేలని వాదించుచుండ నిక సైపలేక నూట రెండు గోత్రములవారు కోపోద్రిక్తులై నిర్ణయము ప్రకటించిరి. 1838

శా. ఓ వాక్పాటవ శూరులార ! ఇకపై నోటాఋ వంశ ప్రభల్,
మీ వైదుష్యము మీర లుంచు కొనుఁడీ మీ దేహ రక్షార్థమై,
మా వైశ్యత్వము మేము కాచుకొనుటే మా రక్ష గావించి మా
భావావేశము చొప్పు రాజ కలిమిన్ వైరంబుతో నోర్తుమీ ! 1839



ఆ.వె. మీరు కోరినట్లు మీ తోడ బంధుత్వ
మింక వలదు, పలుకరించ వలదు,
మాకు మాకు పొత్తు, మీకు మీకును పొత్తు
లుండు దీని కీశ్వరుండు సాక్షి ! 1840

ఆ.వె. ప్రతిగ నారు నూర్ల పంద్రెండు గోత్రాల
వారు శంభు నెదుట బంధు పాశ
ములను గోసి భారముగ లేచి పోయిరి
చరువులగు కులమును జాలిఁ గనుచు. 1841

***ఇది శ్రీవాసవీపురాణమునందు వైశ్య గోత్రములు రెండుగా విడిపోవుట యను అరువదిమూడవ అధ్యాయము సంపూర్ణము.***

(కూలము= ఒడ్డు, తేమాన జీవాతువు= వడ్డీలతో బ్రతుకువాడు, సంశ్రుతము= అందరిచే అంగీకరింప బడినది, అపహ్నవము= స్నేహము, ఓటాఋ= నిస్సత్తువగు)

# అరువది నాల్గవ అధ్యాయము

**కం. ఓంకార బిందు నిలయా !**
**ఐంకార త్రికోణ మధ్య ! అనలోద్భూతా !**
**హ్రీంకారాష్టక కోణా !**
**శ్రీంకారాంతర్దశార ! శ్రీచక్రస్థా !**

తే.గీ. ఆరువందల పదిరెండు అన్వయములు
నూట రెంటిని విడగొట్టి నొవ్వి పోవ,
నవ్వు మోముల పొంగెత్తె నవ్వులాట,
నవ్వు బరువైన గుండెలు నడచి పోయె ! 1842

తే.గీ. వారు పోయిన తరువాత వీరి నవ్వు
కృష్ణ పక్షపు చందురు క్రియలఁ దవిలి
వర్తమానంబు భయపెట్ట, వదనముల న
మవస చీకట్లు క్రమ్మె నమ్మహముఁ దొలఁగ ! 1843

కం. లోపల కలగుండులు కను
పాపల వెలువడిన యంత పరమేశుండే
ప్రాపుగఁ దోచెను వారికి
రూపెత్తిన రక్షణ యన రోదోవిభుఁడై. 1844

ఉ. అంతట నెల్లవారు పరమాత్ముని మానసమందు నిల్పి వ
న్యాంతర వర్తి భాస్కరుల యాశ్రమ వాటికిఁ జేరి మ్రొక్కి రా
సాంతముఁ జెప్పిరా యెడల నైన విశేషము లన్నియున్, తమో
వంతుల నిష్క్రమంబు, తమవారి విధేయత లెల్ల మెల్లగా ! 1845



ఆ.వె. మాటలందు లేదు, మానసంబులఁ దొల్చు
రాజు వలన భయము రంగులీను
శిష్య తతినిఁ జూచి చెప్పె నాచార్యుండు
పూర్వ మందు వారి పుణ్య చరిత ! 1846

ఉ. నారద మౌని చెప్పగ వినంబడి నట్టి కథాక్రమంబు నిం
పారఁగఁ జెప్పుచుంటి, మును భర్గుని తావున వాని సేవలో
పారఁగులైన వారలు, ప్రపన్నులు, మీ కుల కర్తలైన మీ
వారలు తృప్త మానసులు, వల్లడి నొంది రదేమి చోద్యమో ! 1847

చం. కలదొక కూతు రా కులముఁ గాంతులు నింపుచుఁ గీర్తి కన్యకా
కులవతి, యామె యందములఁ గోరి వరించిన చిత్రకంఠునిన్
వలదన నాతఁ డామెయిని వైశ్యులతో తగవాడె, శాపముల్
తలతల పారె, భూమి నవతారము దాల్చితి రీవిధంబుగన్ ! 1848

ఆ.వె. మీరలా గిరీశు మీద వర్తిలు వారు,
వరుసఁ దప్పి విష్ణు వర్ధనుఁడుగ
చిత్రకంఠుఁ డిపుడు చెఱఁ బట్ట నుంకించె,
శాపములుఁ దొలంగు సమయ మాయె ! 1849

తే.గీ. ఇది రహస్య మిన్నాళ్ళుగా మదిని దాచి
శాప పరిపక్వతను పొందు సాధు విశుల
నేరి వివరించు చుంటినో వీరులార !
అగ్ని ముఖమున కైలాస మేగుడయ్య ! 1850

చం. అనవిని వైశ్య పుంగవులు నగ్ని ముఖంబున జొచ్చుటన్న వా
దన యనకుండ చెప్పుడది దారుణ మాత్మ హవంబు గాదె యా
హననము పాప మందు రది యంతయు తప్పని చెప్పఁజాలుదే –
యనుచు నయంబు మీరకయ యాచనఁజేసిరి సద్గురూత్తమున్. 1851

వ. అంత భాస్కరాచార్యులు తమ వైశ్య శిష్యుల సందేహ నివారణార్థము వశిష్ఠ జనార్దన ముని వృత్తాంతంబు నిటుల చెప్పందొడఁగె. 1852

చం. జగదభిరామ సోదరులు సమ్మతిఁ గొల్చిన పాద యుగ్మమున్,
జగముల సృష్టి చేయదగు సన్ముని మోమును డించు మోముయున్,
జగతి వివాహ వేళఁ గనఁ జాలిన పొల్తుక యర్ధ దేహమున్
తిగియుచు నగ్ని గర్భమున తేజము వోలె వెలుంగు నిత్యమై. 1853

ఉ. అట్టి వశిష్ఠ మౌని తన యాశ్రమ మందు తపంబు నుండగన్
కిట్టె జనార్దనుం డనెఁడు కీలక మౌని యొకండు వానినిన్,
కట్టెదుటం జెలంగు మునిఁ గాంచి వశిష్ఠుఁడు నర్ఘ్య పాద్యముల్
కట్టడ మేర ప్రేమనిడి గద్దియ నిచ్చి ప్రియంబు సల్పుచున్. 1854

మ. ముని చంద్రా! నిను బిల్వ నే పదము లామోదార్ద్ర యోగ్యంబులో,
నినుఁ గాంచంగల భాగ్య మే మిథునమున్ దివ్యంబు గావించెనో,
మును నీ పాద రజంబు సోకి పులకల్ మోయంగ పుణ్యంబు చే
సిన క్షేత్రం బెదియో? వినంగ నిను నే సేవింతు ధన్యాత్ముగాన్. 1855

కం. విన నుత్సుకుఁడౌ బ్రహ్మ
ర్షిని గని యాగంతువును వశిష్ఠున కనియెన్,
జనము జనార్దనుఁ డందురు
జనియించితి ప్రకృతి పురుష జన జఠరములన్. 1856

కం. ఏ కడ నుంటివని యడుగ
నా కొక కడ యనుచుఁ గలదె ! నా రూపము నా
రాకను, పోకనుఁ దెల్పదె ?
లోకంబున యతులకుఁ గన లోఁగలి కలదే ! 1857

కం. లోకంబులు తిరుగుచు నీ
లోకంబున నీ సపర్యలో తనివోవన్
నాకీ భాగ్యము కలిగిన
దీ కడ నీ వేళ నీకు నిష్టం బొసగన్ ! 1858



కం. అంతట ఋషి కుల గురుఁ డా
గంతువు కడ కోర దగిన కామ్యము లేమిన్,
సంతసమగు వాత్సల్యపు
తంతువు కొన సాగనిమ్ము తండ్రీ యనియెన్. 1859

వ. అంతట జనార్దనమునియును వశిష్ఠు మనోగతంబుఁదెలియనెంచి. 1860

కం. ఎంతటి ధనవంతంబును
నెంతటి విజ్ఞాన ధనము లిమిడిన యొడలున్
సంతృప్తి నొందదని ధీ
మంతులు వాకొందు రవని మంగళ చరితా ! 1861

తే.గీ. భౌతికాభ్యుదయమునకు బాధ లేదు,
బౌద్ధికాభ్యుదయమునకు బాధ లేదు,
మానసిక విభూతుల గనం బాధలేదు,
పర గతాత్మ సంబంధమై ప్రాపు వలదె ? 1862

ఆ.వె. అంత ఋషివరుందు నాగంతువునుఁ జూచి
కోర్కె లేని వాని కోర్కె తీర్చ
కంకణమ్ముఁ దాల్చి తింక నీ యిష్టంబు
కొనుట కేను సిద్ధ మనుచుఁ బలికె. 1863

ఆ.వె. శుద్ధ దేహ మందు శుద్ధం బగును బద్ధి,
శుద్ధ బుద్ధి చేత శుద్ధ మనము,
శుద్ధ మనము చేత శుద్ధ చిత్తము కల్గు,
శుద్ధ చిత్తమందు శుద్ధ మాత్మ ! 1864

ఆ.వె. ఆత్మ శుద్ధి చేత హరియించు కోర్కెలు
కోర్కె లేని వాఁడు కోరు టెటుల ?
కోర్కె లేదటన్న కొండెక్కు నహమంద్రు,
నేమి చెప్ప దగుదు నే మునీంద్ర ! 1865

తే.గీ. అతిథిగా వచ్చినట్టి యా యతియు నంత
మహదహంకార మొక్కటే మనికి లేక
దైవ మను పేరఁ బరగును దివిని భువిని,
మనుచు మననిచ్చు మనకు లేదనకు మనియె. 1866

తే.గీ. ఇచ్చ యొంటిగా మొదలగు నేగు కొలది
మఱ్ఱి వృక్షంబునకు వలె మ్రాను పెరిగి
శాఖలకు శాఖలగుచు విశాల మగును,
మూలమును ఛేద మొనరింప వీలు పడదు. 1867

వ. అనుచు పరిపరి విధముల నచ్చఁబలికినను మానసంబు బయటపడని వశిష్ఠుని వదలి జనార్దనముని చనియెనంత. 1868

ఉ. చూచుచు నుండ లోక ముపసూర్యకమై, తమసాతిరేకమై,
పేచక బూచి బూతముల ప్రేత వనంబునునై, భయంకరా
ఊచక శబ్ద బంధురము అవ్వల రచ్చయునై హరింపగన్
మోచనఁదప్పి లోకహిత మోహమునందు వశిష్ఠుఁడున్ చనెన్. 1869

ఉ. అందరి తోడ సంయమని హండను సంయమియుం బడెన్, యమా
క్రందము జేసి లోకమునఁ గాలిడె బ్రాహ్మణ జన్మమంది వా
రందరి తోడ, యౌవనము నందిన కాయము కామ తీవ్రతన్
తొందర చేయ బ్రాహ్మణులతోడ జపాదుల గండముండుటన్. 1870

తే.గీ. క్షత్రియుఁడ నంచుఁ బలుకుచు క్షత్ర కన్య
లను వివాహంబు నంగూడి తనివిఁ దీర,
తిరిగి బ్రాహ్మణు లందును పరిణయముల
సుఖము లందుచు జీవించుచుండె నంత. 1871

కం. కపటము వంచన మోసము
లపరాధము లెన్ని నాఁడు లటులే దాగున్ ?
విపుల వివేకము లేమగు;
విపరీతము లారి పోవె విజ్ఞానమునన్ ! 1872



ఉ. ఆతత ధర్మ వర్తనులు, నాచరితాన్వయ నీతి సంపదుల్,
జాత శరీర సంపద విచారము లేక వసించు వారు, సం
జాత పరాత్ప రాత్మ గుణ సంపదలన్ గ్రహియించి మోసగాఁ
డీతఁ డటంచు, తో గడుప నిష్టము లేక మహాత్మ గాములై. 1873

ఆ.వె. జాతవేదుఁ దలచి జ్వలనమ్ము గావించి
విషయ వాసనలకు వీడుకొలిపి
కేవలాత్మఁ దలఁచి కీలలందున దూకి
హవ్య మౌచుఁ జనిరి దివ్యమునకు. 1874

ఆ.వె. మిగులు మీది రక్తి మిగిలె వశిష్ఠుండు
బూది రాశిఁ జూచి ఖేదమంది,
తప్పు నాది, వీరు తపనుఁ జెందగ నేల
శిక్ష లందు నిట్టి శిక్ష కలదె ! 1875

ఆ.వె. పట్టి తిట్ట వచ్చు కట్టుఁ దప్పితి నంచు,
కట్టి కొట్ట వచ్చు గుట్టుఁ దెలిపి,
పట్టు దట్టమైన మట్టు పెట్టను వచ్చు,
మాట లేక యిట్లు మాయఁ దగునె ? 1876

కం. ఛీ ! నాకేనా యీ యభి
మానము దేహంబు పైన ? మాపగ లేనా !
నేనును మాసెద నంచును
తానును కాష్ఠాగ్ని దూకఁ దలకొను నంతన్. 1877

ఉ. మాయ తొలంగె, నంతయును మాయము, బూదియు లేదు, తొల్లి రూ
పాయతనంబునై వనము నాశ్రమమున్ గవి దారవంతమై,
కాయము జీర్ణమై గతము కట్టెదుటం గనరాగ సిగ్గుతో
గాయక మారయం దలఁచె, గాంచె జనార్దన మౌని పుంగవున్. 1878

ఉ. నవ్వడు పాటు చూచి, తన న్యాయము కాదని వాదులాడినన్
నొవ్వడు, సాధనాంతమున నూల్కొన రాని వ్రతమ్ము వమ్ము కా
నివ్వడు, పారమార్థికుల నిచ్చకు వచ్చిన యట్లు ద్రిప్పు చే
దివ్వె చలింప డట్టి యతి దేవున కంజలి చేసె నమ్రతన్. 1879

ఆ.వె. కాయముందు వఱకు కాంక్షలుండు నటంచు
తెలియదాయె నిజము, తెలిసె నేడు
కాయమందు నుండి కదలి పోయెడి కాంక్ష
నుండ వలయు దోస పండు వలెను. 1880

వ. అంచు వశిష్ఠుండు పలుక జనార్దనుండు నదృశ్యమయ్యెఁ గావునఁ బూర్ణ చిత్తంబున దేహమందు విరక్తి నంది హవ్య వాహనుని వెంట స్వస్థానంబున కేగుచుంటినను తలంపున నగ్ని ప్రవేశంబు నొనరించిన నది యాత్మహత్యకాదిక మీ చిత్తంబు ననుసరింపుడనియె. 1881

**ఇది శ్రీవాసవీపురాణమునందు వశిష్ఠ మాయా జనార్దన వృత్తాంతంబను అరువదినాల్గవ అధ్యాయము సంపూర్ణము.**

(మహము= తేజము, తలతలపారు= ఒకరినుండి మరొకరికి ప్రాకు, కిట్టు= సమీపించు, హండ= వెడల్పుమూతిగల పెద్దకుండ)



# అరువది యైదవ అధ్యాయము

**కం. లం స్థిత బహిర్దశారా !**
**హం స్థిత చతురధిక దశ వియత్పథ కోణా !**
**యం స్థిత పద్మ దళాష్టక !**
**రం స్థిత షోడశ దళయుత రవిగణ చక్రా !**

వ. అంతట నుత్తమాన్వయ సంజాతుండగు కుసుంభుఁడును లెస్సగ నాలోచించి గురు వచనంబుల నర్థంబు గ్రహించిన వాఁడై సభకు ప్రదక్షిణంబుఁ గావించి చింతాక్రాంతులైన సహచరుల కంజలి బద్ధుండై యిట్లనియె. 1882

ఉ. వందనమయ్య విప్రకుల వర్ధన భాస్కర పండితార్య ! ని
స్యందిత ధైర్య సంపదల సన్నిధినున్న కిరాటులార నా
వందన మందుకొండు, నను వహ్నిఁ జొరంగ ననుజ్ఞ నిండు నా
కందు పసిండి వాసవిని, కన్యకఁ గూడి కులంబుఁ గావఁగన్ !1883

తే.గీ. అనుచుఁ బుత్ర సోదర బంధు జనము తోడ,
నూరు నొక గోత్ర విశుల సన్నుతుల, నుతుల
కేవలము చేరు కోరిక కేవలముగ
ప్రణుతి చేసెను కుసుముఁడు ప్రణతుఁ డగుచు. 1884

తే.గీ. రాజ భయమునఁ గొంకు కిరాటు లంత
కుసుము ప్రార్థన వినుచు సిగ్గు పడుచుఁ బురు
షత్వ సిద్ధులై మోముల చాయ మార
పలికె నిట్టుల ధైర్య విపాకు లగుచు. 1885

సీ. భయమేల కల్గెనో ప్రభువు బాధించు నం
చును మనంబున మాకు చోద్య మగును,
భయమైన, వారితో పారిపోదుము కాదె ?
నీ వెంట నిట నుంట భావమేమి !
కుల రక్షణంబు నీ కొకనికేనా యేమి,
మాకు బాధ్యత లేదె మాన ధనుఁడ !
మరణ మొందిన నీవు, మమ్ముపేక్షించునా
కోపమొందిన రాజు మాపుఁ గాని,

తే.గీ. మనుఁడొ, మరణమొ, మనమెల్ల మనసు పెట్టి
కలసి చేయందగును కాని కనల రాదు,
రాజునకు కన్య నీయగా రాదు నిజము,
పాటి సేతము గురుముఖ పదము లెల్ల. 1886

కం. అనఁగ కుసుంభుఁడు నిట్లనె,
చనవున నట్లంటి గాని, చనుదే మీరల్
చెనకక చను వార లనగ,
ననుచుంటి సమస్య నాది, యాలము నాదే ! 1887

ఉ. వాకొననేల మీదు పరివారములన్ విడనాడి ప్రాణముల్
నా కయి యిత్తుమంచు, క్షితి నాథుని వైరము నాకు మాత్రమే
దీకొన నౌను, దానముల దింపకు డయ్య ఋణంబులోన, పై
లోకముఁ జేరనిం దమిత లోలుఁడ నేఁ బరమాత్మఁ జేరగన్ ! 1888

ఆ.వె. అన్న కుసుము విని జగన్నాథ పురపతి
భద్రుఁడనెడు శ్రేష్ఠి పలికె నిట్లు,
వినుఁడు నేను చెప్పు వృత్తాంత మొకసారి
హరి విధించి నట్టి యాజ్ఞ యొకటి ! 1889



మ. అవినాశుండును, నవ్యయుండును, సదాహ్లాదుండు, నారాయణుం
డవగీర్ణావిరతావ బోధకుండునౌ ఆర్యున్, నిరాహారునై,
లవలేశంబును నాస లేక మది వాలాయంబు శుద్ధాత్మునై
హవణిల్లంగ నలంకరించి భృశము న్నారాధనం జేసితిన్. 1890

కం. సేవలు ఫలియించె నతఁడు,
గోవుల యెడ గోపకునటు కుంభాస్యమునన్,
నా వలన నేమి కోరెద
వీవంచును నిలచె నెదుట హిత మీడేర్చన్ ! 1891

కం. మోక్షము మోక్షము మోక్షము
మోక్షమె ముమ్మాటి కిమ్ము మోహన రూపా !
మోక్షంబు నొసంగఁ గలుగు
దక్షుండ వటంచు గొలువ దాసుఁడ నైతిన్ ! 1892

కం. అని వేడఁగ నాతండును
చనవుగ నా శిరము నిమిరి, చాతుర్య నిధీ !
మనుమిక కొలది దినంబులు
చనుదెంతువు మోక్షమునకు సాధుల తోడన్ ! 1893

తే.గీ. వెనుక జన్మంపు శాపంబు వెంట బడఁగ
వైశ్యులందు ముముక్షువుల్ వహ్ని మార్గ
మందు మోక్షంబు నందెద రంబఁ గూడి,
చనుదువిది నిజం బనుచును చనియె, కుసుమ ! 1894

కం. అప్పటి నుండి విధేయత
నిప్పటి వర కెదురు చూచు చిటులుంటిని నే
నిప్పటికైనను మీతో
నిప్పుల కైలాస పదము చొప్పడ నిమ్మా ! 1895

తే.గీ. వినుచు నా మాటలందఱు ననలుఁ జేర
నేల నిక సంశయమటంచు నెసఁగు చుండ,
నధిపు తలద్రాత వలె సూర్యుఁ డస్తమించె,
నతని యజ్ఞానమన దిక్కు లంధ మలదె. 1896

వ. అంత వేదోక్తాచరణాను శీలురగు నా వైశ్యులు సాయం సంధ్యానుష్ఠానంబులఁ దీర్చికొని తిరిగి నగరేశ్వరుని సన్నిధిని జేరి యాచార్యుల బరివేష్టించి కూరుచుండ నాతం డగ్ని ప్రవేశమునకు తగిన నియమంబుల బోధించ దొడంగె. 1897

తే.గీ. నూట రెండు కులంబుల నూట రెండు
జంటలకు మాత్రమే మంట లంటుకొనఁగ
నియమమును సేతు గోత్రముల్ నిలుచు కొఱకు
వృద్ధ దంపతులైనచో సిద్ధి సుఖము. 1898

ఉ. కోరికఁ దీర జీవితము కుత్తుక బంటిగ నోర్చినట్టి వా
రారయఁ దృప్తులౌట, తనుపారిన కొర్కె విరక్తి నొందుటల్
వారు పరంబుఁ జేరగల వారలు, వైదిక ధర్మ సాధకుల్,
వారికి పాప మంటదిక వహ్నిఁ జొరంగ పరాక్రమింపుడీ ! 1899

చం. అనవిని ధర్మ గుప్తుఁడనె, హాఁ అటులైన కులంబు హీనమై
వనట వహింప నేమగుదు ? వహ్నిఁ జొరంగల వృద్ధులెవ్వరున్
వెనుకల లేరు, గోత్రము నవిఘ్న మొనర్పగ నొక్కరుండనే
పెనగుచు నుంటి, నెట్లు నడపింతువు భూసుర ! గోత్ర ధర్మమున్ ! 1900

తే.గీ. ధర్మ గుప్తుని విన్నంత ధర్మ సంశ
యమ్ము యమ్మున గ్రుమ్మిన యట్లు నయ్యె,
నంద రొక్క గొంతుక తోడ ననిరి విరత
ధర్ము ధర్మునితో నిట్లు తడియు నెదల. 1901

చం. వగవకుమో కుమార ! చనువారికి చెల్లును సాహసింప, పా
రగ నణుమాత్రమైనఁ గనరాదు ముఖంబున దీనరేఖ, యీ
తగదను మాట కర్ణములఁ దాకెడు దాక, నిదాన మొందుమా,
నిగములు తప్పు పట్ట, రిట నిల్పుము వంశము నుద్ధరింపగా. 1902



ఆ.వె. ధర్మ గుప్తు డద్ది ధర్మంబు గాదంచు,
నిందు నిలువ గోత్ర మీశుఁ దప్పు
నంచు, మంచిదగును నందున నిల్చుటే,
అనుమతించు మనియె నార్య గురుని. 1903

కం. అందరి మొగములు తన నే
మందు వనంగ నిగుడ గురుఁ డాతనిఁ గనుచున్,
పొందు మనల కైలాసం
బందరితో శాప ముక్త మందుము ధర్మా ! 1904

తే.గీ. అందు మగ్ర తాంబూలంబు నగ్ని చేర
నిహమునం గుల శేషంబు నిచ్చ లేక,
ఉపరి పదమందు లక్ష్యంబు నొంది, మోక్ష
మౌరసులు లేకయే లాభ మగును గాక ! 1905

ఆ.వె. అనుచు భాస్కరుండు నారు తంతువు లందు
నారు తమలపాకు లారు పోక
లమరఁ జుట్టి చేతి కందించె నతనికి,
కలఁగువారి తోడ పలికె నిట్లు. 1906

చం. తన కుల గోత్ర గౌరవము తగ్గుట కిష్టము లేక బాలకుం
డనలముఁ జేర పూనుకొనె నాయము చేరగ స్వస్వరూపమున్,
చను నితగాని పెద్దలకు చాలిన యంతగ మీరలిచ్చు త
ద్దినముల, పర్వ వేళ పితృ దేవుల పేరిట దాన ధర్మముల్. 1907

వ. ఈ సమయము పాటించుడు మీ వంశముల నంతకంతకు నభివృద్ధి యగునన నద్ది మా ధర్మంబవశ్యము పాటింతు మనుచు ప్రతిన చేయ ధర్మశ్రేష్ఠియును వందన మాచరింప నందరును భారచిత్తంబుల నిట్టూర్చిరి. 1908

***ఇది శ్రీవాసవీపురాణమునందు ధర్మశ్రేష్ఠి యను బాలకునకు నగ్రతాంబూలం బిచ్చుట యను అరువది యైదవ యధ్యాయంబు సంపూర్ణంబు.***

(అవగీర్ణ= పొగడబడిన, కుంబ= యజ్ఞకుండము చుట్టు వెలుగు)

# అరువది యారవ అధ్యాయము

**కం. వం స్థిత భూపుర చక్రా !**
**సం స్థిత సర్వాత్మికా ! ససత్త్వాతీతా !**
**సంస్థాన మధ్య సకలా !**
**సంస్థిత శ్రీచక్ర వాస స్వాధిష్ఠాత్మా !**

కం. అంతట కంకణములు ధరి
యింతురు దీక్షా విధాన మిదియన గురుఁడున్
సంతస ముప్పొంగ విశులు
వంతుల సాచిరి కరములు వత్సములటులన్ ! 1909

ఉ. ప్రాణములన్న భీతిలెదు బచ్చుల ధైర్యము సాహసమ్ము వి
ష్వాణమునందు వోలె కనఁ జాలిన భాస్కర పండితాత్మలో
బాణము వోలె దూసినది ప్రశ్న మొకండు వధూజనమ్ములో
ప్రాణములన్న నాస గల పట్టుల నంతయు వ్యర్థమే కదా ! 1910

చం. అదియును గాక వాసవికి నాయువుపై మత మేమిటో యెరుం
గఁ దగు, మనోజ్ఞ మంజుల నికాయము కాయము కాదుసేయ నె
ల్లిద మగునో, నికామ మతి లీలలఁ జిక్కి సుఖంబుఁ గోరునో,
సదమల వృత్తి నామె మది సత్య మెఱుంగ దలంతు నియ్యెడన్. 1911

ఉ. కావున నాదువారి కుతుకమ్ము నెఱుంగుట పాడి మీకు, మా
యావులు కాకుఁ డా వనిత లందున, వారికి చెప్పి చేయుటల్
పావన చర్యలౌను కద ! పావకుఁ దర్మిలి చుట్టుముట్టగా
కావు మటన్న నేమి కథ, కన్గొని రండు గృహంబు కేగుఁడీ ! 1912

చం. అనవిని వైశ్య లందఱును ఔను కదాయని ముక్కు పైన వ్రే
లును మునుపండ్ల నాలుకను లోఁగొని నేత కుసుంభ శ్రేష్ఠినిం
గనుగొని, వృద్ధులౌట మన కాంతలు తెలిక యొప్పుకొంట నీ
యనలము చేర వాసవి హృదంతర నిశ్చయ మందుకొమ్మనన్. 1913

కం. కుసుమ శ్రేష్ఠియు నంతట
కసుగందిన మోముతోడ, కన్యక తనకా
పసి తనమునఁ దెలిపిన కథ
శసనంబై మఱపుఁ దగుల చకితాననుఁడై. 1914

కం. నేఁటికి యింటికి పోదము
నేటించి మనోగతమ్ము నిభృతాహితులై
పాటింతము గురు వాక్యము
తూఁటాడఁగ రాజు నింక దోషాపహమై. 1915

ఆ.వె. అనఁగ వైశ్యు లెల్ల నాచార్యు నానతిన్
సెలవు గొంచు నిండ్లు చేరినారు,
ఎట్టులో యొకటుల నెంగిలి పడి కుసుం
భుండు శయ్యఁ జేరి పొగుల సాగె. 1916

సీ. ఎంతకాలము నేను సంతాన హీనత
నెంతగా పొగిలితి చింత చేత,
నెంత తపముఁ జేసి తెందఱఁ బ్రార్థించి
తెంత కాలము నిరీక్షించి తేను,
ఏనాటి పుణ్యమో యే దేవ దత్తమో
అనపత్య దోషంబు నధిగమింప
యజ్ఞ వాటిక యందు నావిర్భవించెను
బిడ్డ లిద్దరుగ నా వేల్పు తుదకు,
ఆ.వె. సంతు కలిగెఁ గాని సంతోషమే లేదు,
లేదు నీకనుచు విలేఖకుండు
వ్రాసెనేమొ నుదుటి వ్రాత యిట్లాయెనే
తిరుగు లేని విధికి దేవుఁడెంత ? 1917

సీ. వాసవీ కన్యక బంగారు బొమ్మ మా
యింటి దీపమ్ము మా కంటి వెలుగు,
ఆడిననాటగా పాడిన పాటగా
నట్టింట తిరుగాడు చిట్టి తల్లి,
వంశోన్నతుండైన వరుఁ జూచి యతనింటి
దారఁ జేయగఁ జాలు తరుణ మిదియ,
పండుగ పబ్బాల పడుచు దంపతులొగి
నింటికి రా వారి కిష్ట మైన

తే.గీ. వంటకములను, బంగారు వస్త్రములను,
మణులు మాణిక్యముల నిచ్చి మక్కు వలర
సంతసంబుల నవ్వులు సందడించు
భాగ్య మన్నది లేదు నా భాగ్యమందు. 1918

తే.గీ. ఎంత యానందముగ నుంటి నింత వరకు
వింత యూహలఁ దేలుచు నంతరమున,
ఊహ కందని వింత పీయూష మొకటి
కంటి పాపను కరుణించె మంటఁ గలుప ! 1919

చం. మృదులశిరీష, భూషణ సమీకృతశోభ, వినమ్రభార, శా
రద, సుకుమార తేజ, రసరమ్యదృగంచల, నేత్రపర్వ, నీ
రద చపలాతిరేక, ననురాగ మయంబుగఁజూచు కూతురున్
చదలస్పృశించు కీలలకు చర్వణమందున నెట్లుత్రోతు నేన్ ? 1920

తే.గీ. ఇట్లు చింతించు తండ్రి నిద్రించ కుండ
యేమి చేయుచు నుండెనో యెఱుఁగ దలఁచి
వచ్చి చేరెను వాసవీ బాలకన్య
హిమ గిరీంద్రుని చేరెడు హిమజ వోలె ! 1921

కం. ఒడిఁ జేరిన వాసవి సుత
యొడ లంతయుఁ దడుము తండ్రి యొందిలియై, యే
యొడికముఁ గనరాక దలఁచె
సడవని నమ్మితె గొఱియ కసాయిని వోలెన్ ! 1922



ఉ. వందురు తండ్రిఁ జూచి పసి వాసవి మోమున మబ్బుఁ గ్రమ్మె, నీ
వందుర నేల తండ్రి ? ఎటువంటి విచారము నైన గాసి చే
యందగు శక్తి నీది, కదియంబడి నెగ్గిన కష్ట మేది? నా
సందియ మే నెఱుంగ దగు సంస్థిత మేని వచింపుమీ యనెన్. 1923

తే.గీ. యుక్త తరుణిమ వాసవీ యోష పలుకు
లెల్ల శైశవవాక్కులై యుల్ల మందు
తాకి, చింతించు వానికి దారి చూపె,
కష్ట పెట్టునె తండ్రిని కడుపు పంట ! 1924

కం. పసి దాన వెట్లు చెప్పుదు
కుసుమించెడి మొగ్గ నెవఁడు కుంపటి వైచున్ ?
కుసుముని వాత్సల్యము చనె
రసికుల పాలిట కుసుంభ రాగము వోలెన్ ! 1925

వ. అనుచు నటువచ్చిన ధర్మపత్ని కౌసుంభియును వినుచుండ నతండు జరిగిన వృత్తాంతంబెల్ల వివరింప సుకుమారి వాసవియును నది యట్ల యగుఁ జింతింపఁ బనియేల యనుచు నిట్లనియె. 1926

కం. నాకై శోకింపగ నే
లా కైలాసమునకుఁ జను లాభము చేదే ?
మీకది యిష్టమొ కాదో,
నా కిష్టమె అగ్ని యాత్ర నా తావునకై ! 1927

ఉ. చెప్పుము తండ్రి ! ఈ జగతి జీవన మింపగు నేని మీకు నే
నొప్పియు లేని రీతి నని నుగ్గొనరించెద శత్రు సంహతిన్ ,
చొప్పడు నెల్ల భూమి తన చొప్పున నీ యెడ నేలుకొమ్ము యే
ముప్పునులేక బంధువుల ముచ్చటఁదీర్చుము, పేరుపొందుమా ! 1928

ఆ.వె. మాయ చేత బుద్ధి మూయ బడిన తండ్రి
బాల మాట చొప్పు బాల్య మనుచు
చెవినిఁ బెట్టకుండ చెప్పె నీ విధముగా
పాలుకారు బుగ్గ పసిమి పుణికి. 1929

సీ. మధురభాషిణి ! నీకు మా మనోవ్యధ నెట్లు
చెప్పగలను నీది చిన్న వయసు,
సుకుమార మైనట్టి సుందర రూపమ్ము
సంపెంగ మొగ్గయౌ సన్నముక్కు,
దివ్యాభరణముల నవ్య శోభల నీను
అలరు కంటెను మృదువైన మేను,
సకల భోగములకు సంసిద్ధమగు దాని
విస్ఫులింగము లందు విడచు టెట్లు ?
తే.గీ. అన్ని దిక్కుల వ్యాపించు నగ్ని కీల
లాకసము నంట జృంభించు నపుడు నీవు
చేర నుంకించు టెటుల యోచింపు మమ్మ,
శిఖల మునుగుట మాటలా చిట్టి తల్లి ! 1930
ఆ.వె. తల్లి దండ్రులైన ధనము ధాన్యమునైన
బంధు మిత్ర శత్రు బంధమైన
సొంత ప్రాణమునకు జోడుకావెప్పుడు
శిఖలఁ జొత్తు ననెడి చిట్టి తల్లి ! 1931
తే.గీ. మున్ను ద్రుపదుఁడు కనలేదె జన్నమందు,
పెండ్లి చేయడె, బంధుల పెంపుఁ గనఁడె;
లేవు నాకా విభూతులు, లేదు భవిత,
ఛిద్రమాయె నా బ్రతుకెల్ల చిట్టి తల్లి ! 1932

వ. అనుచు వివిధభంగుల దుఃఖించు తల్లిదండ్రులఁగని వాసవీకన్యక వారిని కర్తవ్యోన్ముఖులజేయ మాయఁతొలగించి తత్త్వోపదేశంబుఁగావింపఁదొడంగె. 1933

***ఇది శ్రీవాసవీపురాణమునందు కుసుంభ శ్రేష్ఠి అగ్నిప్రవేశ విషయమును కుమార్తె కెఱింగించుట యను అరువదియారవ అధ్యాయము సంపూర్ణము.***

విష్వాణము= భోజనము, ఒందిలి= దుఃఖితుడు, సడవ= మార్గము)



# అరువదియేడవ అధ్యాయము

**కం. ప్రకట శిరస్సాహస్రీ !**
**ప్రకటానల శత సహస్ర పాటవ జిహ్వా !**
**ప్రకటిత పాద సహస్రా !**
**ప్రకటీకృత విశ్వరూప పర పరిమాణా !**

ఆ.వె. రావి యాకు చివర రాలిపో సిద్ధమై
భూమి వ్రేలు నీటి బొట్టు బ్రతుకు,
రోగ మయము, మలిన రాగ మయంబైన
తనువు నెవడు నిలుపఁ దలఁచు తండ్రి ! 1934
ఆ.వె. నిలచి యుండ బోని, నిలుప నుండగ రాని,
మలినమైన దాని, విలువ లేని
దైన, మరువ లేనిదైన నిత్యంబంచు
తనువు నెవడు నిలుపఁ దలఁచు తండ్రి ! 1935
ఆ.వె. వాగు లోన నీటి వడికి గరిక పోచ
లెటుల కలసి పోవు నటులె వీడు,
బ్రతుకు నందు నటులె పలు పన్నికలు పోవు
తనువు నెవడు నిలుపఁ దలఁచు తండ్రి ! 1936
తే.గీ. ఆత్మ దేహంబు ధరియించు నవని యందు
నరుఁడు వసనంబు ధరియించు కరణి వినుము,
కట్టె బట్టల విప్పుచుఁ గట్టు నట్టి
ఆత్మ నిత్యంబు సత్య మనంత మయ్య ! 1937

తే.గీ. ఆత్మ రూపంబు నీవు నే నవని జనులు
నెల్ల లోకముల్ భూతమ్ము లెల్ల జగతి
జగతిఁ గౌమార యౌవన జరలఁ గడచి
తిరిగి కౌమార దశ నొందు దేహి యిచట. 1938

తే.గీ. అవనిఁ జంపుదుఁ జచ్చెద ననెడు వాఁడు
షడ్వికారాది దోష వేషముల లోన
బ్రహ్మ తత్వంబు వెదకెడు పామరుండు,
సమయ, సమయింప వాని కసంభవమ్ము. 1939

తే.గీ. తడవ దెండదు కాలదు తఱుఁగు వడదు,
అంట దీనాటిదియుఁ గాదు, కంట వడదు,
పడదు తలపుల చెదరదు ప్రాతఁ బడదు,
రూపు మారదు, శ్రుతుల చిద్రూప మాత్మ ! 1940

తే.గీ. అంతమే లేని యాత్మకై చింత యేల ?
నాశ మొందెడి తనువుల నాశ లేల ?
తుచ్ఛ బాంధవ్య సంబంధ దుఃఖ మేల ?
సాధకున కిట్టి యనుమాన శోధ తగునె ! 1941

తే.గీ. తొలుత తుదలందు కనరాని తులువ తనువు
నడుమ నగుపింప నద్దాన నడలఁ దగునె ?
పాల బుడగల నాడెడు బాలకుండు
చిదిపి కనరాక యేడ్చుచు వెదకు నటుల ! 1942

తే.గీ. తనువు చెడుగాక ఆత్మ నాశనము కాదు,
ఆత్మ ప్రతి బింబములఁ జూపు అద్దములను
పగుల గొట్టంగ పుట్టును పాపమంచు
నేల చింతింప, పొగులగ నేల తండ్రి ! 1943



తే.గీ. సమత నాత్మానుభూతిని సంతరించి,
మదిని జనియించు నాశల వదలు నెవఁడు
అతఁడె పుడమిని స్థితప్రజ్ఞుఁ డనఁగఁ జెల్లు,
వాని నడవడి వివరించు దాన వినుము. 1944

తే.గీ. ఇష్టముల పొందు నాశింప నిష్ట పడదు,
ఇష్టముల పొందు తప్పిన కష్ట పడదు,
శుభము వడసిన సంతోష శోభఁ గనఁడు,
శుభముఁ దప్పిన పరితాప శోక మనదు. 1945

తే.గీ. ఊట లైదింటి మూయు తాబేటి రీతి,
ఆక లెఱుఁగదు, దాహంబు నైనఁగొనఁడు
చిత్తమున్నిల్పు శాశ్వత విత్తమందు
పృథ్వి దెసఁ జూడ్కు నిల్పు జాబిల్లి వోలె ! 1946

తే.గీ. జగతి సంపద చూడ నాసక్తి కలుగు,
దాన కోఱిక నద్దానఁ దపన కలుగు,
దాన సమ్మోహ మద్దానఁ దగులు మరపు,
మరపు నశియింపఁ జేయు సన్మతిని, గతిని. 1947

తే.గీ. కడలి నలవోలె నటునిటు మిడిసి పడుచు
కామ్య శాంతంబు నందదు కామ కామి,
శాంతి లేకున్న బ్రతుకున కాంతి లేదు,
పరమ శివుచెంత కైలాస భాగ్య మెటుల ? 1948

తే.గీ. కన్ను చెవి ముక్కు నాలుక కప్పు తోలు
ఐదు గుఱ్ఱాలు వాటిని మీదుఁ గట్టి
బుద్ధి రథమును త్రోలంగ శ్రద్ధ కలిగి
భవము తప్పును, శాంతి సంభవము నిజము. 1949

తే.గీ. నదుల నన్నిటిఁ దనలోన నదుము కొనియు,
కలత వడనట్టి లోతైన కడలి యటుల
ప్రకృతి శక్తులఁ జెదరని బ్రహ్మ నిష్ఠ
శాంతి నొసఁగును, చేర్చును శంభుఁ దుదిని. 1950

ఆ.వె. కట్టు వడిన యాత్మ కట్టిన మాయలో
తిరుగుచుండు నెపుడు తెలియ రాక,
తెలిసినంత తానె దివ్యాత్మ, మిగిలిన
తనువు నెవఁడు నిలుపఁ దలఁచు తండ్రి ! 1951

ఆ.వె. కూతురనుచు నన్ను కూర్మిఁ జూడకుమయ్య
తల్లి లేదు నాకు, తండ్రి లేఁడు,
బంధు మిత్ర శత్రు పరిచారకులు లేరు,
తనువు మాయ, నిలుపఁ దగదు తండ్రి ! 1952

తే.గీ. అష్ట భూతము లుండు నా యిష్టమందు,
వాని కాధారమును నేను, కాన రాను,
బ్రహ్మ మొదలు పిపీలికా పదము వఱకు
నాదు లోనుండుఁ గాని నన్నంట వెపుడు. 1953

తే.గీ. ప్రళయ వేళల విశ్వమ్ము ప్రణవ మందు
లయము చెందును, మరల పల్లవము నొందు,
నాదు కను సన్నలందు యీ భేద జగతి
నర్తనము చేయు నేనిచ్చు వర్తనముల. 1954

తే.గీ. సర్వ యజ్ఞమ్ములును నేను, సర్వ మేను,
తెలియ దగినట్టి గుఱి నేను, తేట నేను,
చేర దగినట్టి దరి నేను, చిరము నేను,
కాలమును నేను, కారణ కార్యమేను. 1955



తే.గీ. కోటి యంశల నొక దాని కోటి గోట
బ్రహ్మ ప్రభవించె నందులో ప్రభవ మందె
చాల సప్తర్షి మండల చయము లందు
మనువులు వరుసఁ బ్రభవించి రనువు నిటుల. 1956

తే.గీ. మండలంబున కోట్లాది చండ భాను
గోళములు పుట్టి బ్రహ్మాండ గోళమెల్ల
కాంతి వెదజల్లె నందున గ్రహములెల్ల
పుట్టి పుట్టించె సకల సంభూత వితతి. 1957

తే.గీ. సందరమ్మున నిసుమున సందు నుండు
మంటిరేణువు వలె నున్న మానవుండు
నన్నుఁ దర్కించి తెలిసి కొన్నంత చాలు,
తనదు యునికిని గ్రహియించు, మనును తెలిసి. 1958

ఆ.వె. కనుక తెలియు మేను కారణాంతర మందు
నీదు కూతు నైతి నిఖిల నయ్యు,
నిన్ను మాయ తొలగ నిజరూప దర్శనం
బిత్తు చూడు మనుచు నిహము నిండె. 1959

తే.గీ. భూ నభంబులు గనరాక ఘోరు మనుచు
భీకరంబైన శబ్దంబు, చీకటియును,
క్రమ్మఁ గుసుమాఖ్యుఁ డంత భీతమ్ము నందె;
అలమె నిశ్శబ్ద మంతలో నవధులెల్ల. 1960

తే.గీ. మంద్రకలకంఠమందు నిర్మాణ మంద
ప్రణవ శబ్దాబ్జ మందులో ప్రభవ మందె,
భుగభుగల మంట లవకాశ భుక్తిఁ జేసి,
కోట్ల కాంత్యుష్ణ రాసులై గోళ లయ్యె. 1961

తే.గీ. మొదలు తుదలేవొ తెలియవు, ముఖము లెన్నొ
లెక్కఁ బెట్ట నసాధ్యమ్ము, దిక్కు లెల్ల
కలిసి పోయిన బ్రహ్మాండ వలయ మందు
నియత కక్ష్యలఁ దిరుగుచు నిలచె నవియు. 1962

తే.గీ. విరియు ఘనశతఘ్నివిముక్త విస్ఫులింగ
విధి నయస్కాంతవలయాన విచ్చుకున్న
కాంతిపుంజాబ్జ మందున కర్ణికగ ని
లిచెను గోళమొక్కటి బ్రహ్మలింగమగుచు. 1963

తే.గీ. విడిగఁ బారిన యొక్కొక్క విస్ఫులింగ
మొక్క రవి బింబమై నింగిఁ జుక్క లవగ
నందు నొక సూర్యుఁ జుట్టెడి కందుకములఁ
బుడమి కలదు, దానిం జుట్టు కడలి సుతుఁడు. 1964

తే.గీ. దీప దర్పణములు గాగ దినద శశులు
సప్త సాగర వలయిత సార భూమి
మేరువును చుట్టు, రవిఁ జుట్టు, మేనుఁ జుట్టు,
పంచ భూతంబు లద్దాన ప్రబలు చుందు. 1965

తే.గీ. ప్రాణు లెన్నియొ పుట్టుచు ప్రాకుచుండె,
నంతలో మట్టి పాలౌచు నంతలోనె
మరలఁ బుట్టుచు గత జన్మ మరచు చుండి;
ఆడు చున్నారలట బొమ్మలాట వోలె. 1966

తే.గీ. భరత వర్షమ్మది, అదియె భరత భూమి,
అదియె పెనుగొండ, తానును, అమ్మవారు,
హోమ గుండంబు; లందు నాహుతులునగుచు
నూట రెండు గోత్రాల వారోట లేక ! 1967

తే.గీ. ఫటఫటాయంచు పగిలె భూపాలు శిరము,
జలదరించెను కుసుమాఖ్యు చాటు తనువు,
చూడ లేనింక నీ రూపు చుట్టి వచ్చు,
నన్ను రక్షింపు మని వేడె కన్ను చెదర ! 1968

శ్లో॥ నమస్తే పరమేశాని, నమస్తే విశ్వ బాంధవి ! ।
నమస్త్రిలోక జనని !, నమస్తే భక్త పాలిని ! ॥ 1969

ఆ.వె. తండ్రి మాట వినుచు తనయగా కనుపించె,
స్వస్వరూపము నుపసంహరించి,
మరల మాయలోన నిరికించ కుండగా
తల్లి దండ్రులను ముదంబు నుంచె ! 1970

***ఇది శ్రీవాసవీపురాణమునందు వాసవీకన్యకచే తల్లిదండ్రులకు విశ్వరూప దర్శనము, విజ్ఞానబోధ యను అరువదియేడవ అధ్యాయము సంపూర్ణము.***

## అరువదియెనిమిదవ అధ్యాయము

**కం. సేవక జన చింతామణి !**
**పావక దహనాహతార్త పార్షద శరణీ !**
**శ్రావణ మేఘాభాకృతి !**
**దేవీ ! పరతత్త్వ రాజ్ఞి ! దివ్యోదీర్ణా !**

తే.గీ. జగతి మును మూలమును చూడఁ జాలినట్టి
కుసుము దంపతుల యదృష్ట గుణకమునకు
నొడలు పొంగారి వైశ్యర్షు లడుగ, మిగులు
నుడువఁ దొడఁగె సాలంకాయనుఁడును నంత ! 1971

కం. మరునాటి యుదయ మందున
చిరు చీకటి తొలఁగి వెలుగు చేరిన యంతన్,
గురువున్న శివాలయమున
త్వర త్వరగా చేరిరెల్ల వైశ్యులు కడిమిన్ ! 1972

ఆ.వె. సభకుఁ జనెడు తండ్రి సమ్ముఖంబున నిల్చి
తాను వత్తుననెడు తరుణి సుతను
వలదనంగ లేక వాత్సల్యమును జూప,
కరము వట్టి చనెను కన్యకాంబ ! 1973

చం. అచట విశాలమైన, కనకాంకిత రత్న మయంబునైన, కాం
తిచయము చంద్రకాంత శిల తీరున వేదిక, దాని మీద నే
రుచునటు వైశ్య శిష్యులును, రుక్కులఁ గ్రాలు గురూత్తముండు నా
నిచయము మధ్యనుండ గమనించెను వాసవి తండ్రితోడుతన్. 1974

ఉ. పల్లకి డిగ్గి తండ్రి కర పల్లవ మూని శివ ప్రదక్షిణన్
మెల్లనఁ జేయుచున్ కులము మేలును కోరెడు యొజ్జఁ గాంచి వ
ర్థిల్లు గురూత్తమా యనుచు దీవెనకోరొనరించి, సభ్యులం
దుల్లము నుంచి చేమొగుడుచు న్నుచితాసన మందె తండ్రితో ! 1975

చం. నియత వచో విలాసుఁడగు నిర్మల చిత్తుఁడు భాస్కరార్యుఁ డా
నియమ నిదేశ పాలకుల నిర్ణయముం దెలియంగ నుండ, నా
మయమున నింగి నంట ఘన మంగళ వాద్యము లూరుఁ గ్రమ్మె, నా
రయమున బాల నాగరులు రచ్చకు వచ్చిరి సంతసమ్మునన్ ! 1976

ఉ. వచ్చి నమస్కరించి సభ వాకిట నిల్చిన బాల శిష్యులన్
మెచ్చి సమాదరంబున నిమిత్తము చెప్పుమనంగ, నొజ్జకున్
తెచ్చిన వార్త చెప్పిరిటు తియ్యని మాటల పెద్దలందరున్
నచ్చెడు రీతి, చిచ్చువడ నచ్చక పారెడు వారి పాటులన్. 1977

ఆ.వె. మొన్న మనల వీడి చన్న వారలు కూడి
రొక్క చోట మనల నుక్కడంచ,
రేపు రాజు వచ్చి చేపట్ట చెలి లేక
మంది తోడ తమ్ము మాపు నంచు. 1978

ఆ.వె. అనుచుఁ జెప్పుచుండ నంతలోననె సభ్యు
లందు కొంత మంది యాగ్రహమున,
కొంతమంది వినఁగ గోరిక చొప్పున,
చెప్పుమనుచు వినిరి చెవులు తిక్క ! 1979

వ. అంతట కులంబు విడిచి పోవుచు నాఱువందల పదిరెండు గోత్రముల
వారును చేసిన యకృత్యంబుల నిట్లు చెప్పిరి. 1980

తే.గీ. మనల వీడిన మనవారు మౌనమూని
కదలి యేకాంత మగుచోట కలసినారు,
కులమున కిదేమి పీడంచు కలఁగినారు,
సుఖముగానున్న మనకేలఁ జుట్టెనంచు ! 1981

కం. ఇంతకు కారణ మొక్కటె,
ఇంతి, కుసుంభుని కుమార్తె, యీ వాసవియే !
చింతల కుంపటి కులమున
వింతగ రగిలించె పొంచి విపరీతముగన్ ! 1982

ఆ.వె. కీడు పొంచియుండె కిమ్మన కున్నచో
నధిక సంఖ్య నున్న అహము చేత,
పట్టణమున నుండ పతి వచ్చి చంపును
వృద్ధ బాల బంధు భృత్యు లనక ! 1983

తే.గీ. ఇంతమందిమి యుండియు నింతి నలమి
రాజు పెండిలి యొనరింప రాక యుంటి
మది పరాశక్తి, రేణుక, యజ్ఞసంభ
వనుచు వారించు వారి నేమనఁగ వచ్చు ! 1984

ఆ.వె. బ్రతికియున్న రేపు బలుసాకు తినవచ్చు,
బ్రతుకవలయు నేడు భంగపడియు,
బ్రతుకుచెడిన నడుమ బ్రతుకిచ్చి ఫలమేమి
బ్రహ్మసృష్టి కింక రక్ష యేది ? 1985

కం. కులపెద్ద కూతు రగుటన్
కులపెద్దయు వారివైపు కూడిక యగుటన్
కులమున నధికుల మయ్యును
కులమున వెలి వడితిమే ! మకురుతన మేలా ! 1986

శా. ఏమీ యీ యమ లేనిచో కులములో నేలోప మేతెంచునో,
ఈమే సర్వమొ, యీమె లేక మనరో, ఈ మేన నేమున్నదో,
తామిస్రంబున ముగ్గి వారు మనలన్ తాడించి పోద్రోలిరే,
ఏమీ చేయగ లేని వారమనియా, ఈ రీతిఁ గావించుటల్ ? 1987



ముత్యాల సరం. అందయగు పెనుగొండ నగరుకు,
కేశికుఁడు నగరేశ ప్రభువుకు,
పతి జనార్దన భాస్కరులకును
కులమునకు నతిఁ గూర్తుమా ! 1988

వ. అనుచుఁ బోవ నుంకించుచుండ మరి కొందరు ప్రతీకారేచ్ఛ లోరగుల నిట్లనిరి. 1989

కం. ఎందుకు పోవలె మనమీ
సుందర నగరమ్ము వీడి ? సూడుఁ గొనంగా
నెందరు వారు, ధరాపతి
నెందుకు వెనుకాడ వేడ నిందర ముందన్ ! 1990

కం. వారి ప్రమాణములు మృషలు,
వారల కృత్యములు మృషలు, వారలు మృషలే !
వారి గుఱించిన మొత్తమ
వారిగ రాజునకుఁ జెప్ప వరములు గురియున్. 1991

కం. ఒక దెబ్బకు నిరు పిట్టలు,
ఎకిమీనికి మంచి వార మికపై, పగవా
రికి రాజ దండనగు, మన
మిక పెనుగొండకు ప్రభువుల మేలు కొనంగన్ ! 1992

ఆ.వె. అనఁగ కొంద రనిరి– అడుగు ముందుకు వేసి,
కోట సేనఁ దెచ్చి కూడిరాని
వారి పీచమడఁచి వారిజ నేత్రను
రాజుకొసగ సొమ్ము రాలు ననుచు ! 1993

ఆ.వె. మఱియు కొంతమంది మనవారి గమనింప
నుంచి వెడలి నట్టి కంచియలకు
మనల క్రియలఁ జెప్పి మరలింతమని చెప్ప,
నంద రేగినార లందు కొఱకు. 1994

ఉ. వెడలి వచించి రిట్టు లిది వింటిరె రాజ బలమ్ములార మా
వెడగుల ఘాతుకమ్ము? మిము వెచ్చఁ బరుండఁ గడంగి చాటుగన్
గడువుగతించులోన తము గావులుగా ప్రకటించి చిచ్చులం
బడ తనయాసమేతముగ పండుగవోలె రచింపుచుండగన్ ! 1995

ఆ.వె. కనులు తెరువు డింకఁ గన్య దక్కదు రాజు
కింత బూది మిగులు నిదియ నిజము
నిజముఁ దెలిసి మిమ్ము నిర్జించు నిక్కమ్ము,
నిక్క మఱయుఁడయ్య నిక్కు వీడి. 1996

తే.గీ. బాల నాగరు లిచ్చిన బహుమతులకు,
పెళ్ళి పెద్దలు వేయు పందిళ్ళకున్ను
విందులకు లొంగి పోయిన విభుని భటులు
కొండెములు చెప్పు వారంచు కోపగించి. 1997

మ. ఎవరయ్యా తమ రెట్టి వార లెదలం దేవేవొ వైరంబులన్
నివురుల్ వోలె ధరించి వచ్చితిరి, కానీ వారు వైశ్యోత్తముల్,
నవనీతాత్ములు, నిత్య సత్య వచనానందాగ్ని సంచారులై
హవిణిల్లన్ గమనించి నార మికపై యారోపణల్ మానుడీ ! 1998

వ. పుణ్యంబునకుఁ బోవఁ బాపంబెదురాయె నని సంకోచించుచు నధిక సంఖ్యులైన యా వైశ్యులు ఫలము సిద్ధించు దనుక ప్రయత్నంబు విరమింప దగదను నార్యోక్తి ననుసరించి రాజభటుల నుద్దేశించి మరియు నిట్లనిరి. 1999

ఉ. నమ్మ రదేల మమ్ము జననాథుని మంచిని కోరి చెప్పు స
త్యమ్ము లబద్ధమాయె నొకొ ! త్యాగ మొనర్చి శరీర బంధముల్
వమ్మొనరించు రాజ పరివార ప్రయత్నము లెల్ల, మమ్ములన్
నమ్మనిచో మహీపతిని న్యాయము కోరెద మీక్షణమ్మునన్. 2000

ఆ.వె. వార లందఁజేయు వాయనమ్ముల మెక్కి
వారు చెప్పుమన్న వాక్కు చెప్పి,
గూఢచర్య వ్రతము గోతి పాల్జేసిన
మిమ్ము వదలరాదు మెదుప కుండ ! 2001

చం. అన విని ఉగ్రులైన సుభటావళి కత్తులు దూసి వైశ్యులన్ ,
తునిమెద మొక్క మాటయును తూలిన పీలిక లౌను మేను, ప
ద్దెనిమిది పట్టణంబుల త్యజింపుడు వేగమె ! పొందు దుష్ట లీ
క్షణమున, కార్యదీక్షు లపకార మొనర్తురె యంచుఁ ద్రోలగన్ ! 2002

చం. భయమున పారిపోయె నలువంకలఁ దోడ్కొని యాలు బిడ్డలన్
హయ ఖర వాహనమ్ములను హాటక రత్న చయమ్ములన్, మహా
రయమున సార్థవాహులు పురాకృత దోషము వెంబడింపగన్,
క్రయికులఁ దిట్టుకొంచు తమకంబున వాసవి దోషమెంచుచున్ !2003

వ. అనివచింప నూటరెండు గోత్రములవారును తమవారి తెలివితక్కువ తనమునకు బాధపడుచుండ వాసవి మృదు మధుర వచనంబుల నిట్లనియె. 2004

ఆ.వె. అన్నలార వార లట్లు పారుట లెస్స,
కర్మ శేష మవని కలిగి యుంట;
శివుని చేరువారు శేషముంచని వారు,
గోత్రములును పుణ్య గోత్రములగు. 2005

సీ. ఇంద్రుని దిశకేగి యెనుబది గోత్రజుల్
చరియించెదరు తురాషాహు లనఁగ,
దక్షిణమ్మున కేగు దండు గోపుల పేర
నిన్నూరు గోత్రమ్ము లిరవు కొనఁగ,
పశ్చిమంబున కేగి ప్రాకృతులను పేర
నిన్నూరు గోత్రమ్ము లిరవు కొనఁగ,
నూట ముప్పది రెండు మోటన గోత్రజుల్
ధనదు దిక్కున కేగు దరదు లనఁగ,

తే.గీ. మూపుపై కత్తులను బెట్టి మోసికొనుచు
కోపమున ప్రేలుచును, మౌనకోపులగుచు,
పత్నులకు వెన్క పుత్రులఁ బట్టి పోవు
వారలఁ గని జాలి గొనంగ వలయు మీరు. 2006

వ. అనుచు స్థిత ప్రజ్ఞామూర్తియై భాషించు వాసవిని గని బాలనాగరు లట్లే యనుచు నంగీకరించిరి. 2007

**ఇది శ్రీవాసవీపురాణమునందు సంఖ్యాధికులైన వైశ్యులు నలుదిక్కులకు పలాయనంబగుట యను నరువది యెనిమిదవ అధ్యాయము సంపూర్ణము.**

(రుక్కు= కాంతి, తామిస్రము= చీకటిగల నరకము, సూడు= పగ, కంచియలు= కాపలాదారులు, గావు= బలి, మోటనము= ఆక్షేపించుట)



# అరువది తొమ్మిదవ అధ్యాయము

**కం. ఆనంద సింధు నిలయా !**
**ఆనంద సుధా రసేందు హాసన్మధురా !**
**ఆనందామృత దాతా !**
**ఆనంద రథాగ్ర యాన ! యాపన మధురా !**

కం. అంతట మిగిలిన వైశ్యులు
చెంతను కూర్చున్న చెలువ చెయిదముఁ గనుచున్
వింతగ మాట్లాడుకొనుచు
కొంత వడికి సద్దుమడిఁగి గురువునుఁ గనుచున్. 2008

కం. నిజమా! ఆచార్యోత్తమ !
గజిబిజి వచియించినట్టి కత నిజమేనా !
కుజనుల పోకలు తెల్పిన
ద్విజ కన్యక పలుకులందు ద్వితయము లేదా ? 2009

తే.గీ. విశుల వదనంబు లందున్న వింత ప్రశ్న
మునకు నవ్వుచు నాచార్యుఁ డనియె నిట్లు,
అరిగె పాషండులను తోష మరయకుండ
వచ్చెనే ప్రశ్న వాసవీ వాక్కులందు ! 2010

కం. మీ యనుమానముఁ దీర్చగ
మీ యేలిక కన్యక పిత మేకొన గలడే;
ఓయీ కుసుంభ శ్రేష్ఠీ !
నీ యనుయాయులకు చెప్పు నీ యనుభవమున్ ! 2011

ఉ. ఏమని పల్కె నీ తనయ, ఈ విధి నందర మొక్క మారుగా
హోమములందు మేనులను హోమము చేయఁగ నున్న దన్న నీ
ప్రేమము వించు నేమనెను? ప్రేరణ మంద విశాళి నేర్పుమై
సేమము కల్గుచెప్పుమన శ్రేష్ఠియుఁగూతురు వైపు చూచుచున్, 2012

ఆ.వె. నోట మాట రాదు నోరెత్తి పల్కగా
చేయి రాదు సుతకు చేయి మోడ్చ,
వాసవాంబఁ జూచి వాయోడి కూర్చున్న
వానిఁ జూచి, చూచిరా యనంత ! 2013

వా. చూడ శక్యంబుఁ గాని ప్రకాశమున్, సూర్యోదయ కాంతి భాసురన్,
తోడు లేనట్టి యౌవన ప్రాయమున్, తూగాడెడు సుందరాకృతిన్,
కూడికన్ కోటి ప్రొదిను లొక్కటై గోత్రంబున నుద్భవించెనో
వేడుకన్ ! కాని, మూసిరి కన్నులన్ వీక్షింపగ లేక తేజమున్. 2014

కం. కన్నులు మూసిన వారల
వెన్నుల ధైర్యంబు నింపి వీక్షింపగ సం
పన్నులఁ జేసెను దయ నా
పన్నుల కరుణించు టెఱుఁగు పరమేశ్వరతన్. 2015

తే.గీ. కోటి సూర్యులు నొక చోట కూడి యున్న
యట్లు, కాంతి రాశినిఁ బోసి నట్టులున్న
అమ్మ పర రూపమును గాంచె నబ్బురమున
దివ్య దృష్టిని పొందిన నవ్య ఋషులు ! 2016

సీ. అష్టాదశ భుజము లద్భుతంబై తోఁచ
సర్వాభరణ శోభ సంపతిల్ల,
పాతాళ మడుగంట పాదంబు లుండగా
నింగి కిరీటంబు నెలవు కొనఁగ,
నురగ గంధర్వ కిన్నర సిద్ధ చారణా
దుల సేవ లందుచు చెలఁగు చున్న,
దివ్య దామముఁ దాల్చి దివ్య గంధముఁ బూసి
దివ్య వస్త్రములను తివియు నట్టి,

తే.గీ. దేవఋషుల స్తోత్రములందుఁ దేలియాడు,
వాసవీ పరాదేవికి వందనముల
నాచరించుచు నానందమందు వైశ్యు
లిట్లు స్తోత్రంబుఁ జేసిరి యెడఁద లలర ! 2017

శ్లో॥ నమస్తే దేవి భద్రాయై గౌర్యై ధాత్ర్యై నమో నమః ।
నమో భక్త ప్రియాయై తే భక్తాభీష్ట ప్రదాయిని ! ॥ 2018

శ్లో॥ నమో దేవ్యై మహాదేవ్యై భూయో భూయో నమో నమః ।
నమో వైశ్య కులోద్భూతే ! వరదాత్రి నమో నమః ॥ 2019

తే.గీ. నిజ కులంబున భక్తుల భజనములకు
సంతసించిన వాసవీ కాంత యపుడు
వాణి వీణా నినాదము వంటి వాక్కు
మధురమై సోక నిట్లనె సుధలు కురియ ! 2020

ఆ.వె. ఆర్య వైశ్యులార ! ఆలకించుడు నాదు
జన్మ మర్మ మిదియ ! జన్మ లేని
యాది శక్తి నే స్వయంభువు నైనను
పుట్టితిని సమాధి పుణ్యమునకు ! 2021

ఆ.వె. గతయుగంబు నందు క్ష్మాపతి సురథుండు
వైశ్యుఁడగు సమాధి వనమునందు
వాయు నీర పర్ణ భక్షణంబుల పెద్ద
తపము చేయ సాగి రపుడు వారు. 2022

ఆ.వె. కామ క్రోధములను కాదనుచును వారు
నేనను పదము మదిలోన లేక
ఆశలేక నన్ను అనయమ్ము ధ్యానించు
చును కఠోర తపము చొక్కి యుండ. 2023

ఆ.వె. మెచ్చి వారి నడుమఁ జొచ్చి నేఁ గనుపించ
సంతసించి వారు సన్నుతించి
వినయ వంతులైన, వేడ్కతో గమనించి
మున్ను సురధు గాంచి ముచ్చటలర. 2024

ఆ.వె. ఓయి బుద్ధి శాలి ! పోయి శత్రులఁ జంపి
భూమినేలు ధర్మ గామి వగుచు,
సౌఖ్యమంది తుదకు సావర్ణి మనువగుచు
తరతరాల కీర్తి వరలుమయ్య ! 2025

ఆ.వె. వరము పొంది రాజు వందనమ్ములు సేయ,
వైశ్యుఁడగు సమాధి వైపుఁ జూచి
ఏమి వలయు నీకు నిహ పరమ్ముల యందు
కోలుకొనుచు కోరి కొనుమటంచు. 2026

ఆ.వె. అంత నాతఁడటుల నమిత వాత్సల్యంబు
కురియు కనుల నన్ను కొలుచు చుండ
చెంతఁ జేరి శిరము చే నిమిరితి నంత
శ్రేష్ఠి తెలివి నంది చెప్పె నిటుల. 2027

ఆ.వె. ఓ మహా విభూతి ! నా మనస్సంజాత !
వందనమ్ము తల్లి వచ్చి నావు !
ఏమి వలయు నన్న నేమని కోరుదు ?
నీ వెఱుంగ నట్టి నిజము కలదె ! 2028

ఆ.వె. బ్రహ్మ వేత్త నేను, బ్రహ్మత్వ మగు నాకు,
ముక్తి యందు నెట్టి రక్తి లేదు,
దక్షు వోలె హిమ కుధర నాథు వలె, సంద
రమ్ము వోలె పితృ వరమ్ము నిమ్ము ! 2029

ఆ.వె. శిశువు వగుచు నాదు చేతులందున నూగి,
బాల వగుచు యెదఁద పడకఁ బండి,
ముద్దుపాప వగుచు ముద్దులు కురిపించి,
కన్య వగుచు కనులఁ గదల వలయు ! 2030

ఆ.వె. అనుచుఁ బలుకు చుండ నతనిలో తండ్రి కా
దీక్షఁ గాంచి నేను తృప్తి చెంది,
హే సమాధి ! నీకు హితము కావలెనన్న
భవము శుద్ధి వలయుఁ బడయు మద్ది ! 2031

ఆ.వె. ఎన్ని జన్మలైన నెత్త వలయు సిద్ధి
పొందు వరకు సహము పోవు వరకు
కలి యుగంబు నందు తొలి పాదమందునే
కలుగు నీకు నన్ను కనెడు సిద్ధి ! 2032

ఆ.వె. అతఁడె నేడు కుసుముఁడను పేర నున్నట్టి
నాదు కన్న తండ్రి, మీదు విభుఁడు,
కోరినంత వరకు కోరిక లీడేర్చి
పోవుచుంటి నిజ నివేశమునకు ! 2033

ఆ.వె. నన్నుఁ గాచు కతన నావార లైన మీ
రెల్ల నన్నుఁ గూడి యీశు కడకు
సన్నిధాన మంది సాయుజ్య మందగా
నగ్నిఁ గూడి రండు, అన్నలార ! 2034

ఆ.వె. విష్ణు వర్ధనునకు విపరీత మగు కోర్కె
గత భవముల నుండి కలసి వచ్చె,
నేడు నన్ను కోరి నిర్వాణ మొందును
శిరము పగిలి వేయి చెక్కలగుచు. 2035

ఆ.వె. ఆశ కలద యేని అస్త్ర శస్త్రము లిచ్చి
పోర శక్తి నిత్తు పొలియఁ జేయ,
అవనినేలుకొనుఁడు ఆచంద్రతారార్క
మంట్లు నంట్లు భళిర యనఁగ సతము ! 2036

ఆ.వె. అనఁగ వైశ్యులెల్ల నలజడి నొందుచు
కలఁగినారు వారు కలవరమున,
వలదు తల్లి వలదు వలదు శస్త్రాస్త్రమ్ము
లవని పతిని గెల్చు నాస లేదు. 2037

ఆ.వె. హింస వలదు, ఈ నృశంస కార్యము వద్దు,
రగడ వలన కలుగు రాజ్యమునకు
త్యాగమందు కలుగు తక్రంబు మేలమ్మ,
శాంతి సుఖము నిచ్చు సంతసంబు. 2038

ఆ.వె. అవని రాజ్యమేల నమర రాజ్యంబుండ,
పనసలేల వేద పనస లుండ ?
ఎఱను చూపకమ్మ, ఎదలబలములేమి
నరసి బ్రోచు మమ్ము, పరమ కృపను. 2039

ఉ. బాలలు, పిన్నవారు, తమ భావనలో చిరు చెల్లిగా సదా
పాలన చేసిరమ్మ నిను, భక్తులు నీ నిమిషమ్ము నుండి, వా
రాలుడి పేరుఁగాంచ తగు నాహ్నికముల్ కులధర్మ యుక్తముల్
పాలనఁ జేయ చెప్పుమని ప్రార్థనఁ జేతుము నీపదమ్ములన్ ! 2040

ఆ.వె. అంత యువకులెల్ల నమ్మ చెంతకు చేరి
యోగ్య తనువు నొంది యోగ్య మైన
భాషణముల మమ్ము పాలించు మంచును
ప్రార్థనమ్ము చేసి రర్థు లగుచు. 2041

ఆ.వె. అంత వాసవాంబ యగుచు జగన్మాత
వల్లె యనుచు వైశ్యులెల్ల వినఁగ
కలి యుగమున వారి కుల ధర్మములు చెప్పె
వైశ్య కులము జగతి వర్ధిలంగ ! 2042

**ఇది శ్రీవాసవీపురాణమునందు వైశ్యులకు వాసవి విశ్వరూపదర్శనమను అరువది తొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము.**

(అంటు= మిత్రుడు, నంటు= బంధువు, ఆలుడి= మంచినడత, శీలము)



# డెబ్బదియవ అధ్యాయము

కం. **ఈడిత పాద పరాగా !**
**ఈడిత కుంభస్థలాక్ర మేద్ధ నితంబా !**
**ఈడిత కలశ ద్వితయా !**
**ఈడిత వాగ్దత్త ! విశవరేప్సిత గీతా !**

తే.గీ. వైశ్య సోదరులార మీ వారి లోన
నగ్ని గుండంబులో దూక నర్హమైన
గోత్ర మొకదాని కొక జంట మాత్ర మవని
బంధు సమ్మతి గొనుచు రావలయు దివికి ! 2043

తే.గీ. పెద్దలను గౌరవించు నో పిన్నలార
వారి జాడల లక్ష్యంబుఁ జేర వలదె !
హింస వలదని కాదె, అహింసఁ బూని
ఆయుధము మాని యిపుడు వారగ్నిఁ బడుట ! 2044

తే.గీ. హింస ప్రేరేచు వేదంబు హితము కాదు,
కలి యుగంబున నది మీకు కలిమి కాదు,
వేద మంత్రముల్ భాషను వీడి మీర
లిక పురాణోక్త శ్లోకమ్ము లియ్య కొనుడు. 2045

తే.గీ. యజ్ఞమున కన్న భక్తియే యగును మిన్న,
కలియుగమ్మున భక్తిని కలిగి యున్న
యజ్ఞమునఁ గల్గు లాభంబు లన్నియున్ను
కలుగు, సులభంబు, భక్తి త్యాగంబుఁ గోరు. 2046

తే.గీ. త్యాగము నహింస రెండింటి యోగముననె
వైశ్య కులమున భవములు వాసిఁ గాంచు,
కనుక వైదిక గోత్రములను విడువడి
ప్రాకృతములను గూర్చుదు పదిలముగను. 2047

తే.గీ. గోత్రములు నూట రెండును గోప్య పరుప
ఋషుల పేర్లకు మారుగా వృషప వరణ
సిద్ధ పురుషుల పేర్లు ప్రసిద్ధ మగుత,
శుభములగు మీకు, నిల్చు వైశ్యుల కులంబు. 2048

తే.గీ. నిత్య నైమిత్తికంబుల నియమమైన
కర్మ కాండల వైదిక కర్మలందు
రతి నుదాత్తానుదాత్త స్వరితములను
మానుఁడిక పురాణోక్తంబు మతముఁ గొనుఁడు. 2049

తే.గీ. వేద గాయత్రి యిక మీద విరతమగుచు
వర్ణ గాయత్రిగా మీకు వ్యక్తమగును,
దానఁ బొందెదు ఫలితమ్ము దీన మీకు
ప్రాప్తమగు నిద్ది సత్యంబు ప్రమథులార ! 2050

తే.గీ. లోన ధ్యానించి బ్రాహ్మణులైన వారు,
స్వరము పఠియించి క్షత్రియ వరులు పైకి,
వర్ణములు మాత్రమే పల్కి వైశ్య వరులు,
మహినిఁ గాంతురు గాయత్రి మంత్ర మహిమ ! 2051

తే.గీ. పుట్టువులను గర్భాదాన పుంసవనము
లకును సీమంత జాత నామకరణాన్న
ప్రాశనములు చౌలమ్ము నుపనయనముల
భాస్కరుల వల్ల పద్ధతుల్ ప్రకట మగుత ! 2052

తే.గీ. వేద మంత్రంబు లందున విదిత సార
మంతయును పురాణోక్తంబు నందు నుండు,
కలియుగంబున వైదికోక్త స్వరంబు
లుప్తమగు గాన నిది మీకు గుప్త మగును. 2053

తే.గీ. సంస్కృతంబెల్ల ప్రాకృత సంస్కరణము,
ప్రాకృతమన నసంస్కృత ప్రకృత భాష,
మూలమైనట్టి ప్రాకృతమునకు సరియె
విలువ లున్నను సంస్కృత విజ్ఞ భాష ! 2054

తే.గీ. వైదికము నేర్వ రాబోవు వైశ్య తరము
లిచ్ఛగించవు, వృత్తులం దినుమడించు
భక్తి చేతను, వ్యవహార భాషతోడ
చదువు ముగియును, వృత్తుల చదువె మిగులు. 2055

తే.గీ. పరఁగు వృత్తుల కృషియు గోపాలనములు
శూద్రులనుఁ జేరు, వ్యాపార సూత్రమొకటె
నిలుచు మీలోన, బ్రాహ్మణుల్ నిగమ రహితు
లగును, రాజ్య హీనులు రాజు లగును నిజము ! 2056

తే.గీ. అర్థమెఱుగని బ్రాహ్మణ స్వార్థ పరులు
పలుకు మంత్రంబు లెట్టుల పలుకనగునొ
తెలియ నప్పుడు తప్పులు పలుకు కంటె
స్వరము లేనట్టి శ్లోకముల్ చదువ మేలు. 2057

తే.గీ. తగని వేదంబు వర్జింప తప్పుకాదు,
స్వరము నర్థంబు తెలియక చదువు వారు
నిజమునకు ప్రాకృతులు వారు నియతి లేక,
తగు పురాణోక్తి పాటించి పగటుఁ గొనుఁడు ! 2058

తే.గీ. పెండ్లియన బాంధవుల మైత్రి పెంచ వలయు,
వియ్యమున మేనరిక మైత్రి విడువ రాదు,
ధనము రూపంబుఁ జూచి కాదనఁగ రాదు,
లేనిచో మాత్రమే పైనఁ గానవలయు. 2059

తే.గీ. దినములారును పెండ్లికి దీక్ష వలయు,
నేడవ దినంబు తోరంబు వీడ వలయు,
బంధువులనెల్ల సంతృప్తిఁ బరచ వలయు,
పెండ్లి జంటకు శుభములు పెంచ వలయు. 2060

తే.గీ. శుభము లశుభమ్ము లొక రీతి చూడ వలయు,
చేయు కార్యమ్ము శ్రద్ధతో చేయ వలయు,
చేయునపు డర్థము లెఱింగి చేయవలయు,
శ్రద్ధతో చేసినప్పుడే శ్రాద్ధ మగును ! 2061

తే.గీ. నమ్మి సేవించు వారల కిమ్ము గూర్ప
వివిధ బహుమానముల నిచ్చి విందు గూర్చి,
వలయుచో గో కృషుల లోన భాగమిచ్చి,
సంతసింపగఁ జేయుఁడో సాధులార ! 2062

తే.గీ. బ్రతుకునం గొన్న యర్థంబుఁ బ్రకృతియందు
పెద్దలకు, తోటివారికి, విద్దెలకును,
జంగములకెల్ల పంచి తక్కుం గలద్ది
యనుభవింపఁగ వలె, కాక యధముఁడగును. 2063

తే.గీ. ఫలిత మాశింప రాదట్టి పనినిఁ జేయు
నపుడు, తాఁజేయు చున్నాడ ననఁగ రాదు,
భయము, గర్వమ్ము మదిఁ జేర పనికి రావు,
తప్పదనుకొంచు విసుగున తగదు చేయ. 2064



తే.గీ. వేదములఁ జెప్ప బడినట్టి వానినెల్ల
ననుసరించినఁ గలిగెడు జ్ఞాన మెల్ల
కామ్య రహితాత్ముఁడైనచోఁ గల్గుఁ గాదె !
చిటికె డుప్పుకు సంద్రమ్ముఁ జిలుకనేల? 2065

తే.గీ. కర్మ చేయుటె మీవంతు కాని, దాని
ఫలమునకు కారణము కారు తెలిసి కొనుడు,
సిద్ధి కలిగినఁ గాకున్న బుద్ధి కలిగి
సమ మనస్కులరై కందు సాధకులుగ ! 2066

తే.గీ. పాప పుణ్యాలఁ బొందదు పరమ బుద్ధి,
బుద్ధి కలుగును నిజయోగ సిద్ధి వలన,
సిద్ధి నిష్కామ కర్మచే సిద్ధ మగును,
త్యాగమున నట్టి కర్మంబు తగును సేయ ! 2067

తే.గీ. పొందనగు నట్టి యానంద మొందుచుండి,
రక్తి వైముఖ్యముల నుండి ముక్తినంది,
కడలి నందంబుగా సాగు పడవ రీతి
బ్రతుకు సంసారి సతతంబుఁ బ్రజ్ఞపరుఁడు ! 2068

తే.గీ. భోగులకు నిజ జ్ఞానంబు బోధ పడక
మిగుల చీకటి నది రాత్ర మగుచుఁ దోచు,
యోగులకు జ్ఞాన రహితమై భోగ జగతి
మిగుల చీకటి నది రాత్ర మగుచుఁ దోచు. 2069

తే.గీ. కనుక ప్రతివాడు కర్మచే కట్టువడఁగ
వలయు నటుగాక యుండిన వ్యర్థుఁ డగును,
ఆత్మ సంతుష్టి తృప్తియు నాత్మ రతియుఁ
గలుగు నతనికి కర్మ సంగమ్ము లేదు. 2070

తే.గీ. ఫలము నాశించి యజ్ఞాని సలుపు కర్మ;
కర్మ సంగుల కర్థంబు కాని బోధ
మాని యుక్తాచరణమును పూను జ్ఞాని,
జనులు సత్కర్మ పరులయి మనుట కొఱకు ! 2071

తే.గీ. ఎవఁడు నా మాట చెవిఁ బెట్ట కెదురు నిలుచు
నతఁడు మూఢుఁడు, నవివేకి, యధముఁడగును,
బాహ్య బంధాల లోగక స్పృహ్యా మెఱుఁగు
నతఁడు నావాడు, సర్వము న్నతని సొత్తు ! 2072

తే.గీ. అగ్ని ముఖమున నాతోడ నభవుఁ జేరఁ
జనెఁడు బంధువులార నింగిని గనుండు,
కోటి శంపాలతల వెల్గు కోటి మణుల
కాంతి కనఁగల్గు జంటలు కదలి రండు. 2073

తే.గీ. అవి విమాన శిఖరముల్ విశాళి లోన
నర్హులను గొనిపోవగా నాకసమున
సిద్ధమైనవి మీరింక సిద్ధ మగుఁడు,
శుద్ధ మనముల త్యాగ విశుద్ధు లగుచు ! 2074

***ఇది శ్రీవాసవీపురాణమునందు బాలనాగరులకు వాసవీమాత సందేశమనఁబడు డెబ్బదియవ అధ్యాయము సంపూర్ణము.***



# డెబ్బదియొకటవ అధ్యాయము

**కం. ఊహా కల్పిత దేహా !**
**ఊహా కల్పిత నివాస ! ఊహా జనితా !**
**ఊహా ప్రపంచ జననీ !**
**ఊహా జనిత ప్రపంచ ! ఊహాతీతా !**

కం. అని కన్యక యాచార్యునిఁ
గని యాశీర్వచనములను గ్రహియించి వెసన్
జనకునితో కూడి గృహముఁ
జనె నేమియు నెఱుగనట్లు జననినిఁ జేరన్ ! 2075

తే.గీ. అంత నవ్వులు పూచు వసంత లీల
వైశ్య వనమెల్ల తోషంబు వన్నె మిగుల
పెద్దలెల్ల దీవించిరి పిన్నవారి
శీర్షముల పైన బంగారు చేతులుంచి. 2076

శ్లో॥ యూయం మహేశ కృపయా వర్ధధ్వం వసుధాతలే ।
చిరంజీవథ మద్వంశే పుత్ర పౌత్ర ప్రవృద్ధితః ॥ 2077

శ్లో॥ నీరోగశ్శతమాయుర్వో నిరుపద్రవ సంపదః ।
భూయాసు స్సర్వ సౌభాగ్య విద్యా వినయ సంపదః ॥ 2078

తే.గీ. అనుచు దీవించి నింగిపై నరసి చూడ
పుణ్య కర్మల ఫలితాల వోని భవ్య
రథము లగపడి తమ మనోరథము తీరు
సమయ మరుదెంచెనని సంతసమున నుండ. 2079

తే.గీ. వహ్నివడ సిద్ధమైనట్టి వైశ్యులఁ గని
బాలనగరుల యెదలెల్ల బరువు లెక్కి
ధర్మకార్యమే కదయని తగ్గుచుండ
గుండె శబ్దంబు వినిపించు చుండె నచట. 2080

ఉ. భాస్కరులంత లేచి తన భాషణ భూషణ సంగతిన్ నవా
హస్కర వైశ్యసంతతికి నాయువు నర్థము కూడునంచు శ్రే
యస్కరమైన దీవనల నర్భకులన్ గరుణించి, కోరుడూ
ర్జస్కర మొందనన్ గత విచారులునై హృదయార్తి దూరులై ! 2081

చం. గురువర ! మా వివాహముల కూర్పుల మేనరికంపు ధర్మముల్
గురువుల మోమునన్ వినఁగ కోరిక మాకు, వచింపుడీ, పరం
పరలుగ వచ్చుచున్న నియమావళి నెల్లను బీఱువోక, మా
గురువుల జాడ బోదుమనె గోవుల జాడల దూడలంబలెన్ ! 2082

కం. ఆచార్యుండును నుద్వా
హోచారంబులు తెలుపగ నర్యులఁ గనుచున్,
వాచింపుడు మీ తనయుల
కాచిత మేనరిక ధర్మ మాఖ్యాయకులై. 2083

వ. అనినంత కుల పెద్దలును నాచార్యుల వారికభివాదములు చేసి కుమారుల నుద్దేశించి మున్ను మాండవ్యముని ప్రోక్తంబును, గోత్ర పురుషుల యభిమతంబును, పెద్దల నుండి మాచే నాచరితంబును, దేవి యనుమతంబునునగు మేనతిక ధర్మంబును వినుండని యిట్లు వచించిరి. 2084

సీ. జని మేనమామన జనని తోబుట్టువు,
మామ కూతురు మేన మరదలగును,
ఆమె పెండిలియైన నదియె మేనతికంబు,
తనకు చిన్నది యైన తప్పరాదు,
అన్నదమ్ముల కూతు లక్క చెల్లెండ్ర పు
త్రుల పెండ్లియాడంగ వలెను వరుస,



పుట్టిన దాదిగా పుత్రిక నీయంగ
మేనయల్లుని మామ మెచ్చ వలయు,
తే.గీ. మేనయల్లుఁడు లేనిచో సూను రహితుఁ
డైన మేనల్లుఁ డుండిన నతని కీయ
వలయు, నతఁడును లేనిచో వరుని కొఱకు
కులము నందున నుత్తముఁ గొలువ వలయు. 2085

ఆ.వె. గ్రహణ మొట్టియైన కన్నొక్క టైనను
పతన శూన్యుఁడైన పంగువైన
గుల్మ రోగియైన కూతునీయగ నోపు
మేనయల్లుఁడైన మేలు మనకు. 2086

తే.గీ. మేనతికమంచు పిచ్చివాఁడైన గాని,
హీన తనుఁడైన, పురుషత్వ హీనుఁడైన,
రూప రహితుఁడైనను, గుబ్జ రూపుఁడైన,
కులము వెలి వేసినను పొందుఁ గూర్చరాదు. 2087

తే.గీ. అతడు గోశిశుభ్రూణ హత్యాది పాత
కముల చేయరాదొక వివాహము ఘటింప
మరల పెండ్లికి మసకొని మసల రాదు,
కళ్ళు, కాళ్ళు నోరు, చెవులు కలుగ వలయు. 2088

ఆ.వె. వధువు మేనమామ, వరు మేనమామల
గోత్ర మొక్కటైన కూడ దద్ది,
వేరులై జన గ్రహచారముల్ పొంతనల్
చూడరాదు, మనువు శోభఁ దనరు. 2089

తే.గీ. మేన మరదళ్ళ యందున మేన బావ
లందరును ప్రాయమును బట్టి హస్తపీడ
నంబు గావింప వలయును, నాన్నలందు
చిన్న పెద్దల భేదంపు చింత వలదు. 2090

ఆ.వె. మేనమామ భార్య మేన గర్భముఁ దాల్చ
కాన్పు జరుగు వఱకు కాచియుండి
ప్రసవమైన వెనుక పరిణయ మాడంగ
నౌను మేన యల్లుఁడైన వాఁడు. 2091

ఆ.వె. అక్క చెల్లి దత్తుఁ డొక గోత్రజుండైన
మగువ నొసఁగ వలయు మాతులుండు,
వేరు గోత్రమైన విధిగ నీ పని లేదు,
ఇచ్చుకొనుట వారి యిష్టమదియ. 2092

తే.గీ. మేనమామ కిద్దరు భార్యలైన నందె
వరికి బిడ్డ కల్గిన గాని, వరుఁడు సోద
రి సుతుఁడైన, నామెకు సవతి సుతుఁడైన
చేయ వచ్చును దోషంపు చింత వలదు. 2093

ఆ.వె. ప్రవర యొక్కఁడయ్యు పర గోత్ర మైనచో
చేయరాదు పెండ్లి, చేసియున్న
నేలుకొనఁగ వలయు, నేక గోత్రంబైన
వదల వలయు మాతృ భావముంచి. 2094

ఆ.వె. సహజ సోదరునకు, సవతి సోదరులకు
బిడ్డలుండి నపుడు ప్రియము మరచి,
సహజ సోదరాత్మ జాతనే సుతునకు
పెండ్లి సేయ వలెను ప్రేమ తోడ. 2095

ఆ.వె. సహజ సోదరాత్మజాత లేకున్నచో
సవతి సోదరాత్మజలను చేసి
బీజ ధర్మ దీక్ష భేదంబు గానీక
రక్ష చేయ వలయు రాణ నార్య ! 2096



ఆ.వె. తోడబుట్టు వొకతె, తోబుట్టు లెక్కురు
కలిగి యున్న వైశ్య కాంత కెపుడు
సహజ సోదరాత్మజాతల నందర
కోడళులుగఁ జేసికొనఁగ చెల్లు. 2097

తే.గీ. సొంత తోబుట్టు కొడుకును చూచినటులె
సవతి తల్లి కూతురు సుతు సాక వలయు,
పిల్ల నిచ్చుచు సేసలు చల్లవలయు,
సుమతి యగు మేనమామకు సుగతి యిదియ. 2098

సీ. ప్రీతి వలన, రాజ భీతిచే నైనను,
వేషాదులను చూడ ద్వేషమైన,
కండ లేదని యైన, గండ దోషంబైన,
పలుకాడగా సిగ్గు పడుట నైన,
ధనహీనుఁడని యైన, గుణహీనుఁడని యైన,
బంధువర్గపు మైత్రి భంగమైన,
సర్వ విధమ్ముల జరిపించ వలె పెండ్లి
మేనఱికము మేర మీర రాదు,
ఆ.వె. అటులఁ గాక యున్న నయిన వారికి దూర
మరిగి బాధలొందు నరక మందు,
పాటిసేయు వారు సాటి వారల లోన
భోగమంది తుదకు పోవు దివికి ! 2099

***ఇది శ్రీ వాసవీ పురాణమునందు వైశ్య వివాహముల మేనఱిక ధర్మములను దెబ్బదియొకటవ అధ్యాయము సంపూర్ణము.***

# డెబ్బది రెండవ అధ్యాయము

కం. ఏణాంకాశ్రిత మకుటా !
ఏణాంకామృత కర కరణేరిత తమసా !
ఏణాక్షి విశాల నయన !
ఏణాకృతి సత్వసాంద్ర ! హే జగదంబా !

ఉ. మేనటికంపు ధర్మములు మేమెయి చెప్పిన వైశ్య వృద్ధులున్,
మానిత తృప్త మానసులు, మానము, గోత్రము, వంశ విత్త మీ
శాన, గురూత్తముల్ వెలయు సక్థిజ పుంగవు లాత్మ దేహ సం
ధాన మొనర్చి సర్వమును త్యాగము చేయ ననుజ్ఞ వేడినన్. 2100

ఉ. దేశికులైన భాస్కరులు దేహములన్ తృణప్రాయ మంచు నా
వేశము నందు వైశ్యులను వేలిమి నొంద ననుజ్ఞ చేయుచున్,
కౌశ నిపాతమున్, గిరిశిఖా పతనంబును, స్థండిలాంతమున్
క్లేశములౌను, వాయు సఖు కీలల గ్రాగుట యుత్తమం బిలన్ ! 2101

చం. సవనములందు జంతువు లుషర్బుధు నొంది దివంబుఁ జేరు మీ
నివసతికిన్ దివంబునకు నిచ్చెన పావకు నాల్క, దానిపై
శివ శివ యంచుఁ జేరఁడిక శీఘ్రముగా శివసన్నిధిన్, మహో
త్సవ మహికా మహీధ్ర విభు సన్నిధి, పెన్నిధి, భవ్య ధీనిధిన్ ! 2102



సీ. రాధాఖ్య మన్వంతరము నందు తొలిసారి
బ్రహ్మ యూరువులందు ప్రభవ మంది,
ఊరవ్యు లంచును, నూరుజు లంచును,
సక్థిజులను పేర్ల సంపతిల్లి,
వైవస్వతాఖ్య మన్వంతర మందిప్డు
గోకర్ణమున జన్మ స్వీకరించి,
గోకర్ణు లంచును, గోమఠు లంచును,
కోమటులను పేర్ల కొప్పరించి,
తే.గీ. సాత్వికాంశము నందున జనన మంది
త్యాగ మార్గంబు నందున సాగు మీకు
నభవు సన్నిధి చేకూరు నహరహంబు
నభవ సమకూర్చు నానంద మనవరతము ! 2103

శా. ఏ వైశ్యుం దనల ప్రవేశమునఁ దా నిబ్బంగి నిర్వాణమం
దావాస క్షతి నొందు నాతని శుభాంగాసాద్య గోత్రంబునం
దావిర్భావము నొందు వైశ్య తతికిన్ యజ్ఞోపవీతంబుతోఁ
గావింపందగు కర్మ కాండ లిల నాగామిన్ పురాణోక్తముల్. 2104

ఆ.వె. నేటిదాక మీకు నిజ గోత్ర నామముల్
ఋషుల పేర్లఁ జెల్లె, ఋణముఁ దీరె,
నేటినుండి మీకు కూటస్థ పూరుషుల్
గోత్రములను నిలచి కొలువుఁ దీరు. 2105

శా. కైలాసంబున నుండి భూమిపయి గోకర్ణంబునం బుట్టె నే
మూలంబుల్ భవదీయ గోత్రముల నాముష్యాయణుల్ చేయగా
నా లోష్టంబులె నేటినుండి మిముఁ గాపాడంగ కూటస్థులై
క్రాలుంగాక కులంబు వర్ధిలఁగ, సంక్రామంబు మీకయ్యెడిన్ ! 2106

వ. ఇక మీ ఋషి, ఋషిగోత్రంబులకు సరియగు సిద్ధ పురుష నామంబులను, గోత్రంబులను చెప్పుచుంటి వినుఁడు– 2107

| సంఖ్య. | ఋషి | సనాతన గోత్రము | సిద్ధపురుషుఁడు | నూతన గోత్రము |
|---|---|---|---|---|
| 1. | గౌతముఁడు | గౌతమస | గ్రంథి శీలుఁడు | గ్రంథిశీల |
| 2. | భార్గవుఁడు | భార్గవస | బుద్ధి | బుద్ధికుల |
| 3. | జైమిని | యాస్కస | వెలుగు | వెలుగోళ్ళ |
| 4. | మతంగుఁడు | మాతంగస | కోరటుఁడు | కోరటకుల |
| 5. | ప్రీత మనస్కుఁడు | ప్రీత మనస్కస | పెద్ది శిష్టుఁడు | పెద్ది శిష్టకుల |
| 6. | పరమ తత్త్వుఁడు | పరమ తత్త్వస | పేరి శిష్టుఁడు | పేరి శిష్టకుల |
| 7. | విశ్వామిత్రుఁడు | విశ్వామిత్రస | వినికుఁడు | వినిక కుల |
| 8. | సుతీక్ష్ణుఁడు | సుతీక్ష్ణస | సూరి శిష్టుఁడు | సూరిశిష్టకుల |
| 9. | కనక పాలుఁడు | కనక పాలస | కనకపాలుఁడు | కనకపాల |
| 10. | సంవర్తుఁడు | సంవర్తస | ధనగుఁడు | ధనగుల |
| 11. | సనత్సుజాతుఁడు | సనత్సుజాతస | సాతాలుఁడు | సాతాల |
| 12. | తుంబురుఁడు | తుంబురస | తుప్పాలుఁడు | తుప్పాల |
| 13. | పేశలుఁడు | పేశలస | పుష్పాలుఁడు | పుష్పాల |
| 14. | వరుణుఁడు | వరుణస | వసంతకుఁడు | వసంతకుల |
| 15. | కృత్స్నకుఁడు | కృత్స్నకస | పృచ్ఛకుఁడు | పృచ్ఛకకుల |
| 16. | కపిలుఁడు | కపిలస | మాసంతుఁడు | మాసంతకుల |
| 17. | సాందీపుఁడు | సాందీపస | విక్రమ శిష్టుఁడు | విక్రమశిష్ట |
| 18. | ఆపస్తంబుఁడు | ఆపస్తంబస | అయనకుఁడు | అయనకుల |
| 19. | మందపాలుఁడు | మందపాలస | మండకుఁడు | మండకకుల |
| 20. | భరద్వాజుఁడు | భారద్వాజస | బలిశిష్టుఁడు | బలిశిష్ట |
| 21. | బృహదశ్వుఁడు | బృహదశ్వస | పద్మిశిష్టుఁడు | పద్మిశిష్ట |
| 22. | ఋష్యశృంగుఁడు | ఋష్యశృంగస | అనంతుఁడు | అనంతకుల |
| 23. | వాలఖిల్యుఁడు | వాలఖిల్యస | వెన్నుఁడు | వెన్నుకుల |
| 24. | కూర్ముఁడు | కూర్మస | కొమరుఁడు | కొమరశిష్ట |
| 25. | మంజులుఁడు | మంజులస | ముంజి | ముంజికుల |
| 26. | వ్యాధవానుఁడు | వ్యాధవానస | అభిముంజి | అభిముంచకుల |
| 27. | మార్కండేయుఁడు | మార్కండేయస | మూరువు | మూరుకుల |
| 28. | శాండిల్యుఁడు | శాండిల్యస | చినిశిష్టుఁడు | చినిశిష్ట |
| 29. | శమీకుఁడు | శమీకస | వినిశిష్టుఁడు | వినిశిష్ట |
| 30. | శ్రీధరుఁడు | శ్రీధరస | శినిశిష్టుఁడు | శినిశిష్ట |
| 31. | పర్వతుఁడు | పర్వతస | పైడి | పైడికుల |
| 32. | ప్రమథుఁడు | ప్రమథస | భ్రమరుఁడు | భ్రమరకుల |
| 33. | ఘటభవుఁడు | ఘటభవస | ఘనశ్రీ | ఘనశ్రీల |
| 34. | వేదనిధి | వేదనిధిస | వేంకోలుఁడు | వేంకోల |
| 35. | భృగువు | భార్గవస | పృధ్వి శిష్టుఁడు | పృధ్విశిష్ట |
| 36. | రైభ్యుఁడు | రైభ్యస | రేంటకుఁడు | రేంటకుల |
| 37. | కౌండిన్యుఁడు | కౌండిన్యస | సూసాలుఁడు | సూసాళ్ళ |
| 38. | హరివక్త్రుఁడు | హరివక్త్రస | ఉశరీకుఁడు | ఉశరీకుల |
| 39. | పవిత్రపాణి | పవిత్రపాణిస | చిద్రూపుఁడు | చిద్రూపుల |
| 40. | అక్షయుఁడు | అక్షయస | దీక్షితుఁడు | దీక్షాకుల |
| 41. | బోధాయనుఁడు | బోధాయనస | బుధురుఁడు | బుధురుకుల |
| 42. | విశావరుఁడు | విశావర్యస | యనసుఁడు | యనసకుల |
| 43. | కామ్యకుఁడు | కామ్యకస | కాముఁడు | కామశిష్ట |
| 44. | సత్యవ్రతుఁడు | సాత్యవ్రతస | స్యందికుఁడు | స్యందికుల |
| 45. | మహాసేనుఁడు | మహాసేనస | స్వస్తికుఁడు | స్వస్తికుల |
| 46. | కౌత్సుఁడు | కౌత్సస | కదంబుఁడు | కదంబకుల |
| 47. | స్థూలశిరుఁడు | స్థూలశిరస | అనుమర్షణుఁడు | అనుమర్షణకుల |
| 48. | కృష్ణద్వైపాయన | కృష్ణద్వైపాయనస | యలముంజి | యలముంచకుల |
| 49. | మాధవుఁడు | మాధవస | త్రిమూలుఁడు | త్రిమూలకుల |
| 50. | ముచికుందుఁడు | ముచికుందస | ముష్టకుఁడు | ముష్టకుల |
| 51. | శరభంగుఁడు | శరభంగస | క్రముకుఁడు | క్రముకశిష్ట |
| 52. | ధౌమ్యుఁడు | ధౌమ్యస | చందుఁడు | చందకుల |

| | | | | |
|---|---|---|---|---|
| 53. | తుర్యవ్రతుండు | తుర్యవ్రతస | తోటుండు | తోటకుల |
| 54. | మౌసలుండు | మౌసలస | ప్రొథయాజి | ప్రొథయాజకుల |
| 55. | హయగ్రీవుండు | హయగ్రీవస | అంగముండు | అంగమకుల |
| 56. | శక్తి | శాక్తేయస | సోమశిష్టుండు | సోమశిష్ట |
| 57. | పావనుండు | పావనస | పాలకుండు | పాలకకుల |
| 58. | విష్ణువృద్ధుండు | విష్ణువృద్ధస | ఇసుముండు | ఇసుమకుల |
| 59. | జాతవేదుండు | జాతవేదస | చక్రమూలుండు | చక్రమూలకుల |
| 60. | బృహస్పతి | బార్హస్పత్యస | వృద్ధి | వృద్ధికుల |
| 61. | వశిష్ఠుండు | వాశిష్టస | వస్తుకుండు | వస్తుకుల |
| 62. | పుండరీకుండు | పౌండరీకస | క్రానుండు | క్రానుకుల |
| 63. | శుకుండు | శౌకస | కమలుండు | కమలకుల |
| 64. | గార్గి | గార్గేయస | కన్యకుండు | కన్యకుల |
| 65. | కృష్ణుండు | కార్ష్ణేయస | ధనదుండు | ధనదకుల |
| 66. | త్రిజటుండు | త్రిజటస | త్రివిక్రముండు | త్రివిక్రమకుల |
| 67. | కాంచనుండు | కాంచనస | శమనుండు | శమనకుల |
| 68. | శౌనకుండు | శౌనకస | శౌనకుండు | శౌనకకుల |
| 69. | అశ్వలాయనుండు | ఆశ్వలాయనస | అమలుండు | అమలకుల |
| 70. | విష్వక్సేనుండు | విష్వక్సేనస | పరిశిష్టుండు | పరిశిష్ట |
| 71. | పూతికర్షుండు | పూతికర్షస | తులసికుండు | తులసికుల |
| 72. | జాబాలి | జాబాలిస | భీమశిష్టుండు | భీమశిష్ట |
| 73. | శార్జరవుండు | శార్జరవస | గుండుకుండు | గుండుకకుల |
| 74. | మహాతేజుండు | మహాతేజస | ఇక్ష్వాకుండు | ఇక్ష్వాకకుల |
| 75. | శరభంగుండు | శరభంగస | హస్తి | హస్తికుల |
| 76. | పులస్త్యుండు | పౌలస్త్యస | శ్రీపుంసికుండు | శ్రీపుంసికుల |
| 77. | కశ్యపుండు | కశ్యపస | గణపుండు | గణపకుల |
| 78. | ప్రభాతుండు | ప్రభాతస | ఉద్వాహుండు | ఉద్వాహకుల |
| | రశ్మి | | రవిశిష్టుండు | (రవిశిష్టకుల) |



| | | | | |
|---|---|---|---|---|
| 79. | మాండవ్యుండు | మాండవ్యస | మన్యువు | మన్యుకుల |
| | మదనుండు | | మానాభుండు | (మానాభకుల) |
| 80 | .అంగీరసుండు | అంగీరస | అనుపాలుండు | అనుపాలకుల |
| | ఆఖండలుండు | | అనుపుండు | (అనుపకుల) |
| 81. | హిడింబుండు | హిడింబస | ఇంచుకుండు | ఇంచుకుల |
| | హయగ్రీవుండు | | గోంటుకుండు | (గోంటుకకుల) |
| 82. | తుందిలుండు | తుందిలస | తులశిష్టుండు | తులశిష్ట |
| | తుహినపాలుండు | | వృకశిష్టుండు | (వృకశిష్ట) |
| 83. | శ్రీవత్సుండు | శ్రీవత్సస | శ్రీరంగండు | శ్రీరంగకుల |
| | చరణుండు | | శ్రీలుండు | (శ్రీలకుల) |
| 84. | కణ్వుండు | కాణ్వస | ఘంటకుండు | ఘంటకకుల |
| | గణేశుండు | | ఘనముఖుండు | (ఘనముఖకుల) |
| 85. | కందర్పుండు | కందర్పస | చేరుకుండు | చేరుకోళ్ళ |
| | చరణవ్రతుండు | | చేగుండు | (చేగోళ్ళ) |
| 86. | చండిగుండు | చండిగస | ఫలకుండు | ఫలకకుల |
| | పౌండ్రకుండు | | పట్టణుండు | (పట్టణకుల) |
| 87. | దేవలుండు | దేవలస | దేశిష్టుండు | దేశిష్ట |
| | ధార్మికుండు | | దైవిశిష్టుండు | (దైవిశిష్ట) |
| 88. | మైత్రేయుండు | మైత్రేయస | మిథునుండు | మిథునకుల |
| | మంజులుండు | | మైత్రేయుండు | (మద్దికుల) |
| 89. | సనకుండు | సనకస | సనకుండు | సనకకుల |
| | సనందనుండు | | సానకుండు | (సానకకుల) |
| 90. | నారదుండు | నారదస | ఉతశిష్టుండు | ఉతశిష్ట |
| | ఊర్మ్ముండు | | ఉతకాలుండు | (ఉతకాల) |
| 91. | ఉదంకుండు | ఉదంకస | ఉపమన్యువు | ఉపమన్యుకుల |
| | మనువు | | ఉపనుండు | (ఉపనకుల) |
| 92. | కాశ్యపుండు | కాశ్యపస | కాలకుండు | కాలకుల |
| | కల్మాషపాదుండు | | కర్ణాటుండు | (కర్ణాటకుల) |

| | | | | |
|---|---|---|---|---|
| 93. | జహ్నువు | జాహ్నవస | చన్నకుఁడు | చెన్నకకుల |
| | చ్యవనుఁడు | | జానకుఁడు | (జానకకుల) |
| 94. | దత్తాత్రేయుఁడు | దత్తాత్రేయస | దాంతుఁడు | దాంతకుల |
| | ధాతృకుఁడు | | దెంతకుఁడు | (దెంతకుల) |
| 95. | ముద్గలుఁడు | మౌద్గల్యస | నాభీలుఁడు | నాభీల |
| | మౌనితముఁడు | | ముని | (మునికుల) |
| | ముక్తిప్రదుఁడు | | మూలుఁడు | (మూలకుల) |
| 96. | యాజ్ఞవల్క్యుఁడు | యాజ్ఞవల్క్యస | యవిశిష్టుఁడు | యవిశిష్ట |
| | యాసనుఁడు | | అరశిష్టుఁడు | (అరశిష్ట) |
| | అఘహరి | | అరసుఁడు | (అరసకుల) |
| 97. | చతుష్కర్ణుఁడు | చతుష్కర్ణస | చంద్రికుఁడు | చంద్రికకుల |
| | చరమతి | | చంద్రమూలుఁడు | (చంద్రమూలకుల) |
| | చరితవ్రతుఁడు | | చంద్రశిష్టుఁడు | (చంద్రశిష్ట) |
| 98. | పౌంద్రకుఁడు | పౌంద్రకస | ప్రోలికుఁడు | ప్రోలికుల |
| | పుష్పదంతుఁడు | | పుంసికుఁడు | (పుంసికకుల) |
| | పురుకుత్సుఁడు | | ప్రోలిశిష్టుఁడు | (ప్రోలిశిష్ట) |
| 99. | చిత్రకుఁడు | చిత్రకస | చింతుఁడు | చింతకుల |
| | చిత్రుఁడు | | చింతముఁడు | (చింతమకుల) |
| | చిత్రవ్రతుఁడు | | చింతశిష్టుఁడు | (చింతశిష్ట) |
| 100. | వాయువ్యుఁడు | వాయువ్యస | వ్రక్కాలుఁడు | వ్రక్కాలకుల |
| | వామదేవుఁడు | | వ్రంగముఁడు | (వ్రంగమకుల) |
| | వామనుఁడు | | వక్రశిష్టుఁడు | (వక్రశిష్ట) |
| 101. | పరాశరుఁడు | పారాశరస | పాంచాలుఁడు | పాంచాలకుల |
| | పాదనేత్రుఁడు | | పడగశీలుఁడు | (పడగశీల) |
| | పారియాత్రుఁడు | | పాణుసుఁడు | (పాణుసకుల) |
| | కామధేనుఁడు | | కమఠుఁడు | (కమఠకుల) |



| | | | | |
|---|---|---|---|---|
| 102. | పులస్త్యుఁడు | పులస్త్యస | పునగ శీలుఁడు | పునగశీల |
| | గోవ్రతుఁడు | | గోశీలుఁడు | (గోశీల) |
| | ఉత్తముఁడు | | ఉత్తమ గోశీలుఁడు | (ఉత్తమగోశీల) |
| | పారదుఁడు | | పల్లవ గోశీలుఁడు | (పల్లవ గోశీల) |
| | పర్వతుఁడు | | పటు గోశీలుఁడు | (పటుగోశీల) |
| | సక్తుప్రస్థుఁడు | | సత్వ గోశీలుఁడు | (సత్యగోశీల) |
| | భీషణుఁడు | | భీమ గోశీలుఁడు | (భీమగోశీల) |
| | విజయుఁడు | | వృష గోశీలుఁడు | (వృషగోశీల) |
| | నాచికేతుఁడు | | నంది గోశీలుఁడు | (నందిగోశీల) |
| | సూనృతుఁడు | | సూర్యుఁడు | (సూర్యకుల) |

2108

తే.గీ. వైశ్యవరులార ! యిక మీద వసుధ మీద
మీకు జన్మంబు నిచ్చిన మీ పురాణ
పూరుషులె గోత్ర పురుషులై పూజలందు,
భూసురాదుల గొత్రముల్ బ్రుంగు వడును. 2109

వ. కావున నో వైశ్యోత్తములారా ! పోయి మీ కర్తవ్యంబులు పాటింపుడు, రేపకడనే స్నానాదులు గావించి నిర్మల మనస్కులై అగ్ని ప్రవేశమొనరించు వారలిచ్చటకు రండు, నేను పోయి వచ్చెద ననుచు భాస్కరాచార్యులవారు లేచుచుండగా వైశ్యులును సెలవొంది తమ తమ గృహంబుల కేగిరి. 2110

***ఇది శ్రీవాసవీపురాణమునందు వైశ్యుల ఋషి, గోత్రంబులకు సరియగు సిద్ధపురుష, నూతన గోత్రనామంబుల ప్రకటించు డెబ్బదిరెండవ అధ్యాయము సంపూర్ణము.***

# డెబ్బది మూడవ అధ్యాయము

కం. **ఓం కల్యాణీ ! కమలా !**
**ఓం కామాఖ్యా ! కరాళి ! ఓం కౌమారీ !**
**ఓం కలి కల్మష నాశిని !**
**ఓం కాత్యాయిని ! ప్రచండ ! ఓం గాయత్రీ !**

హరిణగతి రగడ. ముదము తోడుత ముదియు వైశ్యులు
నుదయమే కాలోచితంబులు
మొదలుఁ దీరిచి ముగిసినంతను
కదలి చేరిరి కాలు గృహమును. 2111

హరి.ర. నగరు సామికి, నడచు సామికి
మొగిచి వందనములనుచు, పలికె
మగువ యిట్టుల మంట పడుటే
యుగమునైనను హోళికగుటే ! 2112

హరి.ర. అనఁగ నాచార్యాగ్ర గణ్యుఁడు
వినిచె శిష్యుల వెతల వైద్యుఁడు
వెనుక సహితము వెలుగు చూడని
వనితలెందరొ వహ్నిఁ జనిరని. 2113

హరి.ర. వినుఁడు చెప్పెద వింత కథలన
వినము మేమను వేధ లెవరని ?
వినఁగ నెంతయు వేడుకనియిరి,
అనుచు వైశ్యులు నవధరించిరి. 2114



ఉ. ప్రాణము కన్న మాన మతి పావనమైనది, మానవోత్తముల్
ప్రాణమునైన వీడుదు రపాయము మానముకైన నాడు ని
శ్రేణిగ నగ్ని దూకి మది శ్రేయము నందెద రాత్మ నెంచుచో
ప్రాణము నంది పుట్టి తమ పంతముఁ దీర్తురు వేరు జన్మలో ! 2115

వృషభగతి రగడ. అట్టి యవమతి వేదవతి కయి
నట్టి గతమున నగ్ని దూకెను
మట్టిఁ జేసెను రిపుల వంశము
మట్టుకొని హరి యురముఁ జేరెను. 2116

వృష.ర. అనఁగ వైశ్యులు వేదవతి కథ
ననయమును విన వేడుకాయెను
వినుచుమన నాచార్యుఁడును నా
విన్నపములను స్వీకరించెను. 2117

కం. పూర్వము త్రేతా యుగమున
సర్వము హరి యంచు మ్రొక్కు సన్మతి యింటన్
పర్వము కుహువున శశివలె
పర్వెను వేదవతి యనెఁడు పడతుక వెలుగుల్. 2118

వ. అనవిని ప్రాశ్నికులా సన్మతి యెవరు, వంశంబెద్ది యని ప్రశ్నింప నమ్ముని యిట్లనియె. 2119

కం. మను వంశంబునఁ బుట్టెను
చనవున ప్రభువైన దక్ష సావర్ణియు నా
తనికి మనుమఁడు బలయుతుఁడు
జనియించెను పేర్మి రాజ సావర్ణి యనన్. 2120

తే.గీ. అతఁడు శివభక్తుఁడు సతతం బభవుచింత
మనసు కీలించి జీవితం బనుపుచుండ,
నారదాహతి రాజ్యంబు నాఁచు వడఁగ
నడవిఁ బట్టెను రాజ సింహంబు వగచి. 2121

ఆ.వె. అతని సుతుండనంగ నతులిత బలశౌర్య
ఘని కుశధ్వజుండు కలనమందు
శత్రువులను చెండి సాధించె సామ్రాజ్య
రమను, యేలుకొనియె రాణ మీర ! 2122

కం. వానికి రథధ్వజుండు న
వ్వానికి ధర్మ ధ్వజుండును, వరగుణ పూషం
డైన కుశధ్వజుండును వి
జ్ఞాన భరితులై జనించె సౌజన్యమునన్. 2123

కం. గోదావరి తరగలవలె
పాదాలకు జారు కేశ భారము తోడన్
నాదలహరి మాలావతి
వేదాంతి కుశధ్వజాఖ్యు బ్రేలిన్ బట్టెన్ ! 2124

కం. ఇరువురు విష్ణు విధేయులు
సురుచిరముగ విష్ణు భక్తి సోలుచు నుండన్
కరమరుదుగ జనియించెను
చిరుపాపగ లక్ష్మి అంశ చిత్ఝజ సుమమై ! 2125

ఉ. నేమము వేదపాఠనము నెట్టన సల్పుచునుండఁ బుట్టుటన్
ప్రేమముమీర వేదవతిపేరునఁ బిల్చుచుఁ బెద్దఁజేసి రా
రామనుగన్నవారు తమరాజ్యముకన్నను మిన్నగా పరం
ధామునిసొమ్ముగా, పరమధామముఁ జేరెడు మేలుదారిగా ! 2126

వ. అంతట విష్ణుమూర్తి తన భక్తుల మనోగతం బెఱింగి వారికొక దినంబున స్వప్నంబున గన్పించి యిట్లనియె. 2127

కం. వరమున జనియించిన తన
వర పుత్రిక పత్నిగాదు వరియింపఁగ, నన్
వరునిగ మరు జన్మంబున
వరియించును, జనకుండ వయి పాలించు నెడన్ ! 2128

చం. అనిన కుశధ్వజుండు తన యానన లేఖన దుర్విలాసమున్
మనమున సోకనీక తన మానసమందున విష్ణు చింతనల్
గునగున సాగుచుండ నవగుంఠిత జీవిత మెల్ల బాహిరం
బునఁ గొనసాగఁజేయుచునుఁ బూర్వపు రీతిని నేలుచుండగన్. 2129

ఉ. ఎక్కడి నుండి వచ్చెనొ? కరీంద్ర మదంబున రాక్షసాధముం
డొక్కఁడు, వచ్చి వేదవతి నుద్దిగ నిమ్మని వార్త నంపగా,
ముక్కొను దైత్యు దుండగపు ముట్టుఁ దొలంగగ, కన్య దెందమం
దెక్కెను విష్ణువంచు బదులిచ్చెఁ గుశధ్వజుఁ డంత నాతఁడున్. 2130

తే.గీ. విష్ణువో గిష్ణువో నాకు వినఁగ రాదు,
కన్య నిత్తువో, చత్తువో కదనమందు,
తేల్చుకొమ్మంచుఁ గొమ్మకై తీవరింప
మోహరించెఁ గుశుఁడు దైత్యు మోహ మడఁప. 2131

తే.గీ. ధర్మమునకే విజయమన్న ధర్మసూత్ర
మునకు ప్రతికూలమై పొందె మూర్ఖ బలము
జయము, గెలుపొందె దైత్యుండు, చనియె విష్ణు
భక్తుఁ డచ్యుతుం జేరి శుభమ్ము వడయ ! 2132

ఆ.వె. మగఁడులేని పడఁతి మనుగడ దుర్భర
మనెడినుడిని నమ్ము మగువగనుక
మగనిఁగూడి దివికి మాలావతీదేవి
వేదవతిని నొంటి వీడిచనియె. 2133

తే.గీ. తల్లిదండ్రులు తన్నొంటిదానిఁ జేసి
మింటికేగిన దుఃఖంబు కంటగిలగ
నెట్టులో దైత్యుకనుగప్పి గట్టువడియె
నంబుజోదరుగూర్చి తపంబుఁబూనె ! 2134

సీ. వేదవతి తపంబు విచికిత్స లేకుండ
సలిపె నపూర్వమౌ సాధ్వులవలె,
శంకరు భర్తగా సాధింపఁ బూనిన
పార్వతి వలె సాగు పర్ణములను,
నేను పతులఁ గోరె డింద్రసేనాఖ్య ద్రౌ
పది వోలె సాగు శ్రీపతినె పతిగ,
హరి వీడి తిరిగి శ్రీహరిఁగోరి తపియించు
లక్ష్మివలె వరించు లచ్చి మగని,
తే.గీ. తపమునందునఁ గృశియించు తనువుఁజూడ
నుండి లేనట్టి నడుమట్టులుండు రూపు,
అట్టి రూపునుఁ గామించు నట్టివారు
నుందురీలోకమను చిత్రమందిరమున ! 2135

చం. గెలిచెడివేళ లోకములఁ గ్రేగయి కందిన సుందరీమణుల్
వలపువలంతులై చెలఁగ వాసగృహంబునుఁజేరు రావణుం
డలయికఁదీర నా పథమునందునఁ జేరిక విశ్రమించుచున్
వలఁకులుగాంచఁ గాన్పడెను వల్లడికానికి వాంఛితాంకమై ! 2136

కం. లేడికి లేచినదె పరుగు,
వాఁడికి చూచినదె తడవు వలపు ఘటింపన్
వాడి శరమ్ముల కీడ్పడి
తోడెము దరిఁ జేరి గాంచె తొయ్యలి తపమున్ ! 2137

తే.గీ. కాంచి దర్భాసన స్థిత కాంత నుండి
వెడలు నారాయణా యను విషము సోకి
శివ శివాయంచు చెవులు మూసికొని రావ
ణుండు ఘోరారవంబున నులిచె నంత. 2138

కం. రవమున భయమొదవక, కల
రవమునఁ గనుదములు విడి పరాగము వెడలన్,
రవణింప నేల రావణ
పువుఁబోఁడి హరికి నివాళి, పోపో యనియెన్. 2139

చం. మరల నదే విధానమున మాటలఁ బుచ్చు వధూవిరోధనం
బరసిన రావణుండు మసి బారిన మానిని మానమంటగా
కురులను బట్టి నేలఁ బడి కూలగ లాగెను రాక్షసంబుగా
నురగము తోకఁ ద్రొక్కినటు లూర్జిత మానస లేచి సింగమై. 2140

ఉ. ఓరి విమోహ పాశయుత ! ఓటమెఱుంగని రాక్షసాధమా !
శౌరిని బిల్చు దేహ మవిచారతఁ ద్రోసిన నీదు చేతులా
శౌరి సమర్పణంబులఁ బ్రచాలిత మైన శిరంబు వ్రయ్యలౌ !
నీ రుధిరంబునంగలిగి నిన్ను వధించగ జన్మమెత్తెదన్. 2141

ఆ.వె. అనుచు వేదవతియు నగ్నిఁ బుట్టించె నా
యగ్నిలోన బడె ననంతుఁ దలచి,
రావణుండు చనియె రాబోవు మృతి చింత
చిత్తమందు కలచి చిందువేయ. 2142

హరి.ర. కథను వించును కార్పటికులును
కథకునకు కర కరదమిచ్చుచు
పథముఁ జూపెడు పథికునకు తమ
మథనమందున మరల తడిమిరి. 2143

**ఇది శ్రీవాసవీపురాణమునందు వేదవతి వృత్తాంతమను డెబ్బదిమూడవ అధ్యాయము సంపూర్ణము.**

# డెబ్బది నాల్గవ అధ్యాయము

**కం. మద వారణ పంచానన !**
**మద మోహిత మానవాధమ వినాశిని ! హే**
**మదఘూర్ణిత రక్తాక్షీ !**
**మద పాటల గండ భూః ! సమస్త శుభకరీ !**

కం. ఇటు కథ సాగుచు నుండఁగ
నటు వైశ్యుల మెదడులోన నవనీపతి యే
రటితము నందు దహించుచు
నటమట చెందునొ వినంగ నాశలు రేగెన్ ! 2144

కం. ఋషి సాలంకాయనుఁడును
కృషి జీవుల యాశలోని కీలక మెఱుకన్
విషమశరు ధాటి కెరగిన
తృషితుని విషయమును తేట తెల్లముఁ జేసెన్. 2145

ఆ.వె. రాజభవన మందు రాణివాసము వీడి
వైశ్య గణము నుండి వార్త లేక
ఇక్షుశరహతుండు నేకాంత మందున
గతముఁ దలచికొనుచు గడుపసాగె. 2146

సీ. కొమ్మయో యది ముద్దుగుమ్మయో బంగారు
బొమ్మయో రతనంపుఁ గమ్మయొక్కొ
కల్కియో రతిరాజు ములికియో చెలువంపు
గిల్కయో చిలుకల కొల్కియొక్కొ
బాలయో మరుచేతి కోలయో సుగుణాల
వాలయో మురిపెంపుఁ గోల యొక్కొ
యింతియో ముద్ద చేమంతియో రసముల
దొంతియో యతను పూబంతి యొక్కొ
తే.గీ. తారయో రతియో యెంచ నేరనైతి
కన్యయో లేక యూర్వశీ కాంత యేమొ
యౌర యా సోయగంబు నాయంద మెందు
సుందరాంగుల యందునఁ జూడగలమె ? 2147

సీ. కంజంబు లనుచుఁ జుక్కలటంచు వట ఫల
ములటంచుఁ దామేటి బొరుసు లంచు
వరిపొట్ట లంచును నరటి కంబములం చి
సుక తిన్నె లంచును సుడియటంచు
గగనం బటంచు బంగారు కుండ లటంచుఁ
దామర తూళ్ళంచుఁ దలిరులంచు
మరుని చిందమటంచు మురువు టద్దము లంచుఁ
బగడమంచును దిల ప్రసవ మంచు
తే.గీ. ఝషము లంచును విండ్లంచుఁ జంద్ర బింబ
మనుచు శ్రీకారము లటంచు నళులటంచు
నిట్టివే గద చెప్పబోయెడి యుపమలు
సిగ్గగును వీనిఁ దలఁప నీ చెలియనెన్న ! 2148

ఉ. ఇమ్మహిళా వతంసమును నెట్టుల నేన్దగ నెంచు వాఁడ నం
చమ్మక చెల్ల నోటఁ దనివారఁగ బూనినఁ బల్కఁ జాలనే
యిమ్మదిరాక్షి సోయగము నేర్పడఁ గోటి శతాంశమైన నే
త్రమ్ములు వొందె నిప్డుగద రమ్య ఫలంబిల నన్నుఁ జేరఁగాన్ ! 2149

మ. మృదు మాధుర్య వచో విలాసమున కెంతే నాసచేఁ గాంత వా
క్పద వాణిం బికమో శుకంబొ పరితృప్తన్ జేసి యర్చాదులన్
ముదమొప్పంగ నివేదనం బిడిన కెంపుం బువ్వొ బింబంబొ నా
మద హంసీ వరయాన వాతెఱ దగు న్మాద్యత్ప్రభా సాంద్రమై ! 2150

సీ. కనక కుంభంబుల కామనీయక మింతి
వక్షోజ యుగ్మంబు వరుస నెఱపఁ
గెంపుఁ జాయలఁ గడు సొంపు గుల్కెడు పల్ల
వములు పత్పాణి ప్రభావ మెన్నఁ
గుద్యోపరి స్థిత కోమల లతలెల్ల
యతివ బాహువులు దేహంబుఁ దెలుప
నింద్ర నీలంబుల సాంద్ర కాంతులు కన్ను
గవ వేణి ఘన సోయగంబు నడపఁ
తే.గీ. బూల తెలిడాలు చెలినవ్వు పోల్కిఁదనర
మించు టద్దంబు సకియ మోమంచుఁ జెప్ప
నీ సభాస్థలి యంతయు నీక్షణమునఁ
గన్యకాంబా మయంబౌచుఁ గరము దోఁచె. 2151

చం. కనుకలి చేతనే యిటులఁ గాంత పయిన్ గడు మోహ మబ్బెడిన్
జనవరినై ప్రసంగమును సల్పిన నెట్టుల నుండు వాఁడనో
ఘనకచఁ బెండ్లి యాడఁగల గౌరవ మబ్బిన నాదు నెమ్మనం
బునఁ గడు నింత కెంత పరిపూర్తి దనర్చునొ మోదమందగన్ ! 2152

శా. ఈ తన్వీమణి నెప్పుఁడైన గిరిశుం డీక్షించెనా యేల సం
ప్రీతాత్ముండయి యర్ధ దేహ మమకుం బెంపెక్కఁగా నిచ్చు, నీ
శీతాంశు ప్రతిమాననం గనిన లక్ష్మిన్ వక్షమం దెప్పుఁడున్
జేతో మోదముతోడఁ దాల్చునె కడున్ హేలాగతిన్ వెన్నుఁడున్ !2153

సీ. పాలమున్నీటిలోఁ బరగఁబుట్టిన సిరి
కన్నెగాకిది మర్త్యకన్యగాదు,
మంచుగుబ్బలిరాజు మరువంబుగాఁ గన్న
కన్నెగాకిది మర్త్యకన్యగాదు,
తొలి పలుకుల సామి కులకు మోమున నున్న
కన్నెగాకిది మర్త్యకన్యగాదు,
పదినూరు కన్నుల వాని యిల్లాలైన
కన్నెగాకిది మర్త్యకన్యగాదు,
తే.గీ. ఔర యీచాన మేనిసోయగముఁగన్న
నెట్టి జడదారి తేఁడైన బెట్టిదముగఁ
బువ్వు విలుకాని వాడి తూపులకుఁ గలఁగ
కున్నె యెదలోన నిఁక మన మన్ననెంత ? 2154

మ. గిరిరాట్పుత్రికయో పయోధి సుతయో గీర్భామయో లేక నా
పురుహూత ప్రియయో వసంత రమయో పుష్పేషు నర్ధాంగియో
కర మాశ్చర్యము గల్గుచున్న దెదలోఁ గాకన్ విలాసార్థ మీ
ధర కేతెంచిన యూర్వశీ తరుణియో తథ్యంబు సుమ్మెంతయున్ ! 2155

మ. మెరుపుం దీవెను బోలె నప్పడతి, యా మీనాంక సద్రాజ్య ల
క్ష్మి రహిన్ గన్నుల కట్టె కన్పడి యహా ! మిథ్యోరు మోహాబ్ధిలోఁ
గరమున్ మున్గఁగఁ జేసి మాయమయి వీఁకన్ బోయె నే నెట్టులం
భరియింపం గలవాఁడ మోహమును, నాభాగ్యం బదెట్లుండునో ? 2156

సీ. అద్దిర యా చిన్ని ముద్దుల కన్నియ
కమనీయమైన క్రొక్కాఱు మెఱుఁగు
మెఱుఁగు గాదది తియ్య మేల్విల్లు దొర చేతఁ
గ్రాలు నూతనపుఁ జెంగలువ దండ

దండ గాదది బ్రహ్మ దండి చాతురి బయల్
పరపఁ జేసిన మేలు పసిఁడి బొమ్మ
బొమ్మ గాదది లోకముల మోహమున ముంచు
మాహి నేతెంచిన మోహనాస్త్ర

తే.గీ. మస్త్ర మదిగాదు రతనంపు టరిది తొడవు
తొడవు గాదది సొగసుల మడుగు గాని
మడుగు గాదది తలపఁగ మనుజ రమణి
రమణి గాదది నాభాగ్య రాశి గాని ! 2157

ఉ. ఆ యెలనాగ సోయగ మయారె నుతింపఁగ లేక భారతీఁ
నాయకుఁ డొందె నాల్గు వదనంబులఁ గోర్కెలు దీరఁ జూడఁగా
వేయిని బూనెఁ గన్నులను బ్రీతి మహేంద్రుఁడు, వేయి నాల్కలన్
బాయక నుండు శేషుఁడు శబాసుర దాని నుతింప శక్యమే ! 2158

సీ. కలికి పుత్తడి బొమ్మ కాఁబోలుఁ గాకున్న
నితరుల కాస గల్గింపఁ గలదె,
కలికి తొల్కరి మెఱుపు కాఁబోలుఁ గాకున్న
దళుకు తళుక్కని తనరఁ గలదె,
కలికి సంపెఁగ పూవు కాఁబోలుఁ గాకున్న
వలపుల నింతగాఁ జిలుకఁ గలదె,
కలికి చిల్కలకొల్కి కాఁబోలుఁ గాకున్న
నెలుఁగులోఁ దేనెలనొలుకఁ గలదె,

తే.గీ. ఔర యీ మత్త గజరాజ యాన వంటి
చాననేఁ గాన నెందే జగానఁ గాని,
జాణఁడయ్యెను భారతీ జాని దీనిఁ
బూని యశమాన నసమానఁగా నొనర్చి ! 2159

ఉ. అందని మ్రాని పండులకు నఱ్ఱులు సాచిన రీతి నీ జగ
త్సుందరి పైని మోహమును సూటిగఁ బూనితిఁ బాయఁ జాల నా
మంద మరాళయాన నను మానకఁ బెండిలిఁ గాఁగఁ గోరునో
సందియ మొందునో నెఱుఁగఁజాలను భాగ్య మదెట్టులున్నదో ? 2160

ఉ. అద్దిర దాని మోము సొగసామర వేశ్యల యందు శూన్య మీ
ముద్దుల గుమ్మఁ గౌఁగిటఁ బ్రమోదము పుట్టగఁ జేర్పకున్నెడన్
నిద్దుర వచ్చునే నిశిని ? నిల్వఁగ నిచ్చునె మారుఁడెంతయున్ ?
తద్దయు నన్న మింపగునె ? తాల్మి తనర్చునె ? జీవముండునే ? 2161

మ. తలిరుం బోఁడులు లేరె ? చక్కఁదనమున్ దైవారరే ? వార లీ
యలివేణీ మణిఁ బోలఁ జాలుదురె ? సన్యాస్యౌఘముల్ దీనినిన్
దిలకింపన్ దపమేఁది బంటుల బలెన్ దీవ్రాతి మోహంబునన్
జలిత స్వాంతము తోడ వెంటఁ దిరుగన్ గాంక్షింపరే భూస్థలిన్ !2162

తే.గీ. అబ్జ భూలీలఁ దాల్చు నీ యతివ మోము
హరి విలాసంబుఁ బూను నీ యబల నడుము
కదళికా కుందములఁ బోలుఁ గాంత యూరు
యుగ్మ మయ్యారె బంగారు యువతి మేను. 2163

మ. పలుకుల్ మాలికలై గళంబు వడ యప్పద్మాక్షిఁ జంద్రాననన్
దలిరుం బోఁడిఁ జొకారపుం గరిత నా తన్వంగి బంగారు బొ
మ్మ లసద్రత్న శలాక వంటి మొలకన్ మాణిక్యమున్ ముద్దుఁ బ
ల్కుల రాచిల్క మృగేక్షణన్ మఱువ నాకున్ దుర్ఘటంబౌ నికన్ ! 2164

మ. స్మరియింతున్ మదన క్షమావర మహా సామ్రాజ్య ప్రాజ్యేందిరన్
హరిణాక్షిన్ మఘవాశ్మ నీలచికురన్ జంద్రాననన్ సుందరిన్
హరిమధ్యన్ శుకవాణి మత్తగజయానన్ నెచ్చెలిన్ మన్మనో
హర పంచాయుధసాయకంబు నెదలో నశ్రాంతమున్ బల్తమిన్. 2165

చం. చెలిమి పొలంతు లింటికినిఁ జెచ్చెరఁ దోడ్కొని పోవుచుండగాఁ
గలకల నాదు హంసతతి కాళ్ళకు నడ్డుగఁ దోలుకొంచుఁ గో
కిల పలుకుల్ వినంబడ నొకించుక నుల్కుచుఁ బోయినట్టి నా
యలికుల వేణి చక్కని యొయారము నా మది వేడ్కఁ గొల్పెడిన్ ! 2166

కం. రంగారు నా యొయారపు
బంగారపుఁ గీలుబొమ్మ పటుతరమగు మేల్
సింగార మెంచుకొనియెద
నంగజు వెతఁ బాపు మంత్ర మదిగాదె భువిన్ ! 2167

ఉ. ఏటికి దేశమంతయు జయింపఁగ నా పురి వీడి పోయినా
నేటికి రాక నంతట నహీన జవంబలరార నా పురం
బేటికి పోయినాడనొకొ నెట్లటు వచ్చెను గాంత యా గృహం
బేటికి జొచ్చినాఁడఁ జెలి యేటికిఁ గన్పడె నాదు కంటికిన్ ! 2168

చం. కనఁబడె నేమి నాదు మది గాథ తరంబగు మోహమేల సం
జనితము నయ్యెఁ బెండ్లి యగు సమ్ముద మేల జనించె నద్దిరా
వనజభవుండు నా నుదుట వ్రాసెనొ వ్రాయఁడొ యీ సతీలలా
మను భువిఁ బత్నిఁగాఁ బడయు మానిత భాగ్యము మూఁడు బంతులన్

సీ. గబ్బి గుబ్బలఁ గని యుబ్బి పోయితిఁ గాని
నిబ్బరంబుగఁ జూడ నేర నైతి
సోగ కన్నులఁ జూచి సోలి పోయితి గాని
కోర్కె తీరఁగ ముద్దుఁ గోరనైతి
నలివేణి జడఁగని యబ్ర మొందితిఁ గాని
తెలివితో నా కోర్కెఁ దెలుపనైతి
నిద్దంపుఁ జెక్కుల నిగనిగల్ గని మెచ్చు
కొంటినే గాని వేఁడ్కొనఁగ నైతి

తే.గీ. ఔర పని మించె బుద్ధి యిట్లరఁ దలంచె
మరుఁడు పగనెంచె మోహము మదిఁ గలంచెఁ
గోర్కె లొదవించె ముద్దియ కూర్మి నించె
రామ రామ ! మరుని బాధ కేమి దిక్కు ? 2170

మ. సవనాది క్రియలన్ సురాళిని గడున్ సంతృప్తులం జేయు ధ
న్య వరాగ్రేసరులైన వారి కొదవున్ నాకేటికిన్ గల్గు నీ
భువనాగణ్య సురూప సద్గుణ కళా భూతోపమానాంచితో
ద్ధవళాక్షీ మధురాధరామృత మొకింతన్ గ్రోలు పుణ్యం బిలన్ ? 2171

ఉ. భామిని సుందరీ మణులఁ బూత గుణాఢ్యలఁ జూతుమే కదా
కాముని పూవు ముల్కివలెఁ గాంత తటిల్లత వోలె నిప్పుడీ
భామిని చారు విగ్రహము వాయదు నా మది నేమి సేతు ని
క్కామిని చెంత లేకయును గన్నులఁ గట్టిన యట్లు తోఁచెడున్ ! 2172

కం. తమిఁ గన్నుల కఱవారఁగఁ
గమనీయఁపు దాని రూపుఁ గన్గొను నురు భా
గ్యము నా కున్నదొ లేదో
ప్రమదా రత్నంబు వీడి వచ్చితి నయయో ! 2173

సీ. తన్వి ! నీ యధరామృతం బానినం గాక
విరహ తాపం బేను వీడఁ గలనె
కాంతామణీ ! నిన్నుఁ గౌగలింపక యున్న
మన్మథ వ్యధలను మాన్పఁ గలనె
భామ ! నీ కుచ దుర్గ సీమఁ జేరక యున్న
మార వికారముల్ మాన్పఁ గలనె
చెలి ! నీ కటాక్షంబుఁ జిలుక కుండిన వేగ
మదన వేదనల నే మఱువఁ గలనె

తే.గీ. యింతి ! నను బెండ్లి యాడ నీ వించుకైన
సంశయించెద వేని నీ చరణ మాన
దేహమునఁ బ్రాణముల నిల్పఁ దెఱవు లేదు
లీల నా చెట్టఁ బట్టుము నీలవేణి ! 2174

సీ. హా వికసిత నీరజాయత లోచనా !
హా పూర్ణ రాకాసుధాంశు వదన !
హా మద రోలంబ కోమలాలక జాల !
హా మహా రజిత శోభాభ గాత్ర !
హా దిగంతేభ కుంభాభోగ కుచ కుంభ !
హా చారు తరుణ బింబాధరోష్ఠి !
హా తారకా శకలాంచిత రదనాళి !
హా దర్పణాభ సమ్యక్కపోల !
తే.గీ. హా జగన్మోహనాంగి ! హా యతను ముల్కి !
హా విలాసవతీ మణీ ! యతను రాణి !
నిన్ను విడనాడి పోయెద నన్ను మఱవ
కుండుమీ చాలు నా కోర్కె యొండు లేదు. 2175

తే.గీ. ఏమి సేయుదు వనిత నిన్నెదను మఱువఁ
జాల నీ రూపుఁ బటమున వే లిఖింపఁ
జేసి యెదుటను సతతంబుఁ జేర్చి యుంచి
ప్రాణముల్ చిక్కఁ బట్టెద బలిమి తోడ. 2176

మ. వణిగంభోజ ముఖీ లలామను వెసన్ బ్రజ్ఞాన మొప్పారఁగా
వెను వెంటన్ గొని రాక వైశ్య జనతా విభ్రాంతి కృన్మాధురీ
గణనాతీత సుధామయోక్తులకు నిక్కంబాత్మలో నెంచి యిం
తిని నేలా విడనాడి వచ్చితిని యా శ్రేయార్ద్ర బింబాననన్ ? 2177



సీ. తరుణి నీ యధరామృతము మీది యాస నా
హార పానాదులఁ గోరనైతి
లేమ నీ కుచదుర్గ సీమ నుండెడి యాస
హర్మ్య సౌధావాస మరయ నైతిఁ
గాంత నూపుర కాంతి కనకంబుపై యాస
ధనముపై వాంఛ నే నెనయనైతి
జవ్వని నిన్ గూడు సౌఖ్యంబుపై యాస
రాజ్య వైభవములఁ గ్రాలనైతి
తే.గీ. నింతి నీ మీద కోర్కెచే నిందుముఖుల
స్వీయ కాంతలఁ బట్టాభిషేక మహిషి
యందు నిందాఁక గల ప్రేమ మ్రంది పోయె
విరహ వేదన భరియింపఁ దరము గాదు. 2178

ఆ.వె. అటుల నిలుపు లేక నతివ వర్ణన లందు
మునిగి పోయినట్టి మునిని చూచి
చెవులు మూసికొంచు శివశివా యిదియేమి
ఆగమనుచు వైశ్యు లడ్డు పడిరి. 2179

**ఇందు బొండాడ పురీ వాసులైన కాళ్ళకూరి భోగరాజు కుమారులు సాంబశివ రావుగారు వ్రాసిన కన్యకా పరమేశ్వరీ విలాసమను నాటకమునుండి విష్ణువర్ధనుని విరహ సన్నివేశము నందలి పద్యములు గ్రహింప బడినవి.**

*ఇది శ్రీవాసవీపురాణమునందు విష్ణువర్ధనుని విరహమనెడు డెబ్బది నాల్గవ అధ్యాయము సంపూర్ణము.*

## డెబ్బది యైదవ అధ్యాయము

**కం. పరదేవతా ! భగవతీ !**
**పరమేశ్వరి ! పంచమీ ! జపాపుష్పనిభా !**
**పరమాణు ! పరానిష్ఠా !**
**పరమంత్ర విభేదినీ ! స్వపంతీ ! రాజ్ఞీ !**

కం. కామాంధుని కావరమున
రామాంగాంగంబు లెల్ల రట్టొనరింపన్
మా మర్యాదకు చేటను
కోమట్లకు ఋషి వరుండు కూర్మిన్ బలికెన్. 2180

కం. మీరడిగిననే కాదే
నే రాజు ప్రసంగమందు నిలచితి నౌనా ?
మీ రెరుగుదు రాతని హృద
యారణ్యము నందు తిరుగు నటవీ మృగముల్. 2181

కం. సాగింతము కథ నావల
తేగడగా నిది వినుఁడు మది కుదురు ననగాన్,
త్యాగామల గోమరులతి
వేగము వేదవతి గాథ వెనుకం జనుచున్ ! 2182

ఉ. శంక తొలంగె, వేదవతి చాలదు వాసవి శక్తి ముందు, జ్వా
లాంకుని యంక సీమ కొలువై చను లేమకు విష్ణువర్ధనున్
పంక సమాన లోచనము పడ్డ శరీరముఁ గాల్చివేయగా,
నింక కరంబు చాతు మమయింపుము వీనిని ధర్మ దీక్షకై ! 2183

వా. వాసవీ మాత లోకములేలు భావాతీత బలాతిరేక, లీ
లా సమాహారముల్ నభమేలు గోళాకార విలాసముల్, నిశా
భాసితానేక కాల గణాంకముల్ భామా నిజ దీధితుల్, జలో
చ్ఛ్వాసమై మాయహంబడపున్ సదాచారంబుల మమ్ము నిల్పుచున్. 2184

తే.గీ. ఆమెకై చింత లేదు, మా కాయు వృద్ధి
యగును మా కేటి చింత ? మాయ యుడుపు లన
లము దహించు నంతియ కాదె దుముకుటనఁగ !
వేగ మిప్పింపు డనుమతి వీడెములను. 2185

ఆ.వె. అంచు తొందరించు నార్య వైశ్యులఁ గాంచి
మంచి జరుగు గాక యంచుఁ బలికి
కంకణములఁ గట్టి కమ్మని విడెముల
నంద చేయుచుండ నంత లోన. 2186

ఆ.వె. వైశ్య భటుఁ డొకండు వచ్చి యాచార్యు పా
దములఁ బడుచు విన్నపమునుఁ జేసె,
నార్య నాదు మనవి నాలించు మనుచును
తండ్రి గాథఁ జెప్పె తగవుఁ జెప్ప. 2187

ఉ. నా జనకుండు మల్లణుఁ డనారత మా యమ వింధ్యవాసినీ
పూజలఁజేయు, వైశ్యకులపుంగవులం గడు వృద్ధులందునన్
భాజితుఁడైన సేవకుఁ డపార కృషీవలుఁ డెల్ల వారిలో
నోజ చరించు చుండు మది నూర్జితుఁడై తలలోన నాల్కయై. 2188

చం. అతఁడు జగన్నియంత్రియగు నమ్మనుగూర్చి తపంబుసేసె సం
తతమును ధ్యాన యజ్ఞమున, తల్లియె సర్వమటంచు నమ్మి యే
కృతమును నైన నమ్మ పరికించు నటంచు చరించు, నెందులో
నితరముఁజూడలేఁడు మదినింతగఁ గాంచును వింధ్యవాసినిన్ ! 2189

తే.గీ. నడచు కూర్చొను నిదురించు నడుము వాల్చు
తినును త్రావును త్రేన్చును వినును కనును
పలుకు పనిచేయు నాయాసపడును గాని
అమ్మ చింతన విడఁడు ప్రహ్లాదు వోలె. 2190

కం. జనులను ప్రహ్లాద జనకు
లనదగు పుణ్యాత్ము లుందు రవనిన్, వారున్
పనవిరి పనికిరి గదిమిరి
పెనగొని పరిహాసము సలిపిరి మరిపించన్. 2191

ఆ.వె. తలను కత్తిరించ పిలకలు వేయుచున్
వృద్ధినొందు మొలక విధముగాను
మలచు కొలది భక్తి మల్లాణాంతరమున
గట్టి పడెను దేవి పట్టువడఁగ. 2192

ఉ. ప్రాయమువాలుచుండ తన భక్తుని ప్రేమకు లొంగి వచ్చి యే
శ్రేయముఁ గోరి నన్ను పిలిచేవుర మల్లాణ? దేహమెల్ల న
న్నే యతికించుకొంటి విది యేమిర ! తాపసులందు లేదు తే
జీయ మహాద్భుతారుణిమ జీయ తనమ్మును నీకు నట్లుగాన్ ! 2193

చం. అను జనయిత్రిఁ గాంచి తనయం గనినట్టు లెడంద పొంగ, నా
జనకుఁడు మల్లాణుండు, మనుజ ప్రసిత ప్రతియత్న శీలుఁడా
మెను తనువెల్ల బాష్పముల మేధ్య మొనర్చి నుతించి పల్కె, నా
కు నితర మేమి కావలెను, కోరి భజించుట లేదు వేడఁగన్ ! 2194

ఆ.వె. అంత నభవ మిగుల సంతసించిన దౌచు
పరమపదము నీకు పదిల మనుచు,
తాను వైశ్యులింట తనువుఁ దాల్చితి నంచు
వారి తోడ రమ్మ వచ్చి ననెను. 2195

ఆ.వె. నాఁటి నుండి మొదలు నేఁటిదాకను తండ్రి
యెదురు చూచుచుండె నెటుల నగును
వైశ్య గణముఁ గూడి వైశ్వానరుని యందు
పరమపదముఁ జేరు పథమటంచు. 2196

ఆ.వె. నేఁడు దారి దొరికె నీ మాటలను బట్టి
విశులు దేవి తోడ వెడలుచుండె,
శుష్మ కుండమునకు చోటిందు నా తండ్రి
తనువు వెడలు, నాదు తండ్రులార ! 2197

ఉ. ఆ కథవించు వైశ్యులును నన్యసమస్య తలెత్తెనేలరా !
మాకయి వహ్ని కుండములు మట్టుకొనంగ విచారముండగా
మీ కొక కుండమన్న నది మించిన కార్యము కాదె యంచు లో
లో కలగుండు నొందుట విలోకితమయ్యె గురుండు పైకనెన్. 2198

శా. విన్నారా వరవైశ్యులార ! కులమా విజ్ఞానమా భక్తియా
కన్నారా పరమాత్మఁ జేరుటకు నే కామ్యంబు యోగ్యంబగున్ ?
విన్నాణంబగు భక్తియే కద యశస్విం జేసె నీ మల్లాణున్ !
కన్నుల్ గాయలు గాచుగాక ఫలమే కావ్యంబులం బాడినన్ ? 2199

కం. సందేహించకుఁడయ్యా
నిందార్హుఁడు కాఁడు వాఁడు నిరసనఁ దెలుపన్,
వందన మొనరించుఁడు వాఁ
డందించిన పథమునఁ జనుఁ డానందమునన్ ! 2200

తే.గీ. హీనుఁ డనఁ బోకుఁ డాతం డహీన కులుఁడు,
భక్తి కుల సార్వభౌముఁడు, పరమ యోగి,
పరము సాధించినట్టి సద్బ్రాహ్మణుండు,
గంగఁ గలసిన మలినంబు గంగ కాదె ! 2201

చం. అనవిని వైశ్య బాంధవు లనాదర మొందిన శూద్ర బాలకున్
గని క్షమియింపుమయ్య పులకల్ పొడసూపె శరీరమందు నీ
జనకుని గాథ వించును, నిజమ్మని చెప్పె గురుండు, నీకునై
యనుమతి వేరయేల నిక నందర మొక్కటె యొజ్జ ముంగిటన్ ! 2202

వ. అంత నాచార్యుండును శిష్యుల భావాభ్యుదయంబునకు సంతసించి శూద్ర బాలకునితో నిట్లనియె. 2203

తే.గీ. పొమ్ము నీ తండ్రి మల్హణు సమ్ముదమున
రమ్మనుము రేపు దీక్షఁ గైకొమ్మనుమురు,
యజ్ఞ కుండంబులను ద్రవ్వ నానతిత్తు
చొక్కమగు నవ్వి నీ తండ్రి సూత్రపడిన. 2204

ఆ.వె. కుండములను రేపు కూర్చుకొందురు గాని
నేటి కేగి రండు నిలయములకు
శుద్ధ మనము తోడ శుద్ధమై దీక్షాత్ము
లగుఁడు వైశ్యులార వగవకుండ. 2205

వ. అనగ నందరును తమతమ నెలవులకుఁ జన నాచార్యుండును ధ్యానంబున కరిగె. 2206

***ఇది శ్రీవాసవీపురాణమునందు మల్హణవృత్తాంతంబను దెబ్బదియొందవ అధ్యాయము సంపూర్ణము.***

# డెబ్బది యారవ అధ్యాయము

**కం. అభవా ! వసుంధరా సు**
**ప్రభవా ! సుర నర బుధ గణ భాసుర విభవా !**
**శుభ సంతోషానంద సు**
**లభ గుణ ! కుసుమ హృదయ ! విమల విబుధ విభవా !**

వ. అనంతర కథను సాలంకాయనుండిట్లు వినిపించ సాగె. 2207

కం. మరునా డుదయంబున నె
ల్లరు శుచులై గురు సదనములకు నేతెంచన్
గురు భాస్కరుఁడా మల్లాణు
గురుతించి పిలువ నతఁడును గురువును జేరెన్. 2208

కం. వినయమున వచ్చి నిలచిన
ఖనకుని మల్లాణుని జూచి కడు వాత్సల్యం
బున భాస్కరుండు పొగడె న
తని సద్వర్తనము గాఢతమ మగు భక్తిన్ ! 2209

తే.గీ. ఎన్ని జన్మలు చేసితి వింత తపము
యోగులకును లేదిటువంటి యోగ పటిమ
జన్మచే నీవు శుకముని జాతకుండ
వమ్మ కరుణను పొందిన యర్చకుఁడవు ! 2210

తే.గీ. అనఁగ మల్లాణుఁడును మాట కడ్డు వడుచు
నయ్య నేనేమి చేసితి నయ్య తప్పు ;
తప్పు కాదే పొగడ నన్ను దపసి యనుచు
కోమటుల దాస్యమున బ్రతుకుదుననియనె. 2211

ఉ. ఈ వినయంబె, ఓరిమియె, ఇట్టిదవై గరువంబు లేమియే,
పూవుల మంచు బిందువటు భోగము లంటక యుండఁ జేసెనో
సేవక ! భక్తి మార్గమున సేవన పద్ధతి శ్రేష్టమంచు నీ
జీవితమే ప్రసారిక, సజీవ మరీచిక, సార్ద్ర మృత్తికా ! 2212

వ. అనుచు నాచార్యుండు నేమో వచింపబోవుచుండ మల్లణుండు స్వామీ ! నన్ను పిలచిన యవసరముం దెలుపుఁడు నావల మీ దయయున్న నాకును సాయుజ్యము లభించునన భాస్కరాచార్యుండును. 2213

కం. ఇది పొగడుట కాదు నిజము,
మదిలో మెదలినది, సరియ, మాటాడనులేే;
మదిమది మదియింపుము నీ
మదిఁ దోచిన రీతి నగ్ని మంత్రాంగములన్ ! 2214

వ. అని యడుఁగ నతండును. 2215

ఆ.వె. ఏడడుగుల లోతు, ఏనడుగుల చుట్టు,
నడుగు మూడడుగుల వెడలుపున్ను,
లోన నింధనముల లొద్ద నుంచిన నద్ది
యగ్ని గుండమగును నదియ తెలియు. 2216

ఆ.వె. ఎన్ని కుండములను నేర్పాటు చేయుట,
మధ్య నే కొలది ప్రమాణ ముంట,
మంత్రణంబు నెద్ది, యంత్రణం బది యెద్ది,
పథక రచన చెప్పు పని మదింప ! 2217

వ. అని వచింప నాచార్యుండును నిట్లు చెప్పఁ దొడంగె. 2218

ఉ. ఊరికి నుత్తరాన వనమున్నది, దానికి మధ్యమంబునన్
దారి యొకండు, దానన నిదానముగా నిరు క్రోశముల్ జనన్
నారదు తండ్రి యజ్ఞము నొనర్చిన చోటది బ్రహ్మకుండమన్
పేరున బేరు గాంచిన పవిత్ర విశాల ధరిత్రి చూడగన్ ! 2219

ఉ. అక్కడ బ్రహ్మ దేవుఁడు మహా క్రతువొక్కటి చేయఁ బూనె, నల్
దిక్కులు శాంతి నొంది తన దివ్య మనోహర సృష్టి కాంతిలన్,
మక్కువ నెల్ల వారలది మాదిరిగా యజనంబుఁ జేయగాన్
చక్కని యాజ్ఞికున్ వెదకె, శాస్త్రవిదుం గనఁడొక్కనేనియున్ ! 2220

ఆ.వె. సృష్టిఁ జేసె గాని యిష్టి నేర్పగ లేదు,
యాజ్ఞికుం డదెట్లు విజ్ఞుఁ డగును,
చంటి పిల్లవాఁడు చదువు నేర్పించకే
ప్రాపు నొంద గలఁడె పండితునిగ ! 2221

కం. తను జేసిన నేరమునకు
తననే బాధ్యునిగఁ జేసి ధాతయుఁ దానే
తను సృష్టించిన జనులకు
తనియగ మాట్లాడ బాస దానముఁ జేయన్ ! 2222

కం. యోచించి వే వసంతము
లాచార్యక మైనదాని నార్జించి విధా
త్రాచితము తుమ్మె నొక్కొట
తోచెను క్షుతుఁడనెడు వాఁడు తుమ్మెద వోలెన్ ! 2223

కం. ఝుంకారము వీణియపై
నోంకారాదులుగ పరిణతోన్నతి చెందన్
సాంకేతిక బీజాక్షర
శంకరముగ క్షతునిఁ గూడి సలిపెన్ గ్రతువున్ ! 2224

కం. భాషాబీజములవియే
భాషపలుక సకలజనుల భాషయునదియే,
భాషాయోషగ స్థిరపడె
భాషనుగన్నట్టి బ్రహ్మ వదనమునందున్ ! 2225

ఉ. అంతటి పుణ్య భూమి, తొలి యజ్ఞము చేసిన బ్రహ్మ దేవుఁ డా
శాంతముఁ జూచి యెంచుకొనె నంతటి పావన భూమి రాజమున్,
శాంతము నస్త్రమై తిరుగు సాహుల జేతలఁ జేయగా శిఖా
వంతుఁడు హవ్యవాహనుగ వర్ధిలజాలిన యాగ భూమియౌ ! 2226

తే.గీ. అందుఁ జని నీవు శోధింపు మగ్ని గుండ
ములను నూట మూఁడింటిని మలచఁ దగిన
చోటు, తగు గాలి వీచెడు చోటుఁ జూచి
ఇష్టి కుండంబులం ద్రవ్వు మీ విధమున. 2227

వ. యజ్ఞ భూమికి నడుమ వాసవీ మాత ప్రయాణమునకుఁ దగు ప్రధాన కుండ ముత్త రాభిముఖముగను, దాని కెదురుగ నీశాన్య వాయువ్యములందు నామె తల్లిదండ్రులకును మేనమామ దంపతులకును దగు రెండు ప్రత్యేక కుండంబులను, వానికి చుట్టును షడ్భుజిని నిర్మించి కోణములందు త్రయార్షేయ గోత్రముల వారికిని, షడ్భుజి చుట్టును వృత్తాకారంబున పదమూడింటిని, వృత్తము చుట్టును చతురము నిర్మించి మూలకు పదునారు చొప్పున నరువది నాలుగును మొత్తము డెబ్బదియేడు మంది యేకార్షేయ గోత్రముల వారికిని, మిగిలిన వారికి మొదటి షడ్భుజిలోని వాసవీమాతకు వెనుక భాగమున నైఋతి నవ కుండంబులను, నాగ్నేయంబు నష్ట కుండంబులను మొత్తము నూటమూఁడు కుండంబుల నిర్మింపుము మరియును నుత్తర దిక్కున నందరికి ముందు భాగమున చతుర బాహ్యదేశంబున నీ కొఱకు నొక కుండంబును నిర్మించుకొనుము. 2228

ఆ.వె. అనుచు భాస్కరుండు నగ్ని కుండంబులఁ
గూర్చు విధము దెలుపఁ గూర్పరియును
సంతసంబు తోడ సరియ చేయుదునని
తగిన జనము తోడ తరలె నటకు. 2229

***ఇది శ్రీవాసవీపురాణమునం దగ్నిగుండనిర్మాణమను డెబ్బదియారవ అధ్యాయము సంపూర్ణము.***



# డెబ్బదియేడవ అధ్యాయము

**కం. కౌసుంభీ కుసుమ సుతా !**
**హే సుత కామేష్టి జాత ! హే జగదంబా !**
**నాసామణి దర్పణ దృక్**
**భాసిత బ్రహ్మాండ పిండ భార విడంబా !**

వ. అనంతర కథను జెప్పుచు సాలంకాయనుం డిట్లనియె. 2230

ఆ.వె. మల్లణుండు వెడల కల్హార పుత్రుని
సభకు ముందు నొక్క ఛాందసుండు,
రాజు వద్ద నుండి రారాజు వద్దకు
వార్త మోసికొనుచు వచ్చె నతఁడు. 2231

ఉ. వచ్చిన వృద్ధ బ్రాహ్మణు నవశ్యము లోనికి తోడి తెమ్మనన్
బచ్చుల ఱేఁడు లేచి చని, పాఱుని దోడ్కొని తెచ్చె లోనికిన్,
తెచ్చిన వాని నొజ్జ కడు తీయని పల్కులఁ బ్రస్తుతించుచున్
తెచ్చిన వార్త లేమిటవి తేటపడన్ వచియింపుమా యనెన్. 2232

చం. అతఁడును రాజ దత్తముల నంశుక భూషణ భూరి భూతులన్
హితులగు మీకుఁ బంపెనని యెల్ల విశాళికిఁ బంచె నావలన్
ద్వితయము నొంటి గాఁదగు ప్రవేష్ట సమీకృతి చేరువాయె నీ
క్రతువున కేమి తేవలయు కార్పటి కాచరణం బదెట్లనన్. 2233

కం. ఏమన్నను నే మగునో –
ఆ మన్నన లట్లు జేయ నగునో లేదో
తా మన్నన జేయు గురుం
డా మన్నున నెట్లు ముంచునా యని చూడన్ ! 2234

తే.గీ. విశుల మోములం బరికించి విశ్వ గురుండు
కొంత యోచించి యోచనం గొదర నీక
నోయి వీరింద్ల పెండ్లి కాదోయి దినము,
సప్త దివసంబులును సాగు సప్త పదులు. 2235

వ. అవి యెట్టులన. 2236

చం. మొదటి దినంబు తోరముల ముందుగం దాలిచి వహ్ని వేల్చుచున్
మదవతులెల్ల గంధ సుమ మాలల గాంగ నదీమతల్లి సం
పద లిడ ధూప దీపముల భక్తి సమర్పణ సేయగా వలెన్,
కుదురుగ నైదు ప్రోలికల కూరిచి వేదిక నైదు మూలలన్. 2237

ఆ.వె. ఐదు ప్రోలికలను నైదు స్తంభంబులన్
నిలువబెట్టి నలుపు తెలుపు నెఱుపు
పసుపు టన్నములను బలి యొసంగుట తోడ
పెండ్లి ముందురోజు బిత్తరించు. 2238

కం. రెండవ దినమున వైశ్యులు
మెండుగ రక్షణ మొసంగ మేఘారూఢున్,
దండధరాగ్ని వరుణ శశు
లండ వధూవరులకనంగ నర్థించుట యౌ ! 2239

ఉ. మూరవనాడు తీర్చెదరు మ్రొక్కులు ముప్పది మూడు కోట్ల బృం
దారక శ్రేణి సంతసిల దాన వ్రతాదుల వైశ్య శ్రేష్ఠులున్,
కోరి యొనర్చినట్టి యొక కూడని కార్యము గొప్ప శాపమై
వారిని పట్టి యున్నదది, వారును భక్తిం దనర్చి కొల్చుటన్. 2240

ఆ.వె. గోత్ర పూజ సేయ కోమట్లు నాల్గవ
దినము నెంచు కొందు రనుట నిజము,
మొదట వాసమున్న మునుకొండ పతకాయి
పూజ సేయ శుభము పొసగు నంచు. 2241

ఉ. ఐదవ రోజు నాకబలి, ఆవుకు పూజలు సేతురయ్య యీ
మేదిని వారిం దెచ్చినది మెచ్చుల పైరము కామధేను వా
హ్లాదము విస్మరించని విశాళి వివాహములందు శర్కరన్
మేదిన శాలి చూర్ణమును మేపుచుం బంచుదు రాత్మ బంధులన్. 2242

జలోద్ధత గతి.
జలంబు దరి పూజ సేయవలె నౌ
కలం బసుపుం బూకదంబముల నా
వలన్నవ వధూ వరుల్ పడవలో
విలాసమున నావి నారు గడచున్ ! 2243

తే.గీ. ఆరునొకటవ దినమందు హస్త కంక
ణముల వర్జించి మధ్యాహ్న సమయమందు
నైదుగురు దేవతలకును నాహుతు లిడి
కదుప వలెను నుద్వాసనం గంబములను. 2244

చం. ఇటుల వివాహ తోషముల నింపుగ సప్త దినంబులందు సం
పుటనముం జేసి రార్యులగు పూజ్యులు పూర్వులు పుణ్య పూరుషుల్
దిటవుం జెలంగ నిప్పటికిం దీరుచు చుంటిమి సంప్రదాయముల్
కటువగునేమొ రాజునకు కందువం జెప్పుదు బుద్ధి కింపుగన్. 2245

ఉ. చూచితె వీధులందు గృహ శోభల పచ్చని తోరణమ్ములన్,
కాచెడు నెండలన్ బిగుచు కప్పుల చల్లని పందిరుల్; మదిన్
దోచెడు రంగవల్లులను దోయిలి పట్టెడు ప్రాంగణమ్ములన్,
తోచెనె వంటసాలలును, తోచెనె వైశ్యుల పెండ్లి యత్నముల్ ! 2246

కం. నావుండు చూచితి నంతయు
నీవుల మొదవున కెనయగు నీ దాతృత్వం
బావంత సంశయించుట
పూవిల్తుని దిట్టుటనుచు భూసురుం డనియెన్. 2247

చం. అనుటయుఁ బాఱు నాంతరము నంతర మందు గ్రహించి భాస్కరుం
డనుగుణ భాషణంబుల భటాళినిఁ బంపె మరంద మాధురీ
వనధిని భోగ సంపదల వాటిక సుందర హర్మ్యమందు బా
పన జన విశ్రమంబునకు పచ్చడ ముంచుడు పోయి రండనెన్. 2248

చం. భటులును వీట నింపయిన భాజన వాటిక నొక్కదానిలో
విటజన యోగ్య వాసమున విప్రుని జేరిచి వేశ్య కన్యలన్
చిటికన వెట్టి, షడ్రుచుల సిద్ధము చేసిన భోజనాదుల
న్నిట కుటిలాలకా గణము నిల్పి సుఖించు మటంచు వచ్చినన్. 2249

తే.గీ. మేన జందెంబు కలదను నాన మఱచి,
మెడను రుద్రాక్ష కలదను మేర మఱచి
లొంగి పోయెను ధనకామ లోభములకు
రోయ వలసిన రాజ పురోహితుండు ! 2250

తే.గీ. కౌరు నూరించు విటుల కైవారములును,
తలపు లూరించు తరుణుల తాపములును,
చనవు మరపించు ధన భోగ సంచయములు
ప్రభువు కార్యము మఱచెను బాపడయ్యు ! 2251

చం. భటు లిది యంతయుం దెలుప భాగ్యములం గురిపించి పంపి తా
మటుపరి నిండ్ల కేగి జలమందు మునింగి దుకూల ధారులై
పటువుగ గంధ పుష్పముల ప్రాపక దేవతలం భజించి కో
మటులు తనూనపాత్తు జపమాలను జేరగ నుత్సుకంబునన్. 2252

వ. విషయముఁ దెలిసిన వైశ్యేతరులు విస్తుబోవ శుభ కార్యంబునకు వలె వైశ్య ప్రముఖు లేలలఁ బాడుచు నీలల వేయుచు కడు నుత్సాహంబున వేడుకలర గదలఁ గాలదేవతయు ముక్కున వేలుంచుకొనియె ! 2253

**ఇది శ్రీవాసవీపురాణమునందు వైశ్య వివాహపద్ధతియను డెబ్బదియేడవ అధ్యాయము సంపూర్ణము.**



## డెబ్బది యెనిమిదవ అధ్యాయము

కం. **గంధవిలేపిత తను సం**
**బంధాతీతానురాగ బంధురగంధా !**
**బంధుగుణాలయ కంధర !**
**కంధీకృతహృదయనిలయ కరుణానందా !**

తే.గీ. వైశ్యు లటులుండ నిచట నీ వైశ్య లోక
పావకాకృతి కన్యక సేవ లోన
తరుణు లందరు నలుగుల తనువు నలచి
స్నానమాడించి రభ్యంగనమున నపుడు. 2254

సీ. ఏణాక్షి యొక్కర్తు కేణాంక వదనకు
పసిడి పావడఁ జుట్టి కొసరె లోన,
వామాంగి యొర్తుక వదన బింబము పైన
కస్తూరి దీర్చుచుఁ గటకటఁ బడె,
రత్నాంగి యొర్తుక రత్న తాటంకముల్
చెవుల కంటించుచుఁ జెమరెఁ గనులు,
ముగ్ధ యొర్తుక మేలి ముత్యాల హారాల
మెడను వైచుచు మేన మిడుకు మిడికె,
తే.గీ. హస్త భూషలఁ గూర్చుచు నతివ యొకతె,
మణుల మువ్వలం గూర్చుచు మగువ యొకతె,
పసిడి మొలనూలు గూర్చుచు ప్రమద యొకతె,
లలిత మానసములఁ దోఁగు లోన లోన ! 2255

మ. చెలికత్తెల్ చెలువొంద నంగములపై చెన్నొందు భూషావళుల్
తొలికార్తెల్ వెదజల్లు నీరములునై తోఁతెంచె కన్యామణీ
కలితం బంతయు, వారి వంత తొలగన్ కాయంబు చిన్నారగా
నలు చేతుల్, మృదు మస్తకాంగములతో నందాంగనా నందతన్. 2256

తే.గీ. పరమ, బహురూప, రూప నిష్పాదనమున
నందరకు నన్ని రూపంబులగుచు వారి
చంకలంజేరి కన్నీటి చాలుఁ దుడిచె
లేత చేతుల శైశవ లీల యనఁగ ! 2257

తే.గీ. గాలి తాకున మబ్బుల గమనమటుల
చేయి సోకిన చీకట్లు చెదరి పోయె,
హృదయ ముప్పొంగె మేనులుఁ గుదుటఁ బడియె
నంబ తలచిన నేది యసంభవమ్ము ! 2258

తే.గీ. తల్లి, బంధులు, పరిజను లెల్ల చెలులు
నెదురుగానున్న వాసవీ సుదతిఁ మరచి
చేతులందున్న కన్యక చేయిదముల
మత్తులోఁ బడి యెడదల కొత్తుకొనుచు, 2259

ఉ. ఓసి సుహాసినీ ! చినుకుమో చిరు జల్లుల హాస రేఖలున్
గాసిల బోవు ప్రాణములు గ్రాసములీ దరహాస మాలికల్
జేసి వసింతుమమ్మ, చి చి చీ ! బుజిపాప ! బజోమ్మ, హూఁహుఁ, అ
బ్బోసి, బిగించినావులె, నిబోధన చాలని ముద్దు వెట్టగన్ ! 2260

ఉ. నాలుగు చేతులున్, కనులు నాయకముల్, చిరు నవ్వు మోములో
శ్రీలు దిగంత శాంతములు, శ్రీహరివిల్లు నలంగు కన్బొమల్,
జ్వాలిక ముంగరం గుదుర సర్వ శుభంకర యోషితాంకముల్
స్థూలమొనర్చె నంత, మునుఁజూడని భారముఁదోచె భామలన్. 2261



కం. బరువెక్కిన యొడులందున
నిరుపమ భారంబుఁ దోప నిగమాంగనలున్
బరువును డించగఁ జూడ నె
దురుగా కనిపించె కన్య తొల్కరి మెఱుపై ! 2262

కం. తము పొందిన యనుభవముల
తమకంబున మెఱుపుఁ జూచి తనువులు మరువన్,
తములము నమలుచు వాసవి
తమటము ధ్వనియించి నట్లు తాలిమిఁ బలికెన్. 2263

కం. నేనన నేమిటొ తెలిసెనె,
దీనాననములను వెట్ట దేనికిఁ జెపుడీ,
నే ననలమున జనించితి,
పో ననలమునే జ్వలింతు పొనలగ వినుఁడీ ! 2264

శా. సంతోషంబున నందె ఘల్లుమను నుత్సాహంబు సంధిల్లగా
సంతప్తాంతర మెల్ల శాంతిలగఁ బ్రోత్సాహంబుఁ గైసేయు నా
ధ్వాంతస్తోమ వినాశినీ వచనముల్ ధ్వాంతంబు నిండారు నా
కాంతారామము కుందుఁదీర్చె, ప్రమదాగారంబు పేట్రేఁగగాన్ 2265

కం. ఆడిరి పాడిరి సరసము
లాడిరి పసుపుల వసంత మాడిరి కడిమిన్,
సోదులు ముట్టగ నసువుల
క్రీడిరి, వాసవిని గూడి క్రీడా స్ఫూర్తిన్ ! 2266

ఆ.వె. కులము నూట రెండు గోత్రంబులను విభా
వసుని జేరు స్త్రీలు వరుసఁ గూడి
రాదువారితోడ నాడుచుఁ బాడుచు
కలసి పోయినారు కన్యతోడ ! 2267

ఆ.వె. ఇచట నిట్టులుండ నచట నూటిరువురు
చదల రథముఁ జూచి కదలినట్టి
వైశ్య వరులు మిగులు వైశ్యార్భకులఁ దుది
కోర్కెఁ దెలిపి రిటుల కూర్మి తోడ. 2268

ఉ. బాలకులార ! మీకుగల బాధ్యతలం గురుతించుడింక నే
కాలము వింధ్యవాసినిని, కాంతుఁడు శ్రీనగరేశ్వరాధిపున్
లాలనఁ జేసి, కోన కమలార్య జనార్దన స్వామిఁ గొల్చుఁడీ,
మేలగు భాస్కరున్ పద సమీపమువీడక భక్తి సల్పుఁడీ ! 2269

తే.గీ. ధనము నిచ్చియు, దంపిన ధాన్యమిచ్చి,
మణుల నిచ్చియు, మంచిగ మాటలాడి,
వసనమిచ్చియు, మీద నాభరణమిచ్చి,
గురుల శిశ్రూషచే మెప్పు లరయవలయు. 2270

తే.గీ. చిన్న తనమందు విద్యలఁ జెన్ను మీరి,
వయసులో ప్రేమ సత్కామ వశులు నగుచు,
వార్ధకంబున మునివృత్తి నర్థులగుచు
జీవనంబున సన్మార్గ సిద్ధు లగుఁడు. 2271

కం. విలుచుట నమ్ముట నడుమ ప
దిలపడు లాభమ్ము తోడ దిద్దుఁడు బ్రతుకుల్,
వలదు మృషలాడ, దుష్కృత
ముల వీడుడు, దొంగ సాక్ష్యములఁ జెప్పకుఁడీ ! 2272

ఆ.వె. కలిగినంత వరకు కావలసిన చోట
దానమీయ వలయు, హీన జనుల
కుపకరింప వలయు, కపట వైశ్యుల తోడ
వియ్యమంద వలదు నెయ్యమంద. 2273

తే.గీ. అనుచు వైశ్యులు తమకున్న ధనము లెల్ల
నాల్గు భాగంబులను జేసి న్యాయమంచు
నొండు గురునకు, సుతులకు నొండు, నొండు
దానముల, నొండు తమకు శ్రాద్ధములఁ బంచె. 2274

చం. గురుఁడది వించు బ్రాహ్మణులు కోరున దొక్క దినంపు గ్రాసమే,
బరువగు మించినన్, బ్రతుకు భారమగున్, విధులెల్ల శూన్యమౌ !
కరదము లెక్కుడైన కుల గౌరముం జెడు, నాశ మాయెడున్,
పరిమితి మించ నీయకుఁడు పాలనగా మనువర్తి చాలనెన్ ! 2275

వ. అదియును గాక. 2276

ఆ.వె. రూకఁ బంచుకొన్న మీకును మాకును
చెలిమి వీగి పోవు, చెడును బంధ
మిట్లు సాగనిందు చిట్లక పెట్లక
మిన్ను సూర్య చంద్రు లున్న వరకు. 2277

వ. అనుచు నాదేశింప వల్లెయని వైశ్యులును తమవారికిట్లు శాసన పత్రంబు వ్రాసిరి– స్వస్తిశ్రీ బృహదద్రి నామ నగరంబున శ్రీవింధ్య శైలాలయాయుక్త శ్రీనగరేశ్వర స్వామియును కోన కమలాయుక్త జనార్దనస్వామియును విఘ్నేశ్వరుండును సూర్యచంద్రాది నవగ్రహంబులును నెల్లరకు నాయువును యశంబును సమకూర్చు గాక ! కలియుగాదిగా నారు వందల నలుబది రెండు వత్సరములు గడచిన పిమ్మట ప్రభవ నామ సంవత్సర మాఘమాస శుక్ల పక్షము ద్వితీయ గురువారమున పదునెనిమిది పట్టణాధిపతులమై సంతుష్టులమైన మా వైశ్యుల చేత భూసురుండైన భాస్కరాచార్య పండితులకు సంతోషముగా నివ్వబడిన మంగళకరమైన శాసన పత్రమేమన మావార లేగ్రామమున నున్నను మీరుగాని మీ వారసులుగాని ఇంటికి వచ్చినంతనే నమస్కరించి షోడశోపచారమ్ముల పూజించి షడ్రసోపేతముగా భోజనమిడి గృహమున కెనిమిది వరహాలును వివాహాది శుభకార్యములయందును మరణాది శౌచములయందును ప్రత్యేక దానంబుల నొసంగ గల రిందులకు సర్వ దేవతలు సాక్షు లిందులకు దప్పినవారు రౌరవాది నరకంబుల ననుభవింతు రిది మా యాదేశము. 2278

కం. అని వ్రాసియిడిన వైశ్యుల
గని భాస్కర గురువరుండు కలదే యెంద్రై
నను, కలియుగమా యిది ! శా
సనముల వాసనలు కలిగె సత్యంబనుచున్. 2279

ఆ.వె. పరముఁ జేరఁ బోవు ఫాలలోచనులార !
దాన ధర్మముల వదాన్యులార !
దేవతలయు, జనుల దేహి యనెడి వారి
రక్తిఁ దీర్చి రండు, ముక్తి నొంద ! 2280

వ. అనుచు సెలవొసంగ నా వైశ్యులును గురు వచనంబుల బాటింప వల్లెయనుచు వారి వారి గృహంబులకుఁ బోయిరి. 2281

***ఇది శ్రీవాసవీపురాణమునందు వనితాజనశోకనివారణము, బాలనగరుల కర్తవ్య బోధనము, దానశాసన సమర్పణమునను డెబ్బదియెనిమిదవ అధ్యాయము సంపూర్ణము.***



# డెబ్బది తొమ్మిదవ అధ్యాయము

**కం. సర్వాధారా ! సాధ్వీ !**
**సర్వాంతర్యామినీ ! ప్రశాంతా ! పూర్ణా !**
**సర్వ వ్యాధి ప్రశమని !**
**సర్వజ్ఞా ! సర్వశక్తి సాంద్రా ! జననీ !**

ఉ. అంతయు సిద్ధమైనదిక నగ్ని గమించుట తోడఁ జెల్లు, రా
జెంతటి మూర్ఖుఁడో? విరహ మెంతటి శాపమొ ! మిన్నకుండెనే
కాంతను గూర్తురంచు? నతగాఁడెటు పుట్టె శశాంకు వంశమం
దంతయుఁ జెప్పుమన్న వణిజాధిపులన్ వచియించె మౌనియున్. 2282

తే.గీ. ధర్మ యుద్ధంబు నందున ధర్మరాజు
రాజ్యమును బొంది మనమార రాజ్యమేలి
శాంతులను జేసి జ్ఞాతులు స్వర్గమంద
పయనమాయె హిమాలయ ప్రస్తరముల. 2283

కం. పోవుచును పరీక్షిత్తును,
మావిని మరణించఁ బోయి మగిడిన వానిన్,
ఠావుల నిలిపిన దేవుని
తావుఁ బరీక్షించు వాని తల మకుట మిడెన్ ! 2284

ఆ.వె. అనఁగ వైశ్య మునులు నాగుమాగుమనుచు
పూర్తి గాథఁ జెప్పు పుణ్యమనుచు
కథలు చెప్పు మునిని కరుణించు మంచును
వేడుకొనిరి మునియు వినిచె వేడ్క. 2285

ఉ. భారత యుద్ధమందు కురుపాండవవంశజులెల్ల నాశమై
భూరమ నేల నెవ్వరను భూమికపై వెదుకంగ నుత్తర
స్ఫారనిసర్గగర్భమది సార విహీనతఁదోప వ్యగ్రులై
నీరము కన్నులం దురల నీరజ నాభుఁదలంచి పాండవుల్. 2286

కం. ఏలెదనని రణమున మ
మ్మేల పరాకు పొనరింతు వేలగ రావే,
ఆలము నన్వయ శేషము
నేలుము, జగమేలు కరుణ నేలుము కృష్ణా ! 2287

కం. అని వేడిన నరకాంతకుఁ
డును చెంగటనిలచె, కాలుఁడును కాలికి బు
ద్ధిని చెప్పగ నుత్తరకడు
పున జీవితుఁడాయె శిశువు పుణ్యఫలమనన్ ! 2288

తే.గీ. అంత పాండవులా త్రాత హస్తమూని,
ముద్దులాడుచుఁ బ్రియమార ముచ్చటించె,
నెన్ని యుపకారములు చేసె నిద్ది మాకు
గర్భమును తాకి నేడు వంగడము నిలిపె ! 2289

వ. అనుచు శ్రీకృష్ణుని కొనియాడుచు నీ విపరీతమునకు కారణమేమని యడుగ
నా పరమాత్ముం డిట్లనియె. 2290

శా. యుద్ధానంతర మా సుయోధనసఖుం డుప్పొంగుక్రోధాశని
శ్రద్ధా రక్తుఁడు, దేశికార్భకుఁడు, నశ్వత్థామ మాత్సర్య మీ
విద్ధభ్రూణవిధాయి, మంత్ర శరమున్ బీభత్సుఁ డాకించగా
బద్ధాపత్య మెఱింగి చూపె నెఱగా బ్రహ్మాస్త్ర శాంత్యర్థమై. 2291

కం. కారణ మెఱిఁగిన పాండవు
లీ రణ మేఘంబు లిట్టు లెన్నాళ్ళన, నా
భీరుని శపియించి, అతని
వారణ మన్నించుఁ డంచు వారిశుఁ డనియెన్. 2292



తే.గీ. తనను గుర్తింప జనన మందిన తదాది
ఎల్లవారిఁ బరీక్షించె, కల్లఁబోక
నిజమెఱింగె, పరీక్షిత్తని పిలువఁ దగు
నంచు పేరుంచి అక్షతలుంచె హరియు. 2293

తే.గీ. పెద్దవాఁడై పరీక్షిత్తు పెండ్లి కొఱకు
తాతలైనట్టి వారికై తనువు నిచ్చి
మరణమొందిన తన మేనమామకూతు
రగు నిరావతినివరించె నంతనతఁడు. 2294

తే.గీ. విరటుఁడేలిన తీరసాగరపు తెలుఁగు
నేల మత్స్యఖండము తోడ నెరపెవియ్య
మతని కభిషేకముం జేసినంత పాండ
వులు హిమాలయముల కేగవలసెనాఁడు ! 2295

ఉ. కేకయ రాజ పుత్రియును, కీచకు చెల్లెలునౌ సుదేష్ణ, భీ
తాకులుఁడౌ విరాటునకు నన్నున గన్నది ఉత్తరార్భకన్;
ఆ కులపాలికోదరము నందు జనించె నతండు నాపయిన్
బ్రేకటి యందపాయ పుటి విచ్చిన దుర్భగుఁ డేమి చెప్పుదున్ ! 2296

తే.గీ. అతని తోడనె ప్రారంభమాయె కలియు
గంబు దురదృష్ట మింకేమి కల, దతండు
కలిని దండించె ద్వాపర బలము తోడ,
ధర్మదేవత నెడకాలఁ దన్నెఁ గనుక. 2297

కం. తన్నులు తిన్న కలి పురుషుఁ
డన్నా, యిది నా యుగంబు ! యాచన సేతున్,
నన్నెక్కడ నుంచెదవో
కన్నడ సేయక వచింపు కాఁవుందు ననెన్. 2298

ఆ.వె. అవును యుగము నీది, అదుపుఁ జేయఁగ నేల?
అయిన నేను కలుగు నంత వఱకు
మద్య, మృగయ, భర్మ, మాంసాక్ష విద్యాదు
లందుఁ జొచ్చి యుండు మయ్య నీవు. 2299

తే.గీ. అని పరీక్షిన్మహారా జవని సమస్త
మేలె నరువదేం డ్లంతట నిచ్చ కలిగి
వేటకని చనె గహనాటవీ ప్రదేశ
ములకు ప్రారబ్ధమో, కలి బలమొ కాని. 2300

శా. ఆఖేటమ్మున దారితప్పి చనె రా జాఖేటకుల్ దవ్వుగాన్,
తా ఖండించె ననేక మృగ్యముల, మై దాహం బతిక్రాంతమై
ఏ ఖాతంబున నీరు లేకఁ జననో యేణంబు గాన్పించె, వెన్
బో ఖేలన్ జనె నాశ్రమంబు నది, భూపుండుం బిపాసార్థమై. 2301

తే.గీ. అది శమీక మునీంద్రుని ఆశ్రమమ్ము,
ముని సమాధి నుండఁగ ఱేఁడు మొనసి పిలిచె,
పలుక లేదని కోపించి ఫణి కళేబ
రమును మెడ వైచె దాహ సంరంభి యగుచు. 2302

తే.గీ. రాజు వెడలెను, మునిరా ట్తనూజుఁ డేగు
దెంచి చూచెను, కనుల నేతెంచె సెకలు,
మృత భుజగ ముంచిన యతండు మృతిని జెందు
సర్పమున వారమున కని శాపమిచ్చె. 2303

కం. శాపము నెఱిగిన పతి పరి
తాపము ననుతాప మొంది, తనయుఁడు కలియౌ
రూపరి జనమేజయునకు
భూపతి పట్టంబుఁ గట్టి పురవరు నూనెన్. 2304

ఉ. శ్రీశుకుఁడా పురాణ మును జెప్పఁగ నేడు దినంబులున్ వినెన్
కేశవు గాథ, మానసము కేవల మాధవు చింతనామృతా
వేశము నందు క్రుంకులిడ, వేషముఁ గట్టిన పాము కాటుకున్
కేశవుఁ జేరె ఱేఁడు పొద గేహము వీడిన దోస పండునాన్. 2305

కం. అది చూచిన జనమేజయు
హృదయము క్రోధాగ్నితోడ హింస్రకమయ్యెన్,
పొదలించె సర్పయాగము
ఎదలో తామసప్రవృత్తి యెసగెన్ హసమై. 2306

వ. అంత నెట్టకేలకు జరత్కారువను నాగకాంతకు జరత్కారుఁడను మునిపుత్రుని వలనకలిగిన ఆస్తీకునివచనములుగౌరవించి సర్పయాగమునువిరమించి వైశంపాయనమహర్షివలన మహాభారతకథవినుచు కాలముగడపిన జనమేజయుండు భార్య వపుష్టమ యందు చంద్రాపీడుఁడు, సూర్యాపీడుఁడు, శతానీక, నంద, కర్ణులనెడు పుత్రులఁ బడసి యందు శతానీకుని మత్స్యరాజ్యపతిగా నభిషేకించెను. 2307

తే.గీ. మత్స్యభూమి శతానీకు మార్గదర్శ
నమున నభివృద్ధి సాధించె, ననిచె నంటు,
అంగ వంగల నుండి వైశ్యాళి వచ్చి
భూమి బంగారుఁ జేసిరి బుద్ధి కలిమి. 2308

తే.గీ. భూమి, వసుమతి భార్యలై పొలయు నైన
సంతు కలుగదు రాజుకు వంత మిగిలె,
నెఱుక శాండిల్య మౌని పుత్రేష్టి సలుప
మేనుగొనె సహస్రానీకుఁ డా నలువున. 2309

పంచచామరం.
యుగంధరుం డనెండు మంత్రి యుక్తి శక్తి తోడుగాన్
నిగారపుం గిరీటమున్ జనీ శిరంబునందు నుం
చి గోత్రవాసమేగె రాజు శ్రీహరిన్ జపించగాన్
నగారి వెంటబోయి భండనమ్మునంజనెన్ దివిన్. 2310

వ. సహస్రానీకునకు నశ్వమేధదత్తనియు, క్షేముండనియుఁ బేళ్ళవ్వాని కశ్వమేధజుఁడు జనించి విజయార్థుఁడై శ్రమించె. 2311

కం. విజయుని విజయమునకు గా
విజయనగర మనెడు పేర విరటుని నగరం
బజితంబై పేరొందెను
విజయార్థుఁడు వచ్చు వఱకు విజయాంకంబై. 2312

తే.గీ. పరుల కోడిన విజయార్థ పాలకుండు
రాజధానిని వీడెను ప్రాణ భీతి,
పద్మపురమును చేరి భూపతిగ నిలచె,
తనయుఁ గాంచెను విష్ణువర్ధనుఁడు వాఁడు. 2313

తే.గీ. కీచకుని రక్త మేకొంతొ లాచెనేమొ,
పూర్ణ కలి పురుషుఁడు లోన పొంచెనేమొ
అతుల బలమును క్రోధంబు నతని లోన
కాముకత్వమ్ము రగిలించె గౌరలార ! 2314

**ఇది శ్రీవాసవీపురాణమునందు విష్ణువర్ధనుని కాముక కారణమును దెలుపు డెబ్బది తొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము.**

(విద్ధ=బాధింపబడిన, ఆకించు=అడ్డుకొను, దేశికార్భకుడు=గురు పుత్రుడు, వారిశుడు=విష్ణువు, దుర్భగుడు=దురదృష్టవంతుడు, అతిక్రాంతము= అతీతము, అనిచె నంటు= స్నేహం మొగ్గదొడిగింది, లాచు= పొంచియుండు.)



# ఎనుబదియవ అధ్యాయము

**కం. పరమోదారా ! స్వస్థా !**
**ధరా ! ధరసుతా ! జగద్ధితా ! గంభీరా !**
**తరుణాదిత్య సువర్ణా !**
**గురుప్రియా ! లయకరీ ! ముకుందా ! ధన్యా !**

ఆ.వె. విష్ణు వర్ధనునకు విరహ మేల జనించె –
కారణంబు నెఱిఁగి కార్పటికులు
నెంత వారికైన నింతి బాధలు తప్ప
వా తపోధనా భవంబు ననిరి. 2315

వ. అంత నమ్ముని పుంగవుం డిట్లనియె. 2316

చం. మనుజుఁడు జీవితంబున నమాయికుఁ, డాతని మంచి చెడ్డలున్
మనుగడ పూర్వ జన్మ బహుమానము, లిందు నిమిత్త మాత్రుఁడే !
మనముఁ జయింపఁ జాలని పుమాంసుఁడు పూర్వపు జన్మ వాసనన్
వెనుకొను, లేని వార లిటు వీడ్కొను దేహము లగ్గి పుర్వులై ! 2317

తే.గీ. కలియుగంబున చంపుట కాని కార్య
మెదిరి చంపిన తలవంచి చదియ వలయు,
ధర్మ మెఱిఁగిన వాసవి దహనమగుట
కిదియ కరణం బహింసయు నిదియె చెప్పు. 2318

తే.గీ. హింస కెఱయౌచు దేహంబు నిచ్చు వాఁడు
కలి కరాళ దంష్ట్రల ముక్తిఁ గాంచు వాఁడు,
జన్మ రాహిత్యమగు, లోక జననిఁ జేరు,
కలినిఁ బుట్టిన దోషంబు తొలగి పోవు. 2319

కం. అని పలికెడు సాలంకా
యనునకు వైశ్యర్షు లిట్టు లానందముతో
తనువు లనిత్యంబంచు వ
లను గొంటిమి, మా విశాళి లలి నొందెదరే ? 2320

వ. అని ప్రశ్నింప నాతండును కథాక్రమంబున నిటులఁ బ్రవేశించె. 2321

కం. మరునాడా వైశ్య వరులు
పరిజనులకు కావలసిన పసదనమెల్లన్
వరములుగా దాన మొసఁగి
ఉరరీకృతి నొంది రతులి తోల్లాఘులునై ! 2322

ఉ. బంధు జనంబులెల్ల తమ బంధము లెట్టుల పాయ గల్గుటో,
గంధమలంది మానసిక గాయము లెట్టుల మూయ గల్గుటో,
బంధములా హుళక్కి యను బాపన బాసల నాత్మఁ దాల్చుటో-
గంధన మెట్టులంచు పెను గందరగోళము నంది రయ్యెడన్. 2323

కం. ఏం చేయాలని మల్లడి
గొంచా బంధువులు లోన కుందుటఁ గని వై
శ్యాంచిత బంధు పడంతుక
పంచెను దివ్యాత్మ శక్తి బంధము తొలగన్. 2324

శా. ఆటంకంబుల నెల్ల దీర్చికొని వైశ్యానీక మాచార్య పా
దాటంబుం దరిఁజేరి మోకరిలి ప్రాణాచార దీక్షావిధిన్
పాటించం దగు చోటు చూపుమన నా పాఋుందు నుద్వేగియై
పాటుంజెంది స్వరంబు గద్గదముగాన్ పల్కాడె నేదోవిధిన్. 2325

తే.గీ. బ్రహ్మచే ముందె నిర్ణయింప బడియున్న
తావు కలదిట శివుఁజేర్చు తావు మీకు,
బ్రహ్మ యాగంబుఁ జేసిన పరమ పుణ్య
భూమియగు బ్రహ్మ కుండంబు, భూమి యందు. 2326



తే.గీ. రెండు క్రోసుల దూరమందుండె నదియు
నారు యోజనముల చతురంబు, నందు
యాగ మొనరించు చుండగా నర్వ జనులు
బ్రహ్మ యొద్దకు వచ్చిరి ప్రణతులగుచు. 2327

తే.గీ. వచ్చి బ్రాహ్మణ శాపంబు వాయు మార్గ
మడుగ నాతండు కరుణించి నుడివె నిదియ
లోకమున పవిత్రంబగు లోష్ట మిందు
తనువు చాలింప దివ్యత్వ మెనయుఁ నంచు. 2328

ఉ. ఆతడె నేనుగా నిటుల నాగమనాత్మబలిన్ ఘటింప నీ
ధాతువునం జెలంగితిని, ధామముఁ జేరెద మీకు వెన్క, సం
పాతముఁ దీరుఁగాని, ఇటు పౌరుల మధ్య మెలంగి బంధ సం
ఘాతముఁ జిక్కి గుండె మడుగాయెను శిష్యుల వీడు కొల్పగన్. 2329

ఉ. కొంకక ఛాత్ర బంధులకు గోతులు తీసిన ధాత్ర దేవరన్
బొంకు భవిష్య సంతతుల బుఱ్ఱల చొచ్చిలు, నేమి సేతు నీ
కంకట మింత చేసినది, కార్పటికాగ్రణులార ! మీరలా
వంకకుపొందు, గుండములు వాహ్యములై కొలువున్నవచ్చుటన్. 2330

వ. అనుచు భాస్కరాచార్యుఁడు కుండంబుల నిర్మాణ పదకమును వివరించి వానియం దెవరెవరి కేయే స్థానంబు లను విషయంబులు వంశ ప్రకారముగ తెలియఁబలికి వారి యభిమానమును విశేషముగఁ బొగడి, మీ కులదేవతలను పూజించి పొందని యనుమతించె నంత వారును. 2331

సీ. మదగజంబుల నెక్కి మాషాశముల నెక్కి
గూండ్లు కట్టిన యెడ్ల బండ్ల నెక్కి
భార్యామణుల నెల్ల పల్లకీ లెక్కించి
దేవి వాసవి మంచి తేరు నెక్క
నగరేశ్వరుని జేరి నగలెల్ల నర్పించి
వింధ్యవాసిని మేన ద్విపటి నుంచి

శ్రీజనార్దనునకు శ్రీకోన కమలకు
పదములబడి మ్రొక్కి ప్రస్తుతించి

తే.గీ. పయనమయిరంత హేలగ బ్రహ్మకుండ
మునకు కుసుమాది వైశ్యులు ముదము మీర
పెళ్ళి వేడుకఁ జూడఁగ వెళ్ళు పగిది
వాసవీ కన్య తోడుగా వాడ వీడి ! 2332

తే.గీ. భేరికా తూర్య నాదముల్ సైరిభమ్ము
నంట మునిపంట వెలచంటి నంటు విప్రు
గుండె వేగంబుఁ గని తన గుండెలందు
లీన మొనరించి సమయించె సానిపడతి. 2333

కం. ఏమా గడబిడ యన నిం
కేమున్నది పెండ్లి గోలలే మన కేలా?
కాముకుల యధేచ్ఛా రతు
లీ మంగళ తూర్య రవము లిటు వారించున్ ! 2334

వ. అనుచు మాటిమాటికి తమ కేళీవిలాసాదులచే వారించుచుండ రాజ పరివారములు సుప్తావస్థ యందుండిపోయి నిజము గ్రహించ లేరైరి. 2335

***ఇది శ్రీవాసవీపురాణమునందు వైశ్యజను లగ్నిప్రవేశమున కేగుటయను ఎనుబదియవ ఆధ్యాయము సంపూర్ణము.***

(లలి= వికాసము, ఉరరీకృతి=అంగీకారం, ఉల్లాఘులు=నిరామయులు, గంధనము= ఎతిగించుట, అంచిత=పూజింపదగిన, కంకటము=ధరించునది, మాషాశము=గుఱ్ఱము, ద్విపటి= చీర, లోష్టము=మన్ను)



# ఎనుబదియొకటవ అధ్యాయము

**కం. యోగవిదే ! యాగ మయే !**
**యోగానందా ! అజా ! అయోనిర్యోగ్యా !**
**యోగద ! యుగంధరా ! గు**
**హ్యా ! గోమాతా ! బలిప్రియా ! దేవేశీ !**

కం. కథనము సాగుచు నుండగ
కథకుని నిలుపుచు వినీత గణ మన్వీక్షన్,
ప్రథితులు గలరే మున్నీ
పథమున చని, పోయినట్టి పసరము లైనన్ ? 2336

కం. అనవిని సాలంకాయన
ముని చెప్పెను మృగశిరా భము జనన గాథన్,
తనువులు బలిగావింపగ
వనచరములు సిద్ధమైన వైభవ మెల్లన్ ! 2337

తే.గీ. మృగశిరా తార కొక గాథ మెలగె నేమి ?
వింతయగు నద్ది వినఁగ మా వీనులార !
చెప్పుడీ గురువర యంచు చిన్న పిల్ల
లగుచు కూర్చుండి రా ముని నగుచు చెప్పె. 2338

హరిణగతి రగడ.
మూడు కొండలు ముచ్చటైనవి
చూడ నొక్కెడ చోద్యమైనవి,
అది త్రికూట మటంచు పిల్తురు
మది త్రినేత్రుని మహిమ గొల్తురు. 2339

హ.ర. క్రూర మృగములు కొలువు దీరిన
కారడవుల వికారమా యన
నతి భయంకర మతి ప్రశాంతము
నతిథి నెరుగని ఆది వేదము. 2340

హ.ర. కంటకమ్ముల కాలి బాటలు
తుంటరుల సరి తూగు బోయలు
పొదల పొంచిన పులుల యూర్పులు
నెదల కలచు నహింస యెల్లలు. 2341

హ.ర. భయము లన్నియు పామరులకని
నయము లన్నియు నాగరులకని
భయము నయమును వదలి పెట్టిన
వియతి మృగములు వెలయు నెలవున. 2342

హ.ర. సింగముల కడ జింక లుండును
ముంగిసల పాములును నుండును
జాతి వైరము చంపు చచ్చును
బ్రతుకు గలిగిన బ్రతుక వచ్చును. 2343

హ.ర. కొమ్మలందున కోకిలమ్ములు
నెమ్మి నీడల నెమలి కొమ్మలు
రంగు పూవుల రంగ వల్లులు
బొంగు వెదురుల పొలయు నల్లులు. 2344

హ.ర. అలుఁగు లందున నసువు లూనెడు
పొలుసు మేఁతరి బోయఁ డొక్కఁడు
ప్రతి దినంబును పసరములఁ గని
దిత మొనర్పగ తిరుగు నవ్వని. 2345



హ.ర. ఒక్క దుర్దిన మొదవ నాతఁడు
లెక్క సేయక లీలఁ బోవుఁడు
దిక్కులన్నియు తిరిగి సోలెను
చిక్కదొక ముది జింక యైనను. 2346

హ.ర. అహము నంతయు నహము పెంపున
బహు విధమ్ముల వనము నందున
పాఱఁ జూచును పరుగులెత్తును
పాఱువేఁటగ పవలు చెల్లెను. 2347

హ.ర. కడుపులో యెలుకల హాళాహళి
యెదదలో హడలెత్తు కథకళి
ఒంటి నిండుగ నుబుకు చెమ్మట
నొంటి నిలబడె నొలయు చీకట. 2348

హ.ర. పగలు మృగముల ప్రాణములఁ గొను
మృగయుఁ డంధ తమిస్రమునఁ జను
ప్రాణ భయమున మ్రాకు నెక్కెను
త్రాణ నిలబడ తామసించెను. 2349

హ.ర. ఎవరు తుమ్మిరొ– ఎవరు పిల్చిరొ ?
ఎవరు వ్యాధున కెదురు వచ్చిరొ ?
ఎప్పుడును తన కిట్టి యాపద
చొప్పడదు, తన చొప్పు నట్టిద ! 2350

హ.ర. ఎచటఁ జేరితి నెచట నిలిచితి
నెచట నీ మొదలిక్క జూచితి –
నలు చెరంగుల నగములేవో
పులకముల చప్పుడు లవేవో – 2351

హ.ర. చెంచు యెక్కిన చెట్టు బిల్వము
త్రుంచు నాకులు త్రోయు కాలము
వేయు నొకటిగ బిచ్చు మైనటు
లేయ బాణము లేమి లేనటు . 2352

హ.ర. జాము గడచెను చాయ వాఱెను
గోము నడకల ఘురణ మాయెను
ఏటి చెంతకు నేణమొక్కటి
వాటముగ దాపాయె వేకటి ! 2353

హ.ర. అంత వరకే హంత మృగమో
చెంత యగునను చింత నుండెనొ
అతఁడు హరిణము నరసి నంతనె
హతము చేయగ నాసఁ జిక్కెనె ! 2354

హ.ర. మాను దిగడు, కమాను నెక్కిడు,
నేణమును గుఱినేయఁ బాల్పడు;
నేణమది గమనించి వాకొనె
ప్రాణముల నెడబాయ దీకొనె ! 2355

హ.ర. ఓయి బోయెద ! ఒక్క మారిటు
మాయ దేహము మసల లేదెటు,
చూడుమా తొలి చూలు దానను,
చూడు, కూడుల సోలు దానను ! 2356

హ.ర. వేట యన పరువెత్తు ప్రాణిని
వేటు వేయును బీరగాడని
వింటి, వేకటి వేటరిని గను
గొంటి నిప్పుడు, గుండగొయ్యను. 2357

హ.ర. మంచి వాఁడను మాట వలసిన
కొంచె మాగుము, కూనఁ గని గణ
మందు కలుపుచు, నంబు ముఖమున
నుందు, నీ తనువుంతు నీ మొన ! 2358

హ.ర. అంచుఁ జీకఁటి నణగె హరిణము,
వించు ప్రమాన్పడె వింటి ధరణము,
పలుకు తెలియని పశువు పలికెను–
పలుకు వాఁడిటు పలుకఁ డాయెను. 2359

హ.ర. చేతి కందిన చియ్య పోయెను
నాతి నెట్టుల నమ్మఁ జేతును?
జింక పలుకుట చిత్ర మందురు
బొంకినానని పుక్కిలింతురు ! 2360

హ.ర. ఎఱుకు నట్టుల నెంచు చుండను
జరిగి పోయెను జాము రెండును,
కనులఁ బడె నొక కాలపృష్ఠము
వన పిపాస నవతరణ మృగము. 2361

హ.ర. ఎక్కు వెట్టెను యెఱుక కొంచక
నుక్కణంచగ నులివు చేయక–
నంతలో విననాయె బోయని
కుంత మేయగ కొంత నిలుమని. 2362

హ.ర. కంతు చేతల క్రాగు చుంటిని
కాంతుఁడేమో కలియ రమ్మని,
కలిసి వచ్చెద కబళ మయ్యెద
పిలుకుమార్చకు ప్రేమ పయ్యెద ! 2363

హ.ర. జింక మాటలు చిత్తమున నొక
వంక పెను వలవంత రేఁప, క
ఠోర హృదయము డుల్లె మెల్లన
నారె దండము నారె చల్లన ! 2364

హ.ర. బోయ తలపుల బోయెత మెదల
కాయజునితో కాంక్ష వర్ధిల
రజని లోలో రగిలె తాపము
అజినయోనిని యనిచె, పాపము ! 2365

హ.ర. సతిని దలచుచు జాగరణమున
పతనముల భూ పతన మెసగొన
జాము మూడును చనియె వాసుర
కాము దరికొనె కంట నిద్దుర ! 2366

హ.ర. కునుకు పొలియగ ఘురణ మొక్కటి
వినిచె బోయకు, వెలసె నుక్కట –
ఎదురుగా నొక యేణ ముదకము
పెదవి నుంచగ పెనగె కుతుకము. 2367

హ.ర. వింట శరమును వేయ దొడగెను
కంట గాంచిన గాలి మెకమును,
ములికి విడువక ముందుగా పిడి
పలుకుఁ జేరెను పయిర వినికిడి. 2368

హ.ర. ఆగుమాగుము ఆపనికుఁడా !
ఆగుమోయీ హరిణికుండా !
ఏగుదెంచెదు నిరు మెకమ్ములు
మూగురము నీ ముందె నిలుతుము ! 2369

హ.ర. మూడు కన్నుల మొదలి దైవము
నేడు పుట్టుక నెగడు సుదినము,
ఒడలు విడిచిన నొనరు పుణ్యము
కడగుమా, కొనఁ గలుగు పుణ్యము. 2370

హ.ర. శివుని చెట్టును యెక్కినాడవు
శివుని పూజలు చేసినాడవు
శివుని పత్రము చేత నిడుకొని
భవుని తలపుల భౌతి మేల్కొని. 2371

హ.ర. బోయ వానికి బోధ పడదది,
మాయ యనుకొని మార్గణంబిది
కాచు కొమ్మని కాలు ద్రవ్వగ,
వేచె మూడును వింటి కెదురుగ ! 2372

హ.ర. మున్ను గాంచని ముచ్చటను గన
కన్నులందున కరుణ మేల్కొన
విల్లు జారెను, విందు మరచెను,
మల్లననఁగా మనసు పోయెను ! 2373

హ.ర. ఎవ్వఁడీ శివుఁ డేమి యాకులు
చివ్వి పడవేసితిని, ఆకులు
నైన కతమున, నాది దేవర
యాను వెక్కడ ననెఁడు నక్కఱ. 2374

హ.ర. అరుణ కాంతుల అల్లరిని గన
ధరణి గర్భము తలుపు తెరచిన
చెట్టు క్రింద పసిండి కాంతుల
వట్టి లింగము వలచె దిక్కుల ! 2375

హ.ర. బోయ వానికి పూర్వ పుణ్యమొ
మోయఁ జాలని ముద మగణ్యమొ
శివుని లింగము శివుని రూపము
శివుని తలపులు చేరె శీర్షము. 2376

హ.ర. లింగ మందున లేలిహానుని
అంగ సౌరభ్యాదులంగని
మ్రొక్కె కరములు మోగిచి బోయఁడు
పక్కణమ్మున భక్తి పుట్టిడు. 2377

హ.ర. హర హరోం హర ! హర హరోం హర !
దురిత నాశన ! ధూర్జటీ హర !
అనుచు బోయని ఆననంబున
వినిచె స్తోత్రము వేదమా యన ! 2378

హ.ర. వరద హస్తము వలకడం జను
హరుని రూపం బవతరించెను,
దిక్కులన్నియు తేజరిల్లగ
దృక్కులం గృప దిగుడు వారగ ! 2379

హ.ర. చేరి మ్రొక్కెను జింక లెఱుకులు
చీరి ప్రోచెను శివుఁడు నిచ్చలు
మేఘ పథమున మృగశిరంబన
ఓఘ మృగముల నునిచె వృషమున ! 2380

హ.ర. జాగరణ నిరశనముల బిలువ
చాగుబడికల జాలి మెలకువ
నను మహా శివ నక్త మందున
తనియఁ జేసిన దయ ! మృగాదన ! 2381

హ.ర. మూడు జింకలు మూడు కనులయి
వాడి ముమ్మొన వాలు కోలయి
వృషభమున మను వీర వరునిగ
కషణమున నను గణుతి సేయగ ! 2382

తే.గీ. అనుచు శంకరుఁ డా బోయ హరిణములను
వృషభ రాశికి జతఁజేసి బిరుదుఁ గూర్చె,
శాశ్వతంబగు నాకాశ విశ్వ మందు
తన గృహంబున తన తోడఁ దనరు మనుచు. 2383

తే.గీ. ఇదియ మృగశిరా గాథ విన్పించి నాడ !
పామరుఁడె కాదు భక్తితో పసరమైన
నాత్మ బలిదానమున జెందు నమర లోక
వాస మిది నిత్య మిది సత్య వాక్య మవని ! 2384

***ఇది శ్రీవాసవీపురాణమునందు మృగశిరా నక్షత్ర కథనమను నెనుబది యొకటవ అధ్యాయము సంపూర్ణము.***

(అన్వీక్ష=ఆలోచన, భము= నక్షత్రము, వియతి= పక్షి, పులకములు= పురుగులు, వేకటి= గర్భవతి, గుండగొయ్య= దుష్టుడు, కాలపృష్ఠము= జింక, అవతరణము= ఒడ్డు, ఉలివు= శబ్దము, పిలుకుమార్చు= చంపు, ఆరెదండము= ఆయుధవిశేషము, అజినయోని= జింక, వాసుర= రాత్రి, ఘురణము= గిట్టలచప్పుడు, ఉక్కట= చలనము, పిడి= జింక, చాగుబడిక= పూజ, కషణము= ఒరయిక.)

# ఎనుబది రెండవ అధ్యాయము

**కం. నిరవద్యా ! నిష్కామా !**
**నిరుపాధీ ! నిత్య నందినీ ! నిష్క్రోధా !**
**నిరుపప్లవ ! నిర్లోభా !**
**నిరహంకారా ! మనోన్మనీ ! నిర్లేపా !**

తే.గీ. వృషభ రాశి గాథను విన్న విద్గణంబు
భక్తిచేఁ గల్గు ఫలితంపు భాగ్య మరసి
వాసవీ కన్య బలిదాన వాస్తవంబు
నెఱిగి కథఁ జెప్పు మనిరి మౌనీంద్రు నంత ! 2385

వ. మునియు ననంతర గాథ నిట్లు చెప్పసాగె. 2386

శా. ఆచార్యుండు వచించినట్టి తెరువున్ హట్టంబులన్ వీడి, ప్రా
ణాచారంబులకై కటంకటములన్ నైర్మల్య హేమంత ఖం
శోచిష్మార్గ విదగ్ధులై పొలయగా శోభాయమానంబుగా
వాచస్పత్య మనోవిలాసములు లో సంధించి హత్తం జనెన్ ! 2387

కం. ఎవ్వరు తనువర్పింతురొ,
ఎవ్వరు తమవారితోడ నేగం జనిరో,
నవ్వుచుఁ ద్రుళ్ళుచుఁ గేరుచు
నవ్వారు గమించు చుండ నబ్బుర మయ్యెన్ ! 2388



కం. పసి, ముదుసలి యను మెరమెర;
నసి, సెరవులనెడు నరమర సడవ సడలగా;
వెస నడచుట వెసనముగా
కసిమసగిరి వణిజ వరులు కపిలుని త్రోవన్ ! 2389

కం. క్రోసెడు దూరము నందున
నే సెగ లారంభమాయె నెదురు నడచు నా
ఘూసి కరంబులు సాచుచు
నసి దూసిన యట్లు, కాని ఆశలు కడచెన్ ! 2390

ఆ.వె. ఆత్మ శక్తి తోడ నరుగు సైన్యం బద్ది
అడ్డురావు దాని కగ్గి బుగ్గి,
ముందు ముందు కడుగు ముందుకే పడుగాని
వెనుక పడదు, బుద్ధి వెంట నడచు. 2391

చం. చని చని వైశ్య చక్రమటు చక్రములై కనుపించు నగ్ని గుం
డ నిచయమందు సూర్యుని హుటాహుటి డీకొను నంజనా సుతుం
దన జని తప్త వాయు గృహమందు హిమాలయ మట్లు గొంకులే
క నడచె నగ్నిదీప్త చషకమ్ముల మధ్య హిమాంశు చక్రమై ! 2392

ఉ. తాకదు వేడి చిత్రము వితాకు చెలంగ దదే విచిత్రమో
పాకల మాతిథేయమయి పండుగ సల్పెనొ చెంతఁ జేరగా,
లౌకిక వృత్తి మానుట విలాసము మారెనొ వైశ్య సంతతిన్,
వీకఁ జెలంగి సొంత యిలు వేడుకఁ జొచ్చిన యట్టు లాయెడిన్. 2393

ఉ. అందరు నన్ని కుండముల యంకములందున నిట్టనిల్చి రా
నందము కందకుండ, దహనంబు నభంబునుఁ దాక తారకా
క్రందన విస్ఫులింగ మగు కైవడి నగ్ని చెలంగి పొంగినన్
కందరు ప్రేక్షకాళియును, కాలమిఁ గీలక మేదియో గదా ! 2394

తే.గీ. అగ్ని దూకుట యొక్కటే ఆశయమ్ము,
కాలునను చింత మనమున కలుగ రాదు,
దేహ భావంబు ననెగాదె దాహ చింత !
దేహమే కాదు మనమునం దీహ లేదు ! 2395

ఆ.వె. గురువు చెప్పినట్లు గుండంబులం జేరి
పతనమొంద సిద్ధ పడిన వారు
మోములెత్తి వాసవీ ముగ్ధ రూపంబు
చూచి రాజ్ఞ కొరకు వేచి నటుల. 2396

వాసవి. వాసవీ కన్య మౌనముగా నిజావాసంబు నెడంద నుంచి, కా
ర్పాసమున్ పైకిఁ గట్టి, శపించి భూపాలాగ్రణి నెత్తి పెట్లగా,
రాసలీలా విధానము చుట్టిరా రారాజ కులాగ్ర యుగ్మముల్,
ఘాసిఁ గుప్పించఁ బూనినవేళ వైకల్పంబున నగ్ని తూలినన్. 2397

కం. అచ్చెరువందిన వాసవి
చెచ్చెర నధికార స్వరము చేతన్ శుష్మన్
చచ్చితి వేమన నతఁడున్
క్రచ్చఱ నెదురుగ నిలబడి క్రక్కెన్ నిజమున్. 2398

సీ. దాక్షాయణిం గాల్చి తప్పుఁ జేసితినమ్మ
ఈశుఁ ద్రిప్పితి నాఁడు ఎండ కొండ,
అద్రిజన్ చేపట్టి అద్రి గహ్వర ముండ
తొంగి చూచిన తప్పు దొంగఁ జేసె,
బ్రహ్మ రేతస్సున్న వస్త్రమున్ దహియించి
హరి నోటి నీటితో నణగి పోతి,
భృగుపత్ని గతిఁ జెప్పి భృగుశాపమును పొంది
సర్వ భక్షకుఁడైతి సత్యమాన,

తే.గీ. నేడు నిను, సర్వ శక్తుల నేతవైన,
పంచభూతమ్ములకు నాట పట్టువైన,
విశ్వ మాయను దహియించ వీలుగాంచి
తప్పు గావింప లేకనే తప్పుకొంటి ! 2399

తే.గీ. అధికులై యుంట వేషము లాట మీకు,
మీకు పరిచర్యలం జేయ మాకు తగవు,
తగవునం దిటు నటులైన తప్పు మాది,
మాకు శాపముల్ శిక్షలు తప్ప వకట ! 2400

ఆ.వె. తెలిసి తప్పుఁ జేయు తీపురంబును లేదు
వృద్ధు లెలమిఁ జెప్పు విధులె గాని,
శిక్షలెల్ల నాకు, చిరునవ్వు మీ కాయె
నేమి సేతునమ్మ హోమి జన్మ ! 2401

తే.గీ. భర్త కెదురాడి ఆ యమ్మ భస్మ మయ్యె,
నేమి చేసితివంచు నీ వెరియు దమ్మ?
తప్పు చేయని నీవారు తగుల బడుట
కేమి కారణమునుఁ జూపు దేను నాకు ? 2402

సీ. స్థిరముగా గురువుల సేవించు వారిని
తల్లి దండ్రులఁ దలఁ దాల్చు వారి
ధర్మంబు నేవేళ తప్పని వారిని
శ్రద్ధతో పనులను సలుపు వారి
సత్య వర్తన మొండె నిత్యంబు నగు వారి
బ్రహ్మ విద్యా ప్రాప్తిఁ బడయు వారి
కుల ధర్మముల భక్తిఁ గొలిచెడి వారిని
అంట జాల నిది నీ యాన గాదె !

ఆ.వె. ఆన గట్టునుంచి హరియించు మందువా
చెప్పు మదియు నీవె తప్పు లేదు,
చెప్పు వారు మీరు చేయువారము మేము
చెప్పుమమ్మ యేమి చేయు మనెదొ ? 2403

వ. అనుచు నగ్ని దేవుఁడు వినమ్రుఁడై నిలబడ న య్యాదిపరాశక్తియు నొకింత యోచించి యిట్లనియె. 2404

***ఇది శ్రీవాసవీపురాణమునందు అగ్నిదేవుని నిరాకరణమను నెనుబదిరెండవ అధ్యాయము సంపూర్ణము.***

(కటంకటములు= అగ్నులు, శోచిష్మార్గము= కిరణమార్గము, మెరమెర= భేదము, ససి,సెరవులు= క్షేమాక్షేమములు, సదవ= దారి, కపిలుడు=ఘాసి= పాకలము= అగ్ని, వితాకు= నిశ్చేష్ట, రారాజు= కుబేరుడు, ఎరియు= కాలుట.)



# ఎనబది మూడవ అధ్యాయము

**కం. నిర్మల ! నిర్గుణ ! నిష్కళ !**
**నిర్మద ! హే మోహ నాశినీ ! నిరపాయా !**
**నిర్మోహా ! నిశ్చింతా !**
**నిర్మమ ! నీల చికురా ! ధనీ ! నిర్నాశా !**

వ. అనుచు మునీంద్రుండును కథ నడుమ నొకింత శ్వాసగొనుచుండ వైశ్యమును లగ్ని పలుకుల కర్థమెయ్యది, మహాదేవిని సహితమాలోచింపజేసిన వాని కథనమున హరిముఖజల, భృగుశాప వృత్తాంతము లెటుల సంభవించినవి వివరింపుమన నమ్మునీంద్రుడు నిటులఁజెప్ప దొడంగె. 2405

ఆ.వె. బ్రహ్మ సృష్టి తొలుత పంచ భూతంబుల
దిద్ద నవియు నన్ని దిక్కులందు
నియమ రహిత మగుచు నిఖిల విశ్వమునందు
తిరుగ సాగె, స్వేచ్ఛ తేజరిలగ ! 2406

ఆ.వె. బ్రహ్మ యనఁగ మాయ, భార్య గర్భంబున
ప్రసవ మొనరఁ జేయు ప్రసవమద్ది !
బొడ్డుత్రాడు తూడు, బొడ్డునం బ్రభవించు,
తిరుగ బడిన రావి తరువు చూడ ! 2407

ఆ.వె. మరుఁడు కోర్కె, దాని మారాకు రతియంఁద్రు,
రతిని గన్న వెనుక బ్రహ్మ జారె,
స్ఖలిత రాశినెల్ల జాతవేదుఁడు మ్రింగి
కాల్చుఁ దొడగె ధృత నికాయ మపుడు. 2408

తే.గీ. వస్త్రమును గాల్చి మునుమును బట్టి సాగు
నగ్ని విజృంభణము విశ్వ మావహింప
సృష్టి, సృష్టికర్తయుఁ గారుచిచ్చు బారిఁ
బడియె, పుట్టకుండనె మిత్తిఁ బడియె సృష్టి ! 2409

తే.గీ. శిశువు విష్ణువు మున్నీటి చిన్ని రూపు,
అజునియం దాతఁ డాతని యందు నజుఁడు
నుద్భవించిరి, జలముల నుర్వి తేలి,
ఉర్వి వర్షించు జలములు నొకటఁ జేరి ! 2410

తే.గీ. అగ్ని పైకొన జలమును నభ్రమంటి
యుమియ నొక బిందువున కారె నుపష మెల్ల,
తాడిఁ దన్నెడు వానికి తలను దన్ను
వాడు నొకడుండు గాదె విశ్వంబు నందు ! 2411

తే.గీ. నాటి నుండియు ననలంబు మేటి ననెడి
దర్ప విచ్ఛేదనంబున తనువు నణచి
మెదలఁ డైనను గ్రాసము మేయునపుడు
కొన్ని నియమముల పాటించు నన్ని గొనఁడు. 2412

తే.గీ. అనఁగ వైశ్యులు రెండవ యవసరమున
నగ్ని భృగుశాప మొందెనే యనఁగ మునియు
నవును, వింటిరే భృగుగాథ ననఁగ, విశులు
లేదు, వినగోరెద మటంచు లీనమొంద. 2413

ఉ. బ్రహ్మ హృదంతరాళమున ప్రస్ఫుటమైన భృగుండు నంత నా
బ్రహ్మ వరంబులందిన హిరణ్య సురారి తనూభవన్, దితిన్
బ్రాహ్మ విధంబుఁ బెండ్లిఁ గొని పాసె సుపర్వుల జన్మసిద్ధమౌ
బ్రహ్మరసంబు, దానవుల బాపని శుక్రుని గాంచె నామెకున్ ! 2414

ఆ.వె. దితికి నంత భృగుఁడు దేవవర్ణిని గాంచె,
ప్రేమతోడఁ బెంచి పెద్దఁ జేసి
వివహ మొనరఁ జేసె విశ్రవో బ్రహ్మకు
వైశ్రవణుఁడు కలిగె వారి యందు. 2415

తే.గీ. అంత నొకనాడు దేవత లసురతతిని
తరుము చుండంగ దితి చెంత దాగె వారు,
అవలి గణమందు మెట్టియు నండఁ జేరి
నట్టి తనవారి రక్షింప నామె తలఁచె. 2416

కం. దితిజులఁ దరుముచు దేవత
లతి వేగంబున భృగునిలు నావేశింపన్
దితి చూచి యడ్డు నిలచెను
బ్రతిమాలెను తన కులంబుఁ బ్రతికింపంగా ! 2417

తే.గీ. రిపులు వెనుకంజ వేయ వేలుపులు నిగిడి
కరుణ లేకుండ కడతేర్చు, కడకు వారి
కడ్డు వచ్చిన వారిని కాటి కనుపు,
భృగుని భార్యను మాత్రము దిగ విడుతురె ! 2418

ఆ.వె. ఆమె దైత్య యయ్యు ననుకంప్య సతిగాన
పోరలేరు పాటిపూజితాళి,
చక్రి వచ్చి యపుడు చక్రాయుధము తోడ
నామెఁ జంప, రిపుల నడచె సురులు. 2419

కం. తాపసి తను లేనప్పుడు
లోపలి కేతెంచి చంపు లుంటాకుని పై
కోపించిన భృగుఁడప్పుడు
శాపించె నతఁడు తనవలె సతివిడి పొగులన్ ! 2420

ఉ. శ్రీరమ సీత కాగ, మధుజిత్తు రఘూద్వహుఁడైన త్రేతయం
దారట వెట్టె మౌని పలుకయ్యది రామకథా విశేషమై
మారణమాయె మౌని మనుమల్ నశియించిరి రావణాదులై
కోరక మాత్మ ఘాతుకము కోపము నందున వశ్యవాక్కులన్ ! 2421

వ. రామాయణగాథ మీరలెరింగినదియే కావున భృగువృత్తాంతంబును వినుడు.

ఆ.వె. భార్య లేని భృగుఁడు పరిణయంబున కర్ద
మప్రజాపతి సుత మగువ ఖ్యాతి
నొందె నందు నొందె నందను లిరువురన్
ధాతయును విధాత ఖ్యాతిఁ దనర ! 2423

చం. మరియొక భార్యనొందె భృగుమౌళి పులోమయనంగ నొందు సుం
దరిని, వితాన బాంధవిని, ధర్మ నిధాన మభీష్ట వర్తినిన్,
కరదముఁ దాల్చినట్టి తటి కాంతను వహ్ని గృహంబునుంచి, తా
ఝరి మునుగంగ నేగె, మునిజాతి పురోగముఁడౌచు నిర్ధరన్. 2424

చం. సుమతి పులోమఁ బెండ్లిఁగొన జూచెడి దానవుడట్టి వేళ గే
హమునఁ బ్రవేశమొంది బరి చూపుల లోపల దేవులాడఁగా
దమనుఁడు కానుపించె, నట దాగిన తోయలి యెవ్వరన్న, స
త్యము వ్రతమైనవాఁడు భృగుదారయటంచు వచింపనాతఁడున్. 2425

కం. ఈమెను నేను వరించితి,
ప్రేమను ప్రకటించు వేళ భృగుఁడీమెను భా
ర్యామణిగాఁ దెచ్చెను, నా
లేమను జూడక వసింపలేకుంటి సఖా ! 2426

కం. అని కిటి రూపము గొని యా
మెను భయమున ముంచి పొలసుమేపరి లీలన్
గొనిపోయెను, ప్రేమాంధున
కనదఁ గనిన నూరకుండునా కాల్సేతుల్ ? 2427

తే.గీ. పడతిఁ జూచిన ప్రేమించు పడుచువాఁడు
పడతి కిష్టమో, లేదొ– నిబద్ధి గొనఁడు,
చంప వెనుకాడ బోడు సాధింపకున్న
రాక్షసుల తెఱంగిది, వీఁడు రాక్షసుండు. 2428

ఆ.వె. నిండు గర్భమగుట నిర్జరారాతిచే
భయము నొంది గర్భ పాతమాయె,
వెఱఁగు పడి పులోమ వీక్షించెఁ దనబిడ్డ
కనులు తెఱచె నంత గాముఁ జచ్చె. 2429

ఆ.వె. బిడ్డతోడ వెళ్ళి పెనిమిటితో ఫేర
వుని మరణ కథనము వినిచె సాధ్వి
బిడ్డ ముఖముఁ జూచి భృగుఁడు దీవించెను
శాంత మొందు చ్యవన శాంత మనుచు. 2430

కం. పుత్రునకు శాంతి బోధిం
చి త్రుటియును గడువగ లేదు– ఛీ ధూమాంకా –
మిత్రుని వలె నింట నిలిచి
శత్రువునకు సాయ పడితె? చంచా యనుచున్. 2431

తే.గీ. సాధ్వియైన పులోమను జాడఁ తెలిపి
దైత్యు కర్పించి నట్టి నీ ధైర్య మేమి?
నీవె తినలేక పోతివా– నీతి మాలి?
సర్వ భక్షకుఁడగుమంచు శాపమిచ్చె ! 2432

తే.గీ. శాప మట్టుల నగ్నికి సంభవించె
నాటి నుండియు గుణములు పాటిఁ గొనక
కాల్చసాగెను సకలమ్ము, కరుణ దప్పి,
నేడు లోకమాతను ముట్ట నిరుకుఁ గనఁడు. 2433

***ఇది శ్రీవాసవీపురాణమం దగ్ని సర్వభక్షకుఁడగుట యను నెనుబది మూడవ అధ్యాయము సంపూర్ణము.***

(ఉపషము= అగ్ని, అనుకంపుడు= ఋషి, పాటిపూజితాళి= సామాన్య దేవతలు, లుంటాకుడు= దొంగ, వితానము= యజ్ఞము, కరదము= బహుమతి, భ్రహ్మరసము= అమృతము, బరి= దొంగ, నిబద్ధి= నిజము, గాము= రాక్షసుడు= ఫేరవుడు, చంచ= కసవుతో చేసిన బొమ్మ)



# ఎనుబది నాల్గవ అధ్యాయము

**కం. రుద్రగ్రంథి విభేదిని !**
**భద్రప్రియ ! రుద్రరూప ! భవధి నియంత్రీ !**
**ముద్రాజ్ఞాన మతీ ! సద**
**సద్రూప విహారి ! రాక్షసఘ్నీ ! రాజ్ఞీ !**

ఉ. అగ్ని పరీక్ష యంచు గతమం దనుమానితు లందు నెంచగా
నగ్నులఁ ద్రోయు కారణ మనంతము కాదను మాట సత్యమై
భగ్నము నొందె నమ్మకము, బాగయె లోకము, నింక మీదటన్
లగ్న మనస్కు లార్యుల విలక్షణ మెట్లు గతించె చెప్పుడీ ! 2434

వ. అన నాచార్యుండు వల్లె యనుచు . 2435

ఉ. చేతులు కట్టికొంచు మునుజేరి విధేయత నిల్చియున్న వి
ఖ్యాత హిరణ్య రేతసుని గాంచిన వాసవి జాలినొంది, యో
హేతి ధరుండ నీ విటుల హేతిఁ దొలంగి చరింప నేటికిన్?
హేతువులేదు నీ విటుల హేతిని వీడి చరింపగా శుచీ ! 2436

కం. యజమానులు నీ కొసగిన
యజనము సాగించుటే నియామకమున నా
యజమానులు కోరికొనెదు
భజనము నీ నుండి సర్వ భక్షక వింటే ! 2437

తే.గీ. సేవఁ జేసిన స్వార్థంబు రావలయును,
ఫలిత మాశింప రాదట్టి పనినిఁ జేయ
భయము గర్వంబు మదిఁజేర బాగుపడవు
చేయుచున్నది నీవన్న చింత వలదు. 2438

తే.గీ. కర్మ చేయుటె నీ వంతు కాని దాని
కర్త నీ వను భావంబుఁ గాంచవలదు,
హేయమది ఫలితముఁ గోరి చేయు కర్మ
కృపణుఁ డగు నట్లు చేయంగ కృష్ణవర్త్మ ! 2439

తే.గీ. జన్మ లేనట్టి దాననై జనుల యందు
మూలధర్మంబునం గ్లాని పుట్టి నపుడు
పాపులం జంపి సాధు ప్రాభవము పెంప
ధర్మ సంస్థాపనార్థమై ధర జనింతు. 2440

తే.గీ. మాయ దేహంబు, దీనిచే మాయ చేసి
దుష్ట కర్మల జగమందు తునిమి వైచి
శిష్టులకు భీతి లేకుండఁ జేసి తిరిగి
వెడలు చుంటిని దేహంబు వీడ వలదె? 2441

తే.గీ. అవతరించితి నీ గర్భ మందు నుండి
తీరినవి తల్లి దండ్రుల కోరికలును
తీరినది రాజు చిరకాల తీక్ష్ణ తపము
జన్మ కారణములు తీరె చనఁగ వలదె ! 2442

తే.గీ. భూమిఁ బుట్టిన సీతమ్మ భూమిఁ జొరదె?
జ్వలనమున బుట్టి రామయ్య జలముఁ జొరడె?
వనమునం బుట్టి పాండవుల్ వనినిఁ బడరె?
ఏను మాత్రము నీలోని కేగ వలదె ! 2443

ఉ. ఎంతటి వీరుఁడైన, భువి నేలిక యైనను, లోకమందు వే
దాంతిగ పేరు కెక్కినను, దానము ధర్మములందు కర్ణుఁడై
ఎంతటి వెల్గు వెల్గినను– ఇక్కడ తల్లికి బిడ్డడే కదా !
ఎంతటి దాననైన నిట నేనొక మానవ మాత్రనే కదా ! 2444

కం. ఇహమున బుట్టిన నెపమున
నహమున నేనొందు కాదు, అందరలోనన్
దహనము నొందగ నిల్చిన
దుహితను, దహియింపు మయ్య తుకతుక లేకన్ ! 2445

వ. అయినను ధైర్యము జాలక వెనుకాడుచున్న దహనుని జూచి వెండియు నిట్లనియె. 2446

ఆ.వె. జంకదేల నీకు జంట మోముల వేల్ప !
ఖాండవమ్ము నొంటి కాల్చినట్టి
అంటరాని వేల్ప ! అగ్ని భట్టారకా !
కోరి నిలువ నేల కొందలమున? 2447

ఆ.వె. అరదమందు దాగి అస్త్రమ్ములన్ మ్రింగి
శత్రు పాటవమ్ము సంగ్రహించి
క్రీడిఁ గాచినట్టి కృష్ణార్చి ! కృష్ణుండు
దిగిన వెనుక కీల లెగయలేదె? 2448

ఆ.వె. నీవు లేక యజన నిర్వాహములు లేవు,
దేవతలకు తినఁగ తిండి లేదు,
వారిదములఁ గురియ వర్షంబులున్ లేవు
కఱవు కాటకముల సురుగు జనులు – 2449

ఆ.వె. జీవజాలమందు, జీర్ణ క్రియల యందు,
నీటియందు, వాత కోటి యందు,
నేల యందు నిలచు నీవార శూకమై
ప్రాణమగుదు వయ్య పావకార్య ! 2450

ఆ.వె. పంచ భూతములను బర్హి స్స్వరూపమై
తారలందు వెలుగు తరణి వీవె,
వెలుగు తరణి లోని వేడిమి నీవెగా
జీవములను నిల్పు చిత్రభాను ! 2451

ఆ.వె. వెలుగు ప్రతిఫలింప వేడిమిఁ గోల్పోయి
చందమామ లోని చలువ నీవె,
చలువలోని మానసంబునం బుట్టెడి
కోర్కెలందు వాడి కోర వీవె ! 2452

ఆ.వె. కోరలందుఁ జిక్కి కూరుకొని పోకుండ
మానసమును గెల్చి మసలుచున్న
నన్నుఁ జూచి నీవు నారముఁ గనినట్లు
వెనుకఁ జూతువేల వేడి వేల్ప ! 2453

ఆ.వె. నా బలమ్ము చేననంతమ్ము వ్యాపించి
రాజ్యమేలు చున్న ఆజ్య ప్రియుడ,
నేను నేనుకాదు, నేలఁ బుట్టిన దాన
సమయఁ జేయుమయ్య సర్వ భక్ష ! 2454

తే.గీ. లెమ్ము, నిప్పూరవ్వలఁ దేలి రమ్ము సుశిఖ !
రమ్ము, కార్చిచ్చు వలె కాల్చి పొమ్ము శుష్మ !
పొమ్ము, కాలాగ్నివై చేర్చి పొమ్ము మేరు
నిలయ శృంగస్థ చింతామణీ నిలయము ! 2455

వ. ఎంత చెప్పినను తలయెత్తని దేవ వాహనుఁ జూచి నిత్య మందస్మిత వదన వాసవి కోపారుణ నేత్రయై. 2456

శా. హే స్వాహా ప్రియ ! సర్వతో ముఖ ! శిఖీ ! హేమార్చి ! హవ్యాశనా !
నీ స్వాహా సతి నిన్ను, నీబరిని మన్నీడంచు మన్నింప నే
లా స్వాంతంబు సహించు, నీ బిరుదులేలా? కాల్పనా ! వ్యాహృతిన్
వైస్వర్యంబు ఘటించె, నింక నిను నీవైచిత్రి శాపించెదన్. 2457

చం. వినుచు కఠోరవాక్కులు చెవింబడ, శీర్షమునెత్తి చేతులన్
కనులను నొత్తుకొంచు, నుపకంఠము గద్గద మొంద పల్కె హే
కనకగిరీంద్రసంస్థ ! కలి కల్మష నాశిని ! వాసవాంబ ! నీ
యనుమత మాచరింతు ననయమ్ము క్షమింప నమస్కరించెదన్. 2458

తే.గీ. అనుచు నాకాశమునపొంగు నంబుదముల
రీతి కుండంబులంబొంగె హేతిధరుఁడు,
తల్లిపాదాల చుంబించె తరుణశిఖల
వలయువులఁజెప్పె వెచ్చనిస్వాగతమ్ము ! 2459

**ఇది శ్రీవాసవీపురాణమందలి వహ్నిజ్వలించుటయను ఎనుబదినాల్గవ అధ్యాయము సంపూర్ణము.**

(విలక్షణము= కారణము లేని ఉనికి, కృష్ణవర్త్మ= కృష్ణార్చి= చిత్రభాను= దేవ వాహనుడు= అగ్ని, తుకతుక= సంశయము= కొందలము, సురుగు= బాధపడు, బర్హిః= అగ్ని, నారము= నీరు, ఈబరి= అప్రయోజకుడు, వలయువులు= ఇష్టమైనవారు)

# ఎనుబది యైదవ అధ్యాయము

**కం. కామాక్షి ! కామదాయిని !**
**కామకలా రూప ! కామ్య ! కరుణా రసధీ !**
**రామా ! మమతా హన్త్రీ !**
**కామేశ్వర ప్రాణ నాడి ! కాంతా ! కాంతీ !**

కం. ఒక కంట వహ్ని వ్రేల్చుచు
నొక కంట నిజాలయంబు నొలయుచు దీక్షన్
చకచక ప్రదక్షిణంబున
ప్రకటాకృతి లయముఁ జేయఁ బరగెడు వేళన్ ! 2460

తే.గీ. చుట్టు ప్రక్కల నుండియు చోద్యమార
చూడ వచ్చిన జనులను చూచి నంత
వారి సంతృప్తులను జేయ వాసవాంబ
ప్రకట మొనరించె నిజతత్త్వ పరమమిట్లు. 2461

తే.గీ. భక్త వరులార వినుఁడు నే బ్రహ్మ విష్ణు
శివులు, వాణీ రమా గౌరి మువుర నేనె !
ఈ చరాచర సృష్టి యందేను దప్ప
నేదియును లేదు విశ్వమందేన విభువ ! 2462

వ. అని పలికిన నచటి ప్రజలెల్లరు నో దేవదేవేశ్వరీ ! అపార కరుణా సముద్ర వైన యో తల్లీ ! అనంతమైన నీ విశ్వరూపమును చూపించి మమ్ము ధన్యులఁ జేయుమన నవ్వాసవీమాత భక్త వత్సల కావున వారి కిట్లనియె. 2463



మ. జలజాతాసన వాసవాది ఋభువుల్, చంద్రాంబుజాప్తుల్, మునుల్,
విలసద్యోగ వరిష్ఠులైనఁ గనఁగా బెగ్గిల్లు – నా దివ్యక
ల్పలతారూపము విశ్వరూపమున గాన్పట్టంగ, రూపాఱు క
న్నుల మీరెట్టులఁగాంతురో? అయిన మీనోముల్ ఫలంబందెడిన్ !

తే.గీ. త్యాగ ధనులైన మీ యందు దయవహించి
నూత్న వాత్సల్యమున మీ కనుగ్రహింతు
దివ్య దృష్టిని, చూడుడీ దివ్య రూప
మందు విశ్వమ్ము, విశ్వమ్ము నందు నన్ను ! 2465

చం. అనుచు నచింత్యలోకనిచయం బుదరంబుననుండ, కోటిసూ
ర్యనిభవికాస దీధితులు యాతువు నల్గడలన్విదుర్చ, నం
బునభతటిల్లతారుచి విభూషితమై తనరారు దేవి పొ
ల్చెను, జనులెల్లరద్భుతము చిత్రము ధన్యులమంచుఁ బాడెడిన్. 2466

దండకము:

కనుగొంటి పరమేశ్వరీ వాసవీ నీదు బ్రహ్మాండ భాండంబు రూపించు నీ దివ్య నిర్మాణ మీ విశ్వరూపంబు, నా సత్య లోకంబు శీర్షంబుగా, సూర్య తారావిభుల్ నేత్రయుగ్మంబుగా, సర్వదిక్కుల్ శ్రుతుల్గాగ, వేదంబులే పల్కుగా, గంధవాహుండు ప్రాణంబుగా, సృష్టి నవ్యక్త మంచున్ ఋషుల్ పల్కు సర్వాత్మ కంబైన యా శుద్ధ చైతన్యమే హృత్తుగా, పృథ్వి ప్రోథమ్ముకాగా, భువర్లోకమే నాభిగా, తారకామండలంబెల్ల వక్షస్థలంబై, మహర్లోకమే కంఠమై, చేతనాలోకమెల్లన్ ముఖంబై, తపోలోకమెల్లన్ లలాటంబుగా, దిక్పతుల్ బాహువుల్గా, సమస్తాబ్దులున్ తాలువుల్గాగ, నీరంబు లందున్ రసంబుల్ రసజ్ఞాగ్రమైయుండగా, గంధమెల్లన్ త్వదీయాస్యనాసేంద్రియంబై, త్రిధాముండు తార్తీయనేత్రంబునై, వాసురావాసరంబుల్ పుటద్వంద్వమై, కాల రూపంబుపంచత్వమున్ దంష్ట్రలై, దారపుత్రాదులందుండు మోహంబె దంతంబు లుంగా, మహామాయ స్మేరంబుగా, సర్వసృష్టిన్ గటాక్షంబుగా, లోభలజ్జాద్వయం బోష్టముల్గా, ప్రజాసృష్టికార్యం బధోంగంబుగా, సాగరానీకమున్ గర్భమై, పర్వతానీకమున్ శల్యసంధానమై, వాహినుల్ స్నాయువుల్గాగ, వృక్షంబులున్ సర్వ

రోమంబులై, బాల్య తారుణ్య కౌమార వార్ధక్యముల్ సంప్రహారంబుగా, వ్యోమమున్ కేశముల్గాగ, సంధ్యోభయంబున్ దుకూలంబులై సందడించంగ, నీయందు త్రైగుణ్యముల్ వానిసంసిద్ధులున్ విష్ణుబ్రహ్మేశ్వరుల్ శ్రీవచోఽంబామహాకాళిగా, సప్తపాతాళముల్ పాదపర్యంతముల్గాగ విశ్వంబునెల్లన్ ప్రకాశించు నీవిశ్వ రూపంబు వీక్షించుచున్నారమో హే పరాశక్తి ! హే వాసవీ కన్యకా ! నీ విరాడ్రూప మందుండి జ్వాలాసమూహాలనంతంబులై ప్రజ్వలింపంగ నీ విస్తృతాస్యంబులో జీవరాసుల్ ప్రవేశించు మొత్తంబుగా, విశ్వమాతా సమస్తాయుధంబుల్ ధరింపన్ పరాశక్తివై కోటిసూర్య ప్రకాశంబునన్, నాంత శీర్షంబులున్ వక్త్ర నేత్రంబులున్ బాహు పాదోరుజాలంబులన్ దుర్నిరీక్ష్యంబు నత్యంత భీతావహంబై, త్రికాలంబులన్ జూపు కాలానలాభోజ్జ్వలాభీలమైయొప్పు నీ ఘోరరూపంబు దర్శింపలేకున్న మమ్మేలు మోమాత ! మా తప్పులంబ్రోచి, మా ముప్పులంద్రోచి, నీ బిడ్డలన్ మమ్ముమన్నించి రక్షించుమో బ్రాహ్మశక్తీ ! నమస్కార మోంకారశక్తీ ! ప్రణామంబు హ్రీంకారమూర్తీ! జగన్మాత ! లోకైక నేతా ! నమో వేదవేదాంగ సిద్ధాంత సంపద్విభూతీ ! బృహద్భాను భానోష్షధీశౌషధీ దేవ దైత్యాది సృష్ట్యాదిమాతా ! నమో సర్వరూపా ! సముద్రాద్రి కల్లోలినీ భూమిరుట్ జంతు పక్ష్యాది జన్మాకరీ ! ఇట్టి నీ విశ్వరూపంబుఁ జూడంగ మాజన్మ ధన్యంబు శ్రీచక్రసంచారిణీ ! పాహిమాం ! రక్షమాం ! త్రాహిమాం ! మమ్ముదీవించి తొల్లింటి నీ భవ్యరూపంబు చూపించుమో సాధుసంత్రాణ రాజ్ఞీ ! నమో దేవదేవీ నమో వాసవీకన్యకామాత ! రక్షించు తల్లీ ! నమస్తే ! నమస్తే ! నమస్తే నమః ! 2467

తే.గీ. అట్లు భీతిల్లి దండకంబందు తన ని
జ స్వరూపంబుఁ బాడంగ సంతసిల్లి
కుసుమ సుకుమారమైనట్టి మిసిమిరూప
మందుఁ గాన్పించి కరుణించె నంబకన్య ! 2468

కం. అందరి నాకర్షించెడు
చందిరుకెనయైన కనుల చందనహాసన్
వందారు జనప్రియకర
సుందర రూపంబుఁజూచి సుడిగొని సుగతిన్. 2469

తే.గీ. భయరహిత శాంత చిత్తులై భక్త జనులు
సర్గ సహృదయానందాతి శయముతోడ
మంగళాకృతి కన్య న్నమస్కరించి
అంబ యాశీస్సులను గోరి రాత్మలందు. 2470

వ. అంతట ప్రసన్న చిత్తయైన భగవతి వాసవాంబ కరుణించి యాశ్రితుల నిట్లు దీవించె. 2471

ఉ. నాలుగు వేదముల్ చదువ, నాలుగు రెండుల యోగ సాధనన్
దేల, తపంబు ఘోరముగఁ దీర్చ, మహత్తర దానదీక్షలో
వ్రేల, ననేక సత్క్రతుల వేఁచగ నైనను నా దయార్ద్ర దృ
గ్జాలము సోకకుండ కనజాలరు నాదగు విశ్వ రూపమున్ ! 2472

ఆ.వె. పుణ్య భూమియందు పుట్టిన పుణ్యమో,
పుణ్య విశుల మధ్య పొలుచు ఫలమొ,
పుణ్యవంతులైరి పొడగాంచి, కాంచ రా
నట్టి దివ్య రూప మరసి మీరు ! 2473

తే.గీ. సహగమించెడు వారెల్ల సచివులగుచు
చూడ వచ్చిన వారెల్ల సుగతు లగుచు
చూడ రాకున్న వారును సుమతు లగుచు
భోగభాగ్యమ్ము లిహమున పొదలి రందు ! 2474

**ఇది శ్రీవాసవీపురాణమునందలి సర్వులకు వాసవీమాత విశ్వరూపదర్శనమనెడు ఎనుబదియైదవ అధ్యాయము సంపూర్ణము.**

(బెగ్గిలు= భయపడు, ప్రోథము= పిరుదు, త్రిధాముడు= అగ్ని, తార్తీయ= మూడవ, సంప్రహారము= గమనము, యాతువు= రాక్షసుడు, విదురుచు= తొలగించు)

## ఎనుబది యారవ అధ్యాయము

**కం. రక్ష మహా రూపాయై !**
**రక్ష మహా శక్తి ! రాజ రాజేశ్వర్యై !**
**రక్ష మహా పూజ్యాయై !**
**రక్ష మహా శక్తి రక్తి ! ప్రకటాకృత్యై !**

తే.గీ. అటుల ముని పల్కు దృశ్యమైనట్లు కనుల
ముందు కనిపించ వివశులై మునిని వేడి
రమల మౌనీంద్ర ! వారెంత అమృత మతులు !
అమరదా మాకు నాభాగ్య మనుచు విశులు ! 2475

తే.గీ. నగుచు ముని వల్కె ప్రియ వైశ్యనాథులార !
కలియుగంబున పుట్టుడీ కన్య తోడ
నభిమతంబులు సిద్ధించు ననుచు మునియు
చెప్పె నగ్ని ప్రవేశంబు చేష్ట దక్కి. 2476

తే.గీ. సర్వ జనులను చూచి వాసవి వచించె
నుతులు, జనులార నావెంట నూటరెండు
గోత్రముల పుణ్య దంపతుల్ కూడిరాగ
వహ్నిఁ జనుచుంటి నేటి మధ్యాహ్న వేళ. 2477

తే.గీ. సమిధలై దేహ కాష్ఠముల్ సమసినంత
నాత్మలన్నియు నాతోడ ననువుపడును
మణిపురంబున నల వేల్పు మాణికమున
శాశ్వతంబుగ నాయందు సంవసించు ! 2478

చం. అనవిని శ్రోతలెల్లరు నహా ననబోణిరా ! చంద్రకాంతికే
కనలెడు మేని మార్దవము గాఢ దురాసదు నెట్టులోర్చెదో?
కణకణ మండు మంటలకు కాయము నర్పణ మెట్లు చేసెదో?
చనియెడు మాదుప్రాణములు జ్వాలల దూకెదమన్నమాటచే ! 2479

ఉ. చూచితె, నీ మహత్వమును చూచియు నెట్లు వచించుచుంటిమో?
మా చిరు మానసంబుల నమాయిక వర్తన మిట్టులుండు, హే
మాచలవాసినీ ! సతము మా హృదయమ్ముల నిల్పి కొల్వగా
నీ చిరు రూపమొక్కటి పునీత మొసంగ ప్రసాద మయ్యెడిన్ ! 2480

వ. అని పరిపరి విధంబుల వేడ నా జగన్మోహినియును. 2481

వా. నా సమానంబు నంతకు మిన్నయౌ నా రూపము కానుపించు నే
నాసితార్చిం జ్వలించగ నగ్నియం దారూపము నాకు మారుగా
వాసవీ కన్యకా పరమేశ్వరీ వాత్సల్య వదాన్య సింధువై
దాసులై కొల్చువారిని బ్రోచుతన్ ధర్మార్థసకామముక్తులన్ 2482

కం. అంతట నా పౌరులు తమ
సంతస మెదలం ఘటించి శ్లాఘించుచునే
అంతటి జగన్నియంతవు
వింతకదా ! కోమటింట వెలయుట తల్లీ ! 2483

వ. అన నా జగదంబయు సంతసించి. 2484

తే.గీ. మున్ను భూమీస్పృశుల కెల్ల మూలమైన
గుహ్యకాంగనా రూపాన గోచరించి
నే సృజించిన దేవతానీకములను
విచయనంబొనరించిన విదుషి గాన ! 2485

తే.గీ. మహదహంకారమైన నే మనుట చనుట
నంతయును మాయ, లోక హితార్థ మేను
మొదట నవతరించిన కుల మిదియ గాన
నిందు నర్చావతారమై ఇరవు కొనుట ! 2486

తే.గీ. అనిన వినువారి కనుమాన మొనర వార
లడిగి రదియెట్లు జరిగిన దనఁగ దేవి
సృష్టి తొలుదొల్త జరిగిన రీతి వినిచె
నిటుల వినువారి చెవులకు నింపు గులుక. 2487

తే.గీ. సృష్టి తొలినుండియును మంచి చెడులు గలవు,
మంచి నిత్యమ్ము సత్యమ్ము మంగళమ్ము,
చెడు బలీయ మనిత్యమ్ము చెఱుపు చేయు,
సురలు మంచికి, చెడుల కసురలు ప్రతులు. 2488

కం. దేవాసుర యుద్ధంబున
దేవతలకు నస్మదీయ దివ్యాభయ వీ
క్షావిభవమ్మున గల్గె మ
హా విజయమ్మంత వారిహద్దులు చెఱగెన్. 2489

తే.గీ. ఓడిపోయిన దానవు లూర్ధ్వ మధ్య
లోకముల వీడి పాతాళ లోకమునకు
పారిపోయిరి, చిర ధర్మ బద్ధులైన
దేవతలు శక్తియుతులైన దీమసమున. 2490

కం. విజయ విపంచిక మ్రోసిన
నిజ శక్తుల మోహమంది నిర్జరులంతన్
సృజన పరిపాలనంబుల
నిజ బలములె కారణమని నిబ్బరమందెన్. 2491

చం. తనయుల దుర్నయంబులకు తల్లిని, బాధ్యత నాది కావునన్,
దనుజుల తీవ్ర వృత్తములు తాళిక మించినవై మనంబునం
దెనుముల క్రుమ్ములాటలయె నేమని చెప్పుదు? వీరినైన నా
కనయము నమ్రులై చనఁగ యత్నమొనర్చగ రావలెన్ గదా ! 2492

ఆ.వె. అవతరించితి మును యక్షిణీ రూపాన
కోటి చంద్రులొక్క చోట నిలచి
వెన్నెలలను గురియు వేదికైనట్టులా
దేవతలకు ముందు తేజమెలయ ! 2493

చం. అనిమిషు లట్టి తేజముల నక్షిపటమ్ములఁ గాంచలేక, మూ
యను కను తెప్పలేక, కరయామిక దూరిన దుర్నివారమై
చనిరి దిగంత దేశముల, చన్నను, కన్నదదేమిటో కనన్
వెనుకకుఁ జూడ భీతిలగ, విన్నన జేసితి నాదుతేజమున్. 2494

చం. చను సురలం భయంబులొక సారి నివర్తిల వెన్కఁ జూచుచున్
కనగల తేజమైనటులఁ గాంచుచుఁ గొంకుచుఁ జేరవచ్చుచున్
పెనఁగి రిదేమి వింతయని పెక్కు విధంబుల వాదులాడుచున్,
వెనుక, భరింతు వీవనుచు వేడిదొరం బనిపెం బరీక్షకై. 2495

కం. పనిచిన నగ్ని మనంబున
ననిమిషులందున తన బల మధికంబంచున్
పెనఁగొనె గర్వము నద్ది య
తని నడ బెడఁగుల ఫలించి తద్దయు నెగడన్ ! 2496

తే.గీ. వచ్చి నిలచిన వానిని మెచ్చుకొనుచు
నోయి నీవెవ్వడవు నీదు యోపికెంత?
చెప్పుమా మందలో నీవె చేవఁ గలుగు
వాడవా యేమి? యిటకేల వచ్చినావు? 2497

కం. అని యడిగితి నాతండును
ననలుఁడ, నన్నగ్ని దేవుఁ డందురు నేనీ
కనబడునంతయు భస్మం
బొనరించ గలాడ నంచు పొగరున్నిక్కెన్. 2498

తే.గీ. అతని గర్వంబునుం గాంచి స్మిత మొనర్చి
అగ్నిదేవుఁడనందువే యలవుఁ జూపి
అంటబెట్టుము చూతమటంచు ముందు
గడ్డిపోచను పడవేసి చూచుచుంటి ! 2499

చం. ఇదియొక లెక్కయా యనుచు నేచిన పౌరుషముప్పతిల్ల మో
మొదవిన మందహాసమున నుల్కము నూదిన లెక్క లేదు, లో
బెదరు జనింప, పట్టుదల పేరిచి విక్రమ ముజ్జ్వలింప మా
డదొక రవేనియున్, మడగె డాకయు నగ్నిముఖంబు మాడగా! 2500

వ. మాడిన ముఖంబున నన్నును తృణదళంబును మార్చిమార్చి చూచుచు సిగ్గుతోనతఁడు తిరోహితుడయ్యెను. 2501

కం. అంతట దేవేంద్రునకును
పంతము మెండాయె, పిల్చె పవన నిలింపున్,
వింతగ నున్న దదేదో
కాంతి రహస్యంబుఁ జూచి క్రమ్మఱు మనియెన్. 2502

తే.గీ. ఆతఁడును నన్నుఁ జేరంగ నరగలిగొని
అనలు గతిఁ గాంచియును నేత యానగాన
చేరవచ్చెను శంకలుసేయ పలికె
ప్రళయ ఝంఝులఁ బుట్టించు బల్లిదునని. 2503

తే.గీ. నవ్వు వచ్చె నతని వర్తనమును జూచి
గడ్డిపోచను చూపించి కదపమంటి,
నెంత యత్నించియును దాని నెత్తలేక
ప్రళయ ఝంఝుల మొనగాడు పారిపోయె ! 2504



కం. ఇరు యత్నమ్ములు చెల్లని
సురపతి యిక దిక్కులేక సురలందరితో
నరయగ వచ్చెను నాకడ
కరుదెంచిన గానసైతి నహమహమికకున్. 2505

తే.గీ. నేను కనరాక దిక్కులు నెమకుచున్న
దేవపతి చూచె తృణ మగ్నిదేవు వలన
నెత్తి చూచెను, కదలదు, మొత్తుకొనుచు,
గర్వమును వీడె తనపెంపు ఖర్వమనుచు. 2506

కం. పశ్చాత్తాపము నొందుచు
నిశ్చేష్టుండగు సహస్ర నేత్రుని గనుచున్
నిశ్చల చిత్రోక్తి పలికె
దుశ్చింతలు మాని దేవి దుర్గం గొలుమా ! 2507

తే.గీ. సూర్య శక్తిని గొని మనుజుండు పెరిగి
సూర్యు మరచిన విధముగా సోమపతియు
నా బలంబున విజయంబు నాచికొనియు
నన్ను మరచుట గమనించి నన్నుఁ దలచె. 2508

శా. హేయంబైన కృతఘ్నతాఘమును మార్జించంగ నిష్ఠించి నా
మాయా బీజమునం జపంబు సలిపెన్, మన్నింపు మంచున్, ననున్,
వేయింగన్నుల వేల్పు, జాలిగొని నేఁ బ్రీతిన్ గటాక్షించితిన్,
మాయా యక్షిణిగాగ చైత్ర నవమిన్ మాహేశ్వరీ భాసమై ! 2509

సీ. కాంతిరాశికి మధ్య కన్యకా రూపాన
దాసాన పూచాయఁ దాల్చి వెలసి
తలమీద నెలవంక తనరార నెలకొల్పి
మూడు కన్నుల సౌరు మోము నిలిపి

పాశాంకుశ వరదాభయ ముద్రలను నాల్గు
చేతులందున దాల్చి చెన్ను గొలిపి
విదితరూపము దాల్చి విశ్వసుందరినౌచు
నర్యసత్కులజాత నగుచు నలరి

తే.గీ. భక్త జన కల్పవల్లినై బాల నగుచు
ముగ్గురమ్మల శక్తుల మూలమగుచు
నరయ పొడగట్టి తద్ది నా యాది రూప
మదియ కారణంబగు నేటి అర్యజనికి ! 2510

ఆ.వె. వినుచు పౌరులెల్ల వినుతించె జగదంబ
వింత కథనమునకు వీనులొగ్గి,
వలయు హారతులిడి వాసవీకన్యకన్
వెలుగుఁ జేరుమనుచు వేడిరంత . 2511

***ఇది శ్రీవాసవీపురాణమునందు జగదంబ తొల్లి యక్షిణిగా జన్మించుటయను ఎనుబదియారవ అధ్యాయము సంపూర్ణము.***

(దురాసదుడు= ఆసితార్చి= అగ్ని, విచయనము= పరీక్ష, ప్రతులు= ప్రతినిధులు, కరయామిక= చేతులడ్డుపెట్టుటచే కలిగిన చీకటి, విన్నన= వివర్ణము, ఉల్కము= మంటలేని కట్టెనిప్పు, అరగలిగొని= సందేహించి, చిత్రోక్తి= ఆకాశవాణి)



# ఎనుబదియేడవ అధ్యాయము

**కం. కులసంకేత సుపాలిని !**
**కులామృతైక రసికా ! ముకుందా ! బాలా !**
**కులయోగిని ! ధృత కుండలి !**
**కులాంగనా ! నిత్య ముక్త ! క్రోధశ్శమనీ !**

వ. పౌరుల యనుమతి నొందిన పిదప వాసవీకన్యక వైశ్యలోకమునుద్దేశించి యిట్లనియె. 2512

ఉ. ఓ హితులార ! హోమిగమనోత్సవ శోభన వేళ తుష్టులై
దోహల పూర్ణ మానములతో నను వీడ్కొని సాగనంపుడీ !
కాహళ వేణుగానముల కంజభవాండము పిక్కటిల్లగా
సాహసులై చెలంగు డిది సావియె మౌన వ్రతంబునుండగా? 2513

తే.గీ. అనుచు సంకోచమున నున్న ఆత్మ జనుల
యందు నుత్సాహమును పెంచి, అనియె నిట్లు
అగ్నియందుండి కనిపింతు నమలరూప
మంది అర్చావతారంబనై భజింప ! 2514

వా. ఆ సమాహార రూప సమాహ్వయం బావైశ్య కులార్ణవంబు, శ్రీ
వాసవీ కన్యకా పరమేశ్వరీ వైశ్వానర శుభ్ర వర్ణమై
వాసికెక్కున్ భవాదృశ గోత్ర సంవాసుల్ కొలువంగ విశ్వతో
వాసమై, వాచ్యమై, వరదాయమై, వాసంత సమీరమై తగన్ ! 2515

తే.గీ. అనుదినంబును శ్రీ విద్య ననుసరించి
తమిని పంచాయతన దేవతలకు మధ్య
మంత్ర సహితమ్ముగా నాదు యంత్రముంచి
అర్చ నందుంచి వేదోక్తి నర్చనమున ; 2516

కం. నా మంత్ర జపంబున న
ర్చామూర్తిని షోడశోపచారంబుల పూ
జా మందిరమున కొలుచుచు
కామిత ఫలములను పొంది కాంచుఁడు సుఖముల్ ! 2517

ఆ.వె. లక్ష్మి గౌరి వాణి లాంఛనంబులు నాల్గు
చేతులందుఁ దాల్చి చిద్విలాస
మైన దివ్య రూపమైన గాని, ద్విభుజ
ప్రతిమయైన మీ సపర్య తగును. 2518

ఆ.వె. వత్సలార మీరు వైవాహికములందు
ధార్మికోత్సవముల తావులందు
వనములందు దివ్య వసుధా స్థలముల నా
పేర కలశముంచి కోరఁ దగును. 2519

తే.గీ. ఆలయంబుల నా దివ్య మూలరూప
మగ్ని చక్రంబునం గన్న యట్టిరూప
మును బ్రతిష్ఠించి పూజించు ముఖములందు
నిత్య మానంద తేజముల్ నెగడు గాక ! 2520

వా. దాసులై నన్ను నమ్మిన వారి కాధారాచలమౌదు నెప్పుడున్,
కాసులం బానిసల్ ననుజేర రే కష్టంబుల నొందకంచు శ్రీ
వాసవీ కన్యకా పరమేశ్వరీ వైశ్యాత్మజ సొంత వీటి క
భ్యాసమైనట్లు కాలిడె హవ్యభుక్ భట్టారక భీకరాట్టమున్ ! 2521



తే.గీ. జంకుచునె యజ్ఞబాహువు జగము తల్లి
కెదురుకోలిచ్చి పచరించె నేకపదిని
క్రమముగా మాయమాయె నా కమల నయన
తిరిగి రూపొంద సాగె నిందీవరాస్య ! 2522

సీ. లీలాశుకారూఢ నాళీక మొకచేత
వేద మంత్రార్థముల్ వినుచుచుండ,
వేదంబులొక చేత వేదాగ్రణీ హార్ది
కాశీస్సులం జగం బలచుచుండ,
అభయ హస్తంబునం దాపన్నులంబ్రోచి
భయము లేదని విధుల్ పనుచుచుండ,
వరద హస్తంబునన్ వరములం బ్రసరించి
కువలయంబున లేమిఁ గూల్చుచుండ,

తే.గీ. ధరణి హ్రీంకార వహ్ని మధ్యంబునందు
నెగడు తతదివ్య పద్మాన నిలిచియున్న
కన్యకార్చావతారంబుఁ గాంచి ప్రజలు
ధన్యులైనారు మోక్ష రాజన్యులగుచు. 2523

వ. అంతనెల్ల వైశ్యులును పురజనంబులఁ గూడి దివ్యమగు నా యర్చామూర్తిని మానసంబుల నిలుపుకొనుచు జయజయధ్వానంబుల గావించిరి. 2524

ప్రహరణకలిత. జయజయ జననీ ! జయ పరమఖనీ !
జయ శుక కమలా ! జయ నిగమ ధరా !
జయ అభయకరా ! జయ వరదకరా !
జయ విశులసుతా ! జయజయ జయధీ ! 2525

చం. జయజయ వాసవీ సహజ ! జాత్య గుణాకర ! జాతవేదసీ !
జయ నిజ జీవితాచరిత సంస్కరణోర్జిత ధీ విశాలినీ !
జయ పరమేశ్వరీ ! ముకుట చంద్రకళాధరి ! కన్యకామణీ !
నిజ కరుణందలిర్చి మము నిల్పుము నీ పదకంజ ధూళిగా ! 2526

ఆ.వె. అటుల జయలు వల్కు నాత్మ జనావళి
కిహము పరము లెల్ల నిచ్చి దేవి
అగ్నిఁ బడఁగ నామె యాజ్ఞకై చూచెడు
వారి ననుమతించె వహ్నిఁ జనఁగ. 2527

కం. విన్నంతనె వారును కను
సన్నల సంకోచమేది సంకల్పమునన్
తిన్నగ నగ్నులఁ జేరిరి
తిన్నని భక్తిని గెలిచెడి దీక్షాయుతులై ! 2528

తే.గీ. అంతలో వరుసగాఁ జేరె నాకసమున
విస్మయముఁ గొల్పు నెందుండి విడిదిసేసె
నో విమానముల్ దివ్యముల్ నూటమూడు
నిల్చియున్నవి హుతముల పిల్చునటుల ! 2529

కం. అగ్నినిఁ జేరిన దంపతు
లగ్నిచ్ఛటలందు నుండి యర్చిర్ముఖులై
భగ్నేహద ప్రత్యక్సం
లగ్నత యానంబులందు లంఘించిరదే ! 2530

తే.గీ. విశులతో మల్లాణుని జంట సుశిఖుఁ బొంది
దివ్య ధామంబుఁ జేరెను దేవియాన,
శిష్టులను జేర శూద్రుండు సేమమలరె,
పూల దారంబు మాన్యతఁ బొందు గాదె ! 2531

చం. హరి హర శంకరుల్ సతుల నాదటఁ జేరిచి, సర్వదేవతల్
తెరలిక చుట్టు చేరగను దివ్య పథమ్ముల నిల్చి వాసవిన్
విరుల పరామృతమ్ములను వేడుకఁ గొల్చుచు స్వాగతింప నా
చిఱుతుక హోమకుండమున శ్రీభువనేశ్వరియై బయల్పడెన్ ! 2532



వా. కాంచనాంభోజ పూతము వాసవీ కన్యామణి దివ్య రూపమున్
సంచితాంశాబలంబుల నెంచి ద్యోసద్బాంధవ కోటి ముంగటన్
పంచజన్యాంక శంకర కంజులన్, పద్మాలయ శక్తి వాక్కులన్
గాంచి క్రేగంటి చూపుల బ్రోచి చక్రాంతర్గత సీమకేగుచున్ ! 2533

తే.గీ. అభయ హస్తంబు చూపించి అమర వరుల
వందనమ్ములఁ జేకొంచు, వంశ మూల
ములను లోగొంచు హరివోలె మోక్ష మార్గ
మందు స్వస్థాన మునకుఁ బ్రయాణమాయె. 2534

***ఇది శ్రీవాసవీపురాణమునందలి వాసవీకన్య మహాప్రస్థానమనెడు ఎనుబదియేడవ అధ్యాయము సంపూర్ణము.***

(సావి= కాలము, యజ్ఞబాహువు= అగ్ని, పచరించు= చూపించు, ఏకపది= దారి, తెరలిక= గుండ్రంగా, పరామృతము= వాన, అట్టము= వేదభాగము, హింస)

# ఎనుబది యెనిమిదవ అధ్యాయము

**కం. శ్రీ మాహేశ్వరి ! ఈశ్వరి !**
**శ్రీమత్సింహాసనేశ్వరీ ! శాంభవి ! కు**
**శ్రీ మద నాశిని ! శ్రీకరి !**
**శ్రీ మణిపూరాంత రుదిత ! శ్రీశర్వాణీ !**

కం. జయ వాసవి ! జయ కన్యక !
జయ పరమేశ్వరి ! నమోస్తు ! జయ విణ్మాతా !
జయ జయయను వైశ్యులఁ గని
స్మయ సాలంకాయనుండు స్వామిని దలచెన్. 2535

ఆ.వె. వినుచు వైశ్య మునులు విన్న వాసవిగాథ
లోన లీనమగుచు మేను మరచి
జయలు వెట్టిరంత జగదీశ్వరిని జూచి
నటుల, తెలివి కలిగి నంత నీలి. 2536

చం. ముసిముసి నవ్వు మౌనిఁగని మోములు వాలిచి సైపుమన్నఁ దా
పసి పొరపాటు లేదు తమ పట్ల నొకింతయు, లీనమైరి, నా
కిసుము సమున్నతింగలిగె, నీ గతి నా కథ మీకు నచ్చె, నీ
వసుమతి దేవి పుట్టు కథ వట్టిది కాదని చెప్ప సాగినన్. 2537



కం. పులు కడిగిన ముత్యముల
ట్టుల వైశ్యులు కామి రాజెటుల స్పందించెన్,
నలినొప్పఁ జెప్పుమనఁగా
నలినజువలె చెప్పఁ దొడఁగె నిలుకడ పొనరన్. 2538

మ. మణిగుప్తాది మునీంద్రులార ! జన సామాన్యంబు యుద్ధంబులం
దున ప్రత్యర్థి బలంబు హీనమగు నందున్ దుష్టముఖ్యుండు పో
రున నంతంబగు నంచు నెంచు నదియౌ రూఢంబు, నిందిందు మా
రణమొందన్ రణమొందు లేదిది విచిత్రంబందు శూన్యాస్త్రమున్. 2539

ఉ. ఎంతకు వార్తలేక నట యేలిక కన్యక తోడి దూరమున్
చింతనఁ జేయరాక పలు చిత్తవికారము లేపుచుండ నే
ట్రింతకు వోలె నొక్కయెడ ప్రీతుఁడు గాక చరించు చుండియున్
కంతు పరాక్రమంబునకు క్రాగిన చిత్తము కాయమొల్లమిన్. 2540

కం. తనువున మనమున వలసిన
చనుమానము శూన్యమాయె, చనవును దొలఁగెన్,
వనచర జలచరముల భం
డనమును దలపించె నౌర డంబు చెడంగన్ ! 2541

ఆ.వె. పిలుచు మంత్రివరుల పిలిచితినా యను,
పనుచు పనులుచెప్పి పనిచితెప్పు
డనును, నెదియొ చెప్ప ననుఁగు పుత్రుని బిల్చు
పిల్చి యెందు కిచట నిల్చి తనును. 2542

సీ. పరిచర్యలొనరించు పరిచారికలఁజేరి
ప్రణయసల్లాపంబు రగులఁజేయు,
పెండ్లియైన సతులఁ బిల్చి దూషించుచున్
ఏది పన్నీరంచు నేవగించు,

చక్రవర్తులు మీకు చాగిలింత లటన్న
చట్టన వెనుదిర్గు చనవుమరచు,
విజయంబు మీకంచు విప్రులాశీర్వదిం
చగ వాసవీకన్య సాలుఁదీయు,

ఆ.వె. తనువు ముందు కేగ మనసు వెన్కకు నేగు,
తనువు వెన్కకేగ మనసు ముందు
కఱచు నెవరు లేక, నాలకించు నెవరొ
పిలిచినటుల, లోన కలచినటుల ! 2543

ఆ.వె. ఆకలనుచు లేచు నారగింపు డటన్న
నెవరి నుద్ధరింప నివి యటంచు
పారవైచు మరల ప్రాశనం బేదంచు
పాత్ర పగులగొొట్టి పరుగు లెత్తు ! 2544

ఆ.వె. అటుల పస్తులున్న అధినేతయొకనాడు
ఆవురావురనుచు నారగింప
నామతింపు ముందు నాపోశనము బట్టి
వాయి నీరు పొంగ చేయి వెట్టె. 2545

తే.గీ. పప్పు కూరలు పులుసులు పచ్చడులును
బూరె లరిసెలు బబ్బట్లు పూతరేకు
లూరుగాయలు వడియము లుబ్బు కుడుము
లఖిల భక్ష్యంబు లన్నంబు నందు గాంచె ! 2546

తే.గీ. ఆకలి రుచి యెఱుఁగ దనెడు నార్య వాక్కు
నిజము ఋజువర్తనుల యందు, కుజనులందు
కాక పోవచ్చు, కానిచో లోకపాలుఁ
డేల సందేహ పడును గడోల మెత్త ? 2547

ఆ.వె. పప్పు నేయి కలిపి భక్షింపఁ జిరుచేదు
తిన్నయట్లు మోము చెన్నుఁ దప్పె,
బూరె లరిసెలనుచు భుజియింప నంగిట
విషము పడిన యటుల వెఱ్ఱు లెత్తె ! 2548

ఉ. తిన్నది చేదు చేదనుచు తిన్నని వాడటు చిఱ్ఱు బుఱ్ఱులన్
కన్నులు రక్త వార్నిధులుకాగ చరించుచు నుండ రాణు లా
పన్న విపద్విషణ్ణులయి ప్రాశనమున్ తిని చూచి రయ్యెడన్
క్రన్నన దోషమెన్న పతి కామ విచారమె కారణంబయెన్. 2549

ఉ. ఎట్టులొ నన్న ప్రాశన ముగించిన భూపతి పవ్వళించినన్
కట్టెదుటం గనంబడె వికార విరూపము మృత్యు పాశమై
పట్టెను కంఠనాళమును, ప్రాణము పోయినదన్న భీతిచే
గట్టిగ కేక వైచె పురగహ్వరి భీకర కంపమొందగన్ ! 2550

కం. భూకంపము వచ్చినటుల
మై కంపము నొంది ప్రజలు మైకము నుండన్
లోకంబున వెలుగు పరచె
శోకంబున రాణువ పరిశోధన మునిగెన్ 2551

కం. మంత్రులు బంధులు రాణులు
మంత్రాంగము సలిపి రాజు మతి రప్పింపన్
తంత్రముఁ జేయగ తాంత్రికు
యంత్రించిరి తెల్లవారి నంతన యుక్తిన్ ! 2552

వ. అంతట తాంత్రిక గణమంతయు నొక్కటఁజేరి పరోక్షంబున రాజు పోకడలెల్ల గమనించి భూతంపు చెయ్యిదంబని నేటించి భూతతృప్తికై పశుపక్ష్యాదుల బలియిచ్చి వివిధ తంత్రంబులు సలుప. 2553

కం. భూతంబులు శాంతించినొ
వాతం బవరోహణమున వ్యాధుల్ చనెనో
చేతోభవు నిర్వీర్యమొ
నేత మతిభ్రంశమందు నెమ్మది కలిగెన్. 2554

కం. గ్రహణము విడచిన పిమ్మట
గ్రహరాజు వెలుంగు కరణి రారాజుండెన్,
గ్రహగతి క్షీణించిన ని
గ్రహమేల జనించు నతని కాయము నందున్ ? 2555

ఆ.వె. రాజు తేటి పూర్వ రాజ నైజంబున
కుటిల వైశ్య పురిని కుళ్ళగించ
ప్రతినఁ బూని లేచె, పరివారమును బిల్చె
చావు మూర్తమునకుఁ జనుడటంచు. 2556

***ఇది శ్రీవాసవీపురాణమునందలి విష్ణువర్ధనుని మనోవైకల్యంబను ఎనుబది యెనిమిదవ అధ్యాయము సంపూర్ణము.***

(ఈలి= సిగ్గిలి, సమున్నతి= గర్వం, చనుమానం= అనుబంధం, డంబు= ప్రతిష్ఠ, చాగిలింత= నమస్కారం, చనవు= అధికారం, గడోలము= కబళం, గహ్వరి= నేల)



# ఎనుబది తొమ్మిదవ అధ్యాయము

**కం. విజయా ! స్వాధిష్ఠానాం**
**బుజగత ! దంష్ట్రోజ్జ్వలా ! సుపూజ్యా ! ప్రష్ఠా !**
**త్రిజగద్వంద్యా ! యోగ్యా !**
**ద్విజబృంద నిషేవితా ! ధృతీ ! చిచ్ఛక్తీ !**

ఆ.వె. చావుమూర్త మెవరి చావుకై నట్టుల
తెలుపు మనుచు విశులు తెలిసి యడుఁగ
నవ్వుకొనుచు మునియు క్రొవ్వి చచ్చిన రాజు
కథను జెప్పె నొడలు గగురు పొడుప. 2557

ఆ.వె. విష్ణువర్ధనుండు విణ్మర్దనాకాంక్ష
పద్మ పురము నుండి బయలుదేరె
సైన్య బలము నందు చతురంగ బలములు
కూడిరాగ, పురము కొడుకు చూడ. 2558

ఆ.వె. పట్టపేనుగెక్కి పరిచారకులు కొల్వ
వంది మాగధ కయివారములకు
శిరము నూపుకొనుచు చిప్పిల్లు ఠీవితో
కదలినాఁడు ప్రభువు కదనమునకు 2559

తే.గీ. మంత్రి సామంత నివహ నిమంత్రణమున
సర్వ సంబారములతోడ చమువు కదలె
దివికి దండెత్తు రక్కసి తిట్టవోలె
నల్ప ప్రాణిపై బ్రహ్మాస్త్ర మనిచి నటుల ! 2560

కం. వేకువ కదలిన బలములు
కాకవెలుం గుదయమందు కాలంబునకే
తాకెను భగ్న పురంబును
తాకిన భగ్నమగునంచు తలపడు శిరమున్ ! 2561

ఉ. ఎంతటి వారికైన యము నీంద్రము ముందు నెటింగె నేని లో
వంత ఘటించు, చేయు వరివస్య విఘాతము నిత్యమౌను, దే
హాంతర చింత క్రమ్ముకొను, నట్టిది పూర్వ భవంపు కర్మచే
పొంతనమౌను గాని, శరుపొంతన సాధ్యమె భూస్పృశావళీ ! 2562

తే.గీ. ఆత్మఁ బరికింప శకునమ్ము లర్థమగును
నిర్మలంబైన ముకురంబు నీడఁ జూపు
మలిన దర్పణ మయ్యాత్మఁ దెలియు టెట్లు
శకునముల భాషలోన దుశ్శకున భాష ? 2563

ఆ.వె. ఎన్ని చదివి యేమి? ఎన్ని జయములంద
నేమి మూర్ఖతత్త్వ మెక్కినపుడు
బొమ్మకైన పుట్టు రిమ్మతెవులు, చక్ర
వర్తి యెంత విశ్వ మూర్తి ముందు? 2564

చం. కుదుపున కాఁగి యుండఁ బెనుగొండ పురంబున నుండి సేవకుల్
వడివడి నేగుదెంచి తమవల్లభు ముందట నిల్చి గుండియల్
దడదడలాడుచుండ, ధనదాయి క్రుధాహత పల్లవంబులై,
తడబడు నోటిమాట త ద తాయన, మాటలురాక యుండినన్. 2565

ఆ.వె. ధవుఁడు వారి లోని తడబాటు గమనించి
సందియమ్మునొందె సరసిజాక్షి
కేమి జరిగెననుచు నేమేమొ యోచనల్
మూగుచుండ మనము మూగబోయె ! 2566

తే.గీ. ఏమి జరిగెను? వాసవి కేమి జరుగ
లేదు కదయంచు, కోమటీండ్లే యనర్థ
మునకుఁ బాల్పడి నారంచు మోము వాల్చి
నిల్చి యున్నట్టి భటుల విన్పించు మనియె. 2567

వ. ఇంకనుభయపడుచున్న భటులనుగాంచి యోరీ ! మీకెట్టి భయమును లేదు, జరిగినవిషయమంతయు చెప్పుడు విందునన వారును. 2568

సీ. వాసవి పెండ్లని వాడవాడల పెండ్లి
పందిళ్ళు వేసిరంబరముఁగప్ప
పట్టణం బూడ్చిరి పన్నీరుఁ జల్లిరి
ముత్యాల వరుసల ముగ్గులిడిరి
నవరత్న హారముల్ ననుబొప్ప పందిళ్ళ
తోరణంబులు కట్టినారు వేడ్క
నృత్య గానాదులన్ నిత్యంబు హత్తించి
విశులు రసికులన్న విలువఁ గనిరి

తే.గీ. అనుచు జరిగిన విషయంబు వినుచు నెడల
నడుమ నెందుండి వచ్చెనో పిడుగు వోలె
రాట్పురోహితుఁడౌ ధౌమ్య ప్రాజ్ఞ వరుఁడు
రాజ ! యెచటికీ మితిలేని రాణువనుచు. 2569

కం. ధౌమ్యుని చూచిన రాజుకు
యామ్యాధిపుఁ జూచినట్టు లదలిక కలుగన్
గమ్యము ముందుగఁ దెలుపని
కామ్య గ్రహ దోషమునకు కళవళ పడియెన్. 2570

శా. రాజా ! దిక్కులు చూతువేల? నిను, నీరాజ్యంబు రక్షింప నే
యోజించన్ ఫలమేమి నీ విటుల నా యోజన్ సురాళించ, నే
రాజన్యుల్ నను సంప్రదించకయె కర్తవ్యంబు సంధించిరే
నీజాతిన్? నను నుజ్జగించితివి నే నీరాజ్యమున్ వీడిపోన్ ! 2571

ఆ.వె. అనుచు మందలించ నయ్యెయో మీపట్ల
పేర్మికలదు, మించి ప్రేమ కలదు;
గురువు వినఁగ రాని గోప్య కార్యంబౌట
చెప్పలేదు తప్పుఁ జేసితార్య ! 2572

కం. అని వినయంబునఁ బలికిన
జనవరు హితమెఱిఁగి నట్టి శాస్త్రయు నౌటన్
వెనువెంట జరుగు ఘోర మ
పనయించగ యత్నమూని ప్రకటించె నిటుల్. 2573

ఆ.వె. దండు కదలినట్టి ధారిక సరికాదు
మృత్యు గండమున్న మూర్త మదియ
కాల సర్ప మదియ కబళించు నిన్ను నీ
సేన తోడ నిజము సేవ్య వరుఁడ ! 2574

ఆ.వె. వినుచు నగుచు విభుఁడు వింతగా వర్తించి
లగ్నబలమ యనుచు లఘిమఁ గొనుచు
పిచ్చి బాపనయ్య పుచ్చె నీ శాస్త్రంబ
టంచు చులుక చేసి అనియె నిటుల. 2575

ఉ. పోవుట వైశ్య పట్టణము పోరుట కాదది యాక్రమించుటే
పోవును వారి ప్రాణములు పోటరి సేనలఁ జూచినంతనే !
కావుము కావుమంచు నిరు కాళులఁ బట్టి శమింప వేడరే ?
పోవునదెల్ల శూన్యమిక పోవున దేమి మహాత్మ చింతిలన్? 2576

ఆ.వె. విగ్రహమున గాదె విజయం బవిజయంబు
తులకు వణకు వారు త్రోపు నిలచి
నన్ను తాకుటన్న నవ్వదా జగ మిక
శాస్త్రములను దాచు సంచిలోన. 2577

వ. అనుచుఁ దన శాస్త్రంబును లెక్క సేయని రాజ దర్పంబునకుఁ గినిసి శస్త్రంబుల
బలం బల్పంబుగా నిరూపించుచు నిట్లనియె. 2578



కం. శాస్త్రంబుల కాదనుచును
శస్త్రంబుల నమ్ముకొన్న శస్త్రాస్త్ర బలా !
శస్త్రాస్త్రంబుల నిర్మితి
శాస్త్రోక్తము గాకయున్న శక్తుల్ కలవే ? 2579

ఆ.వె. క్షాత్ర శక్తి కన్న సౌత్ర శాంతము మిన్న
అంతకంటె మిన్న ఆర్యవైశ్య
దానశీలమెన్న దానితో పోరాడ
గలవె రాజ? హీన గతులు మనవి. 2580

ఉ. ఈ గతి శస్త్ర గర్వమున నేలెద నీ ధరణీ ప్రదేశమం
చేగుట చేతనే ప్రవర మీగతి ముక్కలు చెక్కలై అనం
తాగమన ప్రవేశమున నస్త్రముఁ గల్గెడు వారు రాజులై
సాగిరి, స్వార్థ చింతనకు సాగిలి మ్రొక్కిరి నీదు పెద్దలున్ ! 2581

మ. వ్యవసాయంబున క్రిందు మీదులగుచున్, వ్యాపార రంగంబునన్
జవ సత్త్వంబుల నొడ్డి పాటుపడుచున్, జాతిన్ పయోధారలం
దవిరామంబుగ ప్రోది వెట్టు విశులే యానీత కోపోద్ధతిన్
కవియన్‌జేతులుచాలు, నవ్వియును లేకంజేతు రాత్మాహుతిన్ ! 2582

ఆ.వె. దాన శూరులైన దాతలు లేకున్న
ధరణి క్రుంగు నిజము, తైల మడఁగ
నారిపోవుదీపమగును లోకస్థితి,
జగతి లేదు, లేదు చక్రవర్తి ! 2583

చం. వినివిని రాజరాజు కడు వేడుక కైవడిఁ జూచి వాకొనెన్
చనవున తప్పు చేసితిని సత్యము భూసురవర్య నన్నికన్
నెనరుఁ దలిర్చి దీవనల నిల్పు మనుగ్రహ మున్న, లేనిచో
వెనుకకుఁబొమ్ము నాపదము వెన్కకుమళ్ళదు, ఎంత తిట్టినన్. 2584

వ. అనుచు తిరస్కరింప పురోహితుండగు ధౌమ్యుండునిట్లు యోచించె. 2585

కం. పొంచిన మృత్యువు చెఱ త
ప్పించగ నెవ్వరికి చెల్లు ప్రియ గురుఁడైనన్
కొంచక కను మెఱుగక కు
ప్పించెడు మూర్ఖుని నిలుపగ పేదకు వశమే ! 2586

ఆ.వె. రాజు చావు నెఱిఁగి రక్షించు టెట్టులో
తెలిసి యుండగలడె తెలియనటుల,
తెలియఁ జెప్ప వినఁడు తెలియ మక్కువ లేదు
దేశికునకు నేది దిక్కు చెపుమ ! 2587

వ. ధర్మాత్ముండును, పాండవ శ్రేష్ఠుండును నైన యుధిష్టిరుండు తమ కుల గురువులుగ నియమించిన తమ వంశంబున నింత దనుక నెవ్వరికిని నిట్టి ధిక్కార మెదురు కాలేదీ దినమిట్లవిధేయత ప్రాప్తించెనే యని మనమున గుములుచును తన ధర్మంబు నెరవేర్చుట కర్తవ్యంబుగాఁ దలచిన ధౌమ్యుండు రాజు నుద్దేశించి యిట్లనియె. 2588

ఉ. ధర్మము నేలుమయ్య ప్రతిదారణ మానుము, గూఢచారులన్
మర్మము పృచ్ఛసేయకుము, మాట వినంగ శుభంబగున్, మదిన్
నర్మ విచారముజ్జనమునన్ నను మంచుము, లేకయున్న నీ
కర్మ మికేమి సేతు నరి కర్షువు నిన్ను దహించి వేసెడున్. 2589

కం. అని వెడలెడు పౌరోహితుఁ
గని పోపొమ్మనుచు రాజు కల్లోలుండై
పెను హాసం బొనరించెను,
శని సోదరు పాశమునకు శాంతుల్ గలవే ! 2590

***ఇది శ్రీవాసవీపురాణమందలి ధౌమ్యవచన తిరస్కారమను ఎనుబదితొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము.***

(ధనదాయి= అగ్ని, సురాళించు= నిర్లక్ష్యముచేయు, ధారిక= ముహూర్తము, సేవ్యుడు= రాజు, అనంతాగమనులు= మహీసురులు, కర్షువు= పిడకనిప్పు, కల్లోలము= సంతోషము.)



# తొంబదియవ అధ్యాయము

**కం. శాంతా ! విశ్రాంతి మయీ !**
**కాంతిమతీ ! నిష్కళంక ! గగనాంతస్థా !**
**కాంతార్థ విగ్రహా ! బిస**
**తంతు తనీయసి ! కళావతీ ! శిష్టేష్టా !**

కం. అని సాలంకాయనుఁడన
విని వైశ్యులనిరి హితోక్తి వీనులఁబడునే ?
కనక గిరీశ్వరి వచనం
బనృతం బగునే మునీంద్ర ! యనముని పతియున్ ! 2591

కం. ఎప్పటిదీ వైరం బిం
కెప్పటికిం దీరు కామి కింతుల యావల్ ?
చెప్పెను వాల్మీకి మునియుఁ
జెప్పెను వ్యాసుండు నేడు చెప్పుచు నుంటిన్ ! 2592

తే.గీ. బ్రాహ్మణుఁడు క్షత్రియంగోరి ప్రాణమిచ్చె
క్షత్రియుఁడు బ్రాహ్మణిం జేరి క్షాత్రముడిగె
నేడు క్షత్రియుం దర్యజ తోడుఁ గోరె
నేమి కోల్పోవునో కదా యింకమీద ! 2593

చం. వెడలు పురోహితుం గనుచు విస్మయ మొందుచు నీతఁడా ననుం
బడవకు పొమ్ము పోవలదు బ్రామిక కూడదటంచు చెప్పు వాఁ
డడిగిన దెవ్వరో యితని నంచు గొడంగు మహీశుఁ జూచుచున్
చిడిముడి తోడ బ్రగ్గడ వచింపఁ దొడంగె నహీన ధీరతన్ ! 2594

కం. ఈలో నాతఁడు చారుల
నాలోచించెను నిజంబు నాఁకట్టెను రా
జాలోకనమున కందని
కాలీచిని; నెఱుఁగ నట్లు కఱదలు వలికెన్ ! 2595

కం. పథ్యము నొల్లని రోగికి
తథ్యము మరణంబు రాజ ! తప్పకఁ గొను మా
తిథ్యము పెనుగొండ నగర
రథ్యల ననురక్తిఁ దీరు రామాసక్తిన్ ! 2596

వ. మంత్రి మాటలకు త్రుళ్ళిపడిన విష్ణువర్ధనుఁడు రూక్ష కషాయిత లోచనంబుల
కోపంబుఁ బ్రకటింప నతడును. 2597

ఉ. ఔ నతగాఁడు బ్రాహ్మణుఁడు నగ్రకులోద్భవుఁడుం బురోహితుం
డానతిసేయ నీవు నిసుమంతయు జంకవు స్వీయ వాంఛకున్
సేన సమస్త మాహుతిగ సేతువు, మంత్రుల మాట బూటకం
బౌను వినంగ నింక ననౌనది యేమది పాటు కాదొకో ! 2598

ఆ.వె. ఉప్పు తిన్న తప్పు ముప్పుగా పరిణమిం
చినది నేడు కాదు మునుపు కూడ
భీష్మ ద్రోణు లపుడు భీకరమ్ముగ పోరి
యమునిఁ జూడలేదె, అంత కాదె ? 2599

ఉ. ఏమును నింతదాక భవదీయములైన వితండ వాదముల్
కాముక చర్చలన్ వినుచు కాలము పుచ్చితి మింక మీద మా
రాముల పొంతఁ బోము, మము రామల దూరము సేయకయ్య నీ
రామకు నీకు దండములు రామరసాకృత సాయకాహతా ! 2600



వ. అని వచింపుచుండ నవ్విష్ణువర్ధనుండు ద్విగుణీకృత మూర్ఖత్వంబున హత
భుజంగముం బోలె బుసలు కొట్టుచు. 2601

ఉ. పొందిర పొందిి మీకసలు పోడిమి లేదు వచింప, శత్రులన్
చెందిన చేతులా యవి యచేతన మెక్కిన కట్టెలా ? మొనల్
పండిన బుఱ్ఱలా యవి విపంచిక నూగెదు పాములా ? బిడెం
బుండిన రండు లేదనిన పొందు యముం దెరలించు చోటికిన్. 2602

కం. అని కోపోద్రేకంబున
నని పండిత వరులఁ దిట్టి యలసిన యంతన్
మనుగడ కోరిన యెడలన్
మన చారుల వెనుక కంపి మగుడుమనె విభున్ ! 2603

తే.గీ. వల్లభుండంత మంతిరి వైపుఁ గనక
పోవువాఁడవు పోకుండ పుయ్యిలోట
లేల పొందెదు పోపొమ్ము, పాల ముంత
వనుచుఁ దలచితి నీట ముంచినది చాలు. 2604

వ. అనుచు దెప్పిపొడువ నమ్మంత్రిపుంగవుండును చిరునగవు నణచుకొనుచు.

తే.గీ. రాజ ! విష్ణువర్ధన రాజ ! రాజ తిలక !
సుజన పరిపాల ! సుగుణాబ్ధి సోమ వినుమ !
మరల చెప్పుచుంటిని సంతు మంచి కోరి
పట్టు వీడుమ మరలుము పడఁతి వీడి ! 2606

ఉ. ఎందుకు చెప్పెనో విను మహీసుర నేపుడు యామ్యగండమం
చెందుకు నాదు మానసము నీవిధి వెన్కకు లాగు చుండెనో
డెందము నందు చారకుల డిల్లము నుంచుము, చిత్తగించుమా !
చందురుఁడైన పట్టుఁబడు చాలని రాహువు విక్రమించినన్. 2607

ఆ.వె. కాల మెప్పు డొక్క కరణి నుండదు దుష్ట
కాల మొక్కటుండు కాటు వేయ
తెలిసి కాటునొంద తెలివైన పనికాదు
తప్పుకొనుటె తెలివి తరుణి వటము. 2608

తే.గీ. వటము కాలంబు మించిన బారు కత్తి
కత్తి వాదర మృత్యువు కఱకు నాల్క
నాల్క రక్తంబు నూద్చు ననంత శస్త్ర
మద్ది దైవోపహతులకు నంతిమమ్ము. 2609

తే.గీ. కుల పురోహితుఁ గాదని కులములోని
రాజులెవ్వరు కలనుకు రారు ముందు
చెప్పి వచ్చిన వారిలో చెడిన వారు
లేరు, లేరను మాటకు తగవు లేదు. 2610

వ. అంతయును వినియును చారులను పిలిచి విషయంబు తెలుపుమన వారును మంత్రి ముఖంబును గాంచి సన్న మాత్రంబునఁ జెప్పనొల్లక. 2611

తే.గీ. ఏమియును లేదు మా సార్వభౌమ ! మముల
నేలు దొరవంచు నెంచి మీ మేలు కోరి
నుడువ కున్నాము, క్షమియించి విడిచి పెట్టి
బ్రతుక నిమ్మంచు వేడుదు మతుల తేజ ! 2612

తే.గీ. వలయు ప్రత్యుత్తరము రాక వల్లభుండు
కండ్ల నిప్పులు రాల్చుచు కత్తి దూసి
చెప్పుడిక చెప్పకున్నచో చెండి వైతు
ననఁగ కంపించుచునె వారు ననిరి యిట్లు. 2613

ఆ.వె. ఆర్య ! పెండ్లి పనుల నానందముగఁ జేసి
ఆర్య వైశ్యులెల్ల రాలయమున
కూడి మాటలాడు కొనిరందు నేమియో
నిర్ణయములఁ జేసి నిర్గమించె. 2614

ఆ.వె. సంబరంబులందు చనుచుండె దినములు
శాంతి మీర నెట్టి శంకలేక,
తమకు వార్త నంపు తరుణంబు కోసమై
వేచియుంటి మయ్య విభువరేణ్య ! 2615

కం. నిన్నటి దినమున వారలు
మిన్నంటిన భేరికాది మేళమ్ములతో
క్రన్నన వేడుకగాఁ జన
వెన్నంటితి మయ్య పెండ్లి వేడుక యనుచున్ ! 2616

చం. చనిచని గుంపులోనఁబడి చల్లగ మాటలు వింటిమయ్య వా
నిని వినిపింతుమయ్య తన నీడను సైతము తాకలేడటం
చును మిము నాడిపోసెనట సుందరి వాసవి, వారి వేగముల్
గన ననుమానమయ్యె కనుగప్పుచు నూపిరు లార్పుకొందురో ! 2617

కం. వెనువెంటనె తమ దరిసెన
మునకని పరుగు లిడితిమి తమోఘ్నుని యానన్
చనవలద య్యావలనుకు
చని, కొను లాభమ్ములేదు చల్లని తండ్రీ ! 2618

కం. అన నారాజనె నింతకుఁ
జనవలదను కారణంబు చాటున నుండెన్
సనిఁ జెప్పిన నెడఁద నిడుదు
చనియెద తప్పిన మిమ్ము చంపెద ననఁగన్. 2619

కం. చంపిన చచ్చెదమివి మీ
పెంపున పెరిగిన తనువులు, పెలుచనఁ బోకన్
చంపుడు మున్నే, మునుఁ జన
ముంపుకు గురి యౌదురయ్య మునుకొను నగ్నిన్. 2620

ఆ.వె. అనఁగ నృపతి కనలె నందరు నొక్కటై
చావు చావు అనుచు చావు జపముఁ
బూనిరా ! యిదేమి భూమిస్పృశులఁ జూచి
భయము పుట్టె నేమి భ్రష్టులార ! 2621

వ. అనుచు వలదు వలదనెడు వారల లెక్కఁగొనక నగ్ని ముఖంబునకుం జను శలభంబు పగిఁది నొక్కుమ్మడి నొంటిఁ బెనుగొండ పురంబు దెసకుం జనసాగె నంత మంత్రి సామంతాదులును వాని బిరుంద నల్ల నల్ల జనసాగిరి. 2622

***ఇది శ్రీవాసవీపురాణమునందలి విష్ణువర్ధనరాజు తన మంత్రి చారులహిత వచనంబులను గాదని ముందుకు చనుటయను తొంబదియవ అధ్యాయము సంపూర్ణము.***

(పడవ= యుద్ధము, బ్రామిక= కోరిక, కాలీచి= విచారణ స్థలం, కఱదలు= బుద్ధులు, పుయ్యిలోట= సంకోచము, నేపుడు= పురోహితుడు, వటము= త్రాడు, సని= ప్రకాశముగా)



# తొంబది యొకటవ అధ్యాయము

**కం. శాంకరి ! కనత్కనక తా**
**టంకా ! నిష్కారణా ! మృడానీ ! సాధ్యా !**
**హ్రీంకారీ ! శ్రీదుర్గా !**
**క్లీంకారీ ! దుఃఖ హన్త్రి ! లీలా లోలా !**

తే.గీ. జరుగఁ బోయెడి విషయంబు నెఱిఁగి యుండి
సంభ్రమమ్మున దోగు వైశ్యప్రవరులు
నింతఁజెప్పిన విననట్టి వింతపశువు
చచ్చె నెవ్విధి యనజెప్పె సంయమియును. 2623

కం. ఎవ్వరి మాటలు చెవినిడ
కవ్విభుఁడు పురంబుఁ జొచ్చె నసురాస్త్రుఁడై
దవ్వుల నటగాయకులును
మువ్వలనుల నిల్చియంత మ్రొక్కిరి భక్తిన్ ! 2624

సీ. రాజు ముందుకు నేగ రాజమార్గంబునన్
వ్రాలి రమ్మని వేడువారు లేరు
వంది మాగధుల కైవారమ్ములను వించు
వాల్లభ్యమును గాంచువారు లేరు
కవిగాయకాదుల కవనగానమ్ములన్
వర్ణించి తోషించు వారులేరు
నటనటీ బృందముల్ నాట్యముల్ చేయంగ
వానికి తలలూచువారు లేరు

తే.గీ. నగరమంతయు నొక మసనమును బోలి
కానరాఁ డొక్కరుఁడును స్వాగతము పలుక
పారిపోయిరొ తనతోడ పోరవెఱచి
కోమటులు పిఱికివాండ్రను కొనుట నిజము ! 2625

ఉ. ఇంతటి వీరులంగనుచు నెంత భయంబు ఘటిల్లె నందరన్ !
చెంతకు రా మృగేంద్ర కిటి సింధుర చండక భల్లుకాది ప్రా
ణాంతక హింసకంబులును నానన వాలములన్ డిగించు న
న్నంతటి వారలా యిటులనంత భయానల కీలలంటుటల్ ! 2626

వ. అనుకొనుచు సేవకుల నదలించి నలువీధులఁ దిరుగుచునున్న యంత నొక్కచో నొక్క కాపు యువతి జరిగిన దానికి రగులుచు రాజును గన్నయంత కోపంబున జ్వలించుచు నిట్లనియె. 2627

ఉ. పొట్టను బెట్టుకొంటివిర పోఱిని, మా పెనుగొండ కౌముదిన్,
పట్టణ పుణ్యపేటికను; పాపపు కొండకు గడ్డపాఱ నీ
పెట్టిన కంతులోపలనె పేయువునంబడి యెట్టకాక నీ
గిట్టుముహూర్తమై నిలచె గెంటుము దేహము దానిముంగిటన్. 2628

కం. అనవిని యనుమానంబున
ననుజీవ్యుఁడు భటునిబంపి యగ్నిముఖుని దె
మ్మనియెను, తెచ్చినయంత వి
శుని సుత నడుగంగఁ జెప్పె సూనృతుఁ డగుటన్. 2629

ఆ.వె. ప్రభువు రాకనెఱిఁగి పావకున్ బ్రతిమాలి
ప్రాణముల లయించె ప్రవర కొఱకు
నూటరెండుగోత్రు లోటలేకయ వాస
వీ కుమారిఁ గూడి వేలిమిఁబడి. 2630



ఉ. వాసవి యందచందములు వహ్నిని జేరి నిరర్థకంబులై
మాసె నటంచు విన్న నృపమందుడు గుండెల బండ పడ్డటుల్
గాసిలె నంతలోన తలకాయ వడంకెను నెత్తిపై శిలా
ప్రాసము గ్రుచ్చినట్టులయి ప్రాణముపోయెదునంచు నేడ్చుచున్. 2631

కం. బరువెక్కిన తలకాయకు
బరువులు మోటించు నేస్గుపాదము తలపై
బరువుగనుంచగ తలపడు
పరువునుబోనాడె రాజు ప్రాణభయమునన్. 2632

తే.గీ. కూటముగ నా వినీతులు నూటరెండు
గోత్రములవారు తనుజూచి కొక్కరించు
నటుల, నట్టహాసముల నహ్హాహ్హా యనుచు
వెంట పడినట్లు తోపఁ దా వెనుక జూచు. 2633

ఆ.వె. వందిమాగధులును పరివారమును చేరి
విభుని చుట్టుముట్టి వింతజూడ,
కోతులాడువచ్చి కోతినాడించెడి
తీరు తోచి ప్రజలుచేరినారు. 2634

ఉ. బాధ భరించలేక పెనుబాముకు వోలె విచిత్ర రీతులన్
క్రోధప్రచోదితంబగుచుఁ గొంకున మల్లడిఁ గొంచు కేకలన్
రోధము ముట్ట గొల్లుమన రోదన విన్న జనంబులోని వై
బోధికుఁడుం గరంగె, భవభోగిని చిత్తమునుం గరంగెడిన్. 2635

తే.గీ. సార్వభౌముని సారమ్ము సర్వముడిగి
చావు వాకిట పడియున్న సమయమందు
అష్ట భుజముల తోడ శస్త్రాస్త్రములు ధ
రించి కాళికా మూర్తి కాన్పించె నింగి. 2636

తే.గీ. దుర్ని-రీక్ష్యంబు క్రోధానలాతిశయము
కాళియొకసారి, వాసవీ కన్య ముగ్ధ
మోహనాకార మొకసారి మ్రోల నిలచి
చలన చిత్రమా యనఁ దోచె చతుర గతుల.
2637

ఉ. అంతటి వీర విక్రమ నిరంకుశ సైన్య సమేతుఁడైన ది
గ్దంతి, దినేశ చంద్రులను దాపల వెల్పల కట్టగల్గు సా
మంతుఁడు వజ్రఘోషమును మారిప్రహాసము వించు మస్తకం
బంత ఫెటీల్ ఫెటీల్మనుచునంశువులాయె జనంబుమూర్ఛిలన్. 2638

తే.గీ. మంత్రి సామంత నాయక తంత్రమెల్ల
శిలల వలె ననిమిషులైరి చిత్రపటము
విధము, చలచిత్రమాగిన విధముఁ జూడ
నధిపు పాట్లెల్ల కనులార నరయుచుండి. 2639

ఉ. ఎంతటి యుద్ధ రాక్షసుఁడు ! ఎందరు యోధుల యుద్ధభూమిలో
నంతము చేసెనో తుద కనంతలయున్ వలయంబు నందు ప్రా
ణాంతక మారణంబునకు నర్పణ మాయె విధిన్ జయింపగా
నెంతటి వాఁడు మానవుఁడు యెంత నియంత జనాంతుఁడిమ్మహిన్ !

ఉ. అందరు చూచుచుండ వసుధాధిపు పార్థివ దేహమందు రూ
పొందిన వెల్గుదివ్వె పొలుపొందుచుఁ బొంగుచు నల్లనల్లనన్
సుందరి కన్యకాంబ వర సువ్రత పాదములంటి లీనమై
పొందెను శాశ్వతత్వమును పూజ్యపురాతన పాదమానుచున్ ! 2641

తే.గీ. దివ్వె వెనువెంట నడచిన దేవరాభి
జనము వాసవీకన్యక చంద మరసి
అమ్మ పాదాల ముందు సాష్టాంగపడిరి
దేవి యర్చా స్వరూపంబు సేవఁ గొనిరి. 2642

శా. అమ్మా వాసవి ! ఆదిశక్తి ! అమలా ! ఆనంద సంధాయినీ !
కొమ్మా కోటి నమస్కృతుల్ మముల చేకొమ్మా త్వదీయాంకమం
దిమ్మా చోటొక యింత, మా ప్రభువునం దేనస్సు సైరించుమా !
మమ్మీపాపమునుండియాదుకొని మా మానంబుఁగాపాడుమా ! 2643

కం. తప్పని చెప్పితి మమ్మా
తప్పని స్థితిలోన వాని దాసులమై మా
కొప్పని పనిలో దూరితి
మప్పాపము నంటనీక నరయుము తల్లీ ! 2644

ఆ.వె. ఒక్క తప్పుతోన నొడయని ప్రఖ్యాతి
దూరు వడియె పరమ దుష్టమాయె,
నిండు పాల కుండ నిదబిందు వొక్కటి
చాలదే సమీహ సమసి పోవ ! 2645

వ. అనుచు పరమేశ్వరికి ప్రణమిల్లి జరిగినదంతయును వెంటనే యువరాజునకుం దెలియజేయుటకు వేగవంతమైన నాశ్విక దళంబును బంపి రాజదేహంబునకు రక్షకులై నిలిచిరి. 2646

***ఇది శ్రీవాసవీపురాణమునందు విష్ణువర్ధనునిశిరంబు వ్రక్కలగుటయను తొంబదియొకటవ అధ్యాయము సంపూర్ణము.***

(అసురాస్త్రరుడు= ఏనుగుపై ఆసీనుడైనవాడు, హింసకము= క్రూరమృగము, పేయువు= అగ్ని, అనుజీవ్యుడు= రాజు, అగ్నిముఖుడు= బ్రాహ్మణుడు, వినీతులు= వైశ్యులు, రోధము= తీరము, వైబోధికుడు= కాపలివాడు, భవభోగిని= పరమేశ్వరి, సామంతుడు= సమర్థుడు, మారి ప్రహాసము= ఆదిశక్తి అట్టహాసం, అనంతలయుడు= శివుడు, జనాంతుడు= యముడు, పూజ్య పురాతన= ఆదిశక్తి, ఏనస్సు= పాపము, నిదము= విషము, సమీహ= కోరిక)

## తొంబది రెండవ అధ్యాయము

**కం. సమయాంతస్థా ! సర్వ మ**
**య ! మహా యంత్రస్థ ! చిన్మయ ! మహాదేవీ !**
**విమలా ! వామాక్షీ ! మృ**
**త్యు మథని ! పద్మ నయనా ! చతుష్షష్టి కళా !**

ఆ.వె. ఇంత బ్రతుకు బ్రతికి యింటివెన్కనె చచ్చె
నన్న మాట సత్యమాయె తుదకు,
అమ్మ వాసవీ ! నిజమ్ము చూపితివమ్మ
యనుచుఁ బొగడ విశులు, మునియుఁ జెప్పె ! 2647

ఆ.వె. రయముమీర భటులు రాకుమారుని జేరి
రాజు మరణ వార్త రంగరించి
తేనెతోడఁ గలిపి తీయగా మ్రింగింప
చూచి రైన ఫలిత శూన్యులైరి. 2648

తే.గీ. తండ్రి దుర్మరణమ్మును తాళలేని
రాకుమారుఁడు మూర్ఛిల్లె, రాజ భవన
మెల్ల నది గాంచి మూర్ఛిల్లె నెల్ల నగరు
శోక సంతప్త హృదయాల సోలిపోయె ! 2649

చం. కళకళలాడు పద్మపుర కంజము మృత్యు విలాస కేళిలో
విలవిలలాడె, జీవములు వీడిన చేపల కుప్ప పోలికన్
మిలమిలలాడె, మాంత్రికునిదండము సోకినయట్లు మెల్లగా
పొలపొలపొక్కెఁగన్నుల నభోమణి దీప్తులు చల్లినట్లుగాన్. 2650



వ. అంతఁ గొంతవడికి రాజభవనంబు మూర్ఛలఁదేరి విషాదమందయో
మయంబునందుండ రాజ పురోహితుం దేగుదెంచినంత. 2651

తే.గీ. భటుల హెచ్చరికలు విన్న బాలరాజు
గురుని కెదురేగి గుండెలు కరుగునటుల
కాళ్ళపైఁబడి కన్నీటఁ గాళ్ళు కడిగె,
చిక్కబట్టిన స్వాధ్యాయి చేరఁ దీసె. 2652

ఆ.వె. చిత్త శాంతి నొందు చిన్న రాజకుమార !
రాజువయ్యు నీవు రాటు పడఁగ
నుపతపించు తల్లి నూరార్చు నెవ్వండు?
రాజ్య రమను బ్రోచు రాజెవండు ? 2653

కం. పుట్టిన ప్రతి ప్రాణికి నిల
గిట్టుట ధర్మంబు గాదె ! గిట్టిన వాఁడే
పుట్టును తనయుని యందున
గట్టి తలంపునకు తండ్రి కలుగును సుతుడై. 2654

తే.గీ. ప్రాణులన్నియు తమ పూర్వ పాప పుణ్య
ములకు లోబడి మరుజన్మములను పొందు,
బంధ మోక్షంబు నందినవాఁడు మరల
జన్మ మొందదు, పరమున సత్య మొందు. 2655

తే.గీ. తండ్రివలెనన్న నినుజేరి తనయుఁడగును,
వలదు తండ్రికి మోక్షంబు వలయునన్న
మోక్షమును పొందు లేకున్న మొఱలువెట్టు
మొగులు వీధులఁ దిరుగుచు ముదల కొఱకు. 2656

ఆ.వె. ప్రియము మీర తండ్రి ప్రేతాత్మ శాంతికి
శ్రద్ధతోడ కర్మ సలుప వలయు,
నే విధంబునైన నిష్టార్థ ప్రాప్తికి
నీవు సలుపు కర్మ నిఖిలమగును. 2657

ఉ. అప్పటిదాక మౌనముగ నార్యక సూక్తులు విన్న చిన్న రా
జప్పుడు నోరువిప్పె, విబుధార్యక ! రాజుల రాయఁడైన మా
యప్పని కిట్టి దుర్మరణ మబ్బుట యేల? రణంబునంగదా
చొప్పడు పెద్దనిద్ర ! పిత చొప్పు నికృష్టము కాదె చూడగన్. 2658

వ. అంత ధౌమ్యుండును తన జ్ఞానదృష్టిచే గతజన్మల విషయంబులనెల్లయు గ్రహించి యువరాజుతో నిట్లనియె. 2659

మ. యువరాజా ! గతమందు శంకరునిచే నుద్దండ నేత్రాగ్నిలో
నివృత్తి పోయెను మన్మథుండు, నడరెన్ నీఱారు భండాసురుం
డవరోధుండయి లోక రక్షణకు, నా యంబామహాదేవి వా
ని వధించెన్, మరణించుచున్ విజయ సాన్నిధ్యంబు ప్రార్థించగా 2660

వ. జన్మాంతరంబున నట్లే యగుగాక యని పరాశక్తి యనుమతించ. 2661

ఆ.వె. దేవి యనుమతింప తిరిగి గంధర్వుఁడై
చిత్రకంతుఁడనఁగ చెన్ను మీరి
కీర్తికన్య కనెడు వర్తకాన్వయఁ గోరి
శాపగ్రస్తుఁ డగుచు సమసె నపుడు. 2662

తే.గీ. ఇపుడు నీ తండ్రియై పుట్టి యేలె జగతి,
శాప వశమున వాసవీ సతిని గోరి
యిట్టి మరణంబు నొందె నా హితము వినక
శస్త్ర యుద్ధంబు కాదు పౌషమునఁ జావ. 2663

ఉ. బాధ పడంగనేల మరు భస్మ పరంపర నేటితోడ నా
బాధ త్యజించె దేవి పద బంధము బంధవిముక్తి సల్ప నీ
బాధిత తండ్రి బంధమన బంధుజనాళికి తప్పనట్టిదే !
బాధ సహించి కర్మ సలుపంగ నుపక్రమియించు టొప్పగున్. 2664

కం. వెళ్ళుము పెనుగొండకు నీ
త్రెళ్ళిన తండ్రి మెయికొండ తెమ్మిటకున్, కొ
గిళ్ళ ననునయించి విశ కొ
మాళ్ళను, తలిదండ్రి లేక మ్రాన్పడు వాళ్ళన్. 2665



ఆ.వె. తండ్రి మరణమందు ధర్మమ్ము సంధించి
గురుని చేతులందు కరుణ నొంది
నమ్మ యొడిని దూటి యుమ్మలికము తోఁగి
దక్షుఁడాయె రాజ తనయుఁడపుడు. 2666

కం. పరివారంబును దోడ్కొని
కరి తురగ రథాళి తోడ కదలిన వాఁడై
పురి పెనుగొండకు చేరెను
దొర కొడుకు విషాద వదన దుఃఖిత మతియై. 2667

ఆ.వె. ఇళ్ళ ముందు చెంబు నీళ్ళు చల్లినవారు
జుట్టు దువ్వి ముడులఁ జుట్టు వారు
ఎదురు వచ్చి పలుకరించు వారలు లేక
ప్రాణ రహితమగు పురమ్ముఁ జూచె. 2668

కం. మేలిమి బంగారు నగల
వాలెము ధరియించి తిరుగు వామాక్షులతో
కాలముఁ గడపెడు ప్రోలిటు
కాలిన వనమునకు వోలె కనపడు నకటా ! 2669

కం. అని ముందుకు చనిన నచట
మొన రక్షణ మందు తండ్రి మొండెము చుట్టున్
కనిపించె శిరశ్శకలము
లనద శవంబునకు వోలె నవని చిదురులై. 2670

చం. చిదురులు చూచి రాకొమరు చిత్తము నుత్తలమంద రాపడెన్
పదుగురు చేరి చెక్కలను పాటునఁ జేరిచి రాజు దేహమున్
పదిలముఁజేయ, పూజ్య గురు పాణి తలంబున నీటి బిందువుల్
చెదరగ మీద కళ్ళు తెరచెన్ ప్రభు పుత్రుఁడు విహ్వాలాంగుఁడై. 2671

కం. నను కన్నుల పండువుగా
పెనిచిన తండ్రీ ! యిదేమి పృషదంశుఁడవై
కనిపించక నెటఁ బోయితి !
చనునెడ తోషంబుఁ గూర్పఁ జననైతిఁగదా ! 2672

కం. పుత్త్రుఁడనై పున్నరక ల
విత్రుఁడనై బ్రతికి యుండ వికల కరోటీ
గాత్రుఁడవై దుఃఖించుచు
గాత్రము వర్జింపఁ దగునె కనుబ్రాములచే ? 2673

తే.గీ. మంత్రి సామంత సాహిణుల్ మార్గమందు
తోడు నడువంగ యుద్ధంబు తోచెఁ గాని
విధుని వంచింపఁ బోవు పూవింటి వంచు
తలపనైతిని నా కన్న తండ్రి ! కంటె ? 2674

వ. అనుచు పలువిధంబుల విలపించి గురుని వచనంబుల స్థిమితంబునొంది మంత్రి సామంతులతో నిట్లనియె. 2675

ఉ. ఏ వనితన్ వరించి తనువీ పెనుగొండకు తెచ్చి వీడెనో,
ఏ వనితాంఘ్రి యుగ్మమున నేలిక యాత్మ విలీనమాయెనో,
ఆ వనితాగ్ని గుండమున కావల నూరు గజంబు లందు నీ
దేవర దేహ మగ్నినిడ తేఱుకొనుండిక సంస్క్రియాత్ములై. 2676

వ. అనుచు నాదేశించుచు రాకుమారుఁడును తండ్రికపరకర్మలకు సిద్ధంబయ్యె. 2677

***ఇది శ్రీవాసవీపురాణమందలి రాకుమారుని పితృవియోగమనెడి తొంబదిరెండవ అధ్యాయము సంపూర్ణము.***

(స్వాధ్యాయి= ఉపాధ్యాయుడు, ఉపతపించు= దుఃఖించు, నీఱారు= బుగ్గి పుట్టువు, ఆబాధ= దుఃఖము, ఉమ్మలికము తోగి= శోకమున తడిచి, వాలెము= ఎల్లప్పుడు, ఉత్తలమందు= కలతపడు, కరోటీ= పుఱ్ఱె, కనుబ్రాములు= వంచనలు, సంస్క్రియ= ఉత్తరక్రియ.



# తొంబది మూడవ అధ్యాయము

**కం. వరదా ! అనాది నిధనా !**
**దరహాసోజ్జ్వల ముఖీ ! విదగ్ధా ! ముగ్ధా !**
**పరమేశ్వరీ ! రసజ్ఞా !**
**నిరవధిక నిషేవితా ! ముని మనోహంసీ !**

కం. ఉత్తర క్రియలెల్ల జరిపి
క్రొత్త నరేంద్రుండు విశులకొమరుల చింతన్
చిత్తంబుంచెనె చెపుమన
నుత్తరమిడె మునివరుండు నూరుజతతికిన్ ! 2678

తే.గీ. అగ్ని గుండంబులం దాటి యరుఁగు దెంచు
రాకుమారునితో వైశ్య రాట్కుమారు
దనుచరుల తోడ మాటాడ కనుసరించె
నధిపు దహనం బయినదాక నచటె నుండె. 2679

తే.గీ. ఎవరి పనులందు వారుండి రింత వరకు
మౌన దేవత రాజ్యంబు నూనినటుల,
ఒక్క నోటను మాటలే దక్కజంబు
యెదల బరువులు గొంతుల నదిమె నేమొ ! 2680

తే.గీ. దహన సంస్కారమై మైల తలగడుగుల
పిదప యువరాజు వైశ్యులం గదిసి, తలలు
వాల్చి లోలో ప్రతీకార వాంఛ లణచి
ప్రకట మౌనుల, యువకుల పలుకరించె. 2681

కం. మౌనము మాటున కోపము
కానంగల వాడనయ్య, కరుణించి ననున్
హీనుఁడ, కామి కుమారుఁడ,
మానారికి వారసుఁడను మాయించుఁడయా ! 2682

వ. అన విరూపాక్షుం డడ్డు పడుచు 2683

కం. అన్నా మా బాధల మే
మున్నా మదియంత కాని, ఉర్వీపతి ముం
దున్నాఁడని మమ్ములఁగను
చున్నాఁడని తెలియమైతి మో యువరాజా. 2684

ఉ. నీ జనకుండు వచ్చినపు డెంత మహోత్సవమందు మున్గిరో
మా జనకుండు బందుగులు మా పుర పౌరులు సంతసంబునన్,
రోజులు మారె మా మతులు రోగములం బడి మూల్గుచుంటచే
భోజనమైన కూర్చఁదగు బుద్ధి నశించి పడుంటి మిట్టులన్. 2685

తే.గీ. అని విరూపాక్షుఁ డనుచుండ నధిపుఁ డోర్చి
తండ్రి పోయిన తనయుఁడౌ తనకు మించి
తల్లి దండ్రులు పోయిన తనయులెంత
చింత నొందిరో యెఱిగిన చిఱుత గనుక. 2686

కం. జననీ జనకు లమరులై
తనువులఁ గీర్తిధనులైన తనయులు మీరే
వనరిన నిటు, లపకీర్తిం
జనిన జనకునకయి నేను చావగ వలెగా. 2687

ఉ. చంపిన పుణ్యమౌను ననుఁ జంపుడు వైశ్య కుమారులార ! నా
పెంపు దహించు మీ కనుల పేరు ప్రతిక్రియ, శాంత చిత్తులై
పెంపు వహింపరయ్య నిరపేక్షము నా మనవిన్ చరించుచున్,
గుంపున నెవ్వరున్ మిములఁ గొందల పెట్టరు, కత్తి పట్టుడీ ! 2688



వ. వినుచును మిన్నకున్న కిరాట కుమారుల గాంచిన యువరాజు మరియు నిట్లనియె. 2689

చం. తలిమము దూసి మృత్యువునుఁ దాకిన నంటును నాత్మ హత్యయన్
మలిన మటంచు నాగితిని, మానము వీడి చరించు మీ కడన్
నిలచుట కంటె దోషమున నిల్చుట మేలు, మదీయ ప్రాణముల్
తొలగెద నిప్పుడే యనుచు దోదుముదారిని పట్టబోవగన్. 2690

తే.గీ. ఆగుమాగుము యువరాజ ఆగుమయ్య !
ఆగి మా ప్రార్థనల్ సుంత నవధరించు,
నీవు మరణింప మము దోషమావహించు,
నమ్మ యానతి లేదు నీ వంతరించ. 2691

కం. హింసాచణ కలుషాత్ముల
హింసకు ప్రతిహింస కాదు యెదిరించంగా
హింసకు తలవంచి చని య
హింసను పాటించి విడుట హేవాకంబౌ ! 2692

కం. హింసించిన యెడలన్ ప్రతి
హింసకు తెగపడ్డ యెడల హింస్రక మయమై
హింసా శృంఖల మయమున
ధ్వంసంబగు నెల్ల ధాత్రి వంచన కెఱయై. 2693

వ. ఇది మా వాసవాంబ యాదేశమనుచు విరూపాక్షుండు విరోధోపేక్షుండై మరియును. 2694

చం. చంపిన వాఁడు రాజు మునుఁ జచ్చె నహింస యనన్ వరాసిచే,
చంపె నహింస నీ హృదయ సాంద్ర ప్రతిక్రియ ముంచె హార్ధమున్,
పెంపెసలార నింక నిరుపేద క్రియన్ సుఖముల్ త్యజించి పా
లింపుము మానవాళి సుఖియింపగ సంతత శాంత చిత్తతన్. 2695

వ. శ్రోత్రపేయంబులును నాసన్న మరణ జీవనౌషధంబులును నగు శ్రేష్ఠికుమారు వచనంబుల కానంద పరవశుండైన రాకుమారుండు నంబా ప్రోక్తంబగు నహింసా వ్రతంబును, దాని మాహాత్మ్యంబును గొనియాడుచు నిట్లనియె. 2696

కం. తెలిసె నహింసా వ్రతమన
కలి తారక మంత్రమనుచు, కలనుకు సెలవీ
వలెనంచును, ప్రజల హితము
తలవని రాజునకు శిక్ష- తప్పించుటనన్ ! 2697

కం. నేనిదె ప్రతిజ్ఞ చేసెద
నానూకాంతమును జగడమాడము, మాపై
సేనల శత్రువులెత్తిన
నానర్తమునందుఁ బోమనాదిమతులమై ! 2698

కం. మీకే కాదిక వాసవి
మాకును దైవమ్ము సుండు మనకందరకున్
చీకులు చింతలు పగలున్
పోకారుచు, తృప్తిఁదీర పొగడెద మనుచున్. 2699

ఉ. గౌరవనీయ వైశ్యులకు గాత్రము వంచి నమస్కరింతు, మీ
వారొనరించు పాలన మవారణ మేను ప్రియంబుమీర మీ
కారయ నిచ్చునట్టి విషయంబున నాల్గవ భాగమొంది వ్యా
పారమొనర్చి సౌఖ్యము లపార మెలర్చుడు మాత సేవలన్. 2700

వ. అంత విరూపాక్షుఁ డద్దుపడుచు నిట్లనియె. 2701

ఉ. రాజ కుమార ! రాజ్య సుఖ రాజి వెలుంగుల చేతనే కదా
రాజులతోడ వైరమును, రాజిత గోత్ర లయంబు లొందుటల్ !
భూజవరాళి సేవలకు భూస్పృశు లెల్లర నప్పగించి యా
రాజస లక్షణంబుల విరాజిలుఁడీ మము నుజ్జగింపుఁడీ ! 2702

వ. అనవిని రాకుమారుండును. 2703



కం. సరిసరి కానిండు తమరు
సరియను నపు దేగుదెంచి సరి చేతునికన్,
పర కర్మల వర్తింపు డ
పర కర్మల నేను కూడ పాటింప వలెన్ ! 2704

ఉ. మౌనము వీడుడయ్య నను మౌనము వీడగ నమ్మ మాటలే
గానముఁ జేసి తీరు, మిము గాసిల నమ్మ వచించెనే? మరీ
మౌనమదేల? ధైర్యమున మాపుడు ఖేదము, వాసవీ మహా
జ్ఞానద మాయ నాటకము, జాతము లన్నియు నాటవస్తువుల్. 2705

తే.గీ. అనఁగ వైశ్య కుమారుల కమ్మమాట
గుఱుతు వచ్చి మనంబుల కుందు తొలఁగి
రాజసుతు తోడ తమతోడ రాజునకును
విహిత కర్మల నొనరింప వేడుకొనిరి. 2706

వ. అంత యువరాజు తమ పురోహితు సమ్మతంబున వల్లెయన నందరును తమతమ పితరులకు నిత్యకర్మ ప్రారంభించిరి. 2707

***ఇది శ్రీవాసవీపురాణమందలి రాజపుత్ర, వైశ్యపుత్రుల పరస్పరోపశమనమనెడు తొంబదిమూడవ అధ్యాయము సంపూర్ణము.***

(తలగడుగులు= తలస్నానములు, మానారి= గౌరవ విరోధి, మాయించు= చంపు, వనరిన= దుఃఖించిన, పెంపు= నాశనము, పెరుగుదల, తలిమము= కత్తి, దోదుముదారి= ఆయుధము, చణ= ప్రసిద్ధి, హేవాకము= తెలివి, ఆనూకము= వంశమున్నంత వఱకు, ఆనర్తము= యుద్ధము, అవారణము= అడ్డులేనిది, విషయము= దేశము, ఎలర్చు= సంతోషించు, భూజవరాళి= భూమిని పుట్టిన విలువైన వస్తువులు, జ్ఞానద= పరాశక్తి, జాతములు= పుట్టుకలు)

# తొంబది నాల్గవ అధ్యాయము

**కం. పరమానందాయ ! నిరం**
**తరాయ ! స్వస్తి కనకాంగద విభూషాయై !**
**తరుణీ ! తనుమధ్యాయై !**
**నిరుపమ ! నిర్వాణ సుఖద ! నీరాగాయై !**

తే.గీ. అటుల రాజ విరూపాక్షు లాత్మ హితులు
నిత్య కర్మల నాగ్నేయ నియమనముల
సాక్ష్య సంప్రేషణమ్ముల శ్రద్ధ జరిపి
పితల ప్రేతాత్మలకు శాంతి బెరయఁ జేసి. 2708

కం. దక్షత కర్మల నడపిన
శిక్షకుల పదంబులంటి చేమోడ్పులతో
దక్షిణ తాంబూలాదుల
భిక్షావిధి పూర్తిచేసి భిక్షల నిడగన్. 2709

తే.గీ. భాస్కరాచార్యుఁడును వారి భక్తి కలరి
కుసుము తనయుని దాబిల్చి పసలఁ బల్కె
గయకు పోవలె నందఱు కదలుఁడయ్య
పిండములు పెట్టి రావలె పితరులకును. 2710

తే.గీ. అనిన రాకుమారుఁడు విని వినయమొప్ప
నార్య భాస్కరాచార్యుల కంజలించి
పండితులు మీరు, వీరెల్ల బాలకులగు,
గయకు రాగలరె చెప్పుమా నయముఁ గదుర ! 2711

తే.గీ. వీరి కార్యమ్ముఁ దీర్చెడి విప్రవరుల
గయకు పంపెద, వీరికప్రియము వలదు
అడవిదారుల కష్టముల్ బడయలేరు,
మనవి మన్నించుడంచాత్మ మతముఁ దెలిపె. 2712

కం. తమ సుఖములు కోరెడు పతి
తమ కెదురుగ నుంటఁ జూచి తనిసిన వాడై
దమధుండు విరూపాక్షుఁడు
విమల కమల ముఖుని గారవించుచు ననియెన్. 2713

సీ. ఎన్ని వర్షంబులందున్న వారట రామ
లక్ష్మణుల్ మునితోడ లంకె వడఁగ !
ఎన్ని వర్షంబులందున్న వాఁడో కృష్ణుఁ
డటవిలో పెనుబాము నణచి నిలిచె !
ఎన్ని వర్షంబులందున్నాడు శ్రవణుండు
తల్లి దండ్రుల మోసె ధరణి నెల్ల !
ఎన్ని వర్షంబులం దున్నప్డు ధర్మనం
దనుఁడాదిశేషుని తలపు గెలిచె !

తే.గీ. ఎల్ల కార్యంబు లొనగూడు నెడద గట్టి
తనము నందున, దేహపు త్రాణఁ కాదు;
పోయి వచ్చెద మాచార్య ఛాయలోన
కలత వలదయ్య మముఁ బంప కాశి గయల ! 2714

వ. అనుచు బ్రతిమాలు విరూపాక్షుని మృదువచనంబుల సమ్మానించి యువ
రాజును నిట్లనియె. 2715

ఆ.వె. పోయిరండు గయకు పుత్ర కర్మంబుల
చేసి రండు, నేను చెలిమి మీర
మీ నగరములందు మీవారి పిన్న పె
ద్దలనుఁ గాచియుందు బలములుంచి. 2716

కం. నేనును పద్మపురంబున
పూనెద పొలిమేరలందు పుణ్యక దీక్షన్
దానాదులతో మీకై
నేనెదురారయు దొకేఁడు నీఱగు దటుపై ! 2717

ఆ.వె. అనుచుఁ బ్రతిన జేయు నా రాజ బంధువున్
వలదు సాహసమ్ము వత్తుమంచు,
చందన సుమమాల సద్యఃపట యుగంబు
లుంచి సత్కరించె నూరు సుతులు. 2718

కం. నందనుఁడగు యువరాజును
చందన తాంబూల గంధ చర్చల తోడన్
కుందన మణి వస్త్ర యుగము
లందర కర్పించి ధైర్య మందుఁడటంచున్- 2719

వ. పరివారము తోడ నగరు కరుగ వైశ్య పుత్రులును హృదయ భారావతరణంబునఁ దూల దేహులై కతిపయ దినంబుల కవసరంబులగు సేవకాగణంబుల తోడ రక్షక గణంబుల సిద్ధపరచి పెద్దల యాశీర్వచనముల గురు పదంబుల వెంట గయాభిముఖులై ప్రయాణమైరి. 2720

కం. వనముల కనుమల దాటుచు
జనపదముల సేదఁ దీరి చను, మార్గములో
వినయంబున నాచార్యుని
మనమలరగ కథలు వించు మసలెదు నెడలన్. 2721

కం. రాజకుమారుఁడు సైన్య వి
రాజితుఁడై ధౌమ్యు వెంట రానగరు చనన్
వాజము వినికిడి లోనన్
వాజుల నియమించి శిబిర వ్రాతము నిలిపెన్. 2722



ఆ.వె. ఊరి బయట వారు చేరి యుండిరిగాని
రాజుతోడఁ గాదె రాజ బలము !
ఊరు జరిగినట్టు లూహింప నగుఁగాని
రాజతంత్ర మెటుల రాజు లేక ? 2723

ఉ. పాలనమెల్ల మంత్రిసభ పాలొనరించిన రాకుమారుఁడున్
నేలను జేరి పాదుకలు నెత్తిన మోసిన రాము తమ్ముఁడై
మాలనిరీతి నొంటిఁ బరమన్ మదినుంచి జపింప మంత్ర తో
మాలియ నిమ్మటంచు గుణ మాన్యుని ధౌమ్యుని వేడె నంతటన్. 2724

చం. అతఁడును శిష్యు మానసము నంటిన వాఁడగుటంజెలంగి, స
న్నుత గుణ ! దివ్యమంత్రమిది, నూతనమున్, సుగుణాతిరిక్తమున్,
జిత విమతాత్మకమ్ము, పర జీవన దర్శన మాత్మ బోధకం
బతుల నిగూఢవిద్య వినుమంచు వచించెను ధౌమ్యమౌనియున్. 2725

మంత్రము : ఓం ఐం హ్రీం శ్రీం దుర్గాయై నమః
ఓం ఐం హ్రీం శ్రీం భద్రకాళ్యై నమః
ఓం ఐం హ్రీం శ్రీం విజయాయై నమః
ఓం ఐం హ్రీం శ్రీం వైష్ణవ్యై నమః
ఓం ఐం హ్రీం శ్రీం కుముదాయై నమః
ఓం ఐం హ్రీం శ్రీం చండికాయై నమః
ఓం ఐం హ్రీం శ్రీం కృష్ణాయై నమః
ఓం ఐం హ్రీం శ్రీం మాధవ్యై నమః
ఓం ఐం హ్రీం శ్రీం కన్యకాయై నమః
ఓం ఐం హ్రీం శ్రీం మాయాయై నమః
ఓం ఐం హ్రీం శ్రీం నారాయణ్యై నమః
ఓం ఐం హ్రీం శ్రీం ఈశాన్యై నమః
ఓం ఐం హ్రీం శ్రీం శారదాయై నమః
ఓం ఐం హ్రీం శ్రీం అంబికాయై నమః
ఓం ఐం హ్రీం శ్రీం శ్రీవాసవీ కన్యకాపరమేశ్వరీదేవ్యైనమః 2726

తే.గీ. ధౌమ్యుఁడొసఁగిన మంత్రంబు తలపునుంచి
వాసవీదేవి రూపమ్ము వ్రాసి నిలిపి
వత్సరాంతంబు దీక్షమై వత్సుఁడగుచు
నేక భుక్తంబున గడపె నేలికపుడు. 2727

ఆ.వె. గురుని యాజ్ఞ కొలది మఱునాఁటి యుదయంబు
పయన మనుచు నచటె బస ఘటించి,
యిష్టుతోడ నుంత యిష్టగోష్ఠిని నుండ
పరిజనంబు వచ్చి పజ్జ నిలచె. 2728

కం. పెనుగొండ నిలిపి వచ్చిన
మొన యంతయు నంత వఱకు మూలేరునిచే
వినయులు కదలక నుంచిన
మొన సభ్యులె, తల్లి మహిమ మ్రొక్కిన వారే ! 2729

ఉ. రాయిడి వేళ సాయపడి రాక్షస కృత్యము నిగ్రహింప సం
ధాయక వృత్తమందునికి త్యాగ ఫలంబున గౌరవింపగా
నాయక వృత్తమందునికి నాతిశయంబగు స్వానమందుపా
ధ్యాయునిఁజూచి పల్కెనిటు యాపనలేక వసుంధరేశుడున్. 2730

ఉ. వీరలు వీరముఖ్యు లురువిక్రమశోభితులుర్వరేశు ధి
క్కారము సల్పలేక నటకట్టడిఁజేయగఁజేరినట్టి నా
సీరము, వారి గౌరవము చేకొని, ధర్మముగారవింపగా
గారమునందు వైశ్యులనుగాచిరి, వీరును వైశ్యభక్తులే ! 2731

కం. ఆ వీరభటులు సైతము
శ్రీవాసవి బోధలు విని శిక్షా శూన్యం
బై వైశ్యుల సేవలలో
జీవించిరి వీరముష్టి జీవికలందున్. 2732



కం. కోమటులును తమసేవల
నేమముతో సలుపు వారి నియతిని దేవీ
నామముతో ప్రభల నిలిపి
కోమటి జాతీయ గాథ కూర్చుఁడనంగన్. 2733

ఆ.వె. వారు నుద్యమించి వాసవీ గాథను
శరభ, ఖడ్గ, సూక్త, జముకు కథలు,
దేవి కీలకములు, దిగ్బంధ, దండక,
బహుపరాకు లనఁగ పలికినారు. 2734

ఆ.వె. ఏటికేఁడు వీటికేతెంచి కథఁ జెప్పు
వీరముష్టు లనఁగ గౌరవించి
భోజనములుపెట్టి పోషించు వైశ్యులు
దేవి దీవనములఁ దేలినారు ! 2735

***ఇది శ్రీవాసవీపురాణమందలి వీరముష్టుల వృత్తాంతమనెడి తొంబదినాల్గవ అధ్యాయము సంపూర్ణము.***

(భిక్ష= సేవ, భోజనం, పసలు= ప్రియ వచనాలు, దమథుడు= క్లేశములనోర్చువాడు, గంధము= కస్తురి, తూలము= దూది, తోమాలియ= పూలదండ, వాజము= శబ్దము, మూలేరుడు= రాజు, వినయులు= వైశ్యులు)

## తొంబది యైదవ అధ్యాయము

**కం. పురుషార్థప్రద ! పూర్ణా !**
**పరాయ ! పరదేవతాయ ! భగమాలిన్యై !**
**కురుకుళ్ళాయ ! కుళేశ్వరి !**
**సురనాయిక ! శివపరాయ ! సుముఖాయ నమో !**

ఆ.వె. అనఁగ వీరముష్టు లావిర్భవించిన
తీరుఁ జూచి, విశులతీరు మెచ్చి,
బాలవిశులు విన్న బాలగాథలయందు
మునుగ వేడుకొన్న మునులఁ జూచి. 2736

కం. భాస్కరగురుగాథలు ముని
భాస్కరుఁడా విశులమధ్య పలికెనిటుల శ్రే
యస్కరములు, మోహతిమిర
భాస్కరములు, బుద్ధిలక్ష్య పౌస్కరములుగాన్ ! 2737

ఆ.వె. మార్గ మందు విట్కుమారులు వేడంగ
భాస్కరుండు చెప్పె ప్రఘును గయుని
తపము, వరము, గతము, తాత్పర్యమంతయు
బభ్రువిచ్చినట్టి వరము తుదకు. 2738

ఉ. పూర్వ మొకప్పుడీ జగతి పుట్టలు తెట్టువలై గ్రసించుచున్
సర్వజనాదిజీవులను చర్వణలోగొన జాలు నాకృతిన్
కర్వర జాలముండెడిది, కన్గొన రాక్షసబల్లులన్వలెన్,
ఖర్వ నిశాచరాన్వయము, కాసరదైత్య మృతావశేషమై ! 2739

తే.గీ. శాస్త్రవేత్తల పరిశోధనాస్త్రములకు
పుట్టు జీవవిధ్వంస విస్ఫోటనముల
వలె, విరాట్పురుషేష్టి ప్రభావమందు
నిట్టి పటు దీర్ఘ దేహులు పుట్టినారు. 2740

ఆ.వె. అట్టి జీవ జాల మందుఁ గన్పట్టెడి
గయుఁడనంగ నసుర కాయుఁడొకఁడు,
నోరు యోజనంబు, నూట యిరువదైదు
యోజనముల దేహ మొదవఁ బుట్టి ! 2741

ఆ.వె. అతని శక్తి విష్ణు నుతి పుణ్య ఫలితంబు
నతని ప్రాణ మమృత మద్భుతంబు,
నతని రూప మరయ నతి భీకరాకార
మతని వర్తనంబు యతులఁ బోలు. 2742

వ. కాని, 2743

కం. ఆకార మతని శత్రువు
భీకరమై చూచినంత భీతిం గొలుపున్,
శాకాహారముఁ దినుచును
నాకౌకసులకు సుషుప్తి నాశముఁ జేసెన్. 2744

ఆ.వె. పాముఁ జూచి నరుఁడు పాపభీతియు లేక
చంపఁ జూచు నెటుల జాతిఁ గనక,
నటులె రూపుఁ జూచి ఆపద లూహించి
గయుని జంపఁ బూనె ఖచర గణము. 2745

చం. ఋషులను గూడి దేవతలు ఋక్సతిఁ జేరి వినమ్ర దేహులై
ఋష మృగ మానవామరుల జన్మకు కారణమైతి వీ సుర
ద్విషుఁ డమృతాశుఁడై జగతి తేజము నొందెను విష్ణు సేవచే,
మృషలగు సృష్టిధర్మములు, మ్రింగెనుసర్వము, వింటివాయనన్. 2746

చం. అరరెరె ! అట్టులా యనుచు నంబుజ గర్భుఁడమాంత మబ్జ ప్ర
స్తరణము వీడి వెంటఁబడె, దానవ వైరుల తోడఁ జూచె నా
వరణము యోజనంబు లొక వందకు పైఁబడి విస్తరిల్లుచున్,
పొరలుచు నున్న బెట్టిదపు భూతము నంతట భీతచిత్తుఁడై ! 2747

వ. ఇది తన సృష్టి యౌనొకో యని విస్మయమందుచు నాత్మ గతంబున నిటులఁ దలపోసె. 2748

కం. ఎక్కడిదీ వింత మృగం
బక్కజమగు దీనిఁ జూడ, నద్భుత భూతం
బక్కట ! ఇది నోరు తెఱువ
నెక్కడికని పాఱు జీవు లెందున దాగున్ ! 2749

తే.గీ. తిండి మెక్కుటకై నోరు తెఱువ వీని
నోటి గుహలో మహావృక్ష కోటి తోడ
నెన్ని జీవులు పోవుచు నున్న వకట !
వీని నెటులైన వంచన వ్రేయ వలయు. 2750

కం. అని యోచించిన బ్రహ్మ య
తనితో వచియించె నిట్లు, తనయా ! సేమం
బె ! నిజాభిమతం బేమనె !
తనువున కాహార మమరు తావుల్ బాగే ! 2751

ఉ. అంత గయాసురుం డెదుట నబ్జభవున్ గమనించి లేచి ది
క్కాంతలఁ బట్టఁ జాపు కర కాండములాయన బారఁ జాపి, మే
నంతయు సాగదీసి నభమంతయుఁ గప్పుచు నేంది దేవరా?
ఎంతకు కానరాని నిను నిందుఁ గనన్ గడగండ్లు తోచెడిన్. 2752



ఆ.వె. మంచిగున్న నన్ను మంచిగుంటివ– యన్న
నందులోని కిటుకు నందరాను,
ఎందుకొచ్చితన్న, ఏమి కోరెదవన్న
దొకటి చెప్పుమన్న నుక్తి విభుఁడు. 2753

తే.గీ. కీడు శంకించెనే వీడు కీడు వడునె?
శంక నొందెను, కాని యే జంకు లేక
నడుగు మనుచున్న వాఁడు, నే నడిగి చూతు,
ననుచు వరదాత వరభిక్షు నడుగఁ బూనె. 2754

మ. వరదాతన్, వరమేది కావలెనన్ వాకొందు నెబ్బంగి? నీ
చరితంబంతయు విన్నవాఁడ గయుఁడా ! సంత్రాణ సర్వజ్ఞుఁడా !
వర మృత్యుంజయుఁడా ! నిజోక్తి ప్రియుఁడా ! వైచిత్ర్య భూతాత్ముఁడా !
ఉరు నిర్మాణము బట్టి యివ్వదగు నీ కుత్సాహమే యున్నచో ! 2755

ఉ. నేనొక యాగముం దలచి నిర్మల భూమిని దేవులాడ నీ
తానవమంత దివ్యమగు స్థానముఁ గానను లోకమందునన్,
దీనికి నీవు యిష్టపడుదేని మహాక్రతు పుణ్య మంతయున్
దానముఁ జేతు నీకు, సుపథ వ్యవహర్త ! గయాభిధా ప్రథా ! 2756

వ. అడిగెనే కాని , 2757

కం. ఒప్పుకొనునొ లేదొ కడకు
తప్పుకొనునొ యంచు ధాత తడబడు చుండన్,
గొప్ప మనసుతోడ గయుఁడు
చప్పున నంగీకరించె స్వార్థ రహితుఁడై ! 2758

తే.గీ. బ్రహ్మయును తామసింపక బ్రహ్మదేవ
రూపిణి యను శిలను దెచ్చి రుటముగ నసు
రాధిపుని శీర్షమందున నానవెట్ట
బాధ భరియింప లేక నా భటుఁడు కదలె ! 2759

ఆ.వె. సవనమందు నజము నవరంధ్రములు మూయ
నొడలు కొట్టుకొనుచు నడలు రీతి,
ముఖము నాక్రమింప మొదలాయె మెదలాట
కాయమెంత మనసు కంటగిల్ల ? 2760

ఆ.వె. వేది కదలుచుండ వేలిమెట్టుల సాగు?
సురలు పట్టి చూడ సుడులఁ బడిరి,
దీని బట్ట గలుగు దేహంబుకై ధాత
విశ్వ భర్త యైన విష్ణుఁ దలచె. 2761

వ. విష్ణువును తానొనరించిన తప్పిదమునకు మిగులఁ జింతించి తలంచినంతనే ధాతముందు ప్రత్యక్షమై. 2762

ఆ.వె. కొట్టుకొనుచు నున్న కోడాడు కాయంబు
పైన నిలువ జంకి, బ్రహ్మ వేడ
తప్పదనుచు నిలిచె దైత్యు దేహముమీద
గయుని దేహమింక కదల లేదు. 2763

ఆ.వె. గయుఁడు మీద శౌరి కలడని భావించి
శౌర్య మేది యిటుల సాహసింప
తగునె నీకు దాత ! దైత్యారి వనుమాట
నిజముఁ జేసితయ్య నీరజాక్ష ! 2764

కం. దిగుమా క్రిందికి నేనును
మగుడను నా మాట వింటె? మగుడకుమా నా
తగులము శాశ్వత జీవన
మగడు పడకు మాటఁ దప్పి, అంబుజనాభా ! 2765

తే.గీ. దిగిన శ్రీనాథుఁ డాతని స్థిరత మెచ్చి
ఇచ్చె వరమొందు నతఁడున్న యిరవునందు
పితరులఁదలచి శ్రద్ధతో పిండమిడిన
ముక్తి గాంతురు గయుపేర మోక్షమొదవు. 2766



ఉ. అంతటినుండి మానవులు అమ్మకు నాన్నకు పెద్దవారికిన్
హంతువు సంభవించినపుఁ డంతిమ కర్మలు నిర్వహించి, ఆ
తంతుముగింప నచ్చటి త్రిధారతటిన్ గయకేగుదెంచు వా
రుంతురు పిండముల్ పితరు లుల్లస మందగ స్వస్తి పల్కగన్. 2767

***ఇది శ్రీవాసవీపురాణమునందలి గయాపిండ ప్రాశస్త్యమునుదెలుపు తొంబది యైదవ అధ్యాయము సంపూర్ణము.***

(పౌస్కరములు= శుద్ధి చేసేవి, ప్రఘునుడు= రాక్షసుడు, బభ్రువు= విష్ణువు, కర్వర= రాక్షస, ఖర్వ= నీచ, ఋక్పతి= బ్రహ్మ, సురద్విషుడు= రాక్షసుడు, అమృతాశుడు= దేవత, వ్రేయుట= చంపుట, సంత్రాణ సర్వజ్ఞుడా= శరణు కోరిన వారికి ఈశ్వరుని వంటి వాడా, వైచిత్ర్య భూతాత్ముడు= విచిత్రమైన శరీరం కలవాడు, తానవము= తనుత్వము, గయాభిధాప్రథా= గయుడను పేరుతో ప్రసిద్ధినొందినవాడా, రుటము= దృఢము, భటుడు= రాక్షసుడు, కోడాడు= బాధపడు, తగులము= అసక్తి, అగడు= దూఱు, త్రిధార= గంగానది)

# తొంబది యారవ అధ్యాయము

**కం. మేరు నిలయా ! ముఖరితే !**
**వీరారాధ్యా ! అజా ! వివిక్తస్థా ! చూ**
**డారా ! ధీరా ! రస్యా !**
**ధీర సమర్చిత ! ప్రచండ ! త్రిస్థా ! సత్యా !**

ఆ.వె. గయుని తప్పు లేక కడతేర్చ న్యాయమా?
అనఁగ భాస్కరుండు నవును తేలు
కంటఁ బడిన కొండి ఖండింతు రెందుకా
వంతఁ బడిరి కాన వరములిడిరి. 2768

కం. అంతట ధర్మాధర్మము
లంతకు పరిశోధనమున కంకిత మిడుచున్
వ్రంతలు మూడును నొక్క స్ర
వంతిగ కలిసిన ప్రయాగ వచ్చిరి విశులున్. 2769

ఆ.వె. వేయిమంది ద్విజులు విట్కుమారుల తోడ
క్షేత్రమెల్ల తిరిగి సిద్ధ సాధ్య
దేవ గణములెల్ల దీక్షతోఁ గొల్చెడి
తావులెల్లఁ జూచి తనిసినారు. 2770

కం. ఆ వాసుర భోజనముల
గావించిన వైశ్య గణము కథలన్ వినఁగన్
సేవించిరి గురువర్యుని
దీవింప ప్రయాగ పూర్వ దివ్యకథనమున్. 2771

తే.గీ. భాస్కరాచార్యుఁ డిటు పల్కె బ్రహ్మ యిందు
పెక్కు యాగంబులం జేయ పెంపుకెక్కె
నిది ప్రయాగ యంచు, పవిత్ర మిద్ది, దీని
మహిమఁ బొగడంగ వేనోళ్ళ నహియు జంకు ! 2772

కం. పావనమగు గంగానది
పావనమగు యమున తోడ ప్రశ్లేషమునన్
పావన సరస్వతీ నది
పావడమై కలియునట్టి ధరణియిది సుమీ ! 2773

ఉ. పావన పుష్కరంబులకు ప్రాణము, పుష్కర రాజ మిందు నా
ప్లావ మొనర్చు వారలకు పంచ మహాఘ విమోచనంబు నౌ,
ద్రావిణ చౌర్యమున్, గురునిదారనుబొందుట, బ్రహ్మహత్యయున్,
స్రావమధూళిసేవనము, సారెలనాడుట పంచపాపముల్. 2774

తే.గీ. గంగ యన విష్ణు పాదోద్భవాంగ హిమజ,
యమున యన సూర్య నందిని కాల భగిని,
నది సరస్వతి ధీ చేతనా స్రవంతి,
మూడు వాహిను లొకటాయె మునుక వేయ ! 2775

వ. అనిన వైశ్యకుమారకు లెల్లరును త్రివేణీసంగమ మాహాత్మ్యముం బొగడుచు
నిదురించిరి. 2776

కం. మరునా డుదయము లేచిరి
గురువులతో నడచి వెళ్లి కోర్కులు దీరన్
తరణి మకరమును జేరిన
తఱి మునిగిరి మూడునదులు దనిసినచోటన్. 2777

తే.గీ. పుణ్యతీర్థమ్ము సేవించి పూజజరిపి
బ్రాహ్మణులకెల్ల దానముల్ భక్తిసలిపి
పేదలకు నన్నదానమున్ పేర్మిఁజేసి
పితరులకు తృప్తి కలుగఁదపించినారు. 2778

ఆ.వె. తీర్థ మాడినంత ద్విజులెల్లరును గురు
నెందు పోవలెనన నందు కొనియె
కాశి కేగ వలయు కాశిలో శివరాత్రి
వ్రతము చేయవలయు వ్రతులు కందు ! 2779

ఉ. అంతట వైశ్య సోదరులు నగ్గలికన్ శివరాత్రి దీక్షలన్
సంతనకట్టి కాశికకు సాగుచు భాస్కరునిన్ వచింపుఁడా
ప్రాంతపు గాథలంచుఁ బొదువన్ గురువున్ నుడువందొడంగె ను
న్నంతయు వారణాసి నగరాధిపు గాథ యథార్థమే యనన్. 2780

కం. వరుణకు నసికిని నడుమన
నరవిరిసిన వారణాసి ఆది నగర మీ
ధరణిని, దివిజులు దివిదిగి
ధరణికి మనుజులుగ వచ్చి తవిలిన నెలవున్ ! 2781

వ. అట్టియెడ నచట రక్షకులెవ్వరన గురుండును. 2782

ఆ.వె. తెలిసినంత వఱకు దివిజుల పాలనే
సాగుచుండె నచట, సారసోద్భ
వుండె నిల్పె నట దివోదాసుఁ డనువాని
కాశి నేలుమనుచు కరుణ తోడ. 2783

కం. అతఁడును కరుణను జనులను
ప్రతిపాలించుచు రహించె, ప్రజలును సుఖులై
ప్రతిపాదించిరి ప్రభుఁడన
నతఁడె దివోదాసటంచు నంచిత భక్తిన్ ! 2784

తే.గీ. ఎంత మంచివాఁడైన నే మింత దాక
నెవరు సుఖియించి రీ నేల నీల్గు దాక,
నడుమ నొక సనాతన శక్తి నట్టు వడక ?
ధర్మమును పరీక్షించుటల్ దైవికములు ! 2785



తే.గీ. అత్తవారింట నీశుండు నలరుచుండ
గౌరి మాత్రము తల్లిచే గాసిఁబెట్టు
మాటలంబడి విభునితో మనవి చేయఁ
జేయుటా, కూడదా యంచు చెవిని వేసె. 2786

సీ. నెలవేది యన్నచో నెలను జూచెదు వాని
కెందు లే దటనుండ నిల్లొకండు,
భూషణంబులొ యన్న బుసగొట్టు పాములు !
బంగారమే లేదు భార్యకిడఁగ,
నాచ్ఛాదనములా మృగాజినంబులు దక్క
పుట్టంబు లెటు కట్టఁ బెట్టఁగలఁడు,
క్షేత్రమా భిక్షకై పాత్రమొక్కటి తప్ప
పరమాన్నములనెట్లు పంచఁగలఁడు,

తే.గీ. కాపురంబెట్లు చేయు మా కన్య యనుచు
నిరుగు పొరుగులతో అమ్మ యీసడించు,
వినుచు నెట్లుందు పుట్టింట విశ్వనాథ ?
ఉన్న రూపిది, యేమందువో శరణ్య ! 2787

వ. శంకరుండది వినుచు. 2788

కం. ఏ తల్లి యైన నల్లుని
భూతిం గొనియాడుఁ గాని బూదిఁ బొగడునా ?
నీ తల్లి కోర్కెఁ దీర్చెద,
నీ తావును చక్కఁ జేతు నిఖిలైశ్వర్యా ! 2789

కం. అనుచు గణనాథుని నికుం
భుని బిలచి యుపాయమున దివోదాసు దెసం
జని మన కాశీ పట్టణ
మును బోవిడుచునటు జేయుము తెలివి ననియెన్. 2790

ఆ.వె. ఆజ్ఞ యనుచుఁ బోయి ఔనికుంభుఁ డనెఁడు
కాశిలోని విప్రు కలనుఁ గార
వించి చెప్పె నొక్క విశ్వేశు నాలయం
బమరఁ జేయ సౌఖ్య మమరునంచు. 2791

తే.గీ. ఔనికుంభుఁడది నికుంభు నానతియని,
శైవభక్తుండు గావున సత్వరంబు
పతిదివోదాసు కడకేగి ప్రణుతిఁజేసె
శంభునానతి సెలవిచ్చి సలుపుమనుచు. 2792

ఉ. రాజును భక్తుఁడౌట ననురాగమునం దలఁదాల్చి రాజులన్
రాజగు విశ్వనాథునకు రక్షిత మందిర మొందు నిల్పి రా
రాజుకుఁబోలు భోగముల రంగుగనర్చనఁజేయ నెల్లరున్
రాజపథంబునందు తనరారిరి, రాజునుబట్టి పార్షదుల్ ! 2793

ఉ. మ్రొక్కిన వారి కోరికలు మ్రొక్కిన యట్టుల తీర్చుచున్ సదా
మ్రొక్కుల నందుచుండు నఘమోచక సాంబుఁడు, పుత్ర ప్రాప్తికై
మ్రొక్కెడు రాజుకా మొదటి ముచ్చట తీర్చఁడదేమి చోద్యమో–
మ్రొక్కెడు వారి జాతకము మ్రొక్కుల పై పనిచేయునేమొకో ! 2794

కం. సహనము భక్తికి నికషము,
సహనముచే రాక్షసులును చవిఁగొనె వరముల్,
సహనము లేక దివోదా
సహమున పడగొట్టె గుడిని ఔరా! యనఁగన్. 2795

ఉ. జీవితమెల్ల మంచి పని చేసిన నేమి ఫలంబు అంతమం
దావిధి చేతి కీలుబొమలై చరియింపగ తీరదే, మహా
దేవు మనోరథం బటుల తెన్ను మరల్చుచు నుండ మానసం
బేవిధి హద్దునుండు భువనేశునకైనను తప్పు చేయకన్ ? 2796



తే.గీ. గుడిని పడగొట్టినంత నాతఁడిని నృపుని
అధికరణ హీనుఁడగుమంచు నభిశపించి,
అతఁడు రాజ్యంబు వీడి చన్నంత శివుని
కడకు చని నికుంభుఁడు మంచి కబురు చెప్పె ! 2797

కం. అంతయు గమనించిన శివుఁ
డెంతయు సంతోషమంది యింతీ నీ కా
వంతయు వంత వలదిక వ
సంతము జీవితము నిండు, స్వామిని వనియెన్. 2798

వ. ఇకపై కాశీనగరమున కాపురము, కాశీరాజ్యము మనరాజ్యము, నీవే మహా
రాణివీ విషయము. 2799

కం. మాయత్తకు చెప్పుము, నీ
వాయత్తము కమ్ము, రమ్ము, అంతఃపురమున్
ప్రాయిడితో కాలిడి నీ
ప్రాయంబంతయు గడపు మపాయము లేకన్ ! 2800

వ. ఆ విధమున నాది దంపతులు పాలకులుగా విరాజిల్లిన కాశీనగరము మహా
పుణ్య క్షేత్రంబై, అప్పటినుండియు గంగాతీరమున భక్తుల భవంబుల పునీతమొనరించు
చుండెఁ గావున మనమును నన్నపూర్ణా విశ్వేశ్వరుల దర్శించి శివరాత్రి వ్రతమొనరించి
ధన్యులమయ్యెదమన వైశ్యకుమారులును కతిపయదినంబులకు. 2801

శా. గంగాతీర పురంబునందు సతమున్ గంగాభిషేకంబులన్
గంగా పార్వతు లిర్వురన్ దనుపుచున్ కంజాతజాండంబులుం
బొంగారన్ మన, విశ్వనాథుఁడనఁగా పూజ్యాన్నపూర్ణా సతీ
సంగంబందున నున్న కాశిపురి సాక్షాత్కారమై నంతటన్. 2802

కం. లింగము, విశ్వాకృతి భూ
లింగము, విశ్వాస కిరణలేపజ్యోతిర్
లింగము, విశ్వసృడర్చిత
లింగము, విద్బాలకాత్మ లింగంబయ్యెన్ ! 2803

కం. సంతోషంబున వారే
కాంతంబున శివుని జూచి కామరహితులై
శాంతాత్మోపాంతస్థ
స్వాంతంబులఁ బట్టిరంత వ్రతదీక్ష విశుల్. 2804

తే.గీ. ఉదయమే లేచి కాల కృత్యాదికములఁ
దీర్చి గంగోదకంబులఁ దీర్థమాడి
విశ్వనాథాన్నపూర్ణల వినతిఁ జేసి
శ్యామ పంచాక్షరీ మంత్ర జపము సలుపు. 2805

వ. అటుల మహాశివరాత్రము వఱకును దీక్ష సలిపి శివరాత్రి వ్రతముంబూర్తి గావించి వైశ్యబాలకులు గయాభిముఖులైరి. 2806

చం. శుభశకునంబు లా విశుల శుద్ధమనంబులకాయె యానమం
దభిలషణీయ మేదొ కననౌనను వేడుకతోడ విష్ణుస
న్నిభ సుకృతాంగణాంకమున నిల్చిరి భాస్కరువెన్క నిర్మలాం
గ భసల నాదముందగులు కందనకాయల పెద్దలుండగన్. 2807

**ఇది శ్రీవాసవీపురాణమునందలి వైశ్యబాలకుల కాశీయాత్రలోని ప్రయాగ, కాశికా దర్శనంబులను తొంబదియారవ అధ్యాయము సంపూర్ణము.**

(వాసుర= రాత్రి, ప్రశ్లేషము= కలయిక, ఆప్లావము= స్నానము, ద్రావిణము= బంగారము, అగ్గలిక= ఉత్సాహము, సంతనకట్టి= తాల్చి, పార్షదులు= సభ్యులు, ప్రాయిడి= పేదవాడు, విశ్వసృట్= బ్రహ్మ, శ్యామ= రేయి, భసల= తుమ్మెద, కందనకాయ= గుండె)



# తొంబది యేడవ అధ్యాయము

**కం. అతి గర్వితా ! కృతజ్ఞా !**
**శ్రుతి సంస్తుత భాగధేయ ! స్తోత్ర ప్రీతీ !**
**రతి రూపా ! రక్షాకరి !**
**చతురంగ బలేశ్వరీ ! విశావన గోప్త్రీ !**

తే.గీ. శకునముల ఫలంబెటులుండె సక్థిజులకు
చెప్పుమాయన మునియును చెప్పె నిటుల,
బాల వైశ్యులా శకున ప్రభావములను
తర్పణాదులఁ గాంచిరి తత్క్షణంబు. 2808

ఉ. శక్తి కొలంది బాలకులు చక్రిఁ దలంచి పితాళ్ళ పేర శా
స్త్రోక్తవిధిన్ ప్రణేజన, తిలోదక, పిండ విహాయితంబులన్
సక్త మనంబులందు ధృతి సల్పి స్వధాభుజులన్ సకాములన్
రక్తులఁ జేసిరంత ననురక్తి రహించగ నాకసంబునన్. 2809

కం. పితరులు ప్రత్యక్షంబై
హితకుల దీవించి సౌఖ్యమే యని పలుకన్,
హితవరులై మీరుండగ
ధృతికేమిటి? వాసవాంబ స్థితియేమనియెన్. 2810

చం. అదివిని వాసవాంబ భరతావని సోదర ప్రేమ పాశముల్
మదిఁగొని పూర్వదేవతల మధ్యమునందున దివ్య దేహమున్
గొదగొని కానుపించె తన గోత్రము వారి యెదల్ సుమించగన్,
చదలు లయింపఁ బ్రేక్షకుల చిత్తములందు రహింప తోషముల్. 2811

తే.గీ. సోదరిని గన్న గోమఠ సోదరాళి,
తలచినంతనె కనిపించి తారసించి
యెదలఁ బుష్పింపఁ జేసిన యీడితార్థఁ
బొగడ నుంకింప మాటలు పెగల వాయె ! 2812

వ. అంత లోలోన సోదరిని బ్రార్థింప నామె కరుణాకటాక్షంబులచే. 2813

సీ. సిద్ధ సమూహంబు సేవింప ననురక్తి
నానందమున దేలు నలరుఁ బోణి !
గంధర్వ యూథంబు గానంబు సలుపంగ
తలయూచి లయనిచ్చు తలిరుఁ బోణి !
తలవంచి ప్రణమిల్లు దైవత కోటీర
హీరకాంతుల మధ్య నిగురుఁ బోణి !
పూర్ణేందు చంద్రికా పూర్ణోత్తమాంగ సం
భూత హాసవిభూతి పూవుఁ బోణి !
తే.గీ. పసుపుటంచున తెలుపు కుప్పసముఁ తోడ
పసిడి పీతాంబరముదాల్చు పసిడిఁబోణి !
నాల్గు చేతుల దివ్యమై వెల్గుచున్న
వాసవీమాత నీకు మా వందనమ్ము ! 2814

సీ. అపసవ్యహస్తాన నభయముద్రను పట్టి
వామంబునను జిల్కవ్రాల మురియ,
పై భాగమున నున్న పల్లవంబులఁ బోలు
రెండు చేతులయందు రెండు కలశ
ముల నుప్పతిల్లు పోకలఁదాల్చి శోభిల్లు
లలితమోహనరూప లలిత ! బాల !
సకల దిక్కుల కాంతి సంధించి వర్ధిల్లు
కోటిసూర్యప్రభాకోటి వెలుగు
తే.గీ. కన్య ! నీ పుట్టుకంటి మా కందువెల్ల
పావనంబాయె, లోహంబు పరుసవేది
సోకి బంగారమైనట్లు, సోమశృంగ !
వాసవీమాత ! నీకు మా వందనమ్ము ! 2815

వ. ఇట్లు తాము దర్శించిన వాసవీమాత రూపంబును వర్ణించి భక్తితో నమస్క
రించిన బాలవైశ్యులను గాంచి ప్రసన్నురాలైన పరమేశ్వరి యిట్లనియె. 2816

ఆ.వె. బిడ్డలార ! మిమ్ము ప్రేమించు పితరుల
తోడ నేను మదిని తోషమంది
మీదు భక్తి కెఱగి మీకొక్క కానుక
నివ్వఁ బూనినాను, నివ్వటించ ! 2817

సీ. నెలకొక్క పరిఁగాని, నెలలు రెంటికిఁ గాని,
అయనంబు కొక తూరి నయినగాని,
వత్సరంబున కొక్క వారమైనను గాని,
శుక్రవారపు ప్రొద్దు చూచి కాని,
వ్రాలి, నేఁ బుట్టిన వైశాఖ శుక్ల ద
శమి తిథి యందొక్కసారి కాని,
కల్పోక్తముగ పూజఁ గావించి నను దీక్ష
నర్చించు వారికే నఖిల శుభము
తే.గీ. లిత్తు, మణులిత్తు, మాన్యంబు లిత్తు, నిత్తు
వాహనంబుల, నుపభోగ్య వరము లిత్తు,
కలిని పరిశుద్ధ చరితంబుఁ గలుగు వారి
కిత్తు మోక్షంబు, సన్నిధి నిచ్చగింప ! 2818

తే.గీ. బాల విశులది విని వేడి రాలకింతు
మట్టి పూజా విధానంబు నమరు మంత్ర
రాజ మెల్ల బోధించుమా రాజ్య లక్ష్మి !
మమ్ము తరియింపఁ జేయుమా మాన్య చరిత ! 2819

వ. అంత నవ్వాసవియు నిట్లు పల్కె నో భక్తశ్రేష్ఠులారా ! 'ఓమ్' అను ప్రణవ బీజమును, తరువాత 'హ్రీమ్' అను మాయాబీజమగు దేవీ ప్రణవమును, నాపై 'ఐమ్' అను వాగ్భవ బ్రహ్మ బీజాక్షరమును, ననంతరము 'శమ్' అను చంద్ర బీజమును, నంతమున 'వమ్' అను నమృత బీజము నుంచిన నది నా మంత్రము నందలి బీజాక్షర పంచకమగు నా వెనుక. 2820

వాసవి. ఆ సమారంభ మందున బల్కగానౌ నాదగు నామమైన "శ్రీ
వాసవీకన్యకాపరమేశ్వరీ" వాక్యంబును నందుపైన మీ
యాసలన్ దీర్చగాఁదగుమాట "శ్రేయఃదేహి" యటంచు నాపయిన్
న్యాసముల్ ద్యోసదుల్ గొనరాగ "స్వాహా" యంచు వచింపగావలెన్.

వ. మొత్తమీ యిరువది మూడక్షరములు కూర్చినచో "ఓమ్, హ్రీమ్, ఐమ్, శమ్, వమ్, శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ శ్రేయోదేహి స్వాహా" యను మంత్రరాజమై జపించు వారికి సర్వసంపదలును, సత్సంతానభాగ్యంబు నంతంబునమోక్షంబును కరతలామలకంబగు, నిందలి తొలిబీజాక్షర పంచకమునకు 'శ్రీ వాసవీకన్యకే మహ్యమ్ సర్వసౌభాగ్యమ్ దేహి దేహి స్వాహా' యను నిరువది యక్షరములఁ గలిపిన సర్వోత్తమమైన పారాయణ మంత్రమై అనంత పుణ్యప్రదంబగు. 2822

తే.గీ. మంత్రమును జెప్పిన ఋషి 'సమాధి' యనఁగ,
జగతి ఛంద,స్సమృతము బీజమ్ము నగును,
చరమ పదరాజమే మంత్ర శక్తి యగును,
కీలకంబది సౌభాగ్య మాలకింప ! 2823



తే.గీ. ఆలయంబుల బేరంబు లందు 'నిత్య',
అంతికంబుల కలశంబులందు 'క్షణిక',
యనఁగ నన్నుంచి పూజించుడయ్య భక్తి,
రూపముల రెంటియందొక్క రూపు నిలిపి ! 2824

వ. ఆలయంబుల బిందువును, త్రికోణంబును, షట్కోణంబును, వసుకోణంబును, నష్టదళ పద్మంబును, భూపురంబును నొకదాని చుట్టు నొకటి నుంచి షడావరణాత్మకంబగు వాసవీ చక్రమును లిఖించి నాలుగు భుజములతో, శిరంబున చంద్ర రేఖతో, వరదాభయ హస్తంబులతో, శుక పద్మ కరంబులతో, కమలాసనంబున కూరుచున్న పరమ మంగళకరమగు నన్ను స్థాపించి. 2825

తే.గీ. దుర్గ, వనదుర్గయును, పక్షదుర్గయునిక,
భ్రామరీదుర్గ, పైన ద్వారాగ్నిదుర్గ,
వేదదుర్గయు, తుది జాతవేదసియు న
నంగ బిందువున్నర్చయొనర్చి యంత. 2826

వ. ద్వితీయావరణమున క్షేత్రపాలురగు గణపతిని, సప్తమాతృకలను, తృతీయావరణమందింద్రాద్యష్టదిక్పాలకులను, చతుర్థావరణమునందు సూర్యాది నవగ్రహంబులను, పంచమావరణమున చక్రశూలపాశముద్గరంబులను, ఋగ్యజుస్సామాధర్వణవేదంబులను ప్రతిష్ఠించి, భూపురంబుననన్ను శ్రీసూక్తవిధివిధానంబుల పూజింపవలయు నిది పూజావిధానంబుల సర్వోత్తమంబగు, మరియును. 2827

ఉ. బాలకులార ! చేకొనుడు పాత్రయుగంబు సుధాప్రపూర్ణమున్
మేలగు పోకలంబరగు, మీ వివహంబులనుంచినోముచో
మేలగు మీకు, కీడు పొలిమేరలు దాటు నిజంబు, మీకికన్
జాల వరంబులిత్తు, చెయిఁజాచుఁడనంగ విడాత్మజుల్ వడిన్. 2828

వ. వివాహములందీ కలశద్వయంబునుంచి పూజించుడన నబ్బాలకులును మహాప్రసాదంబనుచు స్వీకరించి మరియును. 2829

ఉ. మా పురమందు నీవు నిలుమా ! కొనుమా తిరుబోనముల్ సదా !
నీ పద నీరజ స్తవము, నీ ముఖచంద్ర సుధాంబు పానమున్,
నీ పథ వర్తనంబులను నిల్వగ నిమ్ము నిరంజనా ! మహా
ఘాపనుదా! యనన్, విశులకాంక్షితముల్ నెరవేర్పనెంచుచున్ ! 2830

వ. అటుల కాదుకాని నాజన్మ తిథినుండి తొమ్మిది దినంబులు మనపురంబున విహరింతు మీ కోరికఁదీర్తుననుచుఁ బితరులతో వాసవియంతర్థానమయ్యె. 2831

***ఇది శ్రీవాసవీపురాణమందు వాసవీ పారాయణమంత్రోపదేశమను తొంబది యేడవ అధ్యాయము సంపూర్ణము.***

(పితాళ్ళు, స్వధాభుజులు= పితృదేవతలు, ప్రణేజనము= స్నానము, గొదగొని= ధరించి, ఈడితాస్థ= పొగడబడిన ఆస్థానము కలది, కుప్పసము= రైక, ఎఱగి= పొంగి, నివ్వటించు= వ్యాపించు, ద్యోసదులు= దేవతలు, అంతికము= గృహము, తిరుబోనములు= నైవేద్యములు, అఘాపనుద= పాపములు తొలగించునది.)



# తొంబది యెనిమిదవ అధ్యాయము

**కం. విరజా ! ఛందస్సారా !**
**పరతంత్ర విభేదినీ ! ప్రభా రూపాంకా !**
**గురు మండల స్వరూపా !**
**పరాపరా ! పాశహస్త ! బ్రహ్మ సవిత్రీ !**

కం. ఎంతటి యదృష్టమగు వా
రంతటి మహనీయ మంత్ర మా వాసవిచే
స్వాంతంబుల నొందిరనఁగ
నంతట ముని చెప్పసాగె నర్య చరితమున్. 2832

శా. ఆనందంబుగ వైశ్య బాలకులు నా యాచార్యుతోఁ గూడి తా
మానందాశ్రులు పొంగ నారసిన దివ్యావేశితాఖ్యానముల్
గానాలై తనుపన్ గయాంగికి నమస్కారంబు లర్పించుచున్
కోనన్ నైమిశ నామకంబున జొరం గూరంగ నక్కక్ష్యకన్ ! 2833

ఆ.వె. అచట పుండరీకుఁ డను ముని పుంగవుం
జూచి, గురుని వైపు చూచి పలికి
రిట్టు లెవ్వరీ మునీంద్రుం డెవని గోరి
తపము చేయుచుండె తలరుఁ దక్కి ! 2834

ఆ.వె. ఇతఁడు పుండరీకుఁ డిందు గదాధరున్
గూర్చి తపమునందు కూరుచుండె,
నడిగి తెలిసికొనుఁడు హరి దివ్య చరితంబు
నఘముఁ బాపు విన్న ననియె గురుఁడు. 2835

ఆ.వె. అంత వినయమొప్ప నా మునీంద్రుని జేరి
వందనార్చనాదు లందుఁ దనిపి
దయఁ దలంచి హరి గదాధరుఁ గూర్చి మా
చెవుల కింపుఁ గూర్ప చెప్పుమనిరి. 2836

వ. అంత నా వైశ్యపుత్రుల వినయ విధేయతల మెచ్చిన పుండరీకుండును.

ఆ.వె. చూడ చిన్న వయసు, చూడ్కులా హరి మీద
తీర్చి దిద్దెనెవడు దిద్దు లేక ?
ననఁగ గురుని జూప కనిపించె నీతండు
పుండరీకు శ్రౌతి బుడుక వైచె. 2837

తే.గీ. భాస్కరాచార్యుఁ జూచిన పరమ మౌని
ఏల నేజెప్ప వలెనందు రితని వీడి
వేడుఁడన భాస్కరుఁడును దా వినతిఁ జేసె
విందు నేనును మీ నోట విందుగ ననె. 2838

వ. అంత పుండరీకుండును నాతిథేయంబుగ గదాధర వృత్తాంతంబు నిట్లు వివరింప దొడంగె. 2839

తే.గీ. బ్రహ్మ మానస పుత్రుండు బ్రహ్మచారి
యగు సనత్కుమారుండు విద్యార్థియైన
ముని మృకండుసూతికిఁ జెప్ప ముఖ్యమైన
దిది గదాధరు మాహాత్మ్య మెఱుఁగుఁడయ్య ! 2840

చం. జగమున కర్మకాండలన శ్రౌతము, స్మార్తము రెండు రీతులన్
నెగడును, యజ్ఞ శ్రాద్ధముల నెట్టెల హవ్యము, కవ్యమున్ సదా
జగపతి కోగిరంబులగు, జన్నపు హవ్యము కంటె శ్రాద్ధమున్
జగతి పితాళ్ళ పేర నిడు సంకటి ముద్దలె తృప్తిఁ గూర్చెడున్ ! 2841

తే.గీ. అగ్నిహోత్రంబు నందున నాహుతులగు
హవ్యముల దేవతలఁగూడి యారగించు,
శ్రాద్ధముల గదాధరుఁడౌచు జనులుపెట్టు
పిండములు తానెభక్షించు పితరులందు. 2842

తే.గీ. దాన హోమాదులను చేయఁ బూనకున్న
శ్రద్ధతో పిండముల నుంచు శ్రాద్ధ కర్మ
చే గదాధరు తృప్తుని చేయవలయు,
నట్టిచో ఫల మక్షయంబగును నిజము. 2843

వ. చేయఁగూడని పనులు చేసియైనను శ్రాద్ధవిధులు నిర్వహింపవలయుగాని విస్మరింపరా దందుకొక గాథ వినిపింతును శ్రద్ధతో వినుఁడు. 2844

ఉ. ప్రా యుగమందునుండె నొక బ్రాహ్మణవర్యుఁడు, వేదవేది, వా
త్స్యాయనుఁ డిద్ధ వర్తనుఁడు నాతని కేడ్గురు పుత్రు లుచ్ఛ్రితుల్,
ప్రాయము మించిపోయినను పాండితి యంట దదేమొ? అంతలో
ప్రాయముఁదీరి తండ్రి తనుపాత మొనర్చెఁ గుమాళ్ళ వీడుచున్. 2845

చం. చదువులు లేని పుత్రులకు శ్రాద్ధములందెనలేని నమ్మకం
బదనున తల్లిదండ్రులకు నగ్ని క్రియాదుల నాచరించి రా
కుదిరిక లేని బాలకులు, కొంపను వీడక నూరనుండినన్
చదువరులైన దాయ లుపచారము లందును పేరుగ్రుచ్చరే ! 2846

ఆ.వె ఊరివారు దూరముంచగా నేడ్గురు
బాలకులును లోన బాధపడిరి,
విద్యలేకఁ గాదె విదిలించి వైచుట,
మనికి లేదు విదుల మధ్య మనకు. 2847

ఉ. అంతటి వేదవేత్తలగు నమ్మకు నాన్నకు చెడ్డ పేరు తే
నెంతటి భాగ్య హీనుల మిదేమిటి జీవితముల్ గ్రహింప, నా
జంతువులే నయంబనుచు, సంతతి లేక గతింప పాపమం
చంతయునెంచి వీడిరి జనాంతము, పట్టిరరణ్యదేశముల్ ! 2848

ఆ.వె. తిరిగి తిరిగి యొక్క దివ్య ప్రదేశమం
దొక్క మునినిఁ గాంచి మ్రొక్కులిడిరి,
రజ్జులాడకయ భరద్వాజ మునియని
తెలిసి వేద విద్య వలయు ననిరి. 2849

తే.గీ. గడ్డములు పెంచి పెద్దలై కంటఁబడిన
బ్రహ్మచారులఁ జూచిన బ్రహ్మవిదుఁడు
వయసు మీరిన మీకెట్లు వలను పడును
వేద విద్యల నేర్వంగ వెడలు మనెను. 2850

చం. అయినను బోక యర్భకులు నాగమముల్ పఠనంబుఁ జేయకే
పయనము గాము కామనుచు బండతనంబున నుండ నాతఁడా
శ్రయమిడె, నీ విధిన్ హతము ఛందమునం దొనగూడ బాగుగా
నయనము విచ్చునంచు, గహనంబున గోవును మేపి తెమ్మనెన్. 2851

ఆ.వె. ఆస తీరెనంచు నానంద ముప్పొంగ
నావుతోడ ఛాత్రు లడవికేగి
గురువు చెప్పినట్లు గోసేవలో నుండ
తిథులు నడచె విపిన తిథము రీతి. 2852

ఆ.వె. ఉపచరించు కొలది హోమధేను బలము
హెచ్చెఁ గాని, బుద్ధి హెచ్చదాయె
శిష్య సప్తకమున, సిద్ధింప దొక పాఠ
మైన గురుని బోధనైన గాని ! 2853

చం. అటులొకనాడు దావమున నావునుగాయుచు దూరమేగగా
చటుకున జ్ఞప్తివచ్చెనది శ్రాద్ధదినంబని జన్యుదేవుఁడా
కట వసియించునంచు, తమకార్యము తండ్రినితృప్తిచేయుటొ
క్కటెయని చిత్తగించి రిక కవ్యము నేమిట యంచు నేడ్గురున్. 2854

ఆ.వె. చేయఁగూడనట్టి చేతలనైనను
శ్రాద్ధ మిడగ వలయు, సలుపకున్న
దారుణాఘ మొదవి రౌరవాది నరక
ముల వెతల నివాస ముండ వలయు. 2855



తే.గీ. ఎన్ని విధముల తడిమిన నేమి ఫలము?
తోచదొక యుపాయమును మందులకు, కడకు
కంటఁబడె నావు, నికఁ దీరె కార్యమనుచు
నొకఁడు ప్రతిపాదనము జేసె నోటలేక. 2856

కం. హవ్యను జంపుట పాపము,
కవ్యముగా పెట్టుటన్న ఖర్వంబగు నాన్,
ద్రవ్యము ముఖ్యము కాదిట
కవ్యంబిడ వలయునంచు కడపిరి గోవున్ ! 2857

తే.గీ. అటుల శ్రాద్ధంబు కాలంబునందు జరిపి
వట్టి చేతుల గురు నిక్కపట్టుఁ జేరి
కపిల పులిపాలఁ బడెనంచు కల్లలాడ,
నతఁడు దివ్యదృష్టిని జూచి ఋతముఁ దెలిసె. 2858

ఉ. తర్పణ మొందె నేలిక గదాధరుఁ డెమ్మెయి గవ్య కవ్యమున్,
తర్పణమొంది తేనయిన, తప్పొనరించె నబద్ధమాడి, మా
యార్పిత బుద్ధు లీ జడులు, న్యాయము చేవలెనం చసత్య దో
షార్పణఁ జేసె శిష్యతతి నంతట నేడ్గురు ప్రాణ శూన్యులై. 2859

తే.గీ. బొంకి పొందిన పాపంపు పొడవడంచ
నెఱుక, బెబ్బులి జన్మల నేడు నేడు,
చక్ర, చక్రాంగ భవముల సంతరించి
భ్రమరి బ్రాహ్మణులైపుట్టి పట్టిరొజ్జ. 2860

చం. గురువచనాగ్ని తప్తత నకుంఠుల ఛాత్రులఁ జేరఁదీసె నా
గురువును, సాంగ షట్కముగ కోర్కెలఁ దీర్చెను వేద పాఠముల్
కఱపుచు, పాఠనాంతమున కట్నము నొంది, వివాహ మాడగా
భరపడి పంపె, వారును విభావసులైరి ధరామరార్యులై ! 2861

వ. లోకంబున నట్లనృత దోషంబునకు శిక్షలును, శ్రాద్ధకార్యంబుల కహీన ఫలంబులును దయసేయును గావున మీరెల్లరును గయాదుల శ్రాద్ధాదుల జరిపి గదాధరు దయకు పాత్రులై యుత్తమ లోకంబులకు సిద్ధమైతిరన నా వైశ్య యువకులును సంతోషించి పుండరీకుని దీవనలంబడసి గురు పరివారంబులతో తిరుగు ప్రయాణమైరి. 2862

తే.గీ. గాంగ జలములతో వచ్చు కార్పటికులు
దారియందుగాంచిరి నర్మదానదీ ప్ర
వాహమున దొర్లివచ్చెడి వహ్ని ప్రస్త
రముల శివలింగములఁగాంచి రక్తిమీర ! 2863

కం. తలకొక లింగముఁ గొని చని
నెలవుల గుడి కట్టి పూజ నెఱపుద మనుచున్,
తలకొక లింగము గొని, పెను
శిల కరుదెంచగ కదలిరి శివశివ యనుచున్ ! 2864

చం. రమరమి వత్సరంబునకు రాపురి పద్మపురంబుఁ జేరి రా
సుమతులు, చూచిరా శిబిర సోముని, రాజకులావతంసునిన్,
సమతల స్వాప దీక్షితుని, శ్రాంతుని, సంతత వాసవాంబికా
సమధిక భావనా రతుని, సద్గుణ మిత్రుని, రాకుమారునిన్ ! 2865

***ఇది శ్రీవాసవీపురాణమందలి శ్రాద్ధవిధి మాహాత్మ్యమను తొంబది యెనిమిదవ అధ్యాయము సంపూర్ణము.***

(ఆవేశికుడు= అతిథి, శ్రౌతి= బుద్ధి భేదం, నెట్టెలు= జతలు, ఉచ్ఛ్రితులు= పొడవెదిగిన వారు, జనాంతము= ఊరు, తిథము= అగ్ని, ఇక్కపట్టు= నివాసము, చక్ర= చక్రవాకము, క్షీరాశి= హంసము, అకుంఠులు= మూఢులు కానివారు, భరపడి= సమ్మతించి, వహ్ని ప్రస్తరములు= అగ్నిశిలలు)



# తొంబది తొమ్మిదవ అధ్యాయము

**కం. యజ్ఞప్రియా ! నిరామయి !**
**విజ్ఞాన కలన ! వసుమతి ! విశ్వగ్రాసా !**
**విజ్ఞాత్రీ ! కూటస్థా !**
**అజ్ఞాన ధ్వాంత దీపికా ! త్రిగుణస్థా !**

ఆ.వె. విశుల రాక నెఱిఁగి వీర రాజేంద్రుండు
విబుధ లోకమెల్ల వెంటరాగ
ప్రీతి నెదురు బోయి ప్రియమార నాలింగ
నములు చేసి నియమనములఁ జరిపె. 2866

ఆ.వె. మూడు నదులు కలియు ముక్తి తీర్థము నందు
మునిగి శుద్ధమైన మూర్తు లొదవి
కాశి నీట నస్థికల ముంచి, గయలోన
పిండముంచి పితరు లండఁ గొనిరి ! 2867

తే.గీ. మోములను జూడఁ బుణ్యముల్ ముంచి తేల్చు,
పాదముల మ్రొక్క పాపముల్ పాఱిపోవు,
ధన్యులము మీ చెలిమిని పాతకము లురలె,
స్వీకరింపుడు రాజ్యమ్ము స్నేహయుక్తి ! 2868

వ. అంత విరూపాక్షాదులును స్వాంతంబుల వినయ మొప్పంగ నిటులనియె.

చం. ధరణి ధరాధినాయకుఁడె తల్లియు, తండ్రియు, పాలకుండు నౌ
నరులకు, వర్ణధర్మముల నమ్మికనేలెడు వాఁడుగాన భూ
వరుఁడగు, స్తేయదాయఖలవహ్నుల బాధలఁ గాయుచుంటచే
గురుఁడగు, ప్రేమప్రోదికొను కూరిమిఁజూపునుగాన తల్లియౌ! 2870

ఆ.వె. అట్టి రాజు నెట్లు నెట్టివైతుము మేము
ధర్మమునకు హాని తలంపఁ గలమె ?
పసుల పాలనంబు పాటింపనిమ్ము, మీ
మనుజ పాలనంబు మాకు నేల ? 2871

వ. అనుచు యాత్రా విశేషంబులఁ బ్రొద్దు పుచ్చి, చేసిన మేలునకు కృతజ్ఞత లర్పించి, వాని వ్రతంబున కుద్వాసనము పలుకుచు నిట్లనిరి. 2872

తే.గీ. ఏలికలు మీరు, మా పైన నెలమి యున్న
మాఘ శుద్ధ విదియనాడు మరువకండు
జనని జ్యోతిలోఁ జేరిన చరిత, రండు
రాజ పరివారములతోడ పాజములకు ! 2873

కం. అని రాయని యంగీకృతిఁ
గొని వైశ్యులు బయలుదేరి కొండ నెలవుకున్
జని పయనపు శ్రమముడుగఁగ
గొని రాదటఁబోవ శ్రాంతి కుదురుగ నంతన్. 2874

ఉ. పండుగ చేరువాయె నిక బంధువు లందరఁ బిల్వగా వలెన్,
దండిగ భోజనాదులను తన్పవలెన్ గద యంచు వైశ్యులం
దండగ నొజ్జ యుండ నిఖిలార్య గణంబును, పౌర యూథమున్
దండుగ నమ్మ దర్శనము దంటఁ గొనంగ నియోగ మంపగన్. 2875

ఉ. వారును బంధు మిత్ర పరివారముఁ దోడ్కొని మాతృ దర్శనా
పార పరాయణాక్షులయి పల్లకి, పల్లన లందు నెక్కి రాఁ
బౌర జనాళి హ్లాదమున స్వాగత మిచ్చిరి బంధుకోటికిన్,
వారిజ సంభవాండ పరివాహ పరీవృత దివ్య సన్నిధిన్ ! 2876

తే.గీ. మాఘ మాసంపు ముందు కోమట్లు కూడి
శుభ్రముగ స్నాన మొనరించి సుప్రతీక,
సోమగర్భులకును మ్రొక్కి చూడఁబోయి
రాత్మ గురుపాదులను వారి యాశ్రమమున. 2877

వ. చూడవచ్చిన శిష్యకోటి నాశీర్వదించి యభీష్టంబు నడుగ వారును. 2878

ఆ.వె. ఛాత్ర మానసాంబు జాతాప్త ! దీప్తాంశు
లైన మీరు మాకు నైన వారు,
కన్యక యిడినట్టి కలశంబు లెచ్చోట
నుంచ వలయు నవధరించు డయ్య ! 2879

ఆ.వె. అనఁగ భాస్కరుండు వినయంబునకు పొంగి
నడువుఁ డయ్య ముందు నగర విభుని
మండపంబుఁ జేరి మాట్లాడు కొందము
కదలుఁ డనుచు తాను కదలె గుడికి. 2880

తే.గీ. గుడినిఁ జేరిన వైశ్య గురుఁడు వచించె
నీశు వాస మీశాన్యంబ యెప్పుడుండుఁ
గనుక నమృత కలశమందు గర్బ గుడినిఁ
జేర్చి పూజింపుడీ ! మదుల్ తీర్చు నమ్మ ! 2881

కం. ఇక పోకల కలశంబును
నికరంబుగ నున్న గోత్ర నిచయం బందున్
ప్రకటంబుగ పంచుకొనుఁడు
శుకవహ కడనుంచి హితుల శుభములఁ గనుచున్ ! 2882

ఆ.వె. అంత వారు నటుల నాచరించిన యంత
రాజభటుఁడు వచ్చి రాజు రాక
తెలిపె, నెల్లవారు తేరున కెదురేగి
స్వాగతములు పలికె సంబరమున ! 2883

ఉ. రాజును తేరు డిగ్గి తనరారెఁడు బంధులు బాహులందు వి
భ్రాజిల హత్తుకొంచు నునుపారిన బంధము నుగ్గగట్టుచున్
రాజధరాధివాసముఁ గిరాటుల వెంబడి చేరె నా వణి
గ్రాజిఁ గుశాసనస్థుడయి రాజిలె రాజును వోలె తారలన్ ! 2884

ఉ. రాజపురోహితుండు ధనరాడ్జనభాస్కరుఁజేరి ముచ్చటల్
యోజనసేయ, నెల్లరును యోగ్యవచోవిభవమ్ముఁ దేలగన్,
రాజు వచించె భాస్కరుకరమ్ములు తాకుచు నర్ధరాజ్య ని
ర్ణేజనమిత్తు నొప్పుకొన నెట్టనసమ్మతిఁజేయు భూసురా ! 2885

చం. అన గురుశిష్యులిద్దరును నాననముల్ కనుగొంచు మౌనభా
షణములఁ గన్నుసైగల విచారముసల్పుచు నెట్టకేలకున్
చనవున భాస్కరుండనెను, సర్వభృతాధృత ! తావకీన వా
ఙ్మనమున జన్మనొందెనెది, మార్గముచూపె ధరిత్రికంతకున్ ! 2886

చం. అయినను మా విరూప కమలాక్షుఁడు కన్యక పేరు మీదుగా
మెయికొను భవ్యదత్తమగు మేదిని మొత్తము, దాన భోగ వి
క్రయముల కైన నెల్ల యధికారము లాదట నిత్తువేని, సం
శయమొక యింతలేదు క్షితిజాని ! నిశాపతి వంశవర్ధనా ! 2887

చం. అన ముఖమెల్ల చంద్ర మయమై, నవ మల్లిక లొత్తిరాల, భూ
ధనుఁడు వచించె, నా హృదయధామము నిర్ఝరమయ్యె భూసురా !
చనవరి సమ్మతింపవలె, సర్వము నిత్తును, మేముసైత మీ
వణిజునియింట బంటులయి వాసవిఁగొల్చుచు నుండిపోదుమీ !2888

వ. అనుచు నమస్కరించిన, భాస్కరాచార్యుండు శిష్యుల మొగంబులఁ జూచి వలదు వలదను వారిదండంబుల కనుగ్రహించుచు రాజును దీవించి. 2889

తే.గీ. ఒడయలను పేరు రాజుల కుండ నిండు,
వణిజులను పేర వైశ్యుల వరల నిండు,
ఇచ్చినది యెట్టు లేలుటో యెఱుఁగ నిండు,
ఒదిగి మీ వెంట నంటుగా నెదుగనిండు. 2890

వ. అనుచు రాజునకు నచ్చఁజెప్ప నతండును నర్ధరాజ్యంబు దేవికి సమర్పించుట కనువుగ నగరేశ్వరాలయంబున కెదురుగ వాసవీమాత కాలయమొండు నిర్మింపుడంచు భోజనానంతరంబు చననొక్క సుముహూర్తంబున నా వైశ్య బాలకులును. 2891

ఉ. వానరసేన సంభ్రమున వారధిఁగట్టినయట్టు లందరున్
పూనిక నొక్కరొక్కరును పుణ్యఫలంబులఁబేర్చి కోవెలన్
బోని గృహంబుఁగట్టి పువుబొద్దున విగ్రహముంచ సర్వసం
స్థాన విభాతమాయె నెదదల్‌వికసించె వియచ్చరాళికిన్ ! 2892

ఉ. వార్త నెఱింగి భూపతి చివాలున లేచి రథంబు నెక్క నా
వార్తను విన్న మంత్రి గురు బాంధవు లాప్తులు సేవకాళి వే
వర్తిలె వెంట నంటి, విశవాస విశేష విలాస మేదియో
వర్తిలి యుండవచ్చునను వాసన పట్టిన నాసికా ద్యుతిన్ ! 2893

ఆ.వె. రాజు వెనుక నట్లు రాణువెల్లయుఁ జేరి
వైశ్యవార్ధినున్న వాసవాంబ
చరణ రజము సోక శిరములఁ గీలించి
పాప ముక్తులైరి భవభవముల ! 2894

వ. రాజును వాసవీదేవి పాదములపై శిరమునుంచి 2895

స్తోత్రము :
భద్రరూపి నమస్తేఽస్తు భక్తానాం భద్ర రూపిణి !
మహాకాళి నమస్తేఽస్తు హ్యసురాణాం విమర్దిని !
నారాయణి నమస్తేఽస్తు భక్తవాంఛిత దాయిని !
మాయాయైచ నమస్తేఽస్తు సర్వ మోహ విధాయిని !
వాసవ్యైచ నమస్తేఽస్తు వసోర్విష్ణో స్సహోదరీ !
దుర్గాయైచ నమస్తేఽస్తు సర్వదుఃఖ వినాశిని !
విజయాయై నమస్తేఽస్తు భక్తానాం విజయావహే !
వైష్ణవ్యైచ నమస్తేఽస్తు విష్ణు చక్ర కృతాలయే !
చండికాయై నమస్తేఽస్తు శుంభాసుర నిషూదిని !
కృష్ణాయైచ నమస్తేఽస్తు కృష్ణస్యచ సహోదరీ !
కన్యకాయై నమస్తేఽస్తు కామకోటి స్వరూపిణి !
నమస్తే పరమేశ్వర్యై పరా ప్రకృతి రూపిణి !
శారదాయై నమస్తేఽస్తు బ్రహ్మశక్త్యై నమోనమః !! 2896

ఉ. రాజకిశోరమప్పదవిరాజితరాజలలాటరేఖలన్
రాజు విరూపుజాతకపుఁవ్రాతగనంగ పురోహితోత్తమున్
భాజనమౌముహూర్తము, శుభప్రదమున్, విదధీశుబీజమున్
యోజనసేయుఁడన్న నిజయోగవిచారముఁదెల్పె ధౌమ్యుఁడున్! 2897

సీ. లగ్నమెల్లి యనఁగ మగ్న మానస కోటి
పథము లానంద బాష్పములఁ దడిపి,
ఇళ్ళు వాకిళ్ళు లోనిళ్ళ మాదిరి శుద్ధ
మొనరించి సరిక్రొత్త యుడుపులూని,
పందిళ్ళు ముంగిళ్ళు సందళ్ళు సేయంగ
ముత్యాల రతనాల ముగ్గు లలఁది,
ప్రతివారు తమయింట పండుగ వలె నిండు
మనముల రాజ సమ్మాన మునిచి,

తే.గీ. ఎపుడు మా వాసవీమాత యేలికగునొ,
అపుడు కనిపించితీరు నాయమ్మమఱల
మఱలిపోనీయకూడదీమాఱు మనము
నిలిపి పూజించవలెనంచు నిలిచినారు. 2898

ఉ. వాసవిదేవళంపు మొగవాళముఁజేరి ముహూర్తవేళ, వి
శ్వాసులమధ్య రాజకులవర్ధనుఁడంబకు మ్రొక్కి, స్థేయులం
దాస ఘటించె సత్వరమనాదిపరాకృతి కర్ధరాజ్యమున్
న్యాసముచేయుఁడంచు వినయంబునునెయ్యము మేనరాజిలన్! 2899

తే.గీ. అచటఁ జేరిన పౌర జనాశయముల,
వైశ్య యువకుల నిర్వేద వాస్తవముల
నడుమ ధౌమ్యుండు రాజేచ్ఛ నడుపఁ దొడఁగె
భాస్కరుఁడు మౌనముగ తోడ పదము గలుప ! 2900



తే.గీ. అగ్ని రగిలించి వేద మంత్రానుసార
మాజ్య పాయస సమిధాది హవ్యములను
హవన మొనరించి ఆయాతయామ మంత్ర
పఠనమందున వాసవీ ప్రవరఁ జదువ .... 2901

సీ. అంత నర్చా మూర్తి స్వాంత పల్లవ మట్లు
లోనుంచి పొడగట్టె లోకమాత !
శాంత సుందర హాస కాంత కంజభవాండ
చంద్రికల్ నల్దెసల్ చౌకలింప,
వదన మందునఁ దోచు వాత్సల్య విధురేఖ
స్థాణులం జేతనత్వంబు నింప,
కనులందు కారుణ్య కంజాలయము మాన
వాఘ పుంజహరంబునై చెలంగ,

ఆ.వె. సమ్మతించె నర్ధ సామ్రాజ్య మా మీద
వరము కోరు మిత్తు సరగ ననియె !
ఉలికి పడియె రాజు తలమీద వెలిచెట్టు
పడిన యట్టు, తుదకు పలికెఁ దేఱి ! 2902

మ. తొలి నా నాయనచేతకే యిటుల చేతుల్మోడ్చి యాచింప, నా
చెలికాడీ విధి సమ్మతించె, నటులే చేపట్టుటేచాలు నా
కలుషంబింత శమించినం దొలఁగు శోకంబెల్ల, సంతుష్టుడన్ !
మఱి నాకేలవరంబు లోకజననీ ! మన్నించుమా దీనునిన్ ! 2903

తే.గీ. అంత వాసవీ మాత రాజా! యిదే మ
మాయకత్వంబు నీలోన మలిన మేమి ?
దోషి నీ తండ్రి, శిక్షతో ద్యుసదుఁడయ్యె,
చూతువా యేమి వానినేఁ జూపు దనియె. 2904

ఆ.వె. తం(డ్రి శుద్ధుc దగుచుc దవిషంబుc గలcడంచు
విం చుc జూడc గోర్కె విస్తరిలగ,
చూపు మంచు మాత శు(భ పాదములపైc
బడcగc జూపె నట్లె పార్థివునకు ! 2905

ఉ. చూచుచునుండ సింహధర సుందర రూపము దక్క నెల్ల భూ
గోచరముల్ కనంబడవు, కుక్షమెఱుంగని యక్ష దేవతా
ఖేచరముల్ కనంబడును, కేవల కాంతిమయాకృతుల్ మదిం
దోచును, నందొకానొకటc దోచెను తం(డ్రిని బోలి చెంగటన్ ! 2906

తే.గీ. నాటి పు(త్రకా సేమమే ! నన్నుcగూర్చి
చింత వలదింక, యిచట నిచ్చింత నుంటి,
నరమరల్లేని లోకంబు నమృతమనుచు
వెడలె నా యమ్మ పాదముల్ వీడ కనుచు. 2907

కం. ఇంతేనా కనిపెంచిన
తంతుకు నా మీది (ప్రేమ ! తనువు సెడంగన్
కాంతాసుత బంధుత్వము
లింతే కద తల్లి యంచు నేలిక పొగులన్ ! 2908

తే.గీ. అధిపుc డొందిన యనుభవ మందరకును
కలిగె, సంతోష మొందిరి కన్నవారి
ముక్తులుగ చూచి తల్లికి (మొక్కినారు,
రెండు ఫలితంబు లుండునే యొండు (క్రియకు ! 2909

ఉ. అంతట తల్లి వర్తకుల నందరc గాంచి కుమారులార, మీ
రింతట నర్ధ రాజ్యమును నేలుకొనుండు మనంబుదీర ! వృ
త్త్యంతరమందురా ... రయము నయ్యది పూర్ణ పురోహితోత్తమున్
పొంతకుcబోయి దానమిడ పొంగును మీకునభీష్ట సిద్ధులున్ ! 2910



కం. అని పుర జనులనుc జూచిన
జనని మనము పులకరింపc జన నియ్యెడనే
కనిపించెద భక్తిc బిలువ
ననవరతము వరములిత్తు ననుచు లయించెన్ ! 2911

వ. అంతట తల్లి యానతిc బాటించి విరూపాక్షుం డాచార్యు ననుజ్ఞc గొని ధౌమ్యు చెంతకుం జని వినయంబున కేల్మోడ్చి. 2912

ఉ. పూర్ణ పురోహితోత్తములు, పుణ్యులు మీరలు గారె పట్టుడీ,
పూర్ణ మనంబు తోడ నిడు భూరిజ దానము శంక లేక, నీ
భూర్జి సహోదరీకృత విభూతి, యధీన మొనర్తు, దీని సం
కీర్ణముc జేసెదో- లలి వికీర్ణముc జేసెదొ మీ యభీష్టముల్ ! 2913

చం. అనవిని విష్ణువర్ధన మహా(ప్రభు నందను డబ్బురంబునన్
చనవరి బుద్ధి మాన్యతకు చాగిలి, కోమటి తెల్వియన్న నా
కనుభవమాయె నిప్పుడు, కృతార్థుcడ నైతి విశాధినాథ ! శ్వ
స్తనమున రాజ్యకాంక్ష మిముతాకు నిజంబిది, పోయివచ్చెదన్ ! 2914

వ. అనుచుc (బయాణమగు రాకుమారుని పరివారంబులతోడ, సకల రాజ లాంఛనంబుల తోడ, సంతోషము తోడ వీడ్కొలిపిన విరూపాక్షాదులు భాస్కరాచార్యుల తోడ మరలి వాసవీ గృహంబుc జేరి. 2915

***ఇది శ్రీవాసవీపురాణమందలి విరూపాక్షునకు రాజసమ్మానమను తొంబది తొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము.***

(నియమనములు= సత్కారములు, పాజము= భోజనము, పల్లన= గుఱ్ఱాలు, ఏనుగులపై కూర్చొనుటకేర్పాటు, సు(ప్రతీకుడు,రాజధరుడు= శివుడు, సోమగర్భుడు= విష్ణువు, శుకవహ= వాసవి, ఉగ్గగట్టు= పురిబిగించు, నిర్ణేజనము= పాపపరిహారము, సర్వభృత= భూమి, ఆదట= (ప్రేమ, చనవరి= మి(త్రుడు, సంస్థాన= ఆకృతుల, మొగవాళము= ముంగిలి, స్థేయుడు= పురోహితుడు, సరగ= వేగము, వెలిచెట్టు= కల్పవృక్షము, ద్యుసదుడు= దేవత, తవిషము= స్వర్గము, కుక్షము= కడుపు, శ్వస్తనము= భవిష్యత్కాలము.)

# నూరవ అధ్యాయము

కం. **భక్త ప్రియా ! భవానీ !**
**రక్తాక్షీ ! భద్రమూర్తి ! రసమయ మూర్తీ !**
**భక్త జన కల్పలతికా !**
**వ్యక్తావ్యక్త స్వరూప ! వజ్రోజ్జృంభా !**

ఆ.వె. తిరిగి వచ్చి భగవతీ గృహంబునుఁ జేరి
గురునిఁ దిరిగి రాగ కూరుచుండి,
రాజ వచన మందు రాగమా ! శాపమా ?
తెలియకున్న దనినఁ దెలిపె గురుఁడు. 2916

చం. కలియుగ మందు మీదుగల కాలము ధర్మముఁ దప్పు, నంతటన్
కులములు సంకరంబులగు, కామితముల్ పరమోన్నతంబులౌ,
పులుగుల రీతి మానవులు పుట్టుచుఁ జచ్చుచు నాదికాల మం
దలి నరజాతి జీవనమె దారియగుం దుదకున్ జగంబునన్ ! 2917

సీ. రక్త సంబంధమ్ము రిక్తమైపోవును
డబ్బు సంబంధమే ప్రబ్బుకొనును,
పెళ్ళిపేరంటాలు పిలుపులందయ్యెడి
డబ్బున్నవారిదే గబ్బితనము,
పొరుగులస్నేహముల్ పొల్లులైపోవును
డబ్బున్న స్నేహమే దుబ్బుకొనును,
బిరుదుసత్కారముల్ విపణిలో సరుకౌను
డబ్బున్నచాలు మీ కబ్బగలవు,

తే.గీ. కులముగోత్రమ్ము వంశంబు కూడుపెట్ట
వనెడు సూత్రంబుపాటించి ధనముముందు
దాసులైయన్య ధర్మంబు దరిఁజనుదురు,
ధర్మశూద్రత సామాన్య ధర్మమగును. 2918

ఆ.వె. అనఁగ విట్టుమారులడలుచు నుత్తర
కాలమందు నడపు కార్యమెటుల ?
దేనికొఱకు దేవి దేహంబువిడచెనో
దాని నిలుపఁగలుగుదారి చెపుమ ! 2919

ఆ.వె. విట్టుమారు లటుల వినతిసేయఁగ నొజ్జ
యెలమిఁదెలిపె వైశ్యకులమునందు
మొదటినుండికలుగు మూలముల్ దశలింగ
విధులనడపుఁడయ్య వెలయుజాతి ! 2920

చం. అనవిని వైశ్యపుత్రులవి యందఱకుం దెలియంగజెప్పుఁడీ
వినియెదమంద రొక్కపరి, వీడిరి పెద్దలు ముక్తికాములై,
వినిచెద రెవ్వరింక? మిమువేడెద మాశ్రితశిష్యపోషకా !
అని వినుతింప నాతఁడునునట్లె వినుండనిచెప్పె గుర్తులన్ ! 2921

వ. గ్రంథిశిల గోత్రమువారికి ఋషి గౌతముఁడు, దైవము విజయేశ్వరుఁడు, తపస్థానము సహ్యాద్రి, సంఖ్య కోటి, సరోవరము విజయాంబుధి, దీపములరువది, క్షేత్రము జాబిలి, దానము నెయ్యి, వర్జ్యము దేవకాంచనము;

2.బుధన(బుద్ధి)కుల–ఋ.భార్గవుఁడు, దై.నాగేశ్వరుఁడు, త.కనకాద్రి, సం.లక్ష, స.నాళికాంబుధి, దీ.79, క్షే.కేదారము, దా.గోవు, వ.నిమ్మపండు;

3.వెలిగోళ్ళ– ఋ.జైమిని, దై.మీనేశ్వరుఁడు, త.విమలాద్రి, సం.లక్ష, స.నవనీతము, దీ.21, క్షే.వేణీప్రయాగ, దా.వెండి, తెల్లనివస్త్రము, వ.ఉసిరిక;

4.కోరట– ఋ.మతంగుఁడు, దై.కుమారేశ్వరుఁడు, త.రత్నగిరి, సం.లక్ష, స.ధరణి, దీ.50, క్షే.జాబిలి, దా.ఏనుగు, వ.పిన్న గోరింట;

5.పెద్దిశిష్ట– ఋ.ప్రీతిమానసుండు, దై.జయేశ్వరుండు, త.జయవాటి, సం.లక్ష, స.రాజాంబుధి, దీ.50, క్షే.ఔదంబవనము, దా.మహిషము, వ.చిఱుపెసలు;

6.పేరిశిష్ట– ఋ.పరమతత్వుండు, దై.పాణికేశ్వరుండు, త.గంగాతీరము, సం.పది కోట్లు, స.పర్వము, దీ.50, క్షే.రజితాద్రి, దా.ముత్యములు, వ.మేకపెరుగు;

7. వినికోలు– ఋ.విశ్వామిత్రుండు, దై.విశ్వేశ్వరుండు, త.హేమాద్రి, సం. కోటి, స. వీరము, దీ.54, క్షే.హిమాచలము, దా.రత్నములు, వ.వెలగపండు;

8.సూరిశిష్ట– ఋ.సుతీక్షణుండు, దై.సువర్ణేశ్వరుండు, త.నర్మదాతీరము, సం.కోటి, స.శృంగము, దీ.25, క్షే.బదరీ, దా.బంగారము, వ.దొండపండు;

9.కనకపాల– ఋ.కనకపాలుండు, దై.గౌరీశుండు, త.బదరికాశ్రమము, సం. పది లక్షలు, స.గర్గ, దీ.36, క్షే.కుమారగిరి, దా.వస్త్రములు, వ.జిల్లేడుపూవు;

10.ధనగుళ్ళ– ఋ.సంవర్తకుండు, దై.ధర్మేశ్వరుండు, త.కృష్ణాతీరము, సం. పదిలక్షలు, స.ధర్మము, దీ.20, క్షే.రజితాద్రి, దా.ధాన్యము, వ.దానిమ్మపూవు;

11.సాతాల– ఋ.సనస్సుజాతుండు, దై.సుమంత్రేశ్వరుండు, త.విజయాద్రి, సం.లక్ష, స.చంచరీకము, దీ.25, క్షే.బదరికాగిరి, దా.స.సం.లు, వ.జమ్మిపత్రి;

12.తుప్పాల– ఋ.తుంబురుండు, దై.విమలేశ్వరుండు, త.హిమాచలము, సం. లక్ష, స.అశ్వత్థ, దీ.30, క్షే.ఔదుంబవనము, దా.తులాభారము, వ.పిప్పలి;

13.పుష్పాల– ఋ.పేశలుండు, దై.భీమేశ్వరుండు, త.గోదావరీతీరము, సం.లక్ష, స.భాను, దీ.16, క్షే.కేదారవనము, దా.గోవు, వ.గానుగపిండి, గజపిప్పలి;

14.వసంత– ఋ.వరుణుండు, దై.వామనేశ్వరుండు, త.వారణాసి, సం.లక్ష, స.నిర్గుండి, దీ.14, క్షే.భువనేశ్వరము, దా.గుఱ్ఱము, వ.వంకాయ, పొగడపూలు;

15.పుచ్ఛ(పృచ్ఛక)కుల– ఋ.కుత్సుండు, దై.విమలేశ్వరుండు, త.పురుషోత్తము, సం.వేయి, స.విమలము, దీ.24, క్షే.ఉమ్మడేశ్వరము, దా.మణి, వ.తెల్లానపకాయ;

16.మాసంత– ఋ.కపిలుండు, దై.మదనేశ్వరుండు, త.మందాకిని, సం. పదిలక్షలు, స.మాళవీసింధు, దీ.20, క్షే.పెనుగొండ, దా.నల్లావు, వ.మినుములు;

17.విక్రమశిష్ట– ఋ.సాందీపని, దై.విశ్వేశ్వరుండు, త.గోదావరీతీరము, సం. పది లక్షలు, స.విజయ, దీ.56, క్షే.ఔదంబ, దా.బంగారము, వ.వావిలి;

18.అయనకుల– ఋ.ఆపస్థంబుండు, దై.భోగేశ్వరుండు, త.వేదారణ్యము, సం. కోటి, స.పున్నాగ, దీ.50, క్షే.కేదారవనము, దా.షోడశ, వ.(ద్వాదశితప్ప)అవిసికూర;

19. మండకుల– ఋ.మందపాలుండు, దై.కోటేశ్వరుండు త.కేదారము, సం.నూరు కోట్లు, స.కమలాంబుధి, దీ.50, క్షే.జాబిలి, దా.గోవు, వ.మామిడికాయ;

20. బలిశిష్ట– ఋ.భారద్వాజుండు, దై.భార్గవేశ్వరుండు, త.పంపాతీరము, సం.లక్ష, స.బలసాగరము, దీ.30, క్షే.ఉమ్మడేశ్వరము, దా.వడ్లు, వ.బచ్చలికూర;

21. పద్మశిష్ట– ఋ.బృహదశ్వుండు, దై.సరస్వతీశుండు, త.జగన్నాథము, సం.పదివేలు, స.సర్వాంబుధి, దీ.36, క్షే.సీతాపురి, దా.అన్నం, వ.తామరలు;

22. అనంతకుల– ఋ.ఋష్యశృంగుండు, దై.అనంతేశుండు, త.మేరువు, సం.కోటి, స.అనంతము, దీ.79, క్షే.శ్రావణబెళగొళ, దా.అనంతము, వ.అలచందలు;

23. వెన్నుకుల– ఋ.వాలఖిల్యుండు, దై.సోమేశ్వరుండు, త.సరస్వతీతీరము, సం.పది కోట్లు, స.ప్రాసాద, దీ.21, క్షే.భువనేశ్వరము, దా.బంగారము, వ.వెదురు బియ్యము;

24. కొమరశిష్ట– ఋ.కూర్ముండు, దై.భృంగీశ్వరుండు, త.వృద్ధాచలము, సం.లక్ష, స.అపూప, దీ.60, క్షే.హిమాచలము, దా.అన్నము, వ.గోరింటాకు;

25. మూరుకుల– ఋ.మార్కండేయుండు, దై.మహేశ్వరుండు, త.వేంకటాద్రి, సం.లక్ష, స.మాలాంబుధి, దీ.16, క్షే.రజితాద్రి, దా.గుఱ్ఱము, వ.గారపండు;

26. ముంజికుల– ఋ.ముంజవ్రతుండు, దై.మూలేశ్వరుండు, త.పుష్పగిరి, సం.12 లక్షలు స.అభినవ, దీ.36, క్షే.మాయావని, దా.దుంపలు,బట్టలు, వ.మిరియములు;

27. అభిముంచ– ఋ.అప్నవానుండు, దై.అయుతేశ్వరుండు, త.మేరువు, సం.లక్ష, స.అమృతాంబుధి, దీ.16, క్షే.పెనుగొండ, దా.రత్నములు, వ.అరటిపండ్లు;

28. చిన్నిశిష్ట– ఋ.శాండిల్యుండు, దై.దుర్గేశుండు, త.రజితాద్రి, సం.లక్ష, స.ధర్మ

సాగరము, దీ.79, క్షే.జాబాలినగరము, దా.ఏనుగు, వ.చామలు;

29. వినిశిష్ట– ఋ.శమీకుఁడు, దై.వల్లభేశ్వరుఁడు, త.శేషాద్రి, సం.పదిలక్షలు, స.వసంత, దీ.90, క్షే.భద్రాద్రి, దా.రత్నములు, వ.తిక్తశాకము(ఉలిమిరి);

30. శినిశిష్ట– ఋ.శ్రీధరుఁడు, దై.శిరీషేశ్వరుఁడు, త.కైలాసము, సం.లక్ష, స.సింధు సాగరము, దీ.40, క్షే.పెనుగొండ, దా.మేక, వ.చిరుసెనగలు;

31. పైడికుల– ఋ.పర్వతుఁడు, దై.పర్వతేశ్వరుఁడు, త.పంపాతీరము, సం.లక్ష, స.పుష్పసాగరము, దీ.30, క్షే.ఉమ్మడేశ్వరము, దా.పనసపండు, వ.కాకరకాయ;

32. భ్రమరకుల– ఋ.ప్రమదకుఁడు, దై.వీరేశ్వరుఁడు, త.ప్రయాగ, సం.లక్ష, స.విశ్వాంబుధి, దీ.30, క్షే.రజితాద్రి, దా.పీతాంబరము, వ.చిఱువడ్లు;

33. ఘనశీల– ఋ.అగస్త్యుఁడు, దై.గౌతమేశ్వరుఁడు, త.కైలాసగిరి, సం.కోటి, స. కమల జలధి, దీ.60, క్షే.మందరగిరి, దా.తులాభారం, వ.కుంకుళ్ళు;

34. వేంకోల– ఋ.వేదనిధి, దై.భీమేశ్వరుఁడు, త.వేంకటాద్రి, సం.లక్ష, స.భీమ సాగరము, దీ.73, క్షే.లక్ష్మణఝూల, దా.రత్నములు, వ.వంకాయలు;

35. పృథ్విశిష్ట– ఋ. భృగువు, దై. పృథ్వీశ్వరుఁడు, త. రజితాద్రి, సం. లక్ష, స. పార్థివము, దీ. 23, క్షే. బదరికాగిరి, దా. భూమి, వ. నేరేడుపండు;

36. రెంటకుల– ఋ. రేభుఁడు, దై. వసంతేశ్వరుఁడు, త. దండకాటవి, సం. లక్ష, స. వనసరోవరం, దీ. 30, క్షే. మందరగిరి, దా. కన్య, వ. కెంపు(కురువింద);

37. ఉశరీకుల– ఋ. హరివక్త్రుఁడు, దై. భీమేశ్వరుఁడు, త. సింహాచలము, సం.లక్ష, స.భ్రమరసాగరము, దీ. 35, క్షే. ఔదంబ, దా.బంగారము, వ. ఉశిరిక;

38. సూసాళ్ళ– ఋ.కౌండిన్యుఁడు, దై. జగదీశ్వరుఁడు, త.నర్మదాతీరము, సం. లక్ష, స. జరూకము, దీ. 50, క్షే. కుమారగిరి, దా. బంగారుపాత్ర, వ.పాటలపుష్పము;

39. చిద్రూపుల– ఋ. పవిత్రపాణి, దై. చిత్రేశుఁడు, త. ప్రయాగ, సం. వేయికోట్లు, స. చింతామణి, దీ. 50, క్షే. మాయావని, దా. గొడుగు, వ. చామంతి, చిరికూర;

40. దీక్షాకుల– ఋ. అక్షయుఁడు, దై. భాస్కరుఁడు, త. భాస్కరము, సం. పది కోట్లు, స.భాసకము, దీ.55, క్షే. కేదారవనము, దా. బంగారము, వ. ద్రాక్షపండు;

41. బుధురుకుల– ఋ. బోధాయనుఁడు, దై. బ్రహ్మేశ్వరుఁడు, త. మేరువు, సం. వేయికోట్లు, స. కమలాంభోధి, దీ. 50, క్షే. అమరావతి, దా.భూమి, వ.శివమల్లె;

42. యనసకుల– ఋ. విశావర్యుఁడు, దై. కోటీశ్వరుఁడు, త.మలయగిరి, సం. లక్ష, స. కోటసాగరము, దీ.13, క్షే. గదాధరనగరము, దా.ధనము, వ.గోధుమలు;

43. కామశిష్ట– ఋ.కామ్యకుఁడు, దై.పూర్ణేశ్వరుఁడు, త.కాళింది, సం.పంచాగ్నుల్లో పదికోట్లు, స.కామాబ్ధి, దీ.20, క్షే.పెనుగొండ, దా.స్వర్ణము, వ.కంద,కర్పూరములు;

44. స్యందిక– ఋ. సత్యవ్రతుఁడు, దై. వృషభేశ్వరుఁడు, త. కావేరీతీరము, సం.పది లక్షలు, స.పుష్పాంబుధి, దీ.70, క్షే. బదరీ, దా. ధాన్యము, వ.నేరేడుపండ్లు;

45. స్వస్తికుల– ఋ. మహాసేనుఁడు, దై. క్షీరేశ్వరుఁడు, త. మేరుగిరి, సం. నూరుకోట్లు, స. క్షీరాంబుధి, దీ.13, క్షే. విదేహ, దా. ఏనుగు, వ.వట్టివేరు;

46. కదంబకుల– ఋ. కౌత్సుఁడు, దై. నందీశ్వరుఁడు, త. నర్మదాతీరము, సం. లక్ష, స. నందిసరస్సు, దీ.40, క్షే. ఉమ్మడేశ్వరము, దా. కన్య, వ. నల్లకలువ;

47. అనుమర్షణ– ఋ. స్థూలశిరుఁడు, దై. హాలాస్యనాయకుఁడు, త. మధుర, సం.కోటి, స. జీవన్ముక్తి, దీ.50, క్షే. రామనాథపురి, దా. పగడములు, వ. స్ఫటికము;

48. యలమంచ– ఋ. కృష్ణద్వైపాయనుఁడు, దై. వైభవేశ్వరుఁడు, త. ఏలేశ్వరము, సం. కోటి, స. వైభవము, దీ.40, క్షే. రజితాద్రి, దా.వృషభము, వ.ఏలకులు;

49. త్రిమూల– ఋ. మాధవుఁడు, దై. మాతృభూతేశుఁడు, త. అలంపురము, సం.పది కోట్లు, స. జంబూ, దీ. 78, క్షే. హైందవగిరి, దా. దాసీ, వ. కర్పూరము;

50. ముష్టక– ఋ. ముచికుందుఁడు, దై. మంద్రేశ్వరుఁడు, త. దండకాటవి, సం.లక్ష, స.కపిత్థ, దీ.50, క్షే.జాబాలినగరము, దా.షోడశదానములు, వ. కురువేరు;

51. క్రముకశిష్ట– ఋ. శరభంగుఁడు, దై. జమదగ్నీశుఁడు, త. శ్రీశైలము, సం. పదికోట్లు, స. పావనము, దీ.51, క్షే. హరిద్వారము, దా. వస్త్రములు, వ.దుంపలు, నల్లావుపాలు;

52. చందకుల– ఋ. ధౌమ్యుఁడు, దై. చిత్రేశ్వరుఁడు, త.యమునాతీరము, సం.పది లక్షలు, స.చిత్రాబ్ధి, దీ.21, క్షే. ఔదంబ, దా.నువ్వులు,కృష్ణాజినము, వ.తెల్లచెఋకు;

53. తోటక– ఋ. తుర్యవ్రతుఁడు, దై. భూతేశుఁడు, త. మలయగిరి, సం. పదిలక్షలు, స. పుష్పాంబుధి, దీ.36, క్షే. మాయావనము, దా. గృహము, వ.ఎఱ్ఱతోటకూర;

54. ప్రౌఢయాచ– ఋ. మౌసలుఁడు, దై.ప్రౌఢేశ్వరుఁడు, త.తామ్రపర్ణీతీరము, సం. పదిలక్షలు, స.పృధివి, దీ.18, క్షే.త్రిపురాంతకము, దా.గోవు, వ.పొట్లకాయ;

55. అంగమకుల– ఋ. హయగ్రీవుఁడు, దై. జలేశ్వరుఁడు, త. గోదావరీతీరము, సం.లక్ష, స.కృష్ణసాగరము, దీ.20, క్షే.రజితాద్రి, దా.సదాన్నదానము, వ.ఆనప;

56. సోమశిష్ట– ఋ. శక్తి, దై. విశ్వేశుఁడు, త. గంగాతీరము, సం.లక్ష, స. వీరాంబుధి, దీ. 17, క్షే. పెనుగొండ, దా. అప్పుడేయీనిన ఆవు, వ.నీవారధాన్యము;

57. పాలకుల– ఋ. పావనుఁడు, దై. ప్రోలేశుఁడు, త. బ్రహ్మాచలము, సం. లక్ష, స. వల్మీక, దీ. 72, క్షే. విదేహ, దా. పండ్లు, వ.మాదీఫలము;

58. ఇసుమకుల– ఋ. విష్ణువృద్ధుఁడు, దై. కపిలేశ్వరుఁడు, త. నర్మదాతీరము, సం. కోటి, స. కపిలాంబుధి, దీ. 63, క్షే. గజపురము, దా. షోడశ, వ. ఇంగువ;

59. చక్రమూల– ఋ.జాతవేదుఁడు, దై.చక్రేశ్వరుఁడు, త. బ్రహ్మావర్తము, సం. నూరు కోట్లు, స. చక్రతీర్థం, దీ. 70, క్షే. బదరీ, దా. గొడుగు, వ. చక్రవర్తికూర;

60. వృద్ధికుల– ఋ. బృహస్పతి, దై. బృహదీశుడు, త. శ్రీముష్ణము, సం. పదికోట్లు, స. బృహస్సరము, దీ.21, క్షే.పాతాళగంగ, దా.కన్య, వ.గజపుష్ప, ఫల,వస్త్రములు;

61. వస్తుకుల– ఋ. వశిష్ఠుఁడు, దై. రాజదేవుఁడు, త. పద్మాచలము, సం. లక్ష, స. పల్లవము దీ. 32, క్షే. రజితాద్రి, దా.వజ్రము, వ.వట్టివేరు;

62. క్రానుక– ఋ. పుండరీకుఁడు, దై. కామేశ్వరుఁడు, త. సరస్వతీతీరము, సం. కోటి, స. కామసాగరము, దీ. 60, క్షే. బదరీ, దా. ఏనుగు, వ. కానుగ సంబంధించినవి;

63. కమల– ఋ. శుకుడు, దై. మహేశ్వరుఁడు, త. కమలాలయము, సం.కోటి, స.ముక్తిసారము, దీ.73, క్షే.లక్ష్మణఝాల, దా.ముక్తాహారము, వ.తెల్లతామరగడ్డ;

64. కన్యకుల– ఋ. గార్గ్యుఁడు, దై. భైరవేశ్వరుఁడు, త. శ్రీకూర్మము, సం. కోటి, స. హస్తి, దీ.53, క్షే. యమునోత్రి, దా. ఏనుగు, వ. తెల్లకలువలు, నేరేడుపళ్ళు;

65. ధనద– ఋ. కృష్ణుఁడు, దై. కృష్ణేశుఁడు, త. గంగాతీరము, సం.పదికోట్లు, స. కృష్ణసాగరము, దీ. 20, క్షే. రజితాద్రి, దా. ధనము, వ. ఉత్తరేణి;

66. త్రివిక్రమ– ఋ. త్రిజటుఁడు, దై. జనార్దనుఁడు, త. సిద్ధవటము, సం. లక్ష, స. తుర్యము, దీ. 20, క్షే. రజితాద్రి, దా. గుఱ్ఱము, వ. బూడిదగుమ్మడి;

67. శమనక– ఋ.కాంచనుఁడు, దై.చంద్రేశ్వరుఁడు, త.గంగాయమునలమధ్య, సం. రెండుకోట్లు, స.కామధేను, దీ.33 క్షే.ఆనందగిరి, దా.మణులు, వ.మల్లె, తోటకూర;

68. శౌనక– ఋ. శౌనకుడు, దై. వీరేశ్వరుఁడు, త.కురుక్షేత్రము, సం.పదిలక్షలు, స. ప్రసూనాంబుధి, దీ. 55, క్షే. ఔదుంబ, దా. ఏనుగు, వ. చేమలు, చేమంతి;

69. అమలకుల– ఋ. ఆశ్వలాయనుఁడు, దై. నర్మదేశ్వరుఁడు, త. మేరువు, సం.లక్ష, స. జంబూ, దీ. 70, క్షే. బదరి, దా. ఏనుగు, వ. అత్తిపండ్లు;

70. పరిశిష్ట– ఋ. విష్వక్సేనుఁడు, దై. విరూపాక్షుఁడు, త. వింధ్యాగ్రము, సం. కోటి, స. కేతక, దీ. 20, క్షే. హిమగిరి, దా. కన్య, వ. మాలతి, వావింటికూర;

71. తులసీకుల– ఋ. పూతికర్ణుఁడు, దై. దుర్గేశ్వరుఁడు, త. శ్రీశైలము, సం.నూరు కోట్లు, స. దేవసాగరము, దీ. 37, క్షే. యమునోత్రి, దా. షోడశ, వ. తులసి;

72. భీమశిష్ట– ఋ. జాబాలి, దై. భీమేశ్వరుఁడు, త. సింధూతీరము, సం. లక్ష, స. భీమాబ్ధి, దీ.100, క్షే.అశోకవనము, దా.రత్నములు, వ.తెల్లపట్టు, పుల్లప్రబ్బలి;

73. గుండుకుల– ఋ.శార్‌జరవుఁడు, దై. కుబ్జేశ్వరుఁడు, త. ఋష్యమూకము,

సం. లక్ష, స.కూష్మాండము, దీ.20, క్షే. రజితాద్రి, దా.నెలనెలా గుమ్మడిపండు, వ.దంటుకూర, నిమ్మపండు;

74. ఇక్ష్వాకు– ఋ. మహాతేజుండు, దై. భోగేశ్వరుండు, త. దండకాటవి, సం.లక్ష, స.భోగము, దీ.73, క్షే.లక్ష్మణఝాల, దా.అశ్వము,గజము, వ.చెఱకు,దాసానిపూవు;

75. హస్తిక– ఋ. శరభంగుండు, దై.రామేశ్వరుండు, త. మలయగిరి, సం.లక్ష, స. అశ్వత్థ, దీ. 70, క్షే. అశోకవనము, దా. తండులములు, వ. బచ్చలి;

76. శ్రీపుంసిక– ఋ. పౌలస్త్యుడు, దై.వీరేశ్వరుండు, త.పారియాత్రము, సం.లక్ష, స. పుష్పాబ్ధి, దీ.70, క్షే. బదరీ, దా. బంగారము, వ. పాలపండు;

77. గణప– ఋ. కశ్యపుండు, దై. ధనేశ్వరుండు, త.బ్రహ్మాద్రి, సం.పదిలక్షలు, స. ధర్మాబ్ధి, దీ.17, క్షే. గంగానగరము, దా. బంగారము, వ. కంద, కరవీర;

78. ఉద్వాహ, రవిశిష్ట– ఋ. ప్రభాతుండు, దై. కుసుమేశుండు, త. పినాకినీ తీరము, సం. పదికోట్లు, స. పుష్పసాగరము, దీ. 60, క్షే. మందరగిరి, దా. ముత్యములు, వ. కుంకుమపూవు, కుసుంబవస్త్రము;

79. మన్యు, మానాభ– ఋ. మాండవ్యుండు, దై. దక్షిణేశ్వరుండు, త. శ్రీశైలము, సం. నూరుకోట్లు, స. దక్షసరోవరము, దీ. 55, క్షే. ఔదంబవనము, దా. షోడశ మహా దానములు, వ. పసుపు బట్టలు;

80. అనుపాల, అనుపకుల– ఋ. అంగీరసుడు, దై. సకలేశ్వరుండు, త. కనకాద్రి, సం. లక్ష, స. సరస్వతీతీర్థము, దీ. 51, క్షే. బదరీ, దా. మహిషీ, వ. అనుములు;

81. ఇంచుకుల, గొంటుకుల– ఋ. ఇడిమ్మీరుండు, దై. కీర్తీశ్వరుండు, త. ఇంద్ర నీలగిరి, సం. కోటి, స. చంద్రసరోవరము, దీ.30, క్షే. అమరావతి, దా. గోవు, వ.పోకలు, తెల్లకలువలు;

82. తులశిష్ట, వృకశిష్ట– ఋ. తుందిలుండు, దై. విజయేశ్వరుండు, త. సింహా చలము, సం. కోటి, స. బర్బర, దీ. 79, క్షే. నాశిక, దా. గజము, వ. తుమ్మికూర;

83. శ్రీరంగ, శ్రీలకుల– ఋ. శ్రీవత్సుండు, దై. శివుండు, త. సింధూతీరము, సం. లక్ష, స. అర్జునము, దీ.30, క్షే. ఉమ్మదేశ్వరము, దా.అశ్వము, వ.చిరుకూర, చిట్టాముదము;



84. ఘంటక, ఘనముఖ– ఋ. కణ్వుండు, దై. గణేశుండు, త. కృష్ణవేణీతీరము, సం. కోటి, స. పుష్టి, దీ.20, క్షే. బదరీ, దా. బంగారము, వ. దోసపండు;

85. చేగోళ్ళ, చేరుకోళ్ళ– ఋ. కందర్పుండు, దై. కామేశ్వరుండు, త. కావేరీతీరము, సం.పదికోట్లు, స.కామ, దీ.50, క్షే.జాబిలి, దా.దాసి, వ.శ్రీగంధము, మాదీఫలము;

86. ఫలక, పట్టణకుల– ఋ. చండిగుండు, దై. వ్యాసేశ్వరుండు, త. హిమగిరి, సం.కోటి, స.నందసారము, దీ.40, క్షే.గజపురము, దా.పండ్లు, వ.పాలపండ్లు;

87. దేశిష్ట, దైవిశిష్ట– ఋ.దేవలుండు, దై.ధనదేశుండు, త.గంగాతీరము, సం. లక్ష, స.ధర్మసాగరము, దీ.40, క్షే.రజితాద్రి, దా.ఆవు, వ.దేవదారువు, దాడిమీ ఫలములు;

88. మిధున, మద్దికుల– ఋ. మైత్రేయుండు, దై. నాగేశ్వరుండు, త. శ్రీశైలము, సం. 20వేలు, స. నాగసముద్రము, దీ. 30, క్షే. ధర్మపురి, దా. ఏనుగు, వ. కోర చాప, జిల్లేడుపూవు, మొగలిబెత్తము, నాగచతుర్థినాడు తెలకపిండి;

89. సనకుల, సానకుల– ఋ. సనకుండు, దై. కర్ణేశుండు, త. వింధ్యాద్రి, సం. లక్ష, స.రత్నసాగరము, దీ.94, క్షే. గంగాతీరము, దా.భూమి, వ. జాజికాయ;

90. ఉతశిష్ట, ఉతకాల– ఋ. నారదుండు, దై. ఉత్తరేశ్వరుండు, త. హేమాద్రి, సం.కోటి, స.ఉత్తరసాగరము, దీ.35, క్షే. భద్రాచలము, దా.నీటికుండ, వ. ఉత్తరేణి;

91. ఉపమన్యు, ఉపనకుల– ఋ.ఉదంకుండు, దై.కుంభేశ్వరుండు, త.మలయాద్రి, సం.లక్ష, స.కోన, దీ.73, క్షే. లక్ష్మణఝాల, దా.బంగారము, వ.శ్రీగంధము;

92. కాలకుల, కర్ణాటకుల– ఋ. కాశ్యపుండు, దై. ద్రాక్షేశుండు, త. గంగా సంగమము, సం.పది లక్షలు, స.రామాంబుధి, దీ.20, క్షే.రజితాద్రి, దా.ఒంటె, వ.తెల్లకందులు;

93. చన్నకుల, జానకుల– ఋ.జహ్నువు, దై.త్రిపురేశ్వరుండు, త.నర్మదాతీరము, సం.కోటి, స.వనమాల, దీ.13, క్షే.విదేహపురము, దా.మదగజము, వ.జామపండు;

94. దాంతకుల, దెంతకుల– ఋ.దత్తాత్రేయుండు, దై. ధర్మేశ్వరుండు, త. సరయూ

తీరము, సం. కోటి, స. ధర్మసరోవరము, దీ. 200, క్షే. నారాయణపురము, దా. కన్య, వ. దాసానిపూవు, అనుములు;

95. మునికుల, మూలకుల, నాభీల– ఋ. మౌద్గల్యుఁడు, దై. మాధవుఁడు, త. మలయపర్వతము, సం. కోటి, స. మలయాంబుధి, దీ. 100, క్షే. అమరావతి, దా. మహిషీ, వ. కస్తూరి, తెల్లవంగ, ములగ;

96. యవిశిష్ట, అరశిష్ట, అరసకుల– ఋ. యాజ్ఞవల్క్యుఁడు, దై. వృషభేశ్వరుఁడు, త. సరయూతీరము, సం. లక్ష, స. నందము, దీ. 40, క్షే. భీమాభిక్యపురము, దా. వాహనము, వ. ఎఱ్ఱతోటకూర కాడలు, కానుగ బెత్తములు;

97. చంద్రిక, చంద్రమాల, చంద్రశిష్ట– ఋ. చతుష్కర్ణుఁడు, దై. క్షీరేశుఁడు, త. తోతాద్రి, సం. కోటి, స. పున్నాగ, దీ. 39, క్షే. పళని, దా. గుఱ్ఱము, వ. సంకులు, లత్తుక, శ్రీగంధము;

98. ప్రోలిశిష్ట, ప్రోలికుల, పుంసికుల– ఋ. పౌండ్రకుఁడు, దై. ప్రోలేశ్వరుఁడు, త. మధ్యార్జునము, సం. కోటి, స. భువనాబ్ధి, దీ. 40, క్షే. యమునోత్రి, దా. పల్లకి, వ. జీడిమామిడి, కుంకుమ, జవ్వాది;

99. చింతకుల, చింతమకుల, చింతశిష్ట– ఋ. చిత్రకుఁడు, దై. ప్రణవేశుఁడు, త. సింహాచలము, సం. కోటి, స. చింతామణి, దీ. 32, క్షే. రామనాథపురి, దా. ధాన్యము, వస్త్రములు, వ. చింతచిగురు, జీడిపప్పు, అల్లము;

100. వ్రక్కాల, వ్రంగమకుల, వక్రశిష్ట– ఋ. వాయువ్యుఁడు, దై. రామేశ్వరుడు, త. శ్రీశైలము, సం. పదికోట్లు, స. రాజసాగరము, దీ. 40, క్షే. గజపురము, దా. షోడశదానములు, వ. ఆవాలు, జీలకఱ్ఱ, కడియాలు;

101. పాంచాళ, పడగశిల, పాణుసకుల, కమతకుల– ఋ. పరాశరుఁడు, దై. క్షీరేశ్వరుడు, త. శ్రీశైలశిఖరము, సం. లక్ష, స. క్షీరసాగరము, దీ. 20, క్షే. పెనుగొండ, దా. పండ్లు, వ. ఖర్జూరము, గజనిమ్మ, కర్పూరము, మొగలిపూవు;

102. పునగశిల, గోశీల, ఉత్తమగోశీల, పల్లవగోశీల, పటుగోశీల, సత్యగోశీల, భీమగోశీల, వృషగోశీల, నందిగోశీల, సూర్యకుల– ఋ. పులస్త్యుఁడు, దై. పృథివీశుడు, త. మంధరగిరి, సం. లక్ష, స. పుష్పాంబుధి, దీ. 40, క్షే. పెనుగొండ, దా. నువ్వులు, వ. తెల్లపట్టు, పులిగోరు, జవ్వాది;

సూర్యకుల(సూర్యశిష్ట) – ఋ. సూనృతుఁడు, దై. సువర్ణేశుఁడు, త. అంతర్వేది, సం. పదికోట్లు, స. సువర్ణాంబుధి, దీ. 36, క్షే. వారణాసి, దా. బంగారము, వ. నల్ల చెఱుకు, పునగశిలాది తొమ్మిదిగోత్రములవారితో వివాహనిషేధము. 2922

ఆ.వె. నూటరెండుగోత్ర కూటంపు దశలింగ
లక్షణంబులివియ శైక్షులార !
ఔషధంబులందు దోషముల్ కావు వ
ర్జ్యములు తెలిసిమసలుఁ డర్యులార ! 2923

కం. కుల గౌరవ మను దీపము
నిలబెట్టగ జాలు మంత్ర నిధి దొరుకుటచే
పొలుపున గేల్మోగిచి గురుని
వెలయించిరి నుతుల నతుల విఘసము తోడన్ ! 2924

***ఇది శ్రీవాసవీపురాణమునందు దశలింగలక్షణములనెడు నూరవఅధ్యాయము సంపూర్ణము.***

(శైక్షులు= వేదమారంభించిన శిష్యులు, విఘసము= దేవతాతిథుల భుక్తశేషము,భోజనము)

## నూటయొకటవ అధ్యాయము

**కం. అనఘా ! త్రిపురాంబా ! మా**
**లినీ ! మహా గురుమతీ ! కులీనావ్యక్తా !**
**సనకాది సమారాధ్యా !**
**అనాహతాబ్జ నిలయా ! ధరాస్థావ్యక్తా !**

కం. అని సాలంకాయనఋషి
వినిపించిన గాథవినుచు విఙ్మునిగణముల్
తనిసితిమి రాజ్యలోభము
గణియింపని విడ్విలాస గరిమన్ గనుచున్ ! 2925

తే.గీ. తండ్రి కులపెద్ద తనమైన తనయుఁ డిచ్చ
గించెనో తెల్పుఁడన నుగ్గడించె వక్త,
భాస్కరాచార్యుఁ జేరిన బచ్చులపుడు
పెద్ద కావలె కులమున దిద్దు డనిరి. 2926

చం. అతఁడును నెందుకీ విశయ మాకలనంబున కేమి యున్న దిం
క? తనయుఁడే కదా మతివకా డిది ధర్మము ! ఏమయా విరూ
ప తనయ ! తండ్రి బాధ్యతలు భారములే మగ బిడ్డకెందునన్ ?
గత సమయంబులివ్వి యని గారముఁజేసెను తండ్రి పోలికన్ ! 2927

చం. కుసుమ కుమారుఁడద్ది విని కోరికలేదు మహాశయా ! మనః
కుసుమము వాడిపోయినది, కోర్కెల కొమ్ములు రాలిపోయె, నీ
విసమునుఁ జిమ్ము పెత్తనము వెట్టము, దీననె గాదె మా కుటుం
బ సుషమ మాయమాయె నిక బాధ్యత లేమిటి కంచు వాకొనెన్. 2928



ఆ.వె. ఇదియ వరుస హితుని నేలిక కమ్మన్న
నేమి సేయ వలయు, నేమి సెలవు ?
దేశికోత్తమా నిదేశించుమా యంచు
విద్గణంబు గురుని వేడె నంత. 2929

ఆ.వె. నాడు యుద్ధమందు నారాయణున కెట్టి
సంకటము ఘటించె, సరిగ నట్టి
స్థితికి చేరువాయె శిక్షాకరుం డంత
నిష్ఠ ఛాత్రు గాంచి యిట్టు లనియె. 2930

స్వాగత.

సర్వ దేవతలు చల్లగఁ జూచున్,
నిర్వికారమున నిస్పృహ లేకన్
ఖర్వ సంపదల గర్వము లేకన్
నిర్వహించు మిక నీ కుల భూతిన్ ! 2931

ఆ.వె. కుల సమూహమెల్ల కొలువు తీరు మటంచు
కుతుక లెనచి నిన్ను బ్రతిమలాడ
కాదు కూడదంచు కాఠిన్యమును బూన
తగునె కుసుమ శ్రేష్ఠి తనయ చెపుమ ! 2932

ఉ. అంతటి దేవివాసవికి, నాదిపరాత్పర జీవశక్తికిన్,
ధ్వాంతజగత్స్థలీ ప్రకటధామగభస్తికి సోదరుండవై
స్వాంతపరాయణేష్టి ఫలసంతతివై కుసుమాత్మజుండవై
వింతవిరాగసాగరవివేచనమా ! వరవిట్కులాగ్రణీ ! 2933

ఉ. రాజ మనోరథంబున నిరాకరణంబన ధర్మశంకయే
వ్యాజ మనంగఁదోచు, నిదియా నినుబట్టి దహించు శంక ! వి
భ్రాజిత నైజ తేజమెటఁ బాసితివయ్య విరూప లోచనా !
వాజ విశేష తేజమున వాజినివోలె పరిక్రమింపుమా ! 2934

ఆ.వె. క్లైబ్య మొంది నీదు కర్తవ్యమునుఁ బాయ
కన్నతండ్రి యాత్మ కలగునయ్య !
పేరుఁ దెచ్చునంచు పెంచిన పుత్రుండు
వ్యర్థుఁడైన నెటుల బ్రతుక గలదు ? 2935

ఆ.వె. శక్తి, బలము, చేవ సొంతమ్ము మరచిన
హనుమ వయితి వింక, హరుఁడ వగుచు
స్థాణు గతిని వీడి చైతన్యమును బూని
నేత వగుము వైశ్య జాతి కిపుడు. 2936

కం. అని సముదాయించెడు నా
జ్ఞను సంశయమున గనుచు విడగ్రణి యేదో
వినిపించగ వెనుకాడుచు
పనుపడు చున్నాడటంచు పటిమన్ గురుఁడున్ ! 2937

ఉ. ఏమిటి సందియమ్ము ? అది యేమయిన న్వెడుకాద నేల ? నీ
కామిత మెట్టిదైన వెటకారము సేయఁగ దాయనే ? శ్రియః
కాముఁడ ఛాత్రులందు, ననుగంతల కెందులకోయి మర్మముల్ !
ప్రాముఁడు మాని పల్కుమిక పాటన సేసెదనంచు పల్కగన్. 2938

ఉ. నాన్నల మించి బిడ్డల మనంబులఁ దీరుచు దేశికాగ్రణీ !
నన్ననజాలు దీవు, గణనాయక పట్టముఁ గట్టఁజాలు దీ
యున్న జనంబులందు ప్రతి యొక్కఁడు ప్రాజ్ఞుఁడె, జాతిసేవ కే
బన్నముకైన సిద్ధపడు పారగుఁడే, తెగుదారియే ననన్. 2939

కం. శిష్యుని మనమున గల కా
లుష్యము సమయింప జాలు లోక హితోక్తిన్
కృష్యమొనరించి యాతని
వృష్యాఢ్యుని జేయ గురుఁడు వీడని పూన్కిన్. 2940



తే.గీ. పద్మరాగాల గనియ మీ ప్రాపణికుల
కులము గాజురాళ్ళుండునే ! కోఁఱడమగు,
నేమయా నాయకత్వంబు నెవ్వరేని
కొనెడు తలపున్న లభియించు ననియె గురుఁడు. 2941

ఆ.వె. కొరడు కొఱకు జూడ కొఱవి దయ్యము వోలె
పదవి బరువు మీద పడుచునున్న
గురుని శరణు జొచ్చి బరువెత్త వలదంచు
కుసుమ సుతు హితాళి కొలిచి నారు. 2942

కం. అంత విరూపాక్షుని గని
పంతులు తమ నిర్ణయంబు పలుకుచు ముందా
పంతము మానుము తదుపరి
కుంతము చేపట్టు మనియెఁ గూర్మిఁ దలిర్పన్. 2943

చం. ఎదురు వచింప లేక గళమెత్తని శిష్యుని నూరడించగన్
పదవియదేమి ప్రేతగణ పాదపమా భయమొంద ? నీ కుటుం
బ దశయటన్న పూర్వకృత ప్రాప్తము, పుణ్యగతుల్ వరించెగా !
ముదముద లేల నియ్యకొన, మొత్తము జాతి వరింప నిన్ననెన్. 2944

కం. ఈ దేహం బీ జీవం
బీ దివ్య విభూతి యాత్మ యే గురు కరుణన్
పాదుకొనె నేకముగ నా
వేదికి దాసోహమనియె విద్వరుఁడంతన్ ! 2945

శా. ఆనందంబున చిందులన్ మునిగె వైశ్యానీక మాలించి, ప్ర
ఖ్యానంబున్ దిశలెల్ల మ్రోగ వినిచెన్ గ్రైవేయకంబుల్ బిగన్
హ్వానంబుల్ నిజబంధు మిత్రులకు ప్రహ్లాదంబునం బంపుచున్
భూనాథుం బ్రియమారఁ జీర పుర విప్రున్ బంచె నందెల్లరున్. 2946

కం. భూసురుఁ డొక్క రథంబున
భాసుర వేగంబు తోడఁ బతి నగరికి వేం
చేసి విశామంత్రణమును
వే సూడిదల నొసఁగి నుడివెన్, భూపునకున్ ! 2947

కం. హితుని విరూపాక్షుని విని
సతతము నతగాని హితము సంకల్పముగా
బ్రతికెడి రాజకుమారుఁడు
వే తెలుగుల విప్రుఁ దన్ని వెడలె నతనితోన్. 2948

ఆ.వె. రాజుతోడ కదలు రాట్పరివారంబు
జ్యేష్ఠశైల సీమఁ జేరినంత,
భూమి స్పృక్పయోధి పోటెత్తె పొలిమేర
స్వాగతంబుఁ జెప్ప స్వామి తతికి ! 2949

మ. ఘన మత్తేభము డిగ్గి, యాస్తరిణి ముంగాలూని, రాజేంద్రుఁ డా
ప్తుని, వైశ్యాన్వయ భాగ్య దీపకుని, త్రైపుండ్రున్, విరూపాక్షునిన్
తన బాహుద్వయ మందు హత్తికొని ప్రస్తావించె నిష్టంబులన్,
మనుజేంద్రేభము పైన తోనునిచి సమ్మానించె నూరేగుచున్ ! 2950

తే.గీ. సూర్య చంద్రుల వలెనున్న శౌర్య ధనులు
భద్రగజమను పూర్వాద్రి ప్రభలు గొలుప
పవలు ఱేలును పరిపరి పరిణమించు
దృశ్య మాయూరి వీథుల దీప్తిఁజెలఁగె ! 2951

సీ. ఎత్తైన పందిళ్ళ నొత్తైన పల్లవం
బులఁ జూచుఁ, జూడదు పుష్కరీఁడు,
ముంగిళ్ళ వ్యాపించు ముత్యాల ముగ్గులం
గాలూను, నూనదు స్థూలపదము,
బాల వృద్ధుల మధ్య వాలుఁగంటుల మధ్య
తగులును, తగలదు దంతి ఱేఁడు,
ప్రాసాదములు చల్లు ప్రసవ వర్షములందు
తడుపును, తడియదు దాన వరము,

తే.గీ. మావటీనికి పురశోభ మత్తు గొలుప
మంగళ ధ్వనుల్ వినిపించు మార్గమందు
వారణంబేగి గుడి ముందు వచ్చి నిలచి
ధరణి శయనించె జయజయ ధ్వనుల మధ్య ! 2952

ఆ.వె. పల్లనంబు డిగ్గి బాల్య మిత్రుని దింపి
యక్కుఁ జేర్చికొంచు నవని విభుఁడు
కూడదంటె కొల్వు కూటంబు నికపైన
స్వజన రాజ్యమేలఁ జనుమటంచు – 2953

ఆ.వె. సఖుని నొంటి వీడి సామ్రాజ్య మేలంగ
చిత్త మొల్ల నట్టి జియ్య కొడుకు
గద్దె నెక్కలేదు పెద్ద లెందరు వేడ
నింత వఱకు, సఖుల పొంతు వదియ ! 2954

ఉ. మెల్లన నాలయంబున నమేయ గుణాఢ్యులు దేవి సన్నిధిన్
పిల్లలవోలెఁ జేరి తెలిపింజను మానస కోశమందుఁ జొ
ప్పిల్లెడు మౌన యోగములఁ బేరు ఘటించి ఘనాంధమందు రా
జిల్లెడు వెల్గుఁజూచు; బయిఁ జిమ్మెడు స్త్వైన కటాక్ష దృష్టులన్ ! 2955

ఆ.వె. అంతరంగ మందు అమ్మ వాసవిఁ గాంచి
మోకతిల్లఁ బడుచు మ్రొక్కు లిడిరి,
కనులు తెఱచి యెదుట కన్యకాంబకు పూజ
సలిపి వైశ్య జగతిఁ జెలఁగి రపుడు. 2956

తే.గీ. గురువు లిరువురు శిష్యుల కూర్మిఁ గాంచి
గుండె లుప్పొంగ, తలపులు తాండవింప,
వధువు, పదవులు రెంటిఁ గావంగఁ జాలు
భటులు, మును విరూపాక్షుఁ గావలయు నంచు. 2957

వ. శీఘ్రంబ కుల వధూ వరణంబుఁ గావింపుఁ దనెడు ధౌమ్యు వచనంబులకు భాస్కరాచార్యుండును. 2958

కం. ఉన్నది సిద్ధముగా నొక
చిన్నది మేనరికమందు, చిత్రముగా నేఁ
డున్నది రత్నవతి యనఁగఁ
బన్నుచు నుపచర్య మేన బావకు నింటన్ ! 2959

కం. ముని ముడి వెట్టిన నిరువురు
కనకపు పీఠంబు నెక్కఁ గన్నులు చెదరున్
మనకన, ధౌమ్యుఁడు నూకొనె,
మనువున కా వెనుక దిద్దె మంత్రాంగంబున్ ! 2960

తే.గీ. భాస్కరాచార్య భావంబు పరిఢవిల్ల
తిరు విరూపాక్ష రత్నవతీ వివాహ
మేడు దినముల పండుగై యెసకమెసగె
బంధు మిత్రుల మధ్య, సంభావనముల ! 2961

వ. అంత ధౌమ్యాది పండితుల యాశీర్వచనంబుల నడుమ 2962

కం. రాజాధ్యక్షంబందున
యాజుష మంత్రముల నడుమ నాచార్యోక్తిన్
రాజాయెను తన జాతికి
ప్రోఁజఁగ విట్తూలమున్ విరూపాక్షుండున్ ! 2963

***ఇది శ్రీవాసవీపురాణమునందు విరూపాక్షపట్టాభిషేకమనెడు నూటయొకటవ అధ్యాయము సంపూర్ణము.***

(దిద్దు= నియోగించు, విశయము= సందేహము, ఆకలనము= ఎన్నిక, మణివకాడు= అధికారి, వెట్టము= శత్రువు, సుషమ= శోభ, కుతుకలెనచి= గొంతులు కలిపి, ధామ గభస్తి= వెలుతురు కిరణము, పనుపడు= ప్రయత్నించు, పటిమ= నేర్పు, అనుగంత= అనుచరుడు, తెగుదారి= సాహసి, కృష్యము= సాగుకువీలైనది, వృష్యాధ్యుడు= బుద్ధి మంతుడు, కోఅడము= అపహాస్యము, కొరదు= ఇంద్రధనుస్సు, ప్రఖ్యానము= ప్రకటన, ఆస్తరిణి= క్రిందపరిచెడి వస్త్రము, జియ్య= రాజు, పొంతువు= చెలిమి, స్త్రైనము= అమృతము, ప్రోఁజు= నూలువడుకు)



# నూట రెండవ అధ్యాయము

**కం. శ్రీచక్రరాజ నిలయా !**
**శ్రీచంద్ర నిభా ! స్వధా ! వశీకృత విశ్వా !**
**శ్రీచిత్కళా సుకన్యా !**
**ప్రాచీ బృహదద్రి నిలయ ! పావన చరితా !**

కం. మణిగుప్తాదులు ఋషిగణ
మణి సాలంకాయనోక్త మానిత విట్ సన్
మణి గాథన్విని తృప్తిగ
ప్రణతుల నర్పించి, విన్న ఫలమెట్టిదనన్. 2964

తే.గీ. ముందు గణపతి యొసఁగిన విందుఁ గుడిచి
వెనుక కథవిన్న ఫలితంబు విందురనఁగ
శ్రోత లంతట బొజ్జలఁ జూచుకొంచు
విందు మావిందు చెవులకు విందటంచు. 2965

కం. అన సాలంకాయనుఁడనె
ననితర సాధ్యంబు ననిమిషాశన తుల్యం
బనఁదగు వైశ్యుల విందును
విని పొందుఁడు తిన్న తృప్తి, వినిచెద ననుచున్. 2966

కం. గణముఖ్య పట్టమునకు, ప
రిణయమునకుఁ గలిపి తగు వరిష్ఠము ఘనమున్,
వణికము నగు విందు సలుప
కణజములను పగులగొట్టె గణముఖ్యుఁ డొగిన్. 2967

ఆ.వె. పంచ భక్ష్యములకు పాలు పండ్లును జేర్చి
విందు భోజనముల విశుల నెల్ల
తనుప వలయునంచు తనవారి నెల్లను
హెచ్చరించి కదలె నింతి తోడ. 2968

ఉ. ఊరఁ బ్రజా సమస్తమును, నూరికి వెల్పల బంధువర్గమున్
ధారుణి రాజు రాణువలఁ దక్కుల వారి నివాస భూములన్
దారను గూడి యొక్కొకరఁ దమ్ముల మిచ్చుచుఁ బిల్చె విందుకై,
వారల కెట్టి లోపమును వర్తిలకుండ విధించె దాసులన్. 2969

సీ. వేలు నాల్మూరల విస్తీర్ణమైనట్టి
ఎనిమిదంతస్తుల మనికి పట్టు,
మణులు పొదిగినట్టి మంజుల ద్వారముల్
రత్నఖచితములు రవల మెట్లు,
పగడంపు స్తంభాల పడసాల నలుసాల
మేల్కట్లముత్యాల మెఱపుసిరులు,
రత్నకంబళులతో రహియించు నెలవులు
తలగడదిండ్లతో తల్పతతులు,

తే.గీ. చిత్తరువులందు సొంపారు భిత్తికలును,
కమ్మపన్నీట కడిగిన గదులుకలిగి
ధూపములతో విరూపాక్షు దుర్గగృహము
వైశ్రవణు సౌధమునకెన వైశ్యజగతి ! 2970



చం. పిలిచిన వారలొక్కొకరు పేర్మి గృహంబున కేగుదెంచ, దే
హలికడ నొక్కరొక్కరిని హర్మ్యములోనికి స్వాగతించి వా
రల నెఱి నర్ఘ్యపాద్యముల రమ్యపదమ్ముల సేదఁదీర్చి రా
కలుముల నూత్నదంపతులు కల్గినమేరకు భక్తిసల్పుచున్. 2971

సీ. పొలపంపు నలుగుల తలమున్కలందోగి
శుభ్రదేహంబులు శోభలీను
విలువైన మిక్కిలి జిలుగైనవస్త్రముల్
బహువిధమ్ములు గట్టిపటిమఁజూపు
మణిమయ కర్ణభూషణముల నలరారి
మేలిమి సొమ్ములన్ మేనులూను
శ్రీగంధపరిమళ సిద్ధపూరుషులైన
వైశ్యులాదిగ నెల్లవారి కెరగి

తే.గీ. శ్రేష్ఠిముఖ్యుండు వినమిత శీర్షుఁడగుచు
మందిరమ్మున పీఠంబులందగింప
వరుస నాసీనులంజేయ వాసవసభ
వోలె దీపించె; భోజనకాలమందు. 2972

ఆ.వె. నూరువేలమంది యూరవ్యులును మించి
రాజు రాణువలును రాజినుండ
భరతుసేనలకు తపసి భరద్వాజుండు
విందుచేయునట్టి విధముతోచె ! 2973

తే.గీ. పప్పు కూరలు పచ్చళ్ళు పప్పుచారు
నేయి బూరెలు బొబ్బట్లు పాయసములు
పాలకాయలు తేనెలు పండ్లు పెరుగు
వేడియన్నంబు వడ్డింపు వేయిమంది. 2974

తే.గీ. భోక్తలును దీక్షచెడకుండ భోజనముల
చేసి త్రేన్చుచు బొజ్జలు చేతనిమురు
కొనుచు నాపోశనములెత్తి కొనుచు లేచి
అన్నదాతాసుఖీభవ యంచువలుక ! 2975

తే.గీ. ముందు రాజును పరివారములనుజేరి
ధన్యులము మీ చరణధూళి తగులనొప్పె
మాకుటీరమ్ము, వేంచేయు మరల మరల
యంచు కౌగిలిందనియించె నర్య విభుఁడు ! 2976

తే.గీ. అపరిమితహర్ష సందోహమనఁగ నడపె
దివ్యమణిభూషణములు, ప్రతీతవస్త్ర
సంగ్రహమ్ములు, మొదవులు, సైంధవములు,
సింధురమ్ములుతోనంపె సేవకులను. 2977

తే.గీ. పయనమగు రాకుమారుఁడు పలికె నిటుల
'రాకకై చూతు పట్టాభిషేక మందు
నీవు నీవారలందరు రావలయును'
అటులె వచ్చెదమని శ్రేష్ఠి యనిచె విభుని. 2978

ఉ. అంత నితాంతయోగధనుఁడా కులసారధి యాత్మబంధులన్
వింతదుకూల భూషణ గవీగణ వాహనరాజి తోడుతన్
సంతస మింపుమీర నుపచారముచేసి మృదూక్తులన్ సుమా
ళాంతమొనర్చె పొత్తుగుడుపంతట సంస్కృతమాయె నవ్విధిన్. 2979

కం. భోజనములైన పిమ్మట
భాజనముగ సేదఁదీరి పాణికులెల్లన్
తేజస్వి భాస్కర గురుని
యోజనమునకై పొడగన యోజిత మతులై. 2980

ఉ. తీఱిక నాకుటింటగల దేశికుఁ జేరిన బచ్చు బాంధవుల్
తీఱుగ నంజలించి తమిఁ దెచ్చిన కానుక లప్పగించి, బా
జాఱులు బోసివోయినవి సార్థకు లేగ ననుజ్ఞ నిండటం
చేఱువ సాగఁబోవ కడియెత్తి గమించుఁడనెన్ గురుండునున్. 2981

వ. అంత విరూపాక్షుండును వారిని సమీపించి బిగియార కౌగలించి కుశలంబు
లడిగి ఆచార్యులతో నిట్లనిరి. 2982

చం. మలహణు వంశదీధితులు మాత విధేయులు, భక్తి సాంద్రతన్
కులమున ఝుంఝువుట్ట సమకూర్చిరి నైతిక శక్తి మాకు ప్ర
క్కల నిలుచుండి కీలి మొనగట్టగ, వీరి నితాంత సేవకున్
వెలనెటు నిర్ణయించుటలు, వెచ్చముఁదీరు విధంబుఁ జెప్పవే. 2983

ఆ.వె. శిష్యు విన్నపమున సేవకాభీష్టంబు
నెఱుఁగఁ దలచి వారి నెఱుఁగఁ బిలువ,
తఱుగనట్టి నిధులఁ దయచేసి నారింక
నేమి చేయఁ బిలిచె నెఱుఁగ మనిరి. 2984

వ. అదివిని భాస్కరాచార్యుండు విరూపాక్షు మోముఁజూడ. 2985

ఆ.వె. వారిసేవ మాకు నోరంత ప్రొద్దగు
నిధులు తఱిగి పోవు నేడు గడువ,
తఱుగ నట్టి విధము దారవోసిన గాని
మనము శాంత పడదు మాన్య చరిత ! 2986

తే.గీ. అనగ నాచార్యుఁ డదియెంత పని యనుచును
మాతృ గాథలఁ బాడుచు మనెద రీరు,
వంశముల పోషణము చేయు వంతు మీది,
భావి మైలారులను పేరఁ బరగుదు రని. 2987

ఆ.వె. అనఁగ వారు వీరు నానందముననుండ
కొలముసామి చిక్కుదొలగెనంచు
నాత్మబలులు తప్ప అతిసర్జనము లేని
శాంతమూర్తులను భరింతుమటులె. 2988

ఆ.వె. విన్న భటులు నటులె వినుతింతు మాయమ్మ
ఖడ్గ శరభ దండకముల యందు
తరతరమ్ములకును తరియింతు మిట్టులే
యంచు ప్రణతులైరి యంచితముగ. 2989

ఆ.వె. వారి నలరఁజేసి వారణాసికి వెంట
వచ్చి గంగనీళ్ళు తెచ్చినట్టి
కర్మకరుల గంగకావిళ్ళ వాళ్ళంచు
వారికటులె గారవంబుసలుప. 2990

ఆ.వె. అనఁగ నెల్లజాతి అస్తు అస్తని పల్కి
కులముపెద్ద పెద్ద గుణముహొగడ,
కన్యకాంబచరిత గాన శ్రవణ సిద్ధి
తెలియఁ జెప్పె నిటుల దేశికుండు ! 2991

ఉ. ధన్యులు మీరు వైశ్యకులధర్మనిబంధులు, నిత్యసత్యస
మ్మాన్యులు, లోకమాతకొక మానితనామమునిచ్చినట్టి సౌ
జన్యులు, మీ కులంబు నవజాతసురద్రుమమయ్యె నెట్టులా
కన్యకగాథవించు భవికమ్మున శోభిలు బిడ్డ బిడ్డలున్ ! 2992

ఆ.వె. అమ్మకథనుచదువ నఘములెల్లయుజారు
విన్నవారికెల్ల వెరపుతీరు
స్మరణచేయువారు సత్యంబుతప్పరు
మననజేసినంత మహిమకలుగు. 2993



ఆ.వె. పాదసేవనమున పరతత్త్వమొనగూడు
ప్రార్థనమునదొలగు నర్థకాంక్ష
నర్చనమునగలుగు నతిథిసంసేవన
మమ్మయంచు పిలిచినంత పలుకు. 2994

ఆ.వె. దండమిడిన యంత దారిద్ర్యముల్ దీరు
దండకంబుఁ జదువ నండ కలుగు
వందపేర్లు చదువ వర్ధిల్లుజ్ఞానంబు
వేయిపేర్లు చదువ వెతలుతొలుగు. 2995

ఆ.వె. ధర్మవర్తనము కథాగానమునుజేయ
శమము దమము దేవి శరభఁజెప్ప
కామితంబులెల్ల ఖడ్గముల్ విసరంగ
తీరు నమ్మమెచ్చు తీరువెనుక. 2996

ఆ.వె. మంత్రజపముసలుప మంగళంబులుగల్గు
స్తోత్రముల్ పఠింప శుభముగల్గు
నిత్యపూజ సలుప నిఖిలార్థముల్గూడు
వృత్తులందు జయము విస్తరిల్లు. 2997

ఆ.వె. అనుచు నొజ్జపలుక నాతిథ్యులెల్లరు
తృప్తిపడితిమనుచు ధృతినిబూని
రేయి నిదురవోయి రేపకడనెలేచి
విందుఁగుడిచి చనిరి వీళ్ళుఁ జేర ! 2998

కం. అని సాలంకాయన ఋషి
యనఘుల గాథ వినిపించె నానందముతో
ననఘము నాయుష్కరమును
మునులగు వైశ్యులకు వదనములు వికసింపన్. 2999

చం. ఋషిగణ కావ్యయాగమున ఋక్షరుఁడౌ ఋషి సూతుఁడిట్లు ని
ర్విషయ పరాయణం బమలవిశ్రుతి వాసవిగా జనించుటల్
పృషత నిపాతమట్లు శ్రుతిపేయ మొనర్చెను, దివ్యబృందముల్
శుషిరమునుండి పుష్పములు సోనలుగా కురియించ నిచ్చలున్ ! 3000

***ఇది శ్రీవాసవీపురాణమున ఫలశ్రుతియను నూటరెండవ అధ్యాయము సంపూర్ణము.***

(వణికము= రుచ్యము, కణజము= పాతర, విశుదు= మనుజుడు, పొలపము= పరిమళ భరితము, పటిమ= నేర్పు, రాజి= వరుస, భాజనము= యోగ్యము, పాణికులు= వర్తకులు, నియోజనము= ఆజ్ఞాపనము, ఏఋవ= దేశము, ఇష్యుడు= ఆచార్యుడు, స్వానము= ధ్వని, మరుమార్తుడు= శివుడు, ఓరంతప్రొద్దు= శాశ్వతము, అతిసర్జనము= హింస, గారము= ప్రేమ, కర్మకరులు= సేవకులు, ధర్మనిబంధులు= ధర్మజ్ఞులు, పృషతము= అమృతబిందువు, శుషిరము= ఆకాశము)

ఇది

శ్రీ చింతలపూడి చెల్లయ్యగుప్త కుమారుడు కోటయ్యశ్రేష్ఠికి ప్రపౌత్రుడును, బొల్లయ్యశ్రేష్ఠికి పౌత్రుడును, వెంకటసుబ్బయ్యగుప్త – వెంకటసుబ్బాయమ్మల ప్రథమపుత్రుండును, సూర్యకుల గోత్ర భవుండును, ఒంగోలుసీమయందలి ఇంకొల్లు మండలంబున త్రిలోచనపల్లవ మహారాజ నిర్మితంబగు ఇడుపులపాడు అగ్రహార వాస్తవ్యుండును, తెలుగున స్నాతకోత్తర పట్టభద్రుండుననగు వేంకటేశ్వర్లుగుప్త ప్రణీతంబయిన శ్రీవాసవీపురాణ మహాకావ్యము సంపూర్ణము.